కవిత్రయ మహాభారతం

# ధృతరాష్ట్రుడు

రచయిత:

డాక్టర్ గుంటుపల్లి రామారావు

పబ్లిషర్స్:

విజ్ఞాన్ పబ్లిషర్స్

బ్రాడీపేట :: గుంటూరు-522 002

ప్రథమ ముద్రణ : డిసెంబరు 1987.

ప్రతులు : 1,000

(తెలుగు విశ్వవిద్యాలయంవారి
ఆర్థిక సహాయంతో ముద్రించ బడింది.)

**కవిత్రయ మహాభారతం—ధృతరాష్ట్రుడు**

(నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి 1986లో
పిహెచ్. డి. పొందిన సిద్ధాంత గ్రంథం.)

రచయిత :
**డాక్టర్ గుంటుపల్లి రామారావు,**
ఎం.ఏ; ఎం.ఫిల్; పిహెచ్. డి;
లెక్చరర్, పెదనందిపాడు కళాశాల,
పెదనందిపాడు-522 235.

**వెల : నలభై అయిదు రూపాయలు**

ప్రతులకు :
**విజ్ఞాన్ పబ్లిషర్స్**
బ్రాడీపేట - గుంటూరు-522 002.

ముద్రణ :
**బాపూజీ ప్రింటర్స్**
నెహ్రూనగర్ - గుంటూరు-1.



**L. Rattaiah,**
*M Sc , M.Ed; D.J ,*
**Vignan Publishars**

# అసందర్భ విషయం

ప్రచురణ విభాగంలో మా మొదటి ప్రయత్నంలో వెలువడిన పుస్తకాలన్నింటినీ విశేషంగా ఆదరించిన విద్యార్థులకు, అధ్యాపకులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

అయితే మొదటి విడతలో ప్రచురించిన పుస్తకాలన్నీ విజ్ఞానశాస్త్రానికి సంబంధించినవే. వాటిని ఆదరించిన అధ్యాపకులు సాహిత్యం, సాంఘిక శాస్త్రాల్లో కూడ ఉత్తమ గ్రంథాల ప్రచురణ ప్రారంభిస్తే బాగుంటుందని సలహా ఇచ్చారు. మిత్రుల సలహామేరకు, ఏ విధమైన పుస్తకాలు మొదటగా ప్రచురించాలని ఆలోచనలో ఉన్న తరుణంలో ఈ గ్రంథ రచయిత శ్రీ రామారావు ఈ సిద్ధాంత గ్రంథ వ్రాతప్రతిని నాకిచ్చి దానిపై నాఅభిప్రాయం కోరటం జరిగింది.

ఆమూలాగ్రం చదివిన అనంతరం లోకంలో చాలా సాధారణ వ్యక్తిగా లెక్కించబడే ధృత రాష్ట్రుని జీవితంలోని మెట్టపల్లాలు, వాటిని శ్రీ రామారావు అనుశీలించిన విధానం నన్నెంతగానో ఆకర్షించింది.

ఇంకా మా ప్రచురణ సంస్థలోని అనుభవజ్ఞులతో ఈ గ్రంథం విషయం చర్చించగా వారుకూడా కూలంకషంగా చదివి కవిత్రయ మహాభారతంలోని ధృతరాష్ట్ర పాత్రను పరిశీలించి వ్రాసిన తీరుకు ఆనందించి ఇది ఒక ఉత్తమ పరిశోధన గ్రంథం అని పేర్కొని, దీన్ని తీర్చిదిద్దటంలో శ్రీ రామారావు పడిన శ్రమను అభినందించారు.

అందువల్ల సాహిత్యాంశాల్లో మా మొదటి పుస్తకంగా ఈ గ్రంథ ప్రచురణను చేపట్టడం జరిగింది.

ఈ పుస్తకం అచ్చువేయటంలో ప్రతిక్షణం సహకరించి, తప్పులు లేకుండా ఎంతో జాగ్రత్తతో అత్యల్పకాలంలో పూర్తిచేసిన ఈ గ్రంథ రచయిత శ్రీ రామారావుకు మా ప్రత్యేక అభినందనలు.

ఈ గ్రంథం వెలువడటానికి ఆర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి మా కృతజ్ఞతలు.

సాహితీ ప్రియులు, విమర్శకులు ఈ పుస్తకాన్ని ఆదరించి శ్రీ రామారావు ధృతరాష్ట్రుని గూర్చి చెప్పిన అనేకానేకాంశాలను వివేచనతో చదివి, సాహితీ రంగంలో మా ఈ ప్రథమ ప్రయత్నాన్ని అభినందిస్తారని ఆశిస్తూ—

గుంటూరు. (సం.) లావు రత్తయ్య
18-12-87,

# ఆశీస్సులు

**శ్రీమతి పి. వెంకాయమ్మ, బి.ఏ., బి.ఎడ్.,**
సెక్రటరీ & కరస్పాండెంటు,
**పెదనందిపాడు కళాశాల,**
**పెదనందిపాడు.**

శ్రీ గుంటుపల్లి రామారావు రచించిన 'కవిత్రయ మహాభారతం-ధృతరాష్ట్రుడు' అనే సిద్ధాంత గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి నేను ఎంతో ఆనందించాను. జనసామాన్యంలో అంతగా ప్రాముఖ్యంలేని ధృతరాష్ట్ర పాత్రను అనుశీలించి ఈ బృహద్గ్రంథాన్ని వ్రాసిన మా రామారావును అభినందించకుండ ఉండలేకపోతున్నాను.

ధృతరాష్ట్రుని జననం మొదలు ఆ మహారాజు జీవితంలోని అనేకానేకాంశాలను ఆమూలాగ్రంగా పరిశీలించి, మహాభారత పాఠకులు గమనించని, తెలియని ఎన్నో నిజాలను వెల్లడించిన తీరు, సరళమైన భాషలో పాఠకులలో ఆలోచనను రేకెత్తించి స్పష్టంగా సందేహాలను నివృత్తిచేసిన విధానం ఎంతో ప్రశంసనీయంగా ఉంది.

మా రామారావు సాహితీరంగంలో ఇంకా కృషిచేసి సాహిత్య పరిశీలకుల అభిమానానికి పాత్రుడవుతాడని ఆశిస్తున్నాను, అతణ్ణి మనసారా ఆశీర్వదిస్తున్నాను.

పెదనందిపాడు, (సం.) పి. వెంకాయమ్మ

**11-12-87.**

నాగభైరవ కోటేశ్వరరావు ఎం. ఎ.
సిండికేట్ మెంబరు - తెలుగు విశ్వవిద్యాలయము.
సభ్యులు - అధికారభాషా సంఘము.
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక బహుమతి గ్రహీత, 1980.
రాజ్యలక్ష్మి వెంకన్నచౌదరి బహుమతి గ్రహీత, 1986.

"ఇతిహాసపు చీకటి కోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం"—

అన్న శ్రీశ్రీ ఆశను నిజం చేయటానికి సత్యాన్వేషణ ప్రయత్నంలో సాగుతోంది ఈనాటి యువతరం. అలాంటి ఒక సఫల ప్రయత్నం యిది.

కత్తి అంచు పదును వంటి ఆలోచనా సరళిని పత్తివంటి మెత్తని భాషాశైలిని కలగలిపి వాక్య నిర్మాణంచేస్తే ఎంత బాగుంటుందో ఈ సిద్ధాంత గ్రంథం సాక్ష్యం చెబుతుంది. చిరంజీవి రామారావు హృదయం - కొండమీంచి గలగల ధ్వనులతో దూకే సెలయేరుకాదు. స్థాయిగా సాఫీగా పొలాల మధ్య ప్రవహించే పంట కాలువ. నడిలేదు. పడివుంది. మన మనోక్షేత్రాలను ఆలోచనా జలాలతో ఎంతగా తడపాలో అంతగా తడిపే తడివుంది. అదేకదా పరిశోధన పరమ ప్రయోజనం.

అందుకే ఈ సిద్ధాంత గ్రంథాన్ని చదివి నేను ఆనందిస్తున్నాను: మార్గదర్శి డా॥ గంగప్పగారిని, గమ్యం చేరిన పథికుడు మా రామారావును అభినందిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.

చీరాల.
21-11-87.

(సం.) నాగభైరవ కోటేశ్వరరావు

విద్వాన్ ముష్టిపల్లి నానరు
రిటైర్డు ఆంధ్రోపన్యాసకులు,
పెదనందిపాడు కళాశాల,
పెదనందిపాడు.

నిర్దుష్ట రచనకు తపస్సు అవసరం. చిరంజీవి రామారావు మూడు వత్సరాలు నిరంతరం ఆ తపస్సు చేశాడు. నాకు హితుడు సన్నిహితుడు కావటాన చూశాను. ఆ తపఃఫలమే ఈ సిద్ధాంత గ్రంథం. దీనిలో ప్రతి ప్రకరణ ప్రారంభం పరిశీలిస్తేనే రామారావు ప్రజ్ఞాపాటవం అగుపిస్తుంది. పూర్తిగా పఠించాలని ఉత్కంఠ కలిగిస్తుంది.

ఈ గ్రంథాన్ని ఆ మూలాన్ని అనుశీలనంచేస్తే అనేకానేక విషయాలు అవగతం కావటమేకాక కేవలం అంధుడుగా, కుటిలుడుగా, లోకం తలచే ధృతరాష్ట్రుడు ఎంతటి వ్యక్తిత్వం కలవాడో అర్థం అవటంతోపాటు అతనిపై మనకు సానుభూతి కూడ కలుగుతుంది.

మా చిరంజీవి కృషికి సంపూర్ణానందాన్ని పొందుతూ ఈతడు తన రచనా తపస్సును ఉద్రిక్తం చేస్తూ ఇంకా ఎన్నో విషయాలను వెలుగులోకి తీసుకురావాలని మనసార ఆశీర్వదిస్తున్నాను.

పెదనందిపాడు,
26-11-87.

(సం.) ము॥ నానరు.

డాక్టర్ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,
రీడర్, తెలుగు ప్రాచ్య భాషావిభాగం,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జుననగర్, గుంటూరు.

# ఆమోదం

మహాభారతం ఇతిహాసం. ఇందులోని కథ చారిత్రకమైనా, కల్పితమైనా, మానవ జీవితానికి దర్పణం. మానవ మనస్తత్వ సూక్ష్మాతి సూక్ష్మ వివరణకి చక్కటి నిదర్శనం. భారతిజాతి విజ్ఞానానికి నిధి; కోశం. ఇందులో లేనిది ఎందులోను లేదు. ఇతివృత్తంలో, పాత్రలలో, పాత్రల మనఃప్రవృత్తులలో, ప్రవృత్తులలోని సూక్ష్మభేదాలలో ఇంత చక్కగా నిరూపించే గ్రంథం మరొక్కటి లేదంటే అత్యుక్తిలేదు. విశ్వమంతా ఇందులో ఇమిడిఉంది. ధర్మాధర్మాలుగానీ, న్యాయాన్యాయాలుగానీ, ఉచితానుచితాలుగానీ, రాజకీయ నైతిక స్థితులను వ్యక్తీకరించడంలో గానీ, ఎత్తుకు పైఎత్తు వేయడంలోగానీ భారతంలో విదితమైనట్లు మరే గ్రంథంలోనూ చూడలేము. అంటే అది సమాజానికి అంత సన్నిహితంగా ఉందని అర్థం. ఎన్నో ఏండ్లూ పూండ్లూ గతించాయి. అయినా మనం చదవడం మానలేదు; భవిష్యత్తులోకూడ మానవజాతి ఉన్నంతవరకు— భారతాన్ని చదువుతూనే ఉంటారు. సాహిత్యం సార్వకాలికమూ, సార్వజనీనమూనని చెప్పటానికి ఇదే ప్రముఖ కారణం. ఇలాంటి ఉన్నతోన్నత స్థితిని సంపాదించుకొన్న ఉద్గ్రంథం భారతం. అందుకే ఈనాటికేకాదు ఏనాటికైనా భారతం ఆరాధ్యమే!

ఇలాంటి కవిత్రయ భారతాన్ని ఎందరో విమర్శకులు విమర్శించారు; వ్యాఖ్యానాలు చేశారు; వాదోపవాదాలు సిద్ధాంత రాద్ధాంతాలు చేశారు. తెలుగు సాహిత్యలోకంలో పరిశోధన ప్రారంభమైనప్పటినుంచీ పరిశోధకులు భారతాన్ని ఎన్నో దృక్కోణాలనుంచి అతి సూక్ష్మ పరిశీలనచేసి, మూలంతో పోల్చి, తులనాత్మకాధ్యయనం చేసి అనేకానేకాంశాలపై అత్యంత నిగూఢమూ, గర్భితమూ అయినా వాటిని వెలికితీసి తమ శేముషీ వైభవాన్ని ప్రకటించుకొన్నారు. ఇంకా ఎందరో పరిశోధనాపథికులు ఆ మార్గంలో పయనిస్తూనే ఉన్నారు. ఇది ముదావహ విషయమే

గాదు; సాహిత్య పరిశోధనా పథంలో రావలసిన ఎన్నో నూతన దృక్పథాలకు మార్గ దర్శకమైన అంశం.

ఇలాంటి పరిశోధనా పథగాముల్లో మన ప్రశంసకు పాత్రమైన ఉత్తమ పరిశోధకుడు డాక్టర్ రామారావు. మహాభారతంలో ఎన్నో రకాలైన పాత్రలు; ఆ పాత్రల మనః ప్రవృత్తులలోని భేదాల్ని పరిశీలిస్తే సమస్త జగత్తు మన కళ్లముందు కదలాడుతుంది; అతిమానుష శక్తియుక్తులైన వ్యక్తులు దృగ్గోచర మవుతారు; మాన ధనులు, ఆత్మాభిమానులు, మైత్రికీ సంధికీ మరోపేరు కలవారు కనిపిస్తారు; దుష్టులు, దుర్మార్గులు, నీచులు, తుచ్ఛులు ఎదురవుతారు; పరుల సుఖమే తమ సౌఖ్యంగాభావించుకొన్న వారూ ఉన్నారు; కానీ సమవగాహనకు సాధ్యంకాని సంక్లిష్ట పాత్ర ధృతరాష్ట్రుడు ఉన్నాడు. అదిగో! అలాంటి సంక్లిష్టమైన మానసిక తత్వం గల ధృతరాష్ట్రుని కవిత్రయ మహాభారతంనుంచి పృథక్కరించి, పరిశోధనాంశంగా స్వీకరించి, తన ప్రయత్నంలో సఫలీకృత మనోరథుడైన డాక్టర్ రామారావును మనసారా అభినందిస్తున్నాను. స్వీకరించిన అంశానికి తగినరీతిలో న్యాయం చేకూర్చ డంలో పరిశోధకుని కుండవలసిన సర్వలక్షణ లక్షితుడయ్యాడు డాక్టర్ రామారావు. కవిత్రయ భారతంలోని విషయాలను మూలభారతంతో సందర్భోచితంగా తుల నాత్మకంగా సరిపోల్చి చూచి, పూర్వులు సమకాలికులు అయిన విమర్శకుల అభి ప్రాయాలు, వాదోపవాదాలు వివరిస్తూనే, ఎటువైపూ తాను మొగ్గక, తనదైన అభి ప్రాయాన్ని వెల్లడించటానికి ఎక్కడా సంకోచించక ఉత్తమ పరిశోధనచేసి కృత కృత్యుడయ్యాడు.

కర్ణునొదలనె భారతమని కొందరు, భారతానికి దుర్యోధనుడు కారణమని మరికొందరు, దుష్ట చతుష్టయమని ఇంకొందరు, కాదు దీనికంతటికీ కారణం శకునిమామ అని మరికొందరు, ఘోర కలికి కారణం కృష్ణుడనే శపిస్తూ గాంధారీ అంటుంది. కానీ ఇంతటికీ కారణం ధృతరాష్ట్రుడు. సూక్ష్మేక్షికతో, నిష్పక్షపాతంగా పరిశీలించినవారికి, పరిశోధించినవారికి ధృతరాష్ట్రుడనే స్పష్టమవుతుంది. ఏమైనా భారతంలో ప్రముఖపాత్ర ధృతరాష్ట్రుడు. అలాంటి ధృతరాష్ట్రపాత్ర పరిపూర్ణ చిత్రణా వైవిధ్య విశదీకరణమే డాక్టర్ రామారావు చేసిన ఈ సిద్ధాంత గ్రంథం.

మహాభారతంలో చిత్రితమైన ధృతరాష్ట్రుని వ్యక్తిగత జీవిత విశ్లేషణ బహుధా ప్రశంసనీయంగా చేయడం మొదటి ప్రకరణంలో గమనించగలం. ఆ రాజు జననం, వైవాహిక దాంపత్య జీవితాలు, సోదరాను బంధం తెలిపి, పుత్ర

వ్యామోహం స్పష్టంచేసి, పెద తండ్రిగా ఆతని బాధ్యత ఎంతటిదో వివరించి, ఆతని అతిథి సత్కారం సూచించి, సంక్లిష్టమైన ధృతరాష్ట్రుని మనస్తత్వాన్ని సూక్ష్మాతిసూక్ష్మంగా విశదీకరించి, అతని జీవిత పరిమాణాన్ని నిర్ణయించటం జరిగింది. ఇందులో డాక్టర్ రామారావు పరిశోధనాత్మక దృక్పథం విస్పష్టమవుతుంది. సముచిత రచనతోపాటు విషయ విశ్లేషణ వ్యక్తమవుతుంది. ధృతరాష్ట్రుని జననంలో నియోగ విధానాల్ని తెలిపి సోపపత్తికంగా అతడు విచిత్రవీర్యుని ఔరస పుత్రునిగా నిరూపించడం— నూతనాంశంగా కనిపించినా— సమంజసంగా ఉంది. రాజ్యాధిపత్యాన్ని గూర్చిన వివిధ వాదాల్ని తెలిపి ధృతరాష్ట్రుని రాజ్యాధిపత్యాన్నే స్థాపించి, అతడు రాజనీతిజ్ఞుడే అయినా స్వార్థం మూలాన్నే వంశం నాశనమైంది సయుక్తికంగా రెండో ప్రకరణంలో చూడగలం. క్రమంగా మనః పరిణతిచెంది ఆతనిలో ఆధ్యాత్మిక చింతన ఎలా బలపడి 'ఆత్మాగ్ని'లో ఎలా జీవన్ముక్తుడయ్యాడో మూడో ప్రకరణం తెలుపుతుంది. ఇతర పాత్రల దృష్టిలో ధృతరాష్ట్రుడెలాంటి వాడో వివరిస్తుంది నాలుగో ప్రకరణం. పరివ్యాప్తమైన ధృతరాష్ట్రుని వ్యక్తిత్వ సర్వ పరిశీలనమూ ఈ పరిశోధనకు ఉపసంహారం ఐదో ప్రకరణం.

ఇలాగా అనేకాంధ్ర సంస్కృతాంగ్ల గ్రంథాలు, వ్యాసాలు పరిశీలించి ఉత్తమ పరిశోధనచేసి కవిత్రయ భారతంలో ధృతరాష్ట్రపాత్ర చిత్రితమైన తీరుతెన్నులను సూక్ష్మాతిసూక్ష్మరేఖలతో, ఇతఃపూర్వం వెలుగులోకిరాని ఎన్నో అంశాల్ని వెలికితీసి మౌలికమైన సిద్ధాంత గ్రంథం నా పర్యవేక్షణలో రచించి డాక్టరేట్ పట్టంపొందిన శ్రీ రామారావును మనసారా మరోసారి అభినందిస్తున్నాను. ఈ గ్రంథ ప్రచురణ బాధ్యతను స్వీకరించిన మిత్రులు ఎల్. రత్తయ్యగారు మన అభినందనకు పాత్రులు. మంచి గ్రంథాల్ని ప్రచురించి సాహిత్యసేవ చేయగలరని ఆశిస్తున్నాను.

డాక్టర్ రామారావు మరెన్నో అంశాల్ని గ్రహించి ఇంకా ఎన్నో మౌలిక రచనలు వెలయించాలని అకాంక్షిస్తున్నాను.

గుంటూరు
21-11-1987.

(సం.) ఎస్. గంగప్ప.

డాక్టర్ ఎస్. సంజీవదేవ్, డి.లిట్.
తుమ్మపూడి.

# సమ్యక్ దృష్టి

చెట్టుకంటె గొప్పది కొండ; కొండకంటె గొప్పది భూమి; దానికంటె గొప్పది ఆకాశం. వీటన్నింటి కంటె గొప్పవాడు మనిషి. చెట్టు, కొండ, భూమి, ఆకాశం స్వయంగా తననుగురించి కాని ఇతర వాటిని గురించి కాని తెలుసుకోజాలవు. మనిషి స్వయంగా తనను గురించి తెలుసుకోటం మాత్రమేకాక చెట్టును గురించి, కొండనుగురించి, భూమిని గురించి, ఆకాశాన్ని గురించి, ఇంకెన్నిటినో గురించి తెలుసుకోగలడు. అందుకే వాటన్నిటికంటే మనిషి గొప్పవాడు. వాటిని గురించి తెలుసుకోటం మాత్రమే కాదు, తెలుసుకొన్నదాన్ని గురించి ఆలోచించగలడు, అవేవీ ఆ పనులు చేయలేవు. అందుకే మనిషి గొప్పవాడు అన్నిటికంటే. అయితే అందరు మనుషులూ అవన్నీ చేయలేరు. కొందరు మాత్రమే చేస్తారు కొన్ని; ఎవరూ చేయలేరు అన్నీ.

శ్రీ రామారావు ఆ కొందరిలో ఒకడు. కనుకనే "కవిత్రయ మహాభారతం - ధృతరాష్ట్రుడు" అనే బృహత్తర సిద్ధాంత వ్యాసం రచించాడు. ఇందులో వైశిష్ట్యం ఏమంటే, మహాభారతంలో సాధారణంగా సాదాపాత్రగా ఎంచబడే ధృతరాష్ట్రుని అసాధారణ వ్యక్తిగా, మహాభారతానికంతటికీ ప్రధాన పాత్రగా చిత్రించాడు. దృతరాష్ట్రుడు లేంది మహాభారతమే లేదన్నట్లు రుజువుచేయ ప్రయత్నించి ఆ ప్రయత్నంలో సఫలుడైనాడు.

భారతదేశ చరిత్రలో మహాభారత ఘటన ఒక మహత్తర ఘటన, భారతీయ సాంస్కృతిక సాహిత్యంలో మహాభారత రచన ఒక మహారచన. అన్ని ఐతిహాసిక ఘటనలవలెనే మహాభారతం కూడ ఒక ఐతిహాసిక ఘటన. సాహసోపేతమైన అదొక యుద్ధ ఘటన. ప్రాణాన్ని తెగించి సలిపిన అదొక సమర సంఘటన. అందులో అమానుషికమైన దైవమహత్తులు మరేమీ లేవు. మహాభారత ఘటనకంటే ఎక్కువ వైశిష్ట్యం గలది మహాభారత రచన. మహాభారత యుద్ధం ముగిసిన తరువాత ఎంతకాలానికి మహాభారత రచన వేదవ్యాసుడనే రచయితచేత రచించబడినదో ఖచ్చితంగా తెలియదు.

దాని మాతృక సంస్కృతం. తరువాతి తరువాతి కాలాల్లో ఆ సంస్కృత మాతృకను ఆధారంగా తీసుకొని దేశభాషల్లో స్వతంత్ర అనువాదాలు బయలు దేరాయి. వాటిలోదే తెలుగులోదైన కవిత్రయం వారి ఆంధ్ర మహాభారతం. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ, ముగ్గురుచేసిన స్వతంత్ర అనువాదం అది. దాని లోని ధృతరాష్ట్రుని పాత్రను తీసుక చిత్రించిందే ప్రస్తుత గ్రంథం. ధృతరాష్ట్రుని వ్యక్తిత్వం మనోవిశ్లేషణ కందని బహుముఖమైంది. అయినా శ్రీ రామారావు దాన్ని అందుకోటంలో కౌశల్యం ప్రదర్శించాడు. కవిత్రయం వారు తమ రచనలో ధృత రాష్ట్రుని చిత్రించటంలో ప్రదర్శించిన ప్రతిభకంటే ఈ రచయిత ఇంకా ఎక్కువ సూక్ష్మమైన ప్రతిభను ప్రదర్శించాడు ధృతరాష్ట్రుని పాత్రచిత్రణలో. అదే స్రష్టలోని స్వీయ ప్రతిభ. పాత్రను గురించిన స్వీయ అభిజ్ఞత.

ధృతరాష్ట్రు డొక ముడిపదార్థం. ఆ ముడిపదార్థాన్ని ఏ రచయుతకు నచ్చిన రీతిలో వారు సుందరమూర్తిగా మలచుకొంటారు. కొందరి సృజన తగిన న్యాయం కలుగ చేయటంలో వెనుకంజ వేయవచ్చు, మరి కొందరిది ముందంజ వేయవచ్చు. ఈ గ్రంథాన్ని సక్రమ రీతిలో అవగాహన చేసుకొంటే తెలుస్తుంది ఈ రచయిత అసఫలుడు కాలేదని.

ధృతరాష్ట్రుని రాజకీయ జీవితం, కుటుంబ జీవితం, వైయక్తిక జీవితం, యుద్ధతంత్ర జీవితం, భర్తగా వ్యవహరించటంలో ఆయన చూపిన సామర్థ్యం, అసామర్థ్యం, మానవతను అమలు పరచటంలో తన నైపుణ్య హీనత, న్యాయా న్యాయాల మధ్య, ఇష్టాయిష్టాల మధ్య ఆయన నలుగుతూండటం, తన అభిమానాన్ని న్యాయమని నమ్మే తన హ్రస్వదృష్టి, అభిమాన దృష్టి, ఇటువంటివెన్నో ఆయనలో క్రీడిస్తూ వెలుగు చీకట్ల నర్తనకు సుందర అక్షర రూపం ఇవ్వటంలో దక్షుడైనాడు శ్రీ రామారావు.

సిద్ధాంత వ్యాసంకోసం కావలసిన గుట్టల గుట్టల సామగ్రిని సంవత్సరాల పర్యంతం ప్రోగుచేసుకోటం వేరు, దాన్ని ఒక సుందర రూపంలో కూర్చుకొని సృజనాత్మక - సమీక్షాత్మక రూపం ఇవ్వటం వేరు. మొదటిది చాలామందికి అందుబాటులోది; రెండవది అందరకూ అందుబాటులోది కాదు. అందని దాన్ని అందుకోటంలోనే ఇమిడి ఉంటుంది సార్థక్యంలేని సార్థక్యం. సిద్ధాంత వ్యాసం ప్రధానంగా భోగట్టాకు చెందిందైనప్పటికీ దాన్ని సృజనాత్మకంగా నిర్మించరాదనే నియమం ఏమీ లేదు. విషయం సమీక్షాత్మకంగా ఉన్నా కూడ దాని అభివ్యక్తి

రసాత్మకంగా ఉండవచ్చు. సుందర అభివ్యక్తి నిమిత్తం విషయాన్ని శిథిల పరచాలసిన అవసరం లేదు. విషయం సుదృఢంగాను ఉండవచ్చు, దాన్ని ప్రత్యక్ష పరచటం సుఖమయంగాను ఉండవచ్చు. అయితే ఇందుకు రచయితలో - ఆయన గద్య రచయిత అయేది, పద్య రచయిత అయేది - రచనా శిల్పం లయిస్తుండాలి. రచనా శిల్పం సామాన్య రచనకు అసామాన్య ప్రాణస్పందన నిస్తుంది, స్థితిశీల అక్షరపంక్తికి గతిశీలశక్తిని ప్రసాదిస్తుంది.

కొందరు ఇటువంటి విధానానికి విరోధులుగా ఉంటారు. సమీక్షా ప్రధాన మైన విషయం రసాత్మకంగా అభివ్యక్తి పొందక సమీక్షాత్మక రచనా శైలిలోనే ఉండాలి కాని మరో విధంగా ఉండటం సమంజసంకాదని కొందరి వాదన. ఇది కేవలం హ్రస్వదృష్టి మాత్రమే అవుతుంది. బలవర్ధకమైన ఆహార పదార్థానికి రుచి ఉండకూడదన్నట్లు ఉంటుంది !

దీని అర్థం ఒక దుర్మార్గుణ్ణి సన్మార్గుడిగా శిల్పించమనికాదు, ఆ దుర్మార్గుడి దుర్మార్గాన్ని ఇంకా విశదంగా, ఇంకా బలీయంగా, ఇంకా మూర్తిమంతంగా శిల్పించ మని. కళాకృతిలోని విషయాన్ని మార్చటం కాదు సుందరంగా రూపకల్పన చేయటం అంటే, ఆ విషయాన్ని ఉన్నదానికంటే ఎక్కువ ఆకర్షకంగా రూపొందించమని. వాస్తవాన్ని అవాస్తవం చేయక ఇంకా ఎక్కువ వాస్తవంగా ఉండేట్లు రూపొందించ మని. అటువంటి శిల్పరీతియే ఇందులో సూక్ష్మంగా, కమనీయంగా ప్రత్యక్షమైంది. చేదును తీపిగా చూపలేదు, చేదును ఇంకా ఎక్కువ చేదుగానే చూపటం జరిగింది. అయితే, ఆ చూపటమనే తీరు మొరటుగా కాకుండా మృదువుగా చూపబడుతుంది. తన రచనాశిల్పంలో వస్తుగత సత్యానికున్న రంగులను మార్చవచ్చు కాని రూపాన్ని మార్చరాదు.

మనిషిలోని సమర్థత మంచిలోను ప్రత్యక్షమవుతుంది, చెడులోను ప్రత్యక్ష మవుతుంది. రెంటిలో దేనిలో అది రూపొందినా కూడ ఆ వ్యక్తిని సమర్థుడనే అంటారు. ధృతరాష్ట్రుడు మంచి చేయటంలోను, చెడు చేయటంలోను సమర్థుడు. అందువల్ల ధృతరాష్ట్రుడు ఏమిటి అని ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన సమర్థుడు అని చెప్పాలి. అసమర్థుడు కాని వ్యక్తి ఏదిచేసినా అతడు సమర్థుడే, చేసింది సమర్థతయే ఎవడు సమర్థుడో వాడు ఘనుడు. ధృతరాష్ట్రుడు సమర్థుడు, కనుక ధృతరాష్ట్రుడు ఘనుడు. మహాభారతంలో అందరికంటే ఘనుడు కృష్ణుడు అని కొందరంటారు.

జీవితంలో ఉపయోగం, ఆనందం అనేవి ప్రధానమైనవి. కొన్నిటిలో ఉపయోగం, ఆనందం కలిసి ఉంటాయి. మరికొన్నిటిలో వేరువేరుగా ఉంటాయి. లైంగిక వ్యవహారాల్లో ఈ సత్యం సమంగా వర్తిస్తుంది. సాధారణంగా స్త్రీపురుషుల లైంగికమిలనం వల్ల సంతానం కలగటం సహజం. సంతానం కలగపోవటంకూడ జరుగుతుంటుంది. దానివల్ల సంతానం కలిగినా కలగకపోయినా లైంగికమిలనం స్త్రీపురుషులకు ఆనందం కలిగిస్తుంది. సంతానోత్పత్తి అనేది ఉపయోగం, లైంగిక మిలనం అనేది ఆనందం. ఒక వయసు వచ్చి సంతానంలేని దంపతులు సంతాన నిమిత్తం బలవంతంగా లైంగిక మిలనానికి ప్రయత్నిస్తే అది ఆనందకార్యంకాక ఉపయోగకార్యం మాత్రమే అవుతుంది. అదే విధంగా ఇష్టంలేని స్త్రీతోనో పురుషునితోనో రమించటం కూడ ఆనందంలేని కార్యమే అవుతుంది.

ధృతరాష్ట్రుని జననం ఇటువంటిదే. సంతానం నిమిత్తం వ్యాసునితో రమించటానికి అంబికను పంపింది సత్యవతి. అది బలవంతపు సంభోగం. అంబిక మీద వ్యాసునికి ఇష్టం ఏర్పడటం సహజం, వ్యాసుని మీద అంబికకు ఇష్టం ఏర్ప డదు ఏవిధంగాను. బవిరిగడ్డాలు మీసాలతో భయంకరంగా ఉన్న వృద్ధుడైన వ్యాసుని సంగమాన్ని ఆమె ఏ విధంగా ఇష్టపడుతుంది ? సంతానమనే కూలికి లొంగవలసి వచ్చింది ఆమె. అందుకే సంభోగ సమయాన వ్యాసుని ముఖాన్ని చూడకుండా ఉండటానికి కళ్లు మూసింది. అల్లసాని పెద్దన మనుచరిత్రలోని వరూధిని మాయా ప్రవరాఖ్యునితో రమించే సమయంలో ఇష్టంవల్ల కళ్లుమూస్తే ఇక్కడ అంబిక అయిష్టంగా కళ్లు మూసింది. కళ్లు మూసుకున్నందున కాని మరోకారణంచేతకాని ధృతరాష్ట్రుడు జాత్యంధుడుగా జనించాడు. రామాయణ కాలంనాటి పాతివ్రత్య ప్రాధాన్యం భారతకాలంలో నశించ జొచ్చింది. ఎవరివల్లనైతేనేమి, కురువంశం అంతరింపకుండా ఉండటానికి ఒక గ్రుడ్డి మహారాజు భూమి మీద పడినాడు ! ధృత రాష్ట్రుని జనన వృత్తాంతా [illegible]ంతా విపులంగా వివరించాడు ఇందులో శ్రీ రామారావు. విషయం కొంత కఠినమైం[illegible] అయినప్పటికీ విశదీకరణ తేటతెల్లంగా ఉంటుంది.

భారతంలోని విషయాలను ఉన్నవి ఉన్నట్లుగా చూపటంతో సంతృప్తి పడక వాటిమీద తన వ్యక్తిగత దృక్పథాలను కూడ వివరించాడు ఆయన. సిద్ధాంతాన్ని వ్యాసంలోకి రూపాంతర పరచటానికి పాండిత్య మాత్రమే చాలదు, గవేషణ మాత్రమే చాలదు, వివేచన మాత్రమే చాలదు; అందుకు మౌలిక సృజన

శక్తి ఉండాలి, రచనా శిల్పం ఉండాలి. అప్పుడు కాని అది సర్వాంగ సుందరమైన సిద్ధాంతవ్యాసం కాదు. ఇది అంతే అయింది.

ధృతరాష్ట్రుడు కురురాజ్యాధిపతే కాని జాత్యంధుడు. చెవిటి, మూగ, కుంటి మొదలైన లోపాలను అంతలెక్కచేయరు కాని గ్రుడ్డి అనే దాన్ని ఘోరంగా చూస్తారు. మిగతా ఎన్ని సుగుణాలున్నప్పటికీ చూపులేని వ్యక్తికి విలువ ఇవ్వరు. కనుకనే కురురాజ్యాధిపతి అయినప్పటికీ ధృతరాష్ట్రునకు పిల్లనివ్వటానికి తోటి రాజన్యులు వెనకాడసాగేరు. ఈ సందర్భం గురించి గ్రంథకారుడంటాడు "ధృతరాష్ట్రుడు ఆరూఢ యౌవనుడైన తరువాత భీష్ముడు అతనికి వివాహం చేయాలని సంకల్పించాడు. అతడు వేదవేదాంగాది విద్యలను అధ్యయనంచేసి రాజవిద్యలలో జితశ్రముడై కుమారాయిత శక్తిశాలి అయ్యాడు. రాజ్యాభిషిక్తుడై కురుసామ్రాజ్యాధిపతి అయ్యాడు. ఆ కాలంలో కురుసామ్రాజ్యం భీష్మాభిరక్షితమై నికృత్త విరోధి సమాజమై వర్ధిల్లుతుంది. అట్లాంటి రాజ్యానికి అధిపతి అయిన ధృతరాష్ట్రునకు కన్యనిచ్చి వివాహం చేయటానికి ఎందరో రాజన్యులు ఉత్సాహపడటం సహజమే. కాని ఉత్తమాంగాలైన కన్నులు లేని జాత్యంధుడవటంచేత తమ కన్యల నివ్వటానికి ఆలోచించి ఉంటారు. అందువల్లే భీష్ముడు వధువుకై తానే అన్వేషణ ప్రారంభించాడు." పై వాక్యాల్లో వాడిన కొన్ని పదాలు విలక్షణంగా ఉండటం గమనార్హం. 'ఆరూఢ యౌవనుడైన,' 'జితశ్రముడై,' 'కుమారాయిత శక్తిశాలి,' 'నికృత్త విరోధిసమాజమై' ఈ విశిష్ట పదాలు బహుశా మహాభారతంలో వాడబడిన పదాలేమో ! అవి ఎక్కడివైనప్పటికీ చాలా ఆకర్షకంగా ఉన్నాయి. మామూలు సాదాపదాలను వాడుతూ వాడుతూ వచ్చి మధ్య మధ్య విశిష్ట పదాలను వాడినప్పుడు ఒక విరుద్ధాభాస ప్రత్యక్షమై ఆనందం కలిగిస్తుంది. ఇందుకు వ్యతిరేకంగా వాక్యాల్లో విరివిగా విశిష్ట పదాలను వాడుతూ వాడుతూ మధ్యలో ఎక్కడో సాదాపదాలను వాడితే మాత్రం అది రక్తికట్టదు. సామాన్యాల మధ్య అసామాన్యం ప్రత్యక్షమైనపుడు రక్తికడుతుంది కాని, అసామాన్యాల మధ్య సామాన్యం గోచరిస్తే మాత్రం రక్తికట్టక అందుకు వ్యతిరేకమైంది జరుగుతుంది !

ధృతరాష్ట్రుని వివాహ విషయం ప్రస్తావిస్తూ గ్రంథకారుడు వివాహ వ్యవస్థను గురించి - వివాహం అంటే ఏమిటి, ఎన్ని విధాల వివాహాలున్నాయి, వధువు ఏమిటి, వరుడు ఏమిటి మొదలైన ఎన్నో మరెన్నో వైవాహిక వివరణలు ఇచ్చాడు. ధృతరాష్ట్రుని గురించి వ్రాసినా కూడ ధృతరాష్ట్రుడు కాని మరెన్నెన్నో

విలువైన విషయాలను గురించి కూడ కష్టపడి అనుశీలించి వ్రాశాడు. వీటిలో చాలా మందికి తెలియని చాలా విషయాలున్నాయి.

ఒక విషయాన్ని తగినంత సమగ్రంగా వివరించాలంటే ఆ ఒక్క విషయాన్ని గురించి వ్రాస్తే మాత్రమే చాలదు, దానికి సంబంధించినట్టీ, సంబంధించనట్టీ అనేక ప్రముఖ, అప్రముఖ విషయాలను గురించికూడ వ్రాస్తేనేకాని అసలు విషయానికి అవసరమైన తుష్టి, పుష్టి అబ్బవు. ఇతర విషయాలను గురించి వ్రాయటం కొందరికి అసందర్భాలు అనిపించుకొంటాయి. కొన్ని సందర్భాలను బలపరచటానికి అసందర్భాలు అనబడేవి కూడ సందర్భాలవుతాయి. ప్రత్యేకించి సిద్ధాంత వ్యాస రచనల్లో విస్తృతమైన విషయజ్ఞానం అవసరం. కొన్నిటిని వివరించటానికి రాజనైతిక, సమాజనైతిక, అర్థనైతిక, మొదలైన ఎన్నో విషయాలను గురించి చర్చించాలసి ఉంటుంది. స్థూలదృష్టికి అవన్ని అసందర్భాలుగా తడతాయి. సూక్ష్మ దృష్టికి సందర్భాలుగానే తడతాయి. కొన్ని సందర్భాలు ప్రత్యక్షాలు అయితే మరి కొన్ని పరోక్షాలు. ఒకోసారి పరోక్ష సత్యాలు ప్రత్యక్ష సత్యాలకంటే ఎక్కువ ప్రస్ఫుట సత్యంగా ఉంటాయి.

ఈ గ్రంథంలో అటువంటి వివరణలు కోకొల్లలుగా ఉన్నందువల్ల విషయ విస్తృతి చోటుచేసుకొంది. అందుకని సిద్ధాంత వ్యాసం కేవల విజ్ఞాన సర్వస్వ నిఘంటు రూపం కాకూడదు. దానిలో తగినంత గ్రంథకారుని మౌలిక వ్యక్తిత్వం కూడ రూపుదాల్చాలి. అదిలేంది ఒయాసిస్ లేని ఎడారిమాత్రమే అవుతుంది రచన. ఈ గ్రంథంలో ఒయాసిస్‌లు తగినన్ని సస్యశ్యామలంగా గోచరిస్తూ భోగట్టాతోడు అనుభూతిని ప్రసాదిస్తాయి.

మానవ జీవితంలోని మహనీయ దశలలో దాంపత్య జీవితం ఒకటి. గాంధారీధృతరాష్ట్రుల దాంపత్య జీవితం గురించి ఇందులో వివరంగా చర్చించ బడింది. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైనందున ఆయనకు తోడు తాను కూడ గ్రుడ్డిగా ఉండాలని గాంధారి తన కళ్లకు గంతకట్టుకొని తాను సృష్టించుకొన్న గ్రుడ్డి తనంతో జీవించసాగింది. ఈ కళ్లగంత (నేత్ర పట్టం) విషయంలో పండితుల మధ్య అభిప్రాయ భేదాలున్నట్లు, ఆ అభిప్రాయభేదాల ప్రాముఖ్యతను గురించి మన గ్రంథ కారుడు కొన్ని రోచకమైన విషయాలను వెల్లడించాడు.

అంధభర్తమీది సానుభూతితో ఆమె కళ్లకు గంతకట్టుకొంటే కొడుకు లను చూడటానికైనా వాన్ని విప్పకపోవటం ఆశ్చర్యకరం. అసలు అంధుణ్ణి ఆమె

ప్రేమతో చేసుకొన్నదా, లేక అయిష్టంతో, విరక్తితో చేసుకొన్నదా అనికూడ సందేహమే. తన భర్త లోకాన్ని చూడటంలేదు కనుక తాను కూడ లోకాన్ని చూడరాదని బలవంతపు అంధత్వాన్ని స్వీకరించినట్లా, లేక భర్తమీది అయిష్టంతో గ్రుడ్డి భర్తను చూడకుండా ఉండటానికై అంధత్వాన్ని స్వీకరించినట్లా ? పాతివ్రత్యం రెండు విధాలుగా ఉంటుంది. భర్తమీది ప్రేమతో అవలంబించే పాతివ్రత్యం ఒకటి, భర్తమీది ద్వేషంతో అవలంబించే పాతివ్రత్యం రెండవది. మొదటిది ఆనందం కలిగించే పాతివ్రత్యం, రెండవది బాధను కలిగించే పాతివ్రత్యం. మరి గాంధారి పాతివ్రత్యం ఆ రెంటిలో దేనికి చెందుతుంది ? రెండవదానికే చెందినట్లు కని పిస్తుంది. ఆమెది విషాద పాతివ్రత్యమేకాని ఆనంద పాతివ్రత్యం కానట్లు తెలు స్తుంది. అసలు భారతంలో అంతగా పాతివ్రత్యానికి విలువ ఉన్నట్లు గోచరించదు. భారతంలోని చాలామంది ఘనుల తల్లులెవరో చెప్పవచ్చునుకాని తండ్రులెవరో చెప్పటం సాధ్యం కాదు. అయినప్పటికీ ఆ వనితలు గౌరవంగానే చూడబడేవారు. దీన్నిబట్టి అనిపిస్తుంది భారతకాలంలో పరపురుష సంబంధం పాతివ్రత్యానికి అడ్డు కాదేమో అని !

ఏది ఏమైనా గాంధారి గ్రుడ్డి ధృతరాష్ట్రునితో దినాలు కష్టంతో, అయి ష్టంతో గడిపిందేకాని మరో విధంగా గడపలేదనిపిస్తుంది ఆమె జీవన విధానాన్ని గమనిస్తే. ఈ విషయంలో మన గ్రంథకారుడు ఏ నిర్ణయానికీ వచ్చినట్లు కని పించదు. అయినా, ఈ క్రింది మాటలవల్ల గాంధారి గొప్పదనే నిర్ణయానికి వచ్చి నట్లున్నాడు. "కనుక గాంధారి ధృతరాష్ట్రుని ఎడ వైమనస్యంతోకాని అయిష్టంతో కాని కాక భర్తతోడిదే లోకంగా భావించి సహధర్మచారిణియై భర్త చూడలేని లోకం తాను చూడ నిష్టంలేకనే కృత్రిమ అంధత్వాన్ని ఒక నియమంగా పెట్టుకొన్నది. ఆమె పాతివ్రత్య దీక్షలో ఈ నియమమొక కఠోర పరీక్ష. జీవితంలో ఈ పరీ క్షకు నిలిచి బిడ్డల్ని చూసుకోవాలనే ఆవేదన తనను దహించినా సహించి భర్తతో సహగమనం కావించి మరణంలో కూడ భర్తను అనుసరించిన అత్యుత్తమ ఇల్లాలై వర్ధిల్లింది."

భర్తచూడలేని లోకాన్ని తాను చూడకుండా ఉండటంకంటె భర్తను చూడకుండా ఉండటం ఎక్కువ అపరాధం. కళ్లకు గంత కట్టుకున్నందువల్ల బయటిలోకం కనపడనట్లే ఇంట్లోని భర్తకూడ కనపడడు. లోకాన్ని చూచినా తప్పు లేదు కాని భర్తను చూడకపోవటం తప్పు. భర్త తనను చూడలేడు కాని తాను

భర్తను చూడకలుగు. కళ్లగంత మూలంగా తాను భర్తనుచూసే అవకాశం లేకుండా పోయింది. కళ్లుండి కూడ భర్తను చూడకపోవటం పతివ్రతాలక్షణం కాదేమో. కొందరు భార్యలు భర్తను ప్రేమిస్తారు, మరికొందరు భర్తను పూజిస్తారు. పూజించటంకంటే ప్రేమించటం గొప్పది. భర్తమీద ఇష్టం ఉన్నవాళ్లు ప్రేమిస్తారు, ఇష్టం తగ్గిన వాళ్లు పూజిస్తారు. మొదటిది సహజంగా వచ్చేది, రెండవది తెచ్చిపెట్టుకొనేది. ప్రేమించక పోవటం పాపం అని ప్రేమించరు, ప్రేమించకుండా ఉండలేక ప్రేమిస్తారు. పూజించేవారి విషయం వేరు; పూజించకపోతే పాపం అని పూజిస్తారు; పూజిస్తే పుణ్యం అని పూజిస్తారు. గాంధారి ధృతరాష్ట్రుని పూజించిన ధర్మపత్ని మాత్రమేకాని, ప్రేమించిన ప్రియపత్నికాదనిపిస్తుంది ఆమె పై ఖరి పరిశీలిస్తే. సహగమనం కూడ ప్రీతివల్లకాక పాపభీతివల్లనే చాలమంది జరిపేది.

ఏది ఏమైనా గాంధారి కురుమహారాణీగా పేరు తెచ్చుకొన్న దనటంలో సందేహం లేదు. భర్తపట్ల ఆమె పై ఖరి ఏమిటి అనేది ప్రధానంకాదు, గృహ యజమానురాలుగా ఏవిధంగా ఆమె సంచరించింది, గార్హస్థ్యాన్ని ఆమె ఏ విధంగా నిర్వహించింది అనేది ప్రధానం. ఆదర్శ గృహిణిగా, గొప్ప మానవతా జీవిగా, ఉదార చరితగా, కారుణ్యవతిగా ఆమె గొప్పగా ప్రకాశించినట్లు తెలుస్తుంది. తన ప్రేమను ధృతరాష్ట్రుడు ఎంతవరకు పొందేడో తెలియదు కాని ధృతరాష్ట్రుని ప్రేమను మాత్రం ఆమె పొందింది. ఆమె ఆరాధనను మాత్రం ధృతరాష్ట్రుడు పొందేడు తగినంతగా అనేది వాస్తవం. నిజం పలకాలంటే గాంధారి మూలంగానే ధృతరాష్ట్రుడు ప్రఖ్యాత ధృతరాష్ట్రుడయ్యాడు.

కురుక్షేత్ర సంగ్రామంలో ధార్తరాష్ట్ర సంతానమంతా నిశ్శేషంగా నశించి పోయిన తరువాత గాంధారీ ధృతరాష్ట్రులు భరించరాని క్లేశానికి లోనై ఒకరిపై మరొకరు ఎక్కువగా ఆధారపడి జీవించసాగారు. ఇదివరలో గాంధారికి ధృతరాష్ట్రుడు ఇవ్వలేని విలువనంతా ఇప్పుడు ఇవ్వసాగాడు. పుత్రుల మరణానంతరం ఆ పుత్రులను పుత్రుల తల్లిలో కళ్లులేకపోయినా చూడసాగేడు. ఈ సందర్భంలో గ్రంథకారుడు రామారావు అంటాడు "భార్య ఏనాడో సమయజ్ఞతతో బోధించిన నీతివాక్యాల్ని వినక పుత్రవ్యామోహంతో, రాజ్యలోభంతో పెడచెవిని పెట్టినందుకు అతని హృదయం పశ్చాత్తాపంతో కుమిలిపోతూంది. పుత్రుల మరణానికి కారణం

తాను, కనుక వారు పుణ్యగతులు అయేందుకు ప్రయత్నించవలసిన భారం తనమీద ఉంది. అందుకే 'వారికి సుగతి గల్గునట్లుగా నిప్పుడును గొప్ప పుణ్యక్రియ లజాత శత్రు ననుమతితో నాచరించి పోదము' అని భార్యతో పలికాడు. తన ఉదాసీనతయే ఇంతటి నాశనానికి కారణమని తన నేరాన్ని అంగీకరించి దోషిలాగా భార్య ఎదుట తలఒగ్గు తున్నాడు. భర్తలో ఈ విధమైన భావ పరిణామాన్ని తన సద్గుణాలతో, అనువ్రత శీలంతో, సహధర్మచారిణియై గాంధారి సాధించింది. ఎలాంటి క్లిష్ట సమయంలో కూడ ఆమె భర్తను తూలనాడలేదు. జీవిత ప్రథమార్ధంలో భార్యకంతగా ప్రాధాన్యమీయక పోయినా, ఆ భర్త ఈనాడు ఆమె ముందు దోషిలా నిలుచున్నాడు. భర్త జీవితంలో భార్యకున్న ప్రాధాన్యాన్ని, భార్యాభర్తల దాంపత్యంలోని ఆత్మీయతానుబంధాన్ని వివరించటానికి ఈ సన్నివేశం ఒక మచ్చుతునక. దీన్ని తీర్చిదిద్దిన తిక్కన కవిలోక పూజితుడు."

ఒక విషయాన్ని, ఒక ఘటనను, ఒక సత్యాన్ని పారదర్శికంగా విశ్లేషించి చెప్పటంలో శ్రీ రామారావు దక్షుడు. ఆయన శైలి తెలిపేదిగా ఉన్నట్లే హృదయానికి హత్తుకొనేదిగా కూడ ఉంటుంది. తెలపటం వేరు, అభివ్యక్తపరచటం వేరు. దీనినే Statement is different from expression అనవచ్చు. Statementలో భోగట్టాయే కాని అభివ్యక్తి (Expression) ఉండదు. కాని అభివ్యక్తిలో భోగట్టాకూడ ఉంటుంది. "ఇది గులాబి పూవు" అనేది భోగట్టా ప్రధానమైన Statement. ఈ గులాబి పూవు నా మానసాన్ని మానస సరోవరం చేసింది అనేది అభివ్యక్తి. అభివ్యక్తిలేని భోగట్టా కేవలం వార్తాపత్రికలో సమాచారం లాంటిది. భోగట్టాలేని అభివ్యక్తి కేవలం ఆధారంలేని కల్పనలాంటిది.

శ్రీ రామారావు రచన ఈ గ్రంథం అంతటిలోను అభివ్యక్తి గల భోగట్టాను, భోగట్టా సమేతమైన అభివ్యక్తినీ ప్రసాదించటంలో ప్రముఖంగా గోచరిస్తుంది. అయితే శైలి కొంత మిశ్రమంగా గోచరిస్తుంది. కొన్నిచోట్ల గ్రాంథిక ప్రయోగాలు కూడ దర్శనమిస్తాయి. వ్యావహారిక శైలిలో పదాంతం నున్నాతో ముగియటం వాడుకలో ఉన్నది. అక్కడక్కడ ఈ గ్రంథకారుడు నున్నాకు బదులు 'ము'ను ఉపయోగించాడు. గుర్తుంచుకొనే ఉపయోగించినట్లా, గురు లేక ఉపయోగించినట్లా ? ఇదే విధంగా కొన్ని వాక్య నిర్మాణాలు గ్రాంథిక గంధాన్ని కలిగి ఉన్నాయి. ఇవన్నీ పెద్దలోపాలుకావు కాని చిన్న లోపాలు కూడ లేకుండా ఉండటం వాంఛనీయం అయితే, గ్రాంథిక వ్యావహారిక మిశ్రమమైన ఈ శైలి నేటి చాలా

మంది రచయితల్లో తరచుగా కనిపిస్తున్నందువల్ల అదొక పెద్ద తప్పుగా ఎంచబడటం లేదు. ప్రతి భాషలోను ఇటువంటి ద్వంద్వప్రయోగాలు ప్రత్యక్షమవుతూనే ఉన్నాయి. వీటిని అదే విధంగా సాగనియటం అవసరమో, అరికట్టటం అవసరమో తెలియదు. వాస్తవానికి తెలియదని తప్పించుకొంటే చాలదు, తెలుసుకోటానికి ప్రయత్నించాలి. ఈ పీఠికలో కూడ అటువంటి లోపాలుండవచ్చు.

వాస్తవానికి గ్రంథం పద్యరచనపై గద్యరచన. ఎక్కడైనా చాలా అరుదుగా గద్య రచనలపై పద్య రచనలు కూడ ఉండవచ్చు. కాని అమలులో ఉన్నవి ప్రధానంగా పద్య రచనలపై గద్య రచనలు, గద్యరచనలపై గద్యరచనలు. ఇటువంటి వానిని వ్యాఖ్యలనవచ్చు. ఒక సందేహం ఏమంటే ఇటువంటి రచనలను మౌలిక రచనలనవచ్చా అని. కారణం, ఇటువంటి వాటి అస్తిత్వం మరొక దానిపై ఆధారపడి ఉంటుంది. ఈ గ్రంథ రచన మహాభారతం మీద ఆధారపడి రచించింది, ప్రత్యేకించి ఆంధ్ర మహాభారతం మీద. అయితే, ఆంధ్ర మహాభారతం కూడ మౌలిక రచనకాదు; అది సంస్కృత మహాభారతం నుంచి తెలుగు అనువాదం. ఇక మౌలిక రచన అనేది సంస్కృత మహాభారతం. అది కూడ ఎంతవరకు మౌలిక రచన కాగలదు గనుక ? కురు రాజన్య గాథలపై, కురుక్షేత్ర యుద్ధంపై ఆధారపడి రచించబడింది అది. కనుక అది కూడ స్వతంత్రమైన మౌలిక రచనకాదు. ఇక మౌలికమైనవి ఏమంటే కురురాజన్య గాథలు, కురుక్షేత్ర యుద్ధం మొదలైనవి. అవి మాత్రం ఎంతవరకు మౌలికాలు కాగలవు ? ఆ ఘటనలన్నీ కూడ మానవ మనోవృత్తుల మీద ఆధారపడి జరిగినవే. ఆ మానవ మనోవృత్తుల అస్తిత్వానికి కూడ కారణాలుంటాయి. కనుక ఈ ప్రపంచంలో ఖచ్చితమైన మౌలికత అనేది ఏదీ లేదేమో !

వ్యావహారిక జగత్తులో ఆ విధిరి భావించబడక కొన్ని మౌలికాలనీ, కొన్ని అనుకృతులనీ భావించబడుతూ వస్తున్నాయి. ఆ అర్థంలో మాతృకలు మౌలికాలుగా, వాటి అనువాదాలు అనుకృతులుగా ఎంచబడుతున్నాయి. ఈ అర్థంలో ఆంధ్ర మహాభారతం మౌలికం కాదు, అందులో అనువాదకులు కొన్ని తమ స్వంతాలను చేర్చినాకూడ. అయినప్పటికీ, దానిలోని విషయం ఒకటైనా, భాష, మాతృకలోని భాష నుండి భేదించి స్వతంత్ర అస్తిత్వాన్ని కలిగిఉంది కనుక అభివ్యక్తి, పద ప్రయోగాలు, వాక్య నిర్మాణాలూ స్వతంత్రమైనవి కనుక ఆంధ్రమహాభారతం కూడ కొంతవరకు మౌలికమే. అటువంటప్పుడు ఈ సిద్ధాంత వ్యాసం ఆంధ్ర మహా

భారతం మీద ఆధారపడి రచింపబడినా కూడ మౌలిక రచనే అవుతుంది. ఈ రచన ఆంధ్రమహాభారతానికి అనుకృతి కాదు. దీనికి పునాది ఆంధ్రమహాభారతం అయితే పునాది మీది నిర్మాణం ఈ సిద్ధాంత వ్యాసం. పునాదికీ, దానిపై కట్టబడిన భవనానికీ పోలిక ఉండదు. పునాది మీద లేని ఎన్నో నూతన రూపురేఖల్ని దానిపై నిర్మితమైన కట్టడం దిద్దుకొంటుంది. కనుకనే సిద్ధాంత రచన అనేది మౌలిక రచనే అవుతుంది.

ఈ సిద్ధాంత వ్యాసం ప్రత్యేకించి ధృతరాష్ట్రునకు సంబంధించి రచించినదైనప్పటికీ సంక్షిప్తంగా భారతంలోని ప్రధాన పాత్రలందరూ ప్రత్యక్షమవుతూనే ఉంటారు. ఇందులోని ధృతరాష్ట్రుని పాత్రలో వెలుగుకంటే చీకటియే ఎక్కువగా గోచరిస్తుంది. ధృతరాష్ట్రునిలో మంచిని తనవరకు తన కుటుంబం వరకు వాడుకొని చెడును ఇతర్లయెడల వాడటం జరిగింది. ఆయనలోని దుష్టత్వానికి చూపబడిన ఉదాహరణలు మంచితనానికి చూపబడలేదు ఈ రచనలో. కొరతపడ్డ మంచితనం ఏ విధంగా చూపబడుతుంది ? పాండవులు ఎంతవరకు చెడ్డవారో సరిగ్గా తెలియదు కాని ధృతరాష్ట్రుడు ఎంతవరకు మంచివాడు కాదో అందరికి తెలిసిన విషయం. కొందరు తమ చెడ్డతనాన్ని పెద్ద పెద్ద పనుల్లో మాత్రమే ప్రదర్శిస్తారు. కాని ధృతరాష్ట్రుడు మాత్రం తన చెడ్డతనాన్ని పెద్ద పెద్ద పనుల్లో ఎంతవరకు ప్రదర్శించాడో అంతగా తెలియదు కాని చిన్న చిన్న వాటిలో మాత్రం విరివిగా ప్రదర్శించాడు.

సరే, కురుక్షేత్ర సంగ్రామంలో తనవారొక్కొక్కరూ నేలకొరిగిపోతున్నట్లు సంజయుని ద్వారా విని ధృతరాష్ట్రుడు స్వయంగా నేలకొరగలేక, నేలపై నిల్చోలేక పడిన తీవ్రమనస్తాపం వర్ణనాతీతం. ధృతరాష్ట్రునిలోని ప్రధాన లక్షణం పచ్చి స్వార్థం. స్వార్థం ఎపుడైతే హద్దులను మించి పోతుందో అది తనను తనవారినికూడ తీవ్రంగా నాశనం చేస్తుంది. స్వార్థం రెండు విధాలయింది. తన లాభం మాత్రమే చూచుకోటం ఒక విధమైన స్వార్థం. తన లాభంతో మాత్రమే సంతృప్తిపడక ఇతర్ల నష్టాన్ని కోరటం మరోవిధమైంది. మొదటిది అంతగా హానికరంకాదు, రెండోది మాత్రం చాలా హానికరం. ధృతరాష్ట్రుని స్వార్థం ఈ రెండవ దానికి చెందుతుంది. తన సుఖాన్ని గురించిన కలలు కనటమే ఆయన ప్రధాన ప్రవృత్తి. ఇతర్లు ఏమైనా తనకు బాధలేదు.

ధృతరాష్ట్రుని గురించిన ఇటువంటి వివరాలెన్నింటినో గ్రంథ కారుడు ఈ గ్రంథంలో విపులంగా చిత్రించాడు. చెడును మాత్రమే చిత్రిస్తూ ఆయనలోని

మంచిని వదలలేదు. అదే విధంగా మంచిని మాత్రమే చిత్రిస్తూ ఆయనలోని చెడును వదలలేదు. కాని ఆ రెంటినీ కాటాలో పెడితే చెడున్న వైపుది నేలనుండి పైకి లేవదు

ఈ గ్రంథంలోని మరో విశేషం ఏమంటే ధృతరాష్ట్రుని గురించి గ్రంథ కారుని అభిప్రాయాలు మాత్రమేకాక భారతంలోని పాత్రల అభిప్రాయాలు ఏవిధంగా ఉన్నాయి అని కూడ వివరణ ఉన్నది. గ్రంథం అంతటిలోకీ ఈ భాగం ఎక్కువ అభిరుచికరంగా ఉన్నట్లనిపిస్తుంది. భారత పాత్రల్లోని మిగతా వారందరికంటే భీముడు ధృతరాష్ట్రునిపట్ల అధిక కుపితుడై ఉండటం విశేషం. ఇది కొంతవరకు సమంజసం కూడానేమో. పాండవ సోదరులందరికంటే భీముని మీదనే ధృత రాష్ట్రునికి ఎక్కువ ద్వేషం ఉండేది. అందరికంటే విపరీతమైన బలశాలి భీముడు. అందువల్ల కురురాజన్యులంతా, ప్రత్యేకించి ధృతరాష్ట్రుడు భీమునిపట్ల అసూయ ద్వేషం కలిగి ఉండేవాడు. కనుకనే భీమునికి కూడ ధృతరాష్ట్రునిపట్ల అంత వైర భావం పాతుకపోయింది.

మొత్తం మీద ప్రతివారూ ధృతరాష్ట్రునిపైన వ్యతిరేక భావాలనే వ్యక్తం చేశారు తీవ్రతల తేడాతో. ఒక దుష్ట స్వభావుని గురించి అతని మిత్రులు కూడ సమక్షంలో మంచిగా మాట్లాడినా, పరోక్షంలో వ్యతిరేకంగానే మాటాడుతారు. ప్రత్యక్షంగా నాశనానికి కారకుడు సుయోధనుడు అయినప్పటికీ, పరోక్షంగా నేపథ్యం లోని కారకుడు ధృతరాష్ట్రుడే అని అందరి అభిప్రాయం. కొన్ని సమయాల్లో తండ్రిమాటను కాదని స్వతంత్రించి నిర్ణయాలు తీసుకొని ఆనిర్ణయాలను ఆచరణలో పెట్టటం కూడ చేస్తుండేవాడు సుయోధనుడు. అయినా అందుకంత తీవ్రంగా బాధ పడినట్లు కనిపించడు ధృతరాష్ట్రుడు. సంజయుడు, విదురుడు, శ్రీకృష్ణుడు మొద లైన హితచింతకులు చెప్పిన మంచి సలహాలను కూడ ధృతరాష్ట్రుడు అంగీకరించ లేదు. తమకు కీడు కలగకపోయినా, ఇతర్లకు మేలు కలిగే సలహాలను ఆ కురు సామ్రాజ్యాధిపతి పెడచెవిని పెట్టేవాడు. అటువంటి వ్యక్తిని గురించి ప్రజల్లోకాని, నాయకుల్లో కాని, రాజన్యుల్లో కాని, మునిపుంగవుల్లో కాని సదభిప్రాయాలుండటం కుదరదు. గ్రంథకారుడు వారందరి అభిప్రాయాలను దీనిలో సుందరంగా సువ్యక్తం చేశాడు.

ఎంత దుష్టులైనా చివరకు తమ జీవన సంధ్యలో అంతర్ముఖులుగా మారి ఆధ్యాత్మిక చింతాస్రవంతిలో ఈదసాగుతారు. ధృతరాష్ట్రుడు కూడ అంతే అయి

నాడు. ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక జీవితాన్ని గురించి వ్రాస్తూ శ్రీ రామారావు మానవ జీవనతత్వాన్ని గురించి కొంత చర్చించాడు. అది లోతులూ ఎత్తులూ కలిగి బాగున్నది. మనిషి అంతర్ముఖ జీవితం గడుపుతున్నా కూడ బయటి పరిసర ప్రభావాలు తగలకుండా ఉండలేడని, సామాజిక ఆర్థిక పరివర్తనాలకు లోబడక తప్పదనీ ఆయన విశదీకరించటం సమంజసంగా ఉన్నది.

ఈ గ్రంథంలో మరో ఉత్తమ ఖండిక గ్రంథాంతంలో ఉన్న 'ఉపసంహారం' అనేది. ఇందులో మహాభారతాన్ని గురించి, దాని ఆద్యంత విషయాలను గురించి, సాహిత్య విషయాన్ని గురించి మంచి సమీక్ష ఉన్నది. ఒకచోట వ్రాస్తాడు గ్రంథకారుడు : "అయితే మహాభారత విస్తరణంలో మాత్రం వాస్తవాంశాలతో పాటు ఆధిదైవికాంశాలు కూడ చోటుచేసుకొన్న విషయం తేటతెల్లమవుతుంది. అందులో కొన్ని అంశాలు బౌద్ధ యుగానంతరం బ్రాహ్మణమత వ్యాప్తిలో వైదిక మతానుయాయులైన రాజుల ఆస్థానాలలోని కవులు, పండితులు, పురోహితులు బ్రాహ్మణమత గ్రంథాలలోని అంశాలను, జాతక కథలలోని అంశాలను కొన్ని మార్పులతో ఉపాఖ్యానాల రూపంలో మహాభారతంలో ప్రవేశపెట్టి ఉంటారు."

ఈ సిద్ధాంత వ్యాసాన్ని రచించటంలో శ్రీ రామారావు పడిన శ్రమ, చూపిన నైపుణి, సాధించిన ఫలితం అన్నీకూడ ఎంతో అభిజ్ఞతను, అంతర్‌దృష్టిని, బాహ్య అనుశీలనను, తాత్విక దృష్టిని, తార్కిక శక్తిని చూపుతాయి. దీన్ని తన డాక్టరేట్ నిమిత్తం రచించినప్పటికీ విద్యార్థినీ విద్యార్థులకూ, అధ్యాపకులకూ మాత్రమేకాక సాధారణ పాఠకులకు కూడ ప్రయోజనకారిగా ఉంటుంది.

ఇందులోని విషయం మహాభారతానికి చెందిందా, మాండూక్యోపనిషత్తుకు చెందిందా అనే ప్రశ్నయే లేదు. దేనికి చెందినప్పటికీ ఇదొక సాంస్కృతిక ఖండిక. ఇందులో ఏమి వ్రాశాడనేది అప్రధానం కాకపోయినా, ఎట్లా వ్రాశాడనేది ప్రధానం. ఎట్లా వ్రాయటం అనేది రమ్యంగా ఉంటే ఏమి వ్రాసినా సౌమ్యంగానే ఉంటుంది.

తుమ్మపూడి, (సం.) ఎస్. సంజీవ్‌దేవ్

22-11-87

# అభివందనలు

సమాజంలో కొందరి జీవితాలు వడ్డించిన విస్తరులయితే, మరికొందరి జీవితాలు కష్టాల కడగండ్లు అవుతాయి. అయితే పెద్దల కష్టాల కడగండ్లలో వడ్డించిన విస్తరి కావటం నా జీవిత విశేషం. ఎం. ఏ. పూర్తికావటం ఎంత అనుకోకుండా జరిగిందో, ఉద్యోగం లభించటంకూడ అంత కాకతాళీయ సంఘటనే అవుతుంది. విద్యార్థిగాకన్నా ఉద్యోగంలో ప్రవేశించటం జరిగాక అసలు విద్యాభ్యాసం ప్రారంభమైన స్ఫూర్తి కలిగింది. విద్యార్థిగా అవగతం కాని ఎన్నో సాహిత్యాంశాలు అధ్యాపకునిగా విద్యార్థులకోసం విషయ సేకరణ చేసే సమయంలో క్రొత్తక్రొత్తగా తోచి తెలుసుకోవలసిన విషయాలెన్నో ఉన్నాయని బోధపడింది. తెలియని అంశాలు విద్యార్థులకోసంకాక, నాకోసం తెలుసుకోవాలనే తపన ఆ స్ఫూర్తికి ఊతం ఇచ్చింది.

ఆ తపనతోనే పరిశీలనాదృష్టితో సారస్వతాధ్యయనం చేసేటప్పుడు తెలుగు సాహిత్యంలో విజ్ఞాన సర్వస్వంగా విలసిల్లుతున్న కవిత్రయంవారి ఆంధ్ర మహాభారతంలోని కురుసమ్రాట్టు ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలోని లోతులు నన్ను ఆకర్షించాయి. ధృతరాష్ట్రుణ్ణి దృష్టిలో పెట్టుకొని కవిత్రయంవారి మహాభారతాన్ని, దానికి మూలంగా సంస్కృత మహాభారతాన్ని పరిశీలించేటప్పుడు అతడి ప్రాధాన్యం ఎంతో విశిష్టంగా ఉన్నట్లు గోచరమైంది. మహాభారత కథ ఎన్నో మలుపులతోనై పర్యవసానంగా కురుక్షేత్ర సంగ్రామంలో కురువంశం నాశనం కావటానికి అందరికన్న ధృతరాష్ట్రుడే ఎక్కువ బాధ్యత వహించవలసి ఉంటుందని అనిపిస్తుంది. మహాభారతంలోని విషయాల నెన్నింటినో కూలంకషంగా పరిశీలించిన పండితులు, సాహిత్య విమర్శకు లెవ్వరూకూడ ధృతరాష్ట్రునిపై తమదృష్టి సారించకపోవటం విశేషంగానే ఉంది. బహుశా అతడు జాత్యంధుడై జీవితంలో ఇతరులపై ఆధారపడి వర్తించినట్లు కనిపించటమే అందుకు కారణం కావచ్చు.

స్థూలదృష్టికి ధృతరాష్ట్రుని ప్రాధాన్యం గోచరం కాక పోయినప్పటికీ, విశ్లేషణాత్మకమైన పరిశీలన ప్రారంభిస్తే కురుపాండవ కథకు మూలకందం ఆ మహారాజేననే అభిప్రాయం దృఢతరమవుతుంది. ఆ మహారాజు జననంలోని రహస్యం, వివాహం, దాంపత్యం, సోదర, పుత్రాదులతోడి అతని సంబంధం, రాజనీతి నైపుణ్యం, అతిధి సత్కారం, ఆధ్యాత్మిక పరివర్తనం, జీవించిన కాలపరిమితి —

ఇట్లా ఎన్నో అంశాలు సూక్ష్మ పరిశీలన కర్హమై, మహాభారతంలో ధృతరాష్ట్రుని బహుముఖమైన వ్యక్తిత్వంలోని నిగూఢత్వం, అనిశ్చయతత్వం, అంతర్ముఖత్వం పాఠకులను ఆశ్చర్యచకితులను చేస్తాయి. సాధారణ మానవ జీవితంలోని సుఖ దుఃఖాది అనుభూతి విశేషాలేకాక, ఒక సామాజిక వ్యవస్థలోని మెట్టపల్లాలుకూడ ధృతరాష్ట్రుని జీవిత పరిశీలనలో అవగతమవుతాయి. ధృతరాష్ట్రుని గూర్చి అనేకానేకాంశాలు పరిశీలించ తగినవి ఉన్నప్పటికీ, ఒక్క కురుసామ్రాజ్యాధిపత్యం విషయంలోమాత్రమే కొందరు పండితులు తమ దృష్టిని సారించారు కాని అతడి జీవితంలో మిగిలిన అంశాలపై సమగ్రమైన పరిశీలన జరగలేదు. ఈ పరిస్థితి విషయ సేకరణలో నాకు కొంత ఇబ్బంది కలిగించిన మాట వాస్తవమే కాని, ఈ గ్రంథంలో కవిత్రయ మహాభారతంలో చిత్రీకరించబడ్డ ధృతరాష్ట్రుని జీవిత విశేషాలపై కొంతవరకు పరిశీలన జరిపి, ఆధార సహితంగా నిర్దిష్టమైన సూచనలతో కూడిన కొన్ని ప్రతిపాదనలు చేసే అవకాశం నాకు లభించటం నాకెంతో సంతోషాన్ని కలిగించే విషయం

ఈ గ్రంథం ఈ రూపు దిద్దుకోవటానికి నా శ్రమకు ఎందరో మహానుభావుల, సన్నిహితుల, మిత్రుల, హితుల అదృశ్య హస్తాలు బాసటగా నిలిచాయి. వారిలో మొట్టమొదట స్మరించ దగ్గవారు. నా పరిశోధనా కార్యక్రమానికి నిర్దేశకత్వం వహించేందుకు అంగీకరించి, అనేక సందర్భాల్లో అనేకానేక సందేహాలను తీరుస్తూ, అమూల్యమైన సూచనలతో నిర్ణీత కాలంలో ఈ సిద్ధాంత వ్యాసరచన పూర్తి కావటానికి తోడ్పడటమేకాక, అర్థించిన వెంటనే ఆమోదం పలికినవారు, గురువర్యులు డాక్టర్ ఎస్. గంగప్పగారి సహృదయానికీ, స్నేహశీలతకూ, శిష్యవాత్సల్యానికీ—

ఎఫ్. ఐ. పి. పథకంలో పరిశోధన చేయటానికి సంస్కృతీ సంపన్నమైన హృదయంతో, అవకాశం కల్పించి పరిశోధన పూర్తి అయ్యేంతవరకు వెన్నుతట్టుతూ ధైర్యం చెప్పిన మా కళాశాలాధ్యక్షులు పౌనకం సాంబశివరావుగారి ఔదార్యానికీ—

ప్రిన్సిపాలుగారి సిఫారసు మేరకు నా పరిశోధనా కార్యక్రమానికి అంగీకరించి ఆశీర్వదించిన మా కళాశాల పాలకవర్గంవారు, ముఖ్యంగా సెక్రటరీ మరియు కరస్పాండెంటు ప్రత్తిపాటి వెంకాయమ్మగారి వదాన్యతకూ- వదాన్యులు, మానవతావాది, విద్యామూర్తులైన కీర్తిశేషులు జాగర్లమూడి శివరామ ప్రసాదుగారి సహృదయానికీ --

నా విద్యావ్యాసంగంలోనేకాక జీవిత గమనంలోకూడ బాసటగా నిలిచి ఆశీస్సులు పలికిన పితృతుల్యులు ముష్టిపల్లి నాసరుగారి అభిమానానికీ—

పరిశోధనాంశం ఎన్నుకోవటంలోనేకాక వివిధ దశల్లో అమూల్యమైన సలహాల నివ్వటంతోపాటు, ఈ గ్రంధ ప్రచురణకోసం తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయాన్నందించిన తెలుగు విశ్వవిద్యాలయం కులపతి, గురుదేవులు తూమాటి దొణప్పగారి ఆదరణకూ—

ఎల్లప్పుడు హితవాక్యాలతో నన్ను ఆశీర్వదించే నా శ్రేయోభిలాషి నాగభైరవ కోటేశ్వరరావుగారి వాత్సల్యానికీ—

పరిశోధన చేయటానికి వసతి కల్పించటంతోపాటు, నాకు పిహెచ్.డి. పట్టప్రదానం చేసిన నాగార్జున విశ్వవిద్యాలయాధికారులకు, ఎఫ్.ఐ.పి. పథకం క్రింద పరిశోధనకు అనుమతించిన విశ్వవిద్యాలయ నిరాశాల సంఘంవారి సహాయానికీ—

పరిశోధన సమయంలోనేకాకుండ ప్రచురణ నిమిత్తమై శుద్ధప్రతిని సిద్ధం చేయటంలో ఎంతో శ్రమకు ఓర్చి సహకరించిన మా కళాశాల తెలుగుశాఖ అధ్యక్షులు డాక్టర్ నల్లూరి వెంకట్రాయుడుగారి ఆత్మీయతకూ— పరిశోధనలో ఉత్సాహం సడలకుండ ప్రోత్సహించిన మిత్రులు డాక్టర్ చేబ్రోలు బసవయ్యగారి సహృదయానికీ— పరిశోధనాంశంతో సంబంధం లేకపోయినా ఎప్పటికప్పుడు పరిశోధన పురోగతిని తెలుసుకొని ప్రోత్సహించిన మా కళాశాల అధ్యాపక, అధ్యాపకేతర మిత్రుల స్నేహశీలతకూ—

అభ్యర్థించిన వెంటనే ఎంతో ఆప్యాయంగా తమ 'సమ్యక్‌దృష్టి'ని ప్రసరించి నాకు ధైర్యం సమకూర్చిన పెద్దలు రూపశిల్పి డాక్టర్ సంజీవదేవ్‌గారి స్వాదు హృదయానికీ—

ముద్రణ విషయం ముచ్చటించగానే స్నేహభావంతో ఈ గ్రంథాన్ని ప్రచురించే బాధ్యత స్వీకరించటానికి అనుమతించిన విజ్ఞాన్ సంస్థల అధినేత లావు రత్తయ్యగారి సాభిమానానికీ—

విషయసేకరణ సమయంలో అడిగిన వెంటనే తమ అమూల్యమైన సలహాలనిచ్చి ప్రోత్సహించిన శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి, చందోలు;

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, కాకినాడ: శ్రీ గంటి జోగిసోమయాజి, విశాఖపట్టణం: శ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, విశాఖపట్టణం: శ్రీ వి. రామచంద్ర, మద్రాసు: శ్రీ రావిపూడి వెంకటాద్రి, నాగండ్ల: శ్రీ వక్లై శ్రీనివాసా చార్యులు, నరసరావుపేట వంటి పండిత విమర్శకుల ఆదరణకూ—

విషయసేకరణలో ఎంతో సహనంతో తమ గ్రంథాలయాల్లోని ఉపక రించే అంశాలను ఎత్తి వ్రాసుకొనేందుకు అవకాశం కల్పించి సహకరించిన వివిధ గ్రంథాలయాధిపతుల సహృదయానికీ—

నియమిత సమయంలో అచ్చువేసే కార్యక్రమాన్ని పూర్తిచేసిన బాపూజీ ప్రింటర్స్, గుంటూరు, అధినేత వెనిగళ్ల వెంకటేశ్వరరావుగారి సహకారానికీ— వారి సిబ్బందికీ—

ఇంకా ఈ కార్యంలో ప్రత్యక్షంగా, పరోక్షంగా తమ సహాయాన్ని అందించిన ఎందరో మహానుభావుల ఔదార్యానికీ— వీరందరకూ కృతజ్ఞతా పూర్వక శతాధిక వందనాలర్పిస్తున్నాను.

ఈ ప్రయత్నంలో మా కుటుంబ సభ్యులందించిన సహకారం ప్రశంసార్హం.

(సం.) గుంటుపల్లి రామారావు
రచయిత.

# విషయసూచిక

# 1·0 ధృతరాష్ట్రుని వ్యక్తిగత జీవితం

## 1.1 ఉపక్రమణిక

మహాభారతం భారతదేశ జాతీయేతిహాసం. భారతదేశంలో పరమపవిత్రమైన గ్రంథంగా సర్వజనులకు ఉపాస్యమై ఉంది. సార్వకాలికమైన జాతీయ జీవన స్రవంతి భారతంలో అంతస్స్రోతస్వినిగా ప్రవహించింది. ఇదొక విజ్ఞానఖని. ఇందలి వస్తువు ఒకనాటిదికాదు. కావుననే "ఆర్యభాషలలో నననేల పాశ్చాత్యుల భాషలో నైతమింతటి యత్యంతోత్కృష్ట గ్రంథము లేదని తలంపనగును." [1] అని కోలాచలం శ్రీనివాసరావు కొనియాడితే, "It is discribed as the great source of knowledge in the Universe" [2] అని యస్. వి. తడాని విశ్వవ్యాప్తమైన మహాభారత స్వరూపానికి అద్దంపట్టారు.

నన్నయ భావనలో మహాభారతం ధర్మశాస్త్రము, మహాకావ్యము, రాజనీతి శాస్త్రము, సామాజిక శాస్త్రము, మనస్తత్వశాస్త్రము, పంచమ వేదము. విశాలమైన ప్రపంచ జ్ఞానం ఈ గ్రంథంలో నిక్షిప్తమై ఉంది. పుట్టపర్తి నారాయణాచార్యులు "మహాభారతమార్యుల జీవశాస్త్రము. భారతీయ రాష్ట్రీయుల లక్షణములు వాని ధ్యేయములు, విషమపరిస్థితుల యందా ధ్యేయములను సాధింపవలసిన సాధనములు, వ్యక్తి సమాజము వీరి పరస్పర సంబంధము, వారి పరిపూర్ణ వికాసముయొక్క తెఱగు- ఈ విషయములన్నియు భారతమున నతిరమణీయముగ చిత్రింపబడినవి. ఇతిహాస పురాణకావ్యములు, ధర్మశాస్త్ర, రాజశాస్త్ర, యుద్ధశాస్త్రములు వీనికి సంబంధించిన విషయములు, సమాజము వ్యక్తి వీరు కష్టములందు దరింపవలసిన వివరములు, వీని నన్నింటిని మహాభారతము స్పష్టముగ నిరూపించును. అందుకే దానిని జ్ఞానకోశమంటిమి. ఆ యితిహాసము భారతదేశ మెట్లు వర్తింపవలెనో భారతీయు డెవడో వాని ధ్యేయమేదో స్పష్టముగ తెల్పును" [3] అని దీని ప్రామాణికతను కొనియాడారు. ప్రపంచ వ్యాప్తంగా అనేక భాషలలోకి అనువదించబడటమే దాని ప్రామాణికతకు, ప్రాశస్త్యానికి నిదర్శనం.

మహాభారతం మొదట 'జయ'మనే పేరుతో సంస్కృత భాషలో వ్యాసుని చేత ఇతిహాసంగా కూర్చబడింది. వైశంపాయనాదులైన అతని శిష్యులచే దానిని

భారత, మహాభారతాలుగా వ్యాప్తిగావించారు. మెక్డొనాల్ పండితుడు మహాభారతం ప్రారంభదశలో ఇప్పుడు లభ్యమయ్యే గ్రంథంలో ఐదోవంతు మాత్రమే ఉండి అనంతరం పెంపొందించబడి, కేవలం ఒక గ్రంథంగాకాక నీతిశాస్త్ర విజ్ఞాన సర్వస్వంగా ప్రసిద్ధిచెందిందనే అభిప్రాయం వ్యక్తం చేశారు.[4] ఐ. జె. రాప్సన్ పండితుడు భారతం తరతరాలుగా మాగధులచేత వ్యాప్తిచేయబడిందంటూ "The epic was composed not by one person, nor even by one generation, but by several. It is primarily the story of an historic incident told by the glorifier of kings, the domestic priest and the bard, who are often one"[5] అని మహాభారత విస్తరణ క్రమాన్ని వివరించారు. ఈ గ్రంథం లిఖిత రూపం పొందే వరకు పరతరాలుగా వందిమాగధ పాటకులచే విస్తరణ పొందిందని చెప్పిన సుక్తాంకర్ అభిప్రాయాన్ని దివాకర్ల వెంకటావధాని ఉట్టంకించారు.[6]

వ్యాసుడు వేదాలను పరిష్కరించి వేదార్థసారమైన ధర్మాద్వైతాన్ని భారతీయ సంస్కృతిలో భాగంగా చేయనెంచి వైదికమార్గ విముఖులైనవారికి దానిని సుబోధం చేసేందుకు ఈ బృహద్గ్రంథ రచనకు పూనుకొన్నాడు. ఆ ప్రయత్నంలో వైదిక మార్గప్రవర్తనానికి అనుగుణాలైన విషయాలేకాక సాంఘిక నైతిక రాజకీయాది విషయాలను ఎన్నింటినో చర్చించాడు. మహాభారతంలోని కథా నిర్మాణం, పాత్రల మనస్తత్వ పరిశీలనం సార్వకాలిక, సార్వజనీన ప్రశస్తిపొంది విశ్వశ్రేయమై వెలిశాయి. మహాభారతంలో సృష్ట్యాదినుంచి మానవసహజాలైన గుణదోషాలు చక్కగా వర్ణించబడ్డాయి. ఇది మానవజీవితాన్ని యథాతథంగా చెప్పటంచేత ప్రపంచ సాహిత్యంలో శాశ్వత స్థానాన్ని పొందింది. ప్రపంచ భాషలలో భారతకథాంశాలను స్వీకరించి ఎందరెన్ని విధాలైన కావ్యాలను, నాటకాలను రచించినప్పటికీ అనాదృతములైన భాగాలెన్నో మిగిలి ఉండటంచేతనే మహాభారతమనే పేరు ఈ గ్రంథానికి సార్థకమైంది.

భారతీయ భాషలలో మహాభారతానికి అనేకానువాదాలు వచ్చాయి. ఆంధ్ర భాషలో కవితామూర్తులైన నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు కృష్ణద్వైపాయనుని అభిహితార్థం ప్రత్యక్షమయ్యేటట్లు తమ అనువాద కార్యక్రమాన్ని కొనసాగించారు. నన్నయగారి భారతానువాదమే తెలుగుసాహిత్యంలో ప్రథమ ప్రామాణిక సాహిత్యం

కావటం విశేషం. వ్యాసుడు సంస్కృతంలో దీనిని ఇతిహాసంగా తీర్చిదిద్దితే కవిత్రయంవారు కథను రమణీయంగాను, కధనాన్ని రమణీయ తరంగాను కూర్చి పాఠకునకు అనితర సాధ్యమైన ఆనందం కలిగేటట్లు చేశారు. లౌకికానంద జనక మైన అంశాలతోపాటు పారమార్థికాంశాలనుకూడ స్పృశించి మానవుని పురుషార్థ సాధనకు ఉదాత్త మార్గాలెన్నింటినో ఏర్పరిచారు. విశ్వవిజ్ఞానకోశ మనదగిన ఇందులో సూక్ష్మాతిసూక్ష్మ ధర్మసందేహాలకు సమాధానాలు లభిస్తాయి. ధర్మోప దేశాన్ని ఆనంద విశేషాన్ని సమకూర్చి వారు దీనిని ఉత్తమ కావ్యంగా రూపొందించారు.

మహాభారతంలో సమాజస్వరూపం, మానవ జీవన విధానం, అతడి దైనందిన వ్యవహారం, మానసిక ప్రవృత్తి మొదలైనవాటి సన్నిహిత సంబంధం గోచరం అవుతుంది. ప్రపంచంలో అసంఖ్యాకమైన పాత్రలున్నట్లే భారతంలో వైవిధ్యంగల ఎన్నో పాత్రలు కనిపిస్తాయి. పాత్రల మనః ప్రవృత్తులు ప్రకృతికి అనుగుణంగా తీర్చిదిద్దటానికి ఎంతో ప్రయత్నం జరిగింది. ఇందులోని పాత్రలు ఒక విశిష్ట సమాజానికి చెందిన సజీవ వ్యక్తులుగా కనిపిస్తారు. అవి కనిపించి నంతసేపు 'జీవన పోరాటం' సాగిస్తూ కనిపిస్తాయి. అవసరమైనప్పుడు కొన్ని పాత్రలలో త్యాగాలు చేయటం కనిపిస్తుంది. జీవిత దైనందిన పరిణామంలో మానవుడు ఎదుర్కొనే కఠోర జీవిత మార్గాలనుకూడ ఇవి ఎదుర్కోవటం గోచరిస్తుంది. ఈ జీవన సంగ్రామంలో కొన్ని పాత్రలు అడ్డంకులను అధిగమించి విజయంసాధిస్తే, కొన్ని వాటిని అధిగమించలేక ఓటమిని అంగీకరించటం ద్యోతకం అవుతుంది. అందుకే ఆచార్య జి. యన్. రెడ్డిగారు "వైవిధ్యసహితమూ, సార్వకాలికమూ అయిన మానవ ప్రకృతికి మహాభారతం ఒక దర్పణం. కాబట్టి మానవ ప్రకృతి మానవ ప్రకృతిగా నిలిచి ఉన్నంతకాలం మహాభారతం మానవ సాహిత్య ప్రపంచంలో మేరువుగా నిలిచి ఉంటుంది" [7] అని అన్నారు. భారత పాత్రలన్నీ 'మానవ జీవన పోరాటం'లో మిగిలేది అపజయం, నిరాశేననే సందేశాన్నిస్తూ వారి నిరాశా నిస్పృహా సమస్త మానవాళి నిస్పృహగా పాఠకునిచేత అనుభవింపచేస్తాయంటూ "All human efforts are fruitless, all human life ends in frustration—was the Mahabharata written to drive home this lesson Human toil, expectations, hates, friendships -- all seen funny and without substance, like whithered leaves eddying in the summer wind. But the people who toiled and dreamed and loved and hated

remain unforgetable, their memory constantly searing the heart. While reading the Mahabharata we see each person going inexorably to a definite end. we become actually aware that each person knows his end, and his agony and dread become our own. And through the agony of each we experience the agony of the whole world" [8] అని ఇరావతీకార్వే వెలిబుచ్చిన అభిప్రాయం మహాభారతంలోని మానవ మనస్తత్వ విశ్లేషణానికి అద్దం పట్టేదిగా ఉంది. మహాభారతంలోని పాత్రలు, వాని చిత్త వృత్తులను పోలిన వ్యక్తులూ మానవ సమాజం ఉన్నంతకాలం సజీవంగా ఉంటారు. దీనిని చదివిన వారందరకూ అందలి పాత్రల సమకాలిక సాంఘిక జీవనాన్ని, తోడి వ్యక్తుల మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తూ ఉలికిపాటు కలిగిస్తాయి.

ఆంధ్ర మహాభారతం పద్దెనిమిది పర్వాలుగా వ్యాపించి ఉంది. ఇందలి ప్రధానకథ కురుపాండవుల దాయభాగ సంబంధమైంది. ఆ సమస్య శాంతిసహజీవన సామరస్య భావంతో పరిష్కారం కాకపోవటంతో పంతాలు, పట్టుదలలు పెరిగి కురుక్షేత్రంలో మహాసంగ్రామంగా పరిణమించింది. భారత దేశంలోని ఎన్నో రాజవంశాలు ఇందులో పాల్గొనటంవల్ల అతివిస్తృతమై భయంకర పరిణామాలకు దారి తీసింది. మహాభారతానికి కురుక్షేత్ర సంగ్రామం కేంద్రం. దీని ముందటి పర్వాలు యుద్ధకారణాలుగా, అనంతర పర్వాలు దాని పరిణామాలుగా కూర్చబడ్డాయి. ఆది పంచకం, యుద్ధషట్కం, శాంతిసప్తకం అని మూడు భాగాలుగా దీన్ని వ్యవహరించే సంప్రదాయం పైఅభిప్రాయానికి బలం చేకూరుస్తుంది.

కురుసామ్రాజ్యంలో శంతన మహారాజు తర్వాత సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పరచిన సార్వభౌముడుగా ధృతరాష్ట్రుడే కనిపిస్తాడు. చిత్రాంగద, విచిత్రవీర్యులు పరిపాలకులుగా ఉన్నప్పటికీ వారి పాలన లెక్కించ దగిందిగా లేదు. భారతకథలో కురుపాండవ కలహంలో వివాద కారణమైన పరిణామాలన్నీ ధృతరాష్ట్రుడు రాజ్యాధిపతి అయిన తరువాత ఏర్పడినట్టివే. పాండురాజు బ్రతికి ఉన్నంతకాలం ధృతరాష్ట్రుడే రాజైనప్పటికీ సోదరులమధ్య పెంపొందిన అనుబంధంవల్ల రాజ్యాధిపతి ఎవరు ? రాజ్య రక్షణ బాధ్యత ఎవరిది ? అన్న మీమాంస ప్రజలకు లేకుండా పోయింది. పాండవ ధృతరాష్ట్రులు పెరిగి పెద్దవారయిన తరువాతనే అధికారం కోసం ఘర్షణ ప్రారంభమైనట్లు గోచరమవుతుంది. ఈ సంఘర్షణలో అనేకులు తమ స్వప్రయోజనాలు, పంతాలు, పగలు తీర్చుకొనే ప్రయత్నం చేశారు, ఫలితంగా

సమస్త బంధుమిత్ర దాయాదులతోసహా పరాక్రమ స్వరూపులైన భారత వీరులంతా కురుక్షేత్ర రణ యజ్ఞంలో ఆహుతి అయ్యారు.

సాహిత్య పరిశీలకులు, పరిశోధకులు భారతంలోని పాత్రల ప్రాముఖ్య ప్రాధాన్యాలను బట్టి తమ అభిరుచులకు అభిమానాలకు అనుగుణంగా ఎవరికి నచ్చిన నాయకుణ్ణి వారు ప్రధానంచేసుకొని భారతకథను విశ్లేషించే ప్రయత్నం చేశారు. మహాభారతంలోని చిన్నపెద్ద పాత్రలన్నీ తమతమ పరిధికి లోబడి కథాపరిణామంలో ప్రాధాన్యం వహించటం ఇందుకు కారణం కావచ్చు. మహాభారతంలోని పాత్రలను గూర్చి 'కర్ణుడు లేని భారతమా !', 'మానదుర్యోధనుడు', 'శౌచగాంగేయుడు', 'ఉత్తర కుమార ప్రజ్ఞలు', 'సైంధవుడులా అడ్డుపడ్డాడు', 'శకునిమామ' మొదలైన లోకోక్తు లెన్నో ప్రచారంలో ఉండటం సమాజం మీద భారత పాత్రల ప్రభావం ఎంత గాఢతరంగా ఉందో వ్యక్తం చేస్తుంది. భారత ప్రజల మనస్తత్వంలోను, వ్యవహార సరళిలోను ఎంత వైవిధ్యం నెలకొని ఉందో భారత విమర్శకులలోను అంత వైవిధ్యం కనపడుతూ ఉంది. మహాభారత బహుముఖమైన విశ్వవ్యాప్తమైన స్వరూపానికి ఈ వైవిధ్యమే నిదర్శనం. ఈ వైవిధ్యంవల్లే ఎందరు పరిశోధకులు ఎన్ని పరిశోధనలు చేసినా పరిశీలించ వలసిన అంశాలు ఇంకా ఎన్నో మిగిలే ఉన్నాయి

మహాభారతంలో ఏ ఒక్క పాత్రనూ ప్రత్యేకంగా పేర్కొని ఇతర పాత్రలను అలక్ష్యం చేయటానికి వీఃలేదు. పాత్రలన్నీ వాటి వాటి ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నప్పటికీ కురుపతి ధృతరాష్ట్ర మహారాజు ఒక ప్రత్యేక ప్రాధాన్యం కలవ్యక్తిగా తెలుస్తుంది. కురుపాండవ కలహంలో ఈ రాజు ఆద్యంతం మూల విరాట్టుగా దర్శనమిస్తాడు. జాత్యంధుడుగా, పరాధీనుడుగా, పుత్రవ్యామోహిగా సామాన్యదృష్టికి గోచరించే ఆ మహారాజు జీవితంలో అసామాన్యమైన ఎన్నో నిగూఢ సత్యాలు ద్యోతకమవుతాయి. నిశితంగా చూస్తే అతని వ్యక్తిత్వంలోని నిగూఢత్వమూ, రాజనీతి వైశిష్ట్యమూ, విద్యావిజ్ఞాన సంపద, ఆధ్యాత్మిక జ్ఞానమూ మొదలైన విశేషాలు పాఠకులను ఆకట్టుకొంటాయి. అందువల్లనే కవిత్రయం మహాభారతకథలో తీర్చిదిద్దిన ధృతరాష్ట్రుని పాత్రలోని విశేషాంశాలన్నింటిని గూర్చి పర్యాప్తమైన పరిశీలన చేయవలసిన అవసరం ఏర్పడింది. ఆ ప్రయత్నంలో ముందుగా అతడి జననాన్నిగూర్చి తెలుసుకోవటం అవసరం.

అథస్సూచికలు :

1. కోలాచలం శ్రీనివాసరావు, శ్రీ భగవద్గీతా విమర్శనోపన్యాసములు. పు. 3.
2. N. V. Thadani, The mystery of mahabharata; P. IV
3. పుట్టపర్తి నారాయణాచార్యులు మహాభారత విమర్శనము; పు. 37
4. A. A. macdonall, A History of Sanskrit Literature; P. 282
5. E. J. Rapson, Cambridge History of India, P. 267.
6. దివాకర్ల వెంకటావధాని, ఆంధ్రవాఙ్మయారంభదశ; పు. 432.
7. జి. యస్. రెడ్డి, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు పీఠిక; పు. VI
8. Iravathi Karve, Yugantha; P. 7.

## 1.2 జననం

మానవ సమాజ పురోగమనానికి, కుటుంబ వ్యవస్థ అవిచ్ఛిన్నంగా కొనసాగటానికి సంతానం పునాది. ఈ పునాదిపైనే పాతతరాలు అంతరిస్తూంటే కొత్త తరాలు వర్ధిల్లుతూ మానవ సమాజం నిత్యచైతన్యంతో అలరారుతుంది. గార్హస్థ్య జీవితం కూడ సంతానంతోనే పరిపూర్ణత చెందుతుంది. సంతానం అనేది సంసార బంధానికి, కుటుంబ రథానికి ఆధారభూతమని ప్రాజ్ఞుల అభిప్రాయం. ఇల్లాలి కడుపుపండి ఆ బిడ్డ ప్రపంచంలోని వెలుగు చూసిందంటే కన్నవారి ఆనందానికి అంతు ఉండదు. అదే తొలిచూలు సంతానమైతే ఇంటిల్లిపాది ఆనందానికి పట్ట పగ్గాలుండవు. ఆడపిల్ల పుడితే మహాలక్ష్మి ప్రభవించిందనీ, మగ సంతానమైతే వంశోద్ధారకుడు జన్మించాడనీ కన్నవారి అదృష్టాన్ని అభినందించటం లోకసహజం. భారతీయ సమాజం పితృస్వామిక వ్యవస్థ ప్రధానంగా కలిగింది కనుక మగబిడ్డ అయితేనే అటుఏడు ఇటుఏడు తరాలను ఉద్ధరిస్తాడని ఒక నమ్మకం. పుత్ర సంతానం తోనే పున్నామ నరకంనుంచి రక్షించబడగలమన్న విశ్వాసం మన ప్రాచీనుల్లో ఉంది.

ప్రాచీనకాలంలో ప్రధానంగా క్షత్రియ వంశాల్లోని వారు పుత్రసంతానం కోసం ఎంతో తాపత్రయపడేవారు. అందుకోసం యజ్ఞయాగాలు, దానధర్మాలు చేసేవారు. ఒకవేళ సంతానం కలగదనుకొంటే జ్ఞాతులలోని వారినికాని, మరెవరి నైనాకాని దత్తత తీసుకొనేవారు. ఇదంతా తమ వంశం నిలపటానికి, తమ రాజ్యాలు అన్యాక్రాంతం కాకుండ ఉండటానికి చేసే యత్నం. విధిలేని పరిస్థితుల్లోనే దత్తత స్వీకరించేవారు. కాని వీలైనంత వరకు ఔరస సంతానాన్ని పొందటానికే మార్గాలను అన్వేషించేవారు. ఇప్పటివారికి కొంత ఆటవికమైందిగా కన్పించినా, అత్యంత ప్రాచీనకాలంలో అందుకొరకు నియోగమనే పద్ధతి ఒకటి సంప్రదాయంగా ఉన్నట్లు కనపడుతుంది. ఆంధ్రమహాభారతంలో ధృతరాష్ట్రుడు అట్లా నియోగంవల్లనే జన్మించి కురువంశాన్ని ఉద్ధరించినట్లు చెప్పబడింది.

**ఆంధ్రమహాభారత కథ :** ధృతరాష్ట్రుని జనన విషయం ఆంధ్ర మహాభారతంలో ఇలా ఉంది. కురువంశ ప్రముఖుల్లో ఒకడైన శంతనుని పుత్రుడు విచిత్ర వీర్యుడు నిస్సంతుగానే పరలోక గతుడవుతాడు. రాజ్యం అరాచకమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఆ వంశంలో ఆ సమయంలో భీష్ముడు ఒక్కడే బ్రతికి

ఉన్నాడు. సత్యవతి వంశోద్ధరణ చేయవలసిందని భీష్మునకు కర్తవ్యం ఉపదేశిస్తుంది. తండ్రి మనోభీష్టం నెరవేర్చి తల్లితండ్రుల సుఖానికై ఆజన్మ బ్రహ్మచారిగా మిగిలిపోయిన దేవవ్రతుడు, తల్లి ఆజ్ఞ శిరసావహించి నియమ వ్రతాన్ని వీడటానికి అంగీకరించ లేకపోయాడు. సకల ధర్మవిదుడు కావటంచేత విచ్ఛిన్నమయ్యే కురువంశాన్ని రక్షించవలసిన బాధ్యత తనపై ఉన్న విషయం గ్రహించాడు. ఈ అంశాన్ని గూర్చి సమస్త పురోహితులతో ఆలోచించాడు. పరశురాముడు గర్భగత బాలురతో సహా ధారుణీ పతులందరను చంపగా భూసురోత్తములు వారి సతులకు ధర్మమార్గాన సంతానం నిలిపిన విషయం చర్చించాడు. తల్లి సత్యవతికి దీర్ఘతముని వృత్తాంతం చెప్పి "ఉత్తమ క్షత్రియ క్షేత్రములందు ధర్మ మార్గమున బ్రాహ్మణుల వలన బుట్టి వంశకరులైన క్షత్రియులనేకులు గలరు" (ఆది. 5-237) అని విశదపరచాడు. ఆ మార్గాన్నే అనుసరించి కురువంశాన్ని ఉద్ధరించటమే ఉత్తమ మార్గం అని ఉద్బోధించాడు.

భీష్ముని ఆలోచన సత్యవతికి ఎంతో ఉత్తమమైందిగా కనపడింది. కన్యగా ఉన్నప్పుడు పరాశరుడు కారణంగా తనకు జన్మించిన వ్యాసుడు విచిత్ర వీర్యుని భార్యలకు దేవరుడు కనుక అతణ్ణి నియోగించి దేవర న్యాయానుగుణంగా కురువంశాన్నుద్ధరించాలనే తలంపుతో భీష్మునకు ఆ విషయం తెలిపింది. తల్లి అభిమతం భీష్మునకు అభిహితం అయింది. దేవర న్యాయం గూర్చి పి. రాజగోపాల నాయుడు "దేవరుడు అంటే భర్తృ బుట్టువు అని అర్థం కనుక భర్త సోదరుల వలన సంతానాన్ని పొందే ఈ పద్ధతికి దేవర న్యాయమని పేరు వచ్చింది"[1] అని వివరించారు. భీష్మునితోడి ఆలోచనకు అనుగుణంగా సత్యవతి వ్యాసుని స్మరిస్తుంది. ప్రత్యక్షమైన వ్యాసునకు భీష్ముడు అర్ఘ్యపాద్యాదులొసగి సత్కారం చేస్తాడు. సత్యవతి కురువంశం విచ్ఛిన్నమవుతున్న విషయం అతని స్మృతికి తెచ్చి

"ధృతినీయనుజుండై వి
శ్రుతుఁడైన విచిత్ర వీర్యునిక్షేత్రములన్
సుతులంబడయుము కుఱమవి
రత సంతతినెగడ దేవర న్యాయమునన్ (ఆది. 4-245)

అని ఉద్ధరించవలసిందిగా కోరుతుంది. ఆ విధంగా వంశం నిలిచి నట్లయితే

"నీ కారణమున వంశము
నా కులమై నిలుచుటయుఁ దదాప్తులుఁ బ్రజలున్
శోక భయంబులు విడుతురు
నాకును భీష్మునకుఁ గడు మనఃప్రియ మెసగన్"

(ఆది. 4-246)

అని వేడుకొన్నది. సత్యవతి ఈ వేడుకోలులో రాజులేని ప్రజలు తండ్రిలేని బిడ్డలలాగా శోకభయ విహ్వలులౌతారనే ఆందోళన కనిపిస్తుంది. తల్లి ఆందోళన గమనించిన వ్యాసుడు దేవర న్యాయ వైశిష్ట్యాన్ని, దాని ప్రామాణికతను వక్కాణించి తన సంసిద్ధతను వ్యక్తం చేశాడు. సంస్కృత భారతంలో కూడ వ్యాసుడు సోదరుని భార్యవల్ల సంతానం పొందటం సనాతన ధర్మమేనని అంగీకరించినట్లు,

"ఈప్సితంతే కరిష్యామి దృష్టంహ్యే తత్సనాతనమ్
భ్రాతృః పుత్రాన్ప్రదాస్యామి మిత్రావారుణయోఃసమాన్"[2]

అని విశదంగా ఉంది.

తల్లి ఆజ్ఞను శిరసావహించిన వ్యాసుడు కాశీరాజు దుహితలయందు పుత్రోత్పత్తి గావిస్తానని, అందుకు వారు తాను చెప్పిన వ్రతం ఒక్క సంవత్సరంచేసి శుద్ధాత్మలైనట్లయితే సత్పుత్రులను పొందుతారని పలుకుతాడు. సత్యవతి వంశోద్ధారకుని పరమావశ్యకాన్ని గూర్చి వివరించి "కాలయాపనం బవితథవాక్య చేయక నయంబున రాజ్యము నిల్పు మిత్తరిన్" (ఆది. 4-250) అని తన ఆత్రుతను ప్రకటించి వ్యాసుణ్ణి తొందర పెట్టింది. అనంతరం సత్యవతి "ఋతుమతియు, శుచిస్నాతయునై యున్న యంబిక కడ కుంజని క్షేత్రజ్ఞుండైనవాడు సుపుత్రుండు కావున ధర్మ్యంబైన విధానంబున నీవు రాజ్య దురంధరుండయిన కొడుకుం బడసి భరత వంశంబు నిలుపు మెల్ల ధర్మంబుల కంటెఁ గులంబు నిలుపుటయు మిక్కిలి ధర్మంబు" (ఆది. 4-252) అని పలికి అంబికను వ్యాసుని తోడి సంగమానికి సమాయత్తం చేసింది. అంబిక కూడ ధవళేక్షణయై వ్యాసుని నిమిత్తమై విమల శయన తలంమీద వేచి ఉంది. అవసరజ్ఞుడై శయనాగారం ప్రవేశించిన వ్యాసుని కపిలగడ్డమూ, కపిలజడలు, కపిలకన్నులు, నల్లని శరీరాన్ని చూసి భయంతో

ఆమె కన్నులు మూసుకొని తెరవలేకపోయింది. కృష్ణద్వైపాయను డామెతో సంగమించి పుత్రదానం చేశాడు. ఆత్రుతతో ఎదురుచూసే సత్యవతితో అంబిక గర్భాన ధీమంతుడూ, పరాక్రమవంతుడు అయిన కుమారుడు ఉద్భవిస్తాడు, వాడు మహా విద్వాంసు డవుతాడు, పది వేల ఏనుగుల బలం వానికుంటుంది, నూరుగురు కుమారులకు తండ్రి అవుతాడు కాని మాతృదోషంవల్ల జాత్యంధుడు అవుతాడని పలికాడు.

అంబిక వల్ల పుట్టే కుమారుడు జాత్యంధుడవుతాడని విన్న సత్యవతి నిరాశ చెందింది. జాత్యంధుడైనవాడు వంశాన్ని రాజ్యాన్ని ఎట్లా రక్షించగలుగుతాడనే అభిప్రాయంతో కురువంశాన్ని ఉద్ధరించగల మరొక కుమారుణ్ణి అంబాలికకు అనుగ్రహించ వలసిందని కోరింది. సత్యవతీ నియుక్త అయిన అంబాలికను కలిసేందుకు వ్యాసుడు శయనాగారం ప్రవేశించాడు. ఆ ముని రూపం చూసి అంబాలిక భయంతో వివర్ణ అయింది. తనను చూసి ఆమె భయంతో వివర్ణ అయింది కనుక పాండు వర్ణం కలిగిన కుమారుడు జన్మిస్తాడని, అతడు పాండుడనే పేరుతో పిలవబడతాడనీ పలికాడు.

ఈ విషయాన్ని విన్న సత్యవతి దిగ్భ్రాంతి చెందింది. వంశోద్ధరణకై తాను చేసిన రెండు ప్రయత్నాల్లోను శారీరక లోపంగల కుమారులు కలగటం ఆమెకు మనస్తాపం కలిగించింది. సర్వలక్షణ సమన్వితుడైన వంశోద్ధారకుని పొందాలనే ఆశతో "అంబికకుఁ బ్రథమ పుత్త్రుం డంధుండయ్యె నింకొక్క కొడుకు రూపవంతుం బడయుము" (ఆది. 4-258) అని వేడుకొన్నది. అంబిక నియతాత్మ అయినట్లైతే సుపుత్రుడు ఉద్భవిస్తాడని వ్యాసుడు సమాధానం ఇచ్చాడు. సత్యవతి అంబికను తిరిగి నియోగించింది. అంబిక ఆ ముని వికృత వేషరూప గంధాలను భరించలేక తన దాసిని చక్కగా అలంకరించి శయనాగారానికి పంపింది. దాసి వ్యాసుణ్ణి ఇష్టోప భోగాలతో సంతృప్తి పరచింది. సంతుష్టుడైన ముని పుత్ర దానం చేశాడు. సకల నీతిపారగుడు, ధర్మవిదుడైన విదురుడు ఉద్భవించాడు. ఈ విధంగా కురువంశం విచ్ఛిన్నం అయ్యే దశలో నియోగ పద్ధతి ననుసరించి వ్యాసుడు ఆ వంశాన్ని ఉద్ధరించాడు. ధృతరాష్ట్ర పాండు విదురులు జన్మించారు.

ఈ కథవల్ల విచిత్రవీర్యుడు నిస్సంతుగా మరణించగా వంశ విచ్ఛేదం కాకుండ వ్యాసుడు కురువంశాన్ని ఉద్ధరించాడని తెలుస్తుంది. జాగరూకతతో

పరిశీలిస్తే ఈ ముగ్గురి జననం విషయంలో కొన్ని సందేహాలు తలెత్తుతాయి. వీరు నిజంగా వేదవ్యాసుడు కారణంగా నియోగ పద్ధతిని విచిత్రవీర్య క్షేత్రాలలో జన్మించిన వారా? లేక ఔరసులై తండ్రి విచిత్ర వీర్యునకే జన్మించిన వారా? అనేది సందేహం. పరిశీలించి చూస్తే వీరు విచిత్ర వీర్యునకు ఔరస సంతానంగానే జన్మించినట్లు విదితమవుతుంది. కొందరు పండితులుకూడ ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చారు. ఆ విషయం తెలుసుకోవటానికి ముందు 'నియోగం' అనే ధర్మాన్ని గూర్చిన పరిశీలన కొంత చేయటం అవసరం.

**నియోగ విధానం :** నియోగం అనేది చరిత్ర కందని ప్రాచీనకాలం నుంచి భారతదేశంలో ఒక సామాజిక ధర్మంగా నెలకొని ఉన్నట్లు తెలుస్తుంది. నియోగాన్ని గూర్చి పి. రాజగోపాలనాయుడు "సంతానంలేని రాజులు ఇతరుల ద్వారా తమ భార్యలయందు సంతానాన్ని పొందే పద్ధతిని నియోగ పద్ధతి అంటారు. భర్త భార్యను పుత్రుల్ని పొందమని నియోగిస్తాడు కనుక ఆ పద్ధతికి నియోగమని పేరు వచ్చింది"[3] అని వివరించారు. వైదిక సాహిత్యంలో ప్రాచీనతమమైన ఋగ్వేదంలో నియోగం ప్రసక్తి కనపడుతుంది. అందులో భర్తను కోల్పోయిన యువతి సంతానంకోసం దేవరుణ్ణి ఆహ్వానించటం యాజకుడు దేవత నాహ్వానించటంతో పోల్చబడింది.[4] ప్రాచీన ధర్మశాస్త్రాలు కూడ నియోగ విధానాన్ని గూర్చి సునిశితంగా పరిశీలన చేశాయి. అయితే ఈ ధర్మశాస్త్రాలన్నీ ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేయటం లేదు. కొన్ని నియోగ విధానం ఆవశ్యకాన్ని గుర్తిస్తుంటే కొన్ని పూర్తిగా నిరాకరిస్తున్నాయి. మరికొన్ని ఆంక్షలతో నియోగాన్ని అనుమతిస్తున్నాయి.

ధర్మశాస్త్రాల్లో ప్రాచీనతమమైన గౌతమ ధర్మసూత్రం నియోగాన్ని అంగీకరిస్తుంది. ఈ గ్రంథం 'భర్తను కోల్పోయి వైధవ్యం ప్రాప్తించిన కాంత కుటుంబంలోని పెద్దల అనుమతితో సంతాన కాంక్షతో ఋతుమతి అయినప్పుడు తన భర్త సోదరునివల్ల సంతానం పొందవచ్చు. ఒకవేళ భర్త సోదరుడు లేకపోయినట్లయితే ఆ కాంత సపిండునివల్లకాని, సప్రవరునివల్లకాని, సగోత్రజునివల్లకాని సంతానాన్ని పొందవచ్చు. కొందరు దేవరుని తప్ప ఇతరులను నియోగించరాదనే ఆంక్ష విధిచారు. నియోగంవల్ల పొందే సంతానం ఇద్దరికి మించకూడదు. నియోగం వల్ల కలిగిన కుమారుడు క్షేత్రజుడు అనబడతాడు' [5] అని వ్రాక్కుచ్చింది.

వసిష్ఠ ధర్మ సూత్రం 'భర్త మరణించిన ఆరు నెలల తరువాత వైధవ్యం ప్రాప్తించిన కాంత సంతానార్థమై నియోగించటానికి అర్హురాలవుతుంది.

ఆ కాంత తండ్రికాని, సోదరుడుకాని, మరణించిన భర్త సంబంధీకులైన పెద్దలను బంధువులను సమావేశపరచి సంతానం కొరకు ఆమెను నియోగించాలి. ఉన్మాది, దుశ్శీలవతి, రోగపీడిత అయిన కాంత నియోగానికి అర్హురాలు కాదు. వయో వృద్ధురాలుకూడ కాకూడదు, బీజిని రోగపీడితుడై బలహీనుడైనచో నియోగించ రాదు. అతడు ప్రాజాపత్య ముహూర్తంలో భర్తవలె ఆ కాంతను చేరాలి. అత డామెను దుర్భాషలాడటం కాని సరసమాడటం కాని చేయరాదు' [6] అని పేర్కొన్నది. అయితే నియోగంవల్ల ఎంతమంది సంతానం పొందవచ్చుననే అంశంలో ఈ ధర్మ సూత్రం మౌనంగా ఉంది.

కౌటిల్యుడు అర్థశాస్త్రంలో నియోగ ప్రశంస చేశాడు. అతడు నియోగ విధానం ఆవశ్యకాన్ని అంగీకరిస్తూ 'క్షత్రియులలో వయోవృద్ధుడు కాని, చికిత్సలేని దీర్ఘవ్యాధితో ఉన్నట్టి రాజు వంశవృద్ధికై తన భార్యను నియోగించి మాతృ బంధువు వలనకాని, సామంతుని వలనకాని సంతానం పొందవచ్చు. అదే బ్రాహ్మణ వంశీయుడు నిస్సంతుగా మరణించినట్లయితే సగోత్రునికాని, మాతృబంధువును కాని నియమించి క్షేత్రజుడైన సంతానాన్ని పొందవచ్చు' [7] అని ఉట్టంకించాడు.

మనుస్మృతికూడ నియోగ విధానాన్ని అంగీకరిస్తూ 'విధవరాలైన యువతి దేవరునివల్ల కాని, దేవరుడు లేని సమయంలో సపిండుని వల్లకాని, సగోత్రునివల్ల కాని, సప్రవరునివల్లకాని, వీరెవరులేనప్పుడు తన కులంలోని వారెవరివల్లనైన గాని సంతానాన్ని పొంది వంశం నిలపవచ్చు' [8] అని పేర్కొన్నది. నియోగ విధానంవల్ల ఒకే ఒక సంతానం పొందవచ్చుననే విధి ఏర్పరుస్తూ కొన్ని సందర్భాల్లో శిష్టులైన పెద్దల నియామకాన్ని అనుసరించి ఇద్దరినికూడ పొందటం ధర్మబద్ధమేనని ఉట్టంకించింది. [9]

యాజ్ఞవల్క్యస్మృతి కూడ 'పుత్రసంతానం లేనట్టి కాంత పెద్దల అనుజ్ఞ తీసుకొని దేవరునివల్ల కాని, సగోత్రజుని వల్లకాని, సపిండుని వల్లకాని క్షేత్రజ సంతానాన్ని పొందవచ్చును' [10] అని నియోగ ప్రాశస్త్యాన్ని అంగీకరించింది.

ఆపస్తంబ ధర్మసూత్రం వంటి కొన్ని శాస్త్రగ్రంథాలు నియోగ పద్ధతిని నిరసించాయి. ఆపస్తంబుడు వివాహంలో కన్యను వరునకు ఒక్కనికే కాకుండ కుటుంబానికి సమర్పించటం జరుగుతుందనే సంప్రదాయాన్ని నిరసిస్తూ 'నియోగం

ద్వారా సగోత్రజుడైన వాని పాణిగ్రహణం చేయటం శాస్త్రవిరుద్ధం. అట్లా చేయటం పరిచయం లేని నూతన వ్యక్తి పాణిగ్రహణంతో సమానం. వివాహ సమయంలో చేసిన ప్రతిజ్ఞ మీరినట్లయితే భార్యాభర్తలిద్దరూ నరకానికే పోతారు. సామాజిక వైవాహిక నిబంధనలకు అనుగుణంగా నడచుకొని పొందిన సంతానమే నియోగ పద్ధతి ద్వారా పొందిన సంతానంకన్నా ఉత్తమమైంది' [11] అని నియోగాన్ని వ్యతిరేకించాడు

మనుస్మృతి కొన్నిచోట్ల నియోగ విధానాన్ని సమర్థించినప్పటికి కొన్ని చోట్ల తీవ్రంగా నిరసించింది. 'సనాతన ధర్మాన్ని నిరసించే ఈ నియోగవిధి ద్విజాతులకు నిషిద్ధమనీ, దాని విషయం వివాహ మంత్రాలలో ఎక్కడా పేర్కొనలేదనీ, విధవా పునర్వివాహంకూడ వివాహ మంత్రంలో ప్రసక్తం కాలేదని, అన్నివిధాలా ఆటవికమైన ఈ నియోగం నిరసించతగింది' [12] అని వివరించింది. ఈ సందర్భంలోనే మనుస్మృతిలో 'ఒక కన్య వివాహంలో వాగ్దత్తయైన పిమ్మట వివాహం కాకుండానే వరుడు మరణించినట్లయితే, ఆ వరుని సోదరుడు ఆ కన్యను వివాహమాడవచ్చు. ఋతుమతియైన సమయంలో ఆ వధువును సంతానార్థమై కలిసి సంతానం పొందవచ్చు. అట్లా కలిగిన సంతానం చనిపోయిన సోదరునకే చెందుతుంది' [13] అని నియోగవిధి నిర్వర్తించవలసిన విధవ విషయంలో వేరొక అర్థం కనిపిస్తుంది. అంటే నియోగవిధి వివాహమై భర్త మరణించిన యువతులయందుకాక వివాహం నిశ్చయమై వివాహానికి ముందే వరుడు మరణించిన వధువులకు మాత్రమే అని అర్థమౌతుంది. 'విధవ' మనుస్మృతిలోనే భిన్నమైనచోట్ల వేర్వేరు అర్థాలలో ప్రయుక్తమైనట్లు తెలుస్తుంది.

బోధాయన ధర్మసూత్రం 'వైధవ్యం ప్రాప్తించిన కాంత నిస్సంతువుకనక అయినట్లయితే భర్త మరణించిన సంవత్సరం తరువాత పెద్దల నియోగంతో దేవరుని వల్ల సంతానం పొందవచ్చు' [14] అని చెప్తున్నది. బోధాయనుడే మరొక సందర్భంలో 'పుత్రులందరిలోకీ ఔరసుడే శ్రేష్ఠుడనీ నియోగంద్వారా పొందిన సంతానం బీజిని అయిన వానికే చెందుతారనీ, కనుక భర్తలు తమ భార్యలను ఇతరుల నియోగంతో సంతానం కలుగకుండునట్లు రక్షించుకోవాలని' [15] నియోగం ఎడ తన వ్యతిరేకతను వ్యక్తం చేశాడు.

నియోగ విధానంవల్ల జన్మించిన సంతానం మీద అధికారం ఎవరికుంటుందనే అంశంపై కూడ సూత్రగ్రంథాలు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశాయి.

'నియోగంవల్ల కలిగిన సంతానం బీజిని అయినవానికే చెందుతుంది'[16] అని ఋగ్వేదం. గౌతమ ధర్మసూత్రం 'భర్తే భార్యను సంతానార్థమై నియోగిస్తే ఆ సంతానం భర్తకు చెందుతుందని, భర్త మరణించిన తరువాత పెద్దలు ఆ కాంతను పుత్రార్థం నియోగించినట్లయితే ఆ సంతానం బీజినికి చెందుతుంది'[17] అని తీర్మానించింది. మనుస్మృతిలో కూడ 'అన్యబీజంవల్ల కలిగే సంతానం బీజిని అయిన వ్యక్తికే చెందుతుంది'[18] అనే అభిప్రాయం కనపడుతుంది. ఇలాగే వసిష్ఠ ధర్మ సూత్రం, ఆపస్తంబ ధర్మసూత్రం, బోధాయన ధర్మసూత్రం కూడ విధవయైన కాంతలకు నియోగంవల్ల కలిగిన సంతానం బీజినిగా నియమించిన వ్యక్తికే చెందుతారనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశాయి.[19]

ఈ పరిశీలనవల్ల నియోగ విధానం విషయంలో ధర్మశాస్త్రాలు ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేయటంలేదని విదితమవుతుంది. గౌతమ ధర్మసూత్రం, వసిష్ఠధర్మ సూత్రం, మనుస్మృతి, కౌటిల్యుని అర్థశాస్త్రం వంటివి నియోగధర్మాన్ని అంగీకరిస్తున్నాయి. ఆపస్తంబ ధర్మసూత్రం, బోధాయన ధర్మసూత్రంవంటి కొన్ని ఈ విధానాన్ని నిరసిస్తున్నాయి. మనుస్మృతి కొన్నిచోట్ల ఈ ధర్మాన్ని అంగీకరించినా మరి కొన్నిచోట్ల నిరసిస్తుంది. నియోగధర్మాన్ని అంగీకరించిన గ్రంథాల్లోకూడ దీనివల్లపొందే సంతానం విషయంలో ఏకవాక్యత కుదరటంలేదు. కొందరు నియోగం ద్వారా ఒక్క సంతానంమాత్రమే పొందాలంటే మరికొందరు ఇద్దరిని పొందవచ్చని చెప్పారు. మనుస్మృతి ఈ విధానంవల్ల ఒక్క పుత్రుని మాత్రమే పొందటానికి వీలున్నదని ముందటి అధ్యాయంలో ఒకచోట చెప్పి, తరువాతి అధ్యాయాల్లో ఇద్దరిని పొందవచ్చునని అంగీకరించింది. మహాభారతంలో పాండురాజు కుంతిని దుర్వాస మహర్షి వరంవల్ల క్షేత్రజసంతానం పొందమనికోరే సమయంలో నలుగురిని పొందిన స్త్రీ స్వైరిణి, ఐదుగురను పొందినకాంత బంధకి అవుతుంది అని చెబుతాడు. కాని నియోగంవల్ల ఖచ్చితంగా ఎంతమందిని పొందవచ్చుననే అంశం పేర్కొనలేదు. నలుగురు పుత్రులకు నిషేధం చెప్పాడు కనుక, అప్పటికే కుంతి ముగ్గురు కుమారులను పొందింది కనుక, నియోగపద్ధతివల్ల ముగ్గురు సంతానాన్ని పొందవచ్చని మహాభారతం అంగీకరిస్తున్నట్లు తలంచవచ్చు. ఇంకా నియోగమనేది భర్తను కోల్పోయిన కాంత పరంగాకాదని వివాహం నిశ్చయమై వివాహానికిముందే వరుడు మరణించిన సందర్భాల్లో మాత్రమే ఆ వరుని సోదరుణ్ణి నియోగించాలని మనుస్మృతిలో ఉంది. వివాహం నిశ్చయమైనంత మాత్రాన వివాహకార్యక్రమం జరగకుండానే అతడు ఏ

విధంగా భర్త అవుతాడో పరిశీలించవలసిన అంశం. ఈ ధర్మశాస్త్రాల్లో నెలకొని ఉన్న భిన్న వాక్యతను దృష్టిలో ఉంచుకొని నియోగధర్మం అనేది ప్రాచీన కాలంలో అనేక నిబంధనలకులోనై అక్కడక్కడ మాత్రమే ఆచరణలో ఉండి వుండవచ్చునంటూ పి. వి. కాణే "Even in the Dharma Sutras, the practice of Niyoga was hedged round with so many restrictions that it must not have been very much prevalant and instances must have been rather rare"[20] అని పరిశీలన చేశారు.

ఇన్ని నియమ నిబంధనలతో నియోగపద్ధతిని సాగించవలసిన అవసరం ఏమిటి? అన్న ప్రశ్న ఉదయించటం సహజం. ఎట్లాగైనా వంశాంకురమైన సంతానాన్ని పొందాలనే ఆకాంక్ష అత్యంత ప్రాచీనకాలంనుంచి నియోగపద్ధతిని ఆశ్రయించటానికి కారణం అయిఉంటుందంటూ "The practice of Niyoga was a relic from the past and probably owed its origin to several cause which are now obscure, but one of which was the great hankering for a son evinced by all in vedic times,"[21] అన్న పి.వి. కాణే అభిప్రాయం సహేతుకమైన సమాధానంగా కనిపిస్తుంది. ఇంకా వింటర్‌నిట్జ్ పండితుడు బీదరికం స్త్రీ జనం తక్కువగా ఉండటం, అవిభక్త సమిష్టి కుటుంబాలు ఈ సంప్రదాయానికి మూలమై ఉంటాయని చెప్పిన అభిప్రాయాన్ని పి. వి. కాణే ఉట్టంకించారు.[22] ఈ నియోగ విధానం అత్యంత ప్రాచీనకాలం నుంచి అమలులో ఉన్నా కాలం గడిచే కొద్దీ సమాజంనుంచి పైదొలగినట్లు తలంచవచ్చు.

**బ్రాహ్మణ నియోగం :** నియోగంద్వారా క్షేత్రజులైన సంతానాన్ని పొందటానికి నియోగించిన వ్యక్తి దేవరుడు కాని, సగోత్రుడు కాని, సపిండుడు కాని, అధవా ఆ వంశంలోని వాడైనా కనిమాత్రమే అయిఉండాలని ఈ ధర్మాన్నంగీకరించిన ధర్మశాస్త్ర గ్రంథాలు వివరిస్తున్నాయి. అయితే క్షత్రియ కాంతలు క్షేత్రజ సంతానాన్ని పొందటానికి బ్రాహ్మణులను నియోగించే సంప్రదాయం మహాభారతంలో కనిపిస్తుంది. ఆ కాలంలో క్షత్రియ క్షేత్రాల్లో నియోగించిన బ్రాహ్మణ జాతివారికి ధనంకూడా ఇచ్చేవారని,

"బ్రాహ్మణోగుణవాన్ కశ్చిద్ధనేనో పనిమన్త్ర్యతాం
విచిత్రవీర్య క్షేత్రేషుయః ముత్పాదయే ప్రజాః"[23]

అన్న భీష్ముని మాటల్లో వ్యక్తమౌతుంది. పరశురాముడు కార్తవీర్యార్జునునితోపాటు క్షత్రియులందరిని గర్భస్థ శిశువులతోకూడ సంహరించగా వైధవ్యం ప్రాప్తించిన క్షత్రియ కాంతలందు ధర్మవిధిని సంతానాన్నేర్పరచి బ్రాహ్మణోత్తములు క్షత్రియ వంశాలను నిలిపారని భీష్ముడు నియోగంలో బ్రాహ్మణ ప్రమేయాన్ని వివరించాడు.

మహాభారతంలో నియోగంవల్ల క్షేత్రజ సంతానాన్ని పొందిన ప్రతిచోట బ్రాహ్మణుల లేదా, దేవతల ప్రమేయంకాని ఉంది. బలి అనేరాజు భార్య సుదేష్ణ యందు నియోగించిన బ్రాహ్మణ శ్రేష్ఠుడైన దీర్ఘతముడు ఆమె శరీరాన్ని అంటిన తోడనే అంగరాజు ఉద్భవిల్లాడు. కేకయరాజైన శారదండాయని పుత్రోత్పాదనంలో అశక్తుడవటంవల్ల భార్యశ్రుతసేనను పుత్రార్థం నియోగించాడు. ఆమె పుణ్యస్నాతయై పుంసవన హోమంచేసి ఋత్విజులవల్ల సంతానాన్ని పొందింది. కల్మాషపాదుడనే రాజర్షిచేత నియుక్తఅయి వాని భార్య మదయంతి వసిష్ఠునివల్ల అశ్మకుడనే కుమారుణ్ణి ప్రసవించింది. వ్యుషితాశ్వుడనే మహారాజు భార్యయందు అనవరత కామాసక్తి వల్ల యక్ష్మరుజాక్రాంతుడై అస్తమించగా ఆమె దుఃఖిస్తూ పుత్రార్థం భర్తృశవాన్ని కౌగిలించుకొని ఏడుగురు కుమారులకు తల్లి అయింది. శతశృంగంలో ధర్మరాజాదుల జననంలోకూడ దైవాంశ ప్రతిపాదన ఉంది. పై కథలను పరిశీలిస్తే భారతంలో నియోగంద్వారా సంతానం పొందిన కథల్లోని జననాలు సహజత్వానికి దూరంగా ఉండి అధిదైవిక భావాన్ని ప్రతిపాదించేవిగా ఉన్నాయి. ధర్మశాస్త్రాల్లో ఉట్టంకించిన నియోగ నిబంధనలు ఏ మాత్రమూ భారతంలోని కథలకు సరిపోలటంలేదు. మహాభారతం వేదమత ప్రతిపాదకం అని భావించిన వారు, వైదికమత విస్తరణంలో బ్రాహ్మణుల ప్రాముఖ్యం ఎక్కువ కనుక వారి ప్రాధాన్యాన్ని చాటిచెప్పటానికి ఈ కథలను ఈ విధంగా తరువాతి వారెవరో చేర్చి ఉంటారని తలంచటం భావ్యంగా ఉంటుంది.

క్షత్రియ కాంతలు బ్రాహ్మణుల నియోగంద్వారా మాత్రమే సంతానాన్ని పొందేవిషయాన్ని గురించి పి. వి. కాణే పండితుడు కొన్ని అభిప్రాయాలు వ్యక్తం చేశాడు. 'ఆర్యులు భారతదేశ వలస విధానంలో గంగా, యమునా మైదానాల్లో చిన్నచిన్న రాజ్యాలు ఏర్పరచుకొన్నప్పుడు గణాధిపత్యానికై భిన్న గణాలమధ్య అంతఃకలహాలు, యుద్ధాలు జరిగి ఉంటాయి. ఆ యుద్ధాల్లో రాజవంశీయుల్లో అధి పతులలో హెచ్చుమంది మరణించి ఉంటారు. వంశాలు నిలుపుకొనేందుకు నియోగాచారం అమలులో ఉన్నట్లయితే నియోగార్హత కలిగినవారు ఆ రాజవంశాలలో

సామాన్య సైనికులే మిగిలి ఉంటారు. ఆభిజాత్యం కలిగిన రాజవంశీయులు సామాన్య సైనికుల తోడ్పాటుతో వంశాల్ని ఉద్ధరించటం వంశప్రతిష్ఠకు భంగకరంగా భావించి ఉంటారు. అందుకోసమే ఆధ్యాత్మిక ప్రపంచంలో తమకన్నా అధికులుగా భావించే బ్రాహ్మణుల సాయంతో క్షత్రియ వంశాల్ని ఉద్ధరించే ప్రయత్నంచేసి ఉంటారు' [24] అనేది ఆ పండితుని ఆలోచన. రాజవంశాలవారి అనుమతి, అభినివేశం లేకుండానే బ్రాహ్మణులు ఆధికారికంగా నియోగాన్ని తమయందు నిక్షిప్తం చేసుకొన్నారనటం సాహసం అవుతుంది అంటూ కాణె, "It is impossible to believe that Brahmanas, who had no temporal power, could coerce the proud and warlike caste in to choosing Brahmanas for Niyoga, unless the teaching of the smritis fell in line with the notions of the ruling houses themselves to some extent at least" [25] అని వ్రాశువ్రారు.

కాణే పండితుని అభిప్రాయానుగుణంగా అవసర నిమిత్తం క్షత్రియులు బ్రాహ్మణులను ఆశ్రయించినట్లు స్పష్టంగా తెలుస్తుంది. భీష్ముడు సత్యవతితో చెప్పిన మాటలుకూడ ఈ అంశాన్నే బలపరుస్తున్నాయి. అవసరార్థం తెచ్చుకొన్న బ్రాహ్మణులు ఆ తరువాత తమ ఆధిక్యాన్ని పటిష్ఠ పరచుకోవటానికి ప్రయత్నించి ఉండవచ్చు. లేదా కృతజ్ఞతా సూచకంగా క్షత్రియులే బ్రాహ్మణాధిక్యాన్ని అంగీకరించి ఉండవచ్చు. ఆ పరస్పరావగాహనం, కృతజ్ఞతా భావమే భారతంలో ప్రతిబింబించి ఉండవచ్చు. అట్లాంటి సందర్భాలలోనే స్మృతివాక్యాల నియమ నిబంధనలకు భిన్నంగా భారతంలో నియోగ సంబంధమైన కథలు వర్ణించి ఉండవచ్చు. ధృతరాష్ట్రాదుల జననంలోని నియోగ విధానంకూడ అట్లాంటిదేనని చెప్పేందుకు భారతంలోనే ఎన్నో అంశాలు ఆధారంగా నిలుస్తాయి.

**నియోగవ్యత్యస్తం :** నియోగపద్ధతిని అమలు పరచే విషయంలో ధర్మశాస్త్ర గ్రంథాల్లోనే కాకుండ మహాభారతంలోకూడ ద్వైధీభావం ఉన్నట్లు కనిపిస్తుంది. కొన్ని సందర్భాల్లో నియోగపద్ధతి అనుమతించటం జరిగితే కొన్ని సందర్భాల్లో నిరసించటమో, లేక క్షేత్రమయిన కాంత వైముఖ్యం ప్రదర్శించటమో జరిగింది. ఉతథ్యుడనే మునివరుని ధర్మపత్ని మమతను బృహస్పతి దేవర

న్యాయానుగుణంగా అభిలషించాడు. ఆ సమయంలో ఆమె గర్భస్థ శిశువు అది ధర్మ విరుద్ధమని ఆక్రోశించాడు. సర్వభూతేప్సితమైన కార్యానికి ప్రతికూలుడైనందువల్ల అతణ్ణి దీర్ఘతముడయ్యేటట్లు శపించాడు. గర్భస్థశిశువు బృహస్పతితో మాటలాడటం ప్రకృతికి అనుగుణం కాకపోయినా, ఈ సన్నివేశం నియోగం విధానంపై కొందరిలో వ్యతిరేకత ఉన్నట్లు తెలియచేస్తుంది.

బీజిని అయినవాడు కాంతయందు తనను తానే నియోగించుకొన్న సందర్భాన్ని నిరసించటం శ్వేతకేతు కథలో కనిపిస్తుంది. పూర్వం స్త్రీలు పురుషులచేత అనావృతలై స్వతంత్ర వృత్తితో అఖిల ప్రాణి సాధారణమైన ధర్మంతో తమతమ వర్ణాలలో ఋతుకాలం తప్పకుండ నియతానియత పురుషులై యథేచ్ఛగా ప్రవర్తించేవారు. అట్లాంటి సమయంలో ఉద్దాలకుని భార్య ఋతుమతియై ఉన్నప్పుడు ఒక వృద్ధ విప్రుడు పుత్రార్థం ఆమెను కామించాడు. ఆ సమయంలో ఆమె కుమారుడైన శ్వేతకేతువు ఇది ధర్మవిరుద్ధమని ఆక్రోశించి సహించలేక అన్య పురుష సాంగత్యం వల్ల కాంతలు సమస్త పాపాలు పొందుతారని, స్త్రీలు పరపురుషార్థినులై ప్రవర్తించటం నిషిద్ధమని కట్టడిచేశాడు. ఆ కట్టడి "ధారుణీజనంబునందు లోకపూజ్యమై ప్రవర్తిల్లుచునుండె శిష్ట సంప్రయుక్తిఁజేసి" (ఆది. 5-85) అని పాండురాజు కుంతీదేవితో చెప్పాడు. ఈ సందర్భంలో ఇంకొక విషయంకూడ గమనించదగిఉంది. నియోగంవల్ల జన్మించిన పుత్రుడు క్షేత్రమైన కాంత మరణించిన భర్తకు చెందుతాడని ధృతరాష్ట్రాదుల జనన కథలోనూ, కొన్ని ధర్మశాస్త్రల్లోను చెప్పిఉండగా, అతిథిగా వచ్చిన ఈ విప్రుడు ఉద్దాలకుని భార్యను తనకై పుత్రార్థం కామించాడు. శ్వేతకేతువంటివారు ఒకరిద్దరు నిరసించి నప్పటికీ బీజిని అయిన వాని ఆత్మనియోగంవల్ల కలిగే సంతతి అతనికే చెందుతుందని భారతంలోనే ఉట్టంకించటం జరిగింది.

నియోగంవల్ల కలిగిన సంతానం బీజిని అయిన వ్యక్తికే చెందుతారనే అంశాన్ని ఋగ్వేదం, వసిష్ఠ ధర్మసూత్రం, గౌతమ ధర్మసూత్రం, బలపరచిన విషయం పూర్వోక్తం. ఇంకా తమ ధర్మసూత్రం జీవించిఉన్న భర్త భార్యను సంతానార్థమై నియోగిస్తే ఆ సంతానం భర్తకు చెందుతుందనీ, భర్త మరణానంతరం పెద్దలు ఆ కాంతను పుత్రార్థమై నియోగించినట్లయితే ఆ సంతానం బీజినికే చెందుతుందని తీర్మానించిన అంశంకూడ విదితమే. అందువల్ల శ్వేతకేతు కథలోని

విప్రుని నియోగ విధానాన్ని దృష్టిలో పెట్టుకొన్నా, గౌతమ ధర్మసూత్రం తీర్మానించిన అంశాన్ని దృష్టిలో ఉంచుకున్నా, వ్యాసునివల్ల అంబికాంబాలికలకు ఉద్భవించిన సంతానం బీజిని అయిన వ్యాసునకే చెందవలసి ఉంటుంది కాని కురు వంశానికి చెందదు. ఒకవేళ వ్యాసుని నియోగం జరిగిందని అంగీకరించినా అది విచిత్రవీర్యుని మరణానంతరమే కావటం ఇందుకు కారణం.

భారతంలో వ్యాసునివల్ల కలిగిన సంతతి క్షేత్రంగా ఉన్న కాంత భర్త వంశానికి చెందుతారని, ఉద్దాలకుని భార్యను వృద్ధవిప్రుడు తనకు పుత్రార్థం కామించాడని చెప్పిన అంశాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ధర్మశాస్త్రాలు కూడ నియోగంవల్ల కలిగిన సంతతి ఎవరికి చెందాలన్న అంశంలో ఏకాభిప్రాయం వ్యక్తం చేయటం లేదు. అంటే ధర్మశాస్త్రాల్లో లాగానే మహాభారతంకూడ నియోగ పద్ధతిని అనుసరించే విషయంలో ఒక నిర్దిష్టమైన సంప్రదాయాన్ని అనుసరించినట్లు కనిపించదు. కనుక నియోగ పద్ధతి అమలుజరిగే విషయంలో వివాదాస్పదమైందిగా, నిర్దిష్టత లోపించిందిగా భావించటానికి అవకాశం ఉంది.

నియోగంలో క్షేత్రాలుగా ఏర్పరచిన కాంతలు దీని ఎడవైముఖ్యం ప్రదర్శించిన సందర్భాలు కొన్ని భారతంలోనే కనిపిస్తున్నాయి. బలి అనే రాజు తన భార్య సుదేష్ణయందు సంతానం పొందేందుకు గీర్ఘతముడనే బ్రాహ్మణ శ్రేష్ఠుని నియోగిస్తాడు. సుదేష్ణ :

> "పుట్టుజీకు వృద్ధుఁ బూతిగంధానను
> వేదజడునిఁ బొందవెలది రోసి
> తన్నపోని దానిఁదన్విఁగోమలి దన
> దాది కూతుఁదపసి కడకు" (ఆది. 4-234)

పంపి భర్త ఆజ్ఞను తిరస్కరించింది. ఇందుకు ఆమె వైముఖ్యమే కారణం. అట్లాగే అంబిక, అంబాలిక వ్యాసునితోడి సంయోగానికి తిరస్కరించినట్లు స్పష్టంగా లేకపోయినా, సంయోగ సమయంలో వారిద్దరి చేష్టలు వైముఖ్యాన్నే తెలియచేస్తున్నాయి. సత్యవతి అంబికను ద్వితీయ పర్యాయం నియోగించినప్పుడు

తాను శయనాగారం ప్రవేశించటానికి రోసి సర్వాలంకార భూషితురాలైన తన దాసిని పంపింది. ఈ అంశం సుదేష్ణ తన దాసి పుత్రికను దీర్ఘతముని వద్దకు పంపిన కథను తలపిస్తుంది. సంభోగ విషయానికి వచ్చేటప్పటికి సుదేష్ణ దాసి పుత్రికనుచూసి గుర్తించటానికి దీర్ఘతముడు జాత్యంధుడు అందువల్ల సుదేష్ణా దాసీపుత్రికలమధ్య అంతరం గుర్తించలేకపోయాడు. కాని వ్యాసుడు అంతకు పూర్వం అంబికను ఒక పర్యాయం చూసి ఉన్నాడు. అప్పుడు ఆమె వైముఖ్య లక్షణాన్ని గుర్తించి ఉంటాడు. అయినా రెండవసారి అంబిక శయనాగారం ప్రవేశించినప్పుడు ఆమె దాసితో పొరపొచ్చంలేకుండా యధేచ్ఛగా సంభోగించటం హేతుబద్ధంగాను, ధర్మ యుక్తంగాను కనిపించదు. అంతేగాక కొంత విడ్డూరంగాకూడ అనిపిస్తుంది. ఇట్లా భారతంలోనే నియోగ విధానం ఎన్నో విరుద్ధాంశాలతో వివాదాస్పదంగా ఉన్నట్లు విదితమవుతుంది.

**వ్యాసుని నియోగంలోని అసంబద్ధత :** నియోగ విధానంలో వంశోద్ధరణే ప్రధాన లక్ష్యంగా దాన్ని అంగీకరించిన శాస్త్రగ్రంధాలు భావించాయి. ఈ పద్ధతివల్ల సాధారణంగా ఒక్క కుమారుణ్ణే పొందాలని, అత్యవసర స్థితిలో మాత్రమే ద్వితీయ సంతానం కోసం ప్రయత్నించాలన్న నిబంధన విధించాయి. సత్యవతి దేవర న్యాయానుగుణంగా అంబికయందు పుత్రుని ప్రసాదించి వంశాన్ని నిలపవలసిందిగా వ్యాసుని వేడుకొన్నది కాని అతడు సురూపవంతుడే కావాలని కోరలేదు. వంశోద్ధరణ, కురువంశాంకుర జననమే ఇక్కడ ప్రధానంగాని, కలిగే సంతానం సౌందర్యానికంతగా ప్రాముఖ్యాన్ని సత్యవతి ఇచ్చినట్లు లేదు. 'కులమవిరత సంతతి నెగడుటయే' ఆమె కోరిక. వ్యాసుడు కూడ అంబికకు సంతానం ప్రసాదించి, అతడు గుణగరిష్ఠుడు అవుతాడని నూర్గురు పుత్రులను కంటాడు అంటూ

**"నాగాయుత సమప్రాణో విద్వాన్ రాజర్షి సత్తమః**
**మహాభాగో మహావీర్యో మహాబుద్ధిర్భవిష్యతి॥**
**తస్యచాపి శతంపుత్రా భవిష్యంతి మహాత్మనః"**[26]

అని ధృతరాష్ట్రుని ప్రయోజకత్వాన్ని విశదపరచాడు. ఇట్లా సంతానం ఉత్పన్నం కావటంవల్ల ఆపద్ధర్మం నెరవేరింది. అతనికి నూర్గురు పుత్రులు కలుగు

తారని చెప్పటంచేత విచిత్రవీర్యుని వంశం నిలిచింది. సత్యవతి వ్యాసుణ్ణి కోరింది వంశవిస్తారకుని. వ్యాసుడు వంశవిస్తారకుడైన కుమారుణ్ణే ప్రసాదించాడు. కాని అతడు మాతృదోషంవల్ల జాత్యంధుడవుతాడని వ్యాసుడు అనటమేకాని, అంబికవల్ల జరిగిన మాతృదోషమేమో వెల్లడించలేదు.

వ్యాసుని సందర్శనతో అంబిక కనులు మూసుకోవటం ఒక్కటే మనకు కనిపించే దోషంగా గోచరిస్తుంది. సంభోగ సమయంలో తల్లి కన్నులు మూసుకొంటే పుట్టేబిడ్డ అంధుడవుతాడనేది నమ్మతగిన అంశంకాదు; శాస్త్రసమ్మతమూ కాదు. సంభోగ సమయంలో తల్లిదండ్రుల మనోవైకల్యాలు పుట్టే శిశువుల శారీరక మానసిక స్థితిపై ఎలాంటి ప్రభావాన్ని చూపవని మనస్తత్వ శాస్త్రవేత్తలుకూడ వక్కాణించారు. గర్భస్థ శిశువు ప్రత్యేకమైన జీవిగా తల్లి గర్భంలో పెరుగుతుంది. శిశువు ఆహారాన్ని తల్లి రక్తం ద్వారానే స్వీకరిస్తుంది. మాతృరక్తంలో ఏదైనా దోషం ఉంటే దాని ప్రభావం గర్భస్థ శిశువుపై పడటానికి కొంత అవకాశం ఉంది. అందువల్ల గర్భిణి స్త్రీ స్వీకరించే ఆహార లోపంవల్ల గర్భస్థ శిశువుకు నష్టం కలగటానికి అవకాశం ఉంది కాని తల్లి ఆలోచనలు ఆ శిశువును ప్రభావితం చేయటానికి అవకాశాలు లేవు. ఈ సందర్భంలో జాన్. ఇ. ఆండర్సన్ వెలిబుచ్చిన "The Foetus is well protected from visual, auditary and other types of sensory stimulation and from external Jars and Jolts. What the mother thinks or feels during pregnancy has little or no relation to the child's subsequent devolopement. She cannot make the child hot tempered by being angry herself or give the child a good imagination by dreaming of his future" [27] అనే అభిప్రాయం గమనించదగింది.

ధృతరాష్ట్రుడు జాత్యంధుడు కావటానికి వేరే కారణాలు ఉండిఉండాలి కాని అంబిక కన్నులు మూసుకోవటం కారణంకాదు. అతడు అంధుడైనా వంశం నిలిపే సామర్థ్యం ఉన్నవాడు. అంధుడవటంవల్ల రాజ్యపాలనలో కొంత ఇబ్బంది ఎదురైతే, విచిత్రవీర్యుని మరణానంతరం రాజ్య రక్షణభారం స్వీకరించిన భీష్ముడే ధృతరాష్ట్రుని సంతతి పెద్దవారయ్యేంతవరకు ఆ భారం కొనసాగించటానికి ఇబ్బంది ఉండదు. ఆ తరువాత ధృతరాష్ట్రుని సంతానంలో అగ్రజుడు కురురాజ్య పీఠాన్ని అధిష్ఠించవచ్చు. ఈ ఏర్పాటుకు అభ్యంతరాలుకాని, అవాంతరాలుకాని ఏమీ ఉండవు.

ఇలాంటి పరిస్థితుల్లో ధృతరాష్ట్రుని అంధత్వాన్ని మిషగా పెట్టుకొని సత్యవతి అంబాలిక ద్వారా మరొక పుత్రుణ్ణి కోరటం సమంజసంగాని, సహేతుకంగాని కాదని చెప్పవచ్చు. ఈ అంశంలో శ్రీ కేతవరపు వేంకటశాస్త్రి "ధృతరాష్ట్రి జన్మముతో సత్యవతి కోర్కె సిద్ధించియుండగా ధర్మజ్ఞురాలైన యామె ద్వితీయ పుత్రుని కోరుటయు సనాతన ధర్మవిదుడగు వ్యాసు డంగీకరించుటయు జరుగదు"[28] అని వెలిబుచ్చిన అభిప్రాయం పరిగణించదగింది.

సత్యవతి కోరినా వ్యాసుడు అంగీకరించటం ధర్మశాస్త్రబద్ధంగా లేదు. ధృతరాష్ట్రుని జననంతో కురువంశం నిర్వీర్యమయ్యే ప్రమాదం తప్పింది. అనివార్య పరిస్థితుల్లో మాత్రమే పెద్దల అనుమతితో నియోగానుగుణంగా రెండవ కుమారుని పొందటాన్ని కొందరు శాస్త్రకారులు అనుమతిస్తున్నారు. ధృతరాష్ట్రుని జననానంతరం కురువంశానికి ఏర్పడ్డ అనివార్య పరిస్థితులేమీ గోచరించవు. కనుక సత్యవతి రెండవ కుమారునకై అంబాలికను నియోగించేందుకు ప్రయోజనం కనపడదు. ఒకవేళ అంబాలికను నియోగించటం కొంతవరకు సమ్మతమే అనుకొన్నా, అంబికను తిరిగి రెండవసారి నియోగించటం శాస్త్రదూషితమే అవుతుంది. ఒకసారి నియోగంవల్ల సంతానం పొందినవాని భార్యను తిరిగి నియోగించినట్లయితే కలిగే సంతానం జారిణీ పుత్రులతో సమానులని, కారకులయిన వారిద్దరు నరకానికి పోతారని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఈ విశృంఖలత్వాన్ని అనుమతించినట్లయితే సామాజిక వ్యవస్థ ఛిన్నాభిన్నమవుతుందని మనుస్మృతిలాంటి శాస్త్రగ్రంధాలు సూచిస్తున్నాయి. ఈ అంశంలో మనుస్మృతి సంతానవతియైన కాంతయందు పునర్నియోగంవల్ల జన్మించిన క్షేత్రజ సంతానం పిత్రార్జితంలో భాగానికి అర్హులు కారంటూ,

"నియుక్తామపి పుమాన్నార్యాం జాతేఽవిధానతః
నైవార్హం పైతృకం రిక్థం పతితోత్పాదితోసహిః"[29]

అని చేసిన నియమం పరిశీలించదగింది. సకల ధర్మాలు ఎరిగిన వ్యాసుడు ఈ మాత్రపు సామాజిక ధర్మాన్ని ఎరుగకపోడు.

'వ్యాసో నారాయణో హరిః' అని కీర్తి పొందిన ధర్మమూర్తి అయిన వ్యాసుడు నలుగురు ప్రశ్నించే ధర్మవిరుద్ధమైన కార్యం ఎట్లా చేయగలడు? వ్యాసుడే

అయితే చేయలేడని చెప్పాలి. అయితే పాండురాజు, విదురుడు ఎవరివల్ల జన్మించి ఉండాలి? వ్యాసునివల్ల కాక మరెవరికైనా జన్మించి ఉండాలి; కాకపోతే వ్యాసుడు సత్యవతి, భీష్ముడు కూడ ధర్మవిరోధులు కావలసి ఉంటుంది; లేదా అధర్మమార్గాన జన్మించిన సంతానాన్ని ఆనాటి ప్రజలైనా అంగీకరించి ఉండాలి. రాజ్యాంగ వ్యవహారాల్లో ప్రజల ఉత్కంఠను, ప్రమేయాన్ని పరిశీలించినట్లయితే సామాజిక ధర్మవిరుద్ధమైన కార్యాలను అనుసరించినప్పుడు వారు రాజులను ప్రశ్నించేవారని తెలుస్తుంది. ధృతరాష్ట్రాదుల జనన విషయంలో ప్రజలు పెద్దలు ప్రశ్నించలేదంటే వారు విచిత్ర వీర్యునకు ఔరస పుత్రులుగా జన్మించినట్లు నమ్మి ఉండటమే ప్రధాన కారణంగా తలంచవచ్చు.

ధృతరాష్ట్రాదులు విచిత్రవీర్యునకు ఔరస సంతానం అనే విషయాన్ని బలపరచే మరొక అంశం పరిశీలించటం అవసరం. ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డి అవటంవల్ల అంబాలిక ద్వారా రెండవ సంతానం ప్రసాదించమని సత్యవతి వేడుకొన్నది. సామాజిక, నైతిక ధర్మబద్ధం కాకపోయినా వంశోద్ధరణ నిమిత్తమై వ్యాసుడు అంగీకరించాడను కొందాము. అతడి రూపానికి భయపడిన అంబాలిక వైవర్ణ్యం పొందింది. అందువల్ల పాండుదేహుడైన కుమారుడు ఉద్భవిస్తాడని తెలిపాడు. జాత్యంధత ధృతరాష్ట్రుణ్ణి రాజ్యార్హతకు అనర్హుణ్ణి చేసిందనుకుంటే, పాండుత్వంవల్ల పాండురాజు రాజ్యపాలనకు అనర్హుడనే విషయం ఎక్కడా చెప్పలేదు. పైగా నన్నయ కురువంశం ప్రతిష్ఠించే సామర్థ్యం కలవాడు, సర్వధర్మాలు తెలిసినవాడు, గుణరత్నాంబుధి అని పాండురాజు సామర్థ్యాన్ని ప్రస్తుతించాడు. కనీసం పాండుని జననంతోనైనా కురువంశం నిలిచింది. అలాంటి సమయంలో సత్యవతి అంబిక వల్ల రెండవ సంతానాన్ని పొందే ప్రయత్నం చేయటమూ, వ్యాసుడు అందుకు అంగీకరించటంలో ప్రయోజనం కనిపించదు. ధృతరాష్ట్రుని జననంతోనే ఆపద్ధర్మం అనుకూలించింది. పాండురాజు జననానికే కారణం లేకపోగా, అప్పటికే సంతానాన్ని పొందిన అంబికయందు రెండవ పర్యాయం సంతానంకోసం ప్రయత్నించటం విడ్డూరంగానే గోచరిస్తుంది.

విడ్డూరమూ, ధర్మదూరమూ కాదని సమర్థించినప్పటికీ, సత్యవతి వ్యాసుణ్ణి రెండవ పర్యాయం నియోగించింది అంబికయందు సంతానం పొందటానికి మాత్రమేకాని, అంబిక దాసిద్వారా సంతానోత్పత్తి చేయటానికి కాదు. అంబిక

ఎవరో అంబికదాసి ఎవరో గుర్తించలేనంత అశక్తుడు వ్యాసుడు అని అనుకోలేము. కనీసం దాసి అని తెలిసిన తరువాతనైనా ధర్మమూర్తియైన వ్యాసుడు శయనాగారం నుండి వెనుతిరిగి వచ్చి ఉండవలసింది. అట్లా చేయకుండ కృష్ణద్వైపాయనుడు "దాని చేసిన యుష్టోప భోగంబులం దుష్టుడై దానికిం బుత్రదానంబు" (అది. 4-258) చేశాడు. సత్యవతి వ్యాసుని నియోగించింది అంబికయందు వంశోద్ధారకుడైన రెండవ పుత్రునికోసం. వ్యాసుడు కురువంశానికి సమర్పించింది దాసి పుత్రుడైన విదురుణ్ణి.

ధృతరాష్ట్రుడు అంధుడు కావటంచేత వంశోద్ధరణ సామర్థ్యం లేకపోయి నట్లయితే, దాసిపుత్రుడైన విదురునకు కూడ ఆ అర్హతలేదు. వీరిద్దరు అర్హులుకాక పోయినా పాండురాజు ఉన్నాడు గదా అనుకుంటే, పాండురాజు వంశోద్ధరణ చేయ గలడనుకొన్నప్పుడు, అంబికవల్ల రెండవ పర్యాయం కుమారుణ్ణి పొందే ప్రయత్నం చేయవలసిన అవసరమే కనిపించదు. పాండురాజు కూడ సమర్థుడు కాడనుకుంటే కురువంశం ధృతరాష్ట్రుని జననానికి పూర్వం ఎట్లావుందో విదురుని జననం తరువాత కూడ అలాగే ఉంది. కురువంశోద్ధరణ సామర్థ్యంగల కుమారుడు మూడు ప్రయ త్నాల్లోను ఫలించలేదన్నమాట. భర్తను కోల్పోయిన విధవయందు సంతానం పొందిన తరువాత పునర్నియోగం జరిగినట్లయితే వారిరువురు పతితులవుతారని మనుస్మృతిలో ఉంది. కనుక నియోగ ధర్మానికి వ్యతిరేకంగా నడచినా సత్యవతి మనోభీష్టం నెరవేరలేదు. వంశం ఉద్ధరించేదుకు మరొక పుత్రుడు కావాలి. కాని ఆ మేరకు సత్యవతి వ్యాసునిఅర్థించలేదు. అయితే కురువంశం ఉద్ధరించే కార్యం ఈ ముగ్గురిలో ఎవరివల్ల సాధ్యమవుతుందని భావించిందో ఊహకు అందని విషయం.

ఈ తతంగం అంతా వ్యాసుని వ్యక్తిగత శీలానికి పెద్ద మచ్చలా తయా రయింది. నియోగ నిబంధనలను అన్నింటినీ త్రోసి రాజని ధర్మమూర్తి అయిన వ్యాసుడు అంబికతోపాటు అంబాలికను కలియటమేకాక, అంబికదాసితో సైతం నిస్సం కోచంగా ప్రవర్తించటం అసంగతమూ, అసంబద్ధమూ అవుతుందనటంలో విప్రతి పత్తిలేదు. లోకజ్ఞానంలేని సామాన్య బ్రాహ్మణుడెవరో ఈ ధర్మవ్యతిరిక్తకార్యాన్ని ఆచరించాడంటే ధనాశతో చేశాడని అనుకోవచ్చు. కాని ఎన్నో అసంగతాలకు, అసంబద్ధాలకు నిలయమైన ఈ కార్యంలో వ్యాసుడు భాగస్వామి కావటం, భీష్మాదులు దానిని అంగీకరించటం నమ్మశక్యంకాదు. మనకేకాదు ప్రాచీనులలోకూడ కొందరు పండితులు ఈ విషయాన్ని నమ్మటంలేదు. క్రీ. శ. 8వ శతాబ్ది వాడైన విశ్వ

రూపుని అభిప్రాయాన్ని పి.వి. కాణే తన గ్రంథంలో "V. warupa further says that the procreation of sons by vyasa from the queens of Vichitra-veerya should be paid no heed ie is not to be relied on" [30] అని ఉట్టంకించారు.

విశ్వరూపుని అభిప్రాయాలు, ప్రాచీన ధర్మశాస్త్రాల్లోని నిబంధనలు కూడ వ్యాసునివల్ల ధృతరాష్ట్రాదులు జన్మించారనే అంశాన్ని ఖండించే విధంగా ఉన్నాయి. గ్రంథస్థమైన కొన్ని విషయాలను పరిశీలించినా వ్యాసునివంటివారు ఈ కార్యాలకు పాలుపడరని భావించ వలసి వస్తుంది. వైదిక ధర్మానికి, ప్రాచీన భారతీయ సాంఘిక నైతిక జీవన ధర్మానికి బాటలు వేశాడని ప్రసిద్ధి చెందిన వ్యాసుడు భారతంలో ఇలాంటి నమ్మశక్యంకాని రచన చేశాడనటం కష్టం. అయితే ఈ అంశం భారతంలో నిర్దుష్టంగా కనిపిస్తుంది కనుక అది ఎలా అందులో చోటు చేసుకొన్నదో పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

విచిత్ర వీర్యుని సంతానమే : ధృతరాష్ట్రాదులు వ్యాస నియోగం వల్ల జన్మించారనటానికి అవకాశం పృగ్యమనుకొంటే, వారి జనక తండ్రి ఎవ్వరై ఉంటారనే అంశం గుర్తించవలసి ఉంది. వీరు ముగ్గురు విచిత్రవీర్యునకు పొందిన సంతానం అని చెప్పటానికి తెలుగు భారతంలో అంతగా ఆధారాలు కనపడకపోయినా, సంస్కృత భారతాన్ని పరిశీలిస్తే కొంత విషయం బోధపడుతుంది. భీష్ముడు, ఎదిరించిన రాజులందరను జయించి స్వయంవరంలో కాశీరాజు కుమార్తెలు అంబికాంబాలికలను తెచ్చి విచిత్రవీర్యునకు వివాహం చేశాడు. విచిత్ర వీర్యుడు తండ్రి శంతనుని లాగానే ప్రజారంజకంగ పరిపాలిస్తూ కురువంశ గౌరవ ప్రతిష్ఠలను పెంచాడు. అంబికాంబాలికలు విచిత్రవీర్యునివంటి వీరుడు, సౌందర్యవంతుడు భర్తగా లభించటం తమ అదృష్టంగా భావించారు. సమస్త నారీజన హృదయాకర్షక శక్తిగల విచిత్రవీర్యుడు భార్యలతో నిరాఘాటంగా ఏడు సంవత్సరాలు కామోపభోగాలతో సంసారం సాగించాడు. ఈ విషయం సంస్కృత భారతంలో స్పష్టంగా ఉంది. [31]

విచిత్రవీర్యుని దాంపత్య జీవితాన్ని, పరిపాలనా దక్షతను పరిశీలిస్తే కురువంశ గౌరవానికి తగిన నాయకుడనే విశ్వాసం కలుగుతుంది. భార్యలతో

సంసారం చేసిన ఏడుసంవత్సరాల కాలంలోనే విచిత్రవీర్యుడు అంబికాంబాలికల యందు ధృతరాష్ట్ర పాండురాజులను, దాసివల్ల విదురుణ్ణి పొంది ఉండవచ్చునని ఊహించటం సమంజసంగా ఉంటుంది. ఈ ఊహకు ప్రోద్బలకంగా "విచిత్రవీర్యు డేడు సంవత్సరముల కాలము కళత్రద్వయముతో సుఖించియున్నాడు. అప్పుడు భార్యలయందొకొక్క కుమారుని కనియుండును. పూర్వజన్మ కర్మవశమున ధృత రాష్ట్రుఁడు జాత్యంధుడయ్యెను. అంబాలికయందు కలిగిన బాలుడు తెల్లని వాడగుటచే పాండుడని పేరు పెట్టిరి. విదురుడుత్తమ గుణుడై శూద్రవంశమున జన్మించి ధృతరాష్ట్ర పాండురాజులను సేవించుచు తన సత్ప్రవర్తనముచేత వారి యను గ్రహమునకు పాత్రుడై రాజగృహమందు వారితో సరిగా పూజింపబడుచుండెను. ఇతడుత్తమ గుణవంతుడగుటచేతనే ధృతరాష్ట్ర పాండురాజులాతని సోదరప్రేమతో మన్నించియుందురు. అంతియకాని వారికంచరకు వ్యాసుడు తండ్రియగుటచేకాదు."[32] అన్న కేతవరపు వెంకటశాస్త్రిగారి అభిప్రాయం ఆలోచించదగిందిగా ఉంది.

**వ్యాసవిదుర సంబంధం :** ధృతరాష్ట్రాదులు విచిత్రవీర్యునకు ఔరస పుత్రులేకాని వ్యాసుని నియోగంవల్ల క్షేత్రజులుగా జన్మించి ఉంటారనటానికి సావకాశం కన్పించటం లేదు. మహాభారతంలో ధృతరాష్ట్రాదుల జననాన్ని వ్యాసునితో ముడిపెట్టటం అర్వాచీన పండితులెవరో చేర్చిన ప్రక్షిప్తంగాను, ధర్మ విదుడైన విదురుని పుట్టుకను ధర్మమూర్తియైన వ్యాసునితో ముడిపెట్టటానికి జరిగిన ప్రయత్నంగా సాహిత్య పరిశీలకులు కొందరు భావిస్తున్నారు. "విదురు జన్మమునకు వ్యాసుడు కారణమని చెప్పుటకే ఇది అంతయు కల్పింపవలసి వచ్చినది."[33] అని కేతవరపు వెంకటశాస్త్రి అభిప్రాయపడ్డారు. ఇట్లా భావించటానికి వీరు కొన్ని కారణాలు చూపి విదురుని మహాత్మ్యాన్ని ప్రతిపాదించారు. 'మహాభారత ప్రతి పాదితార్థం మూర్తీభవించిన భారత వీరులలో ధర్మరాజు విదురుడు ప్రత్యేకంగా కనపడతారు. విదురుడు నిస్వార్థంగా నమ్మిన ధర్మానికి సేవచేసినవాడు. ఇతడు శూద్ర యోనియందు జనించినవాడు. అతని కీర్తి ప్రతిష్ఠలకు, ధార్మిక ప్రవర్తనకు, ఆధ్యాత్మిక విజ్ఞానానికి కులం ఏ మాత్రమూ అడ్డుకాలేదు. కాని ధర్మవిదుడైన విదురుడు విచిత్రవీర్యునివల్ల శూద్ర యోనియందు జన్మించాడన్న దానికన్న వేదమూర్తి అయిన వ్యాసుని వీర్యసంభవుడయినట్లయితే బ్రహ్మజ్ఞాన సమపేతుడవు తాడని భావించి ఉంటారు. ఆ భావంతో విదురుని జన్మను వ్యాసునకు ముడిపెట్టి

ఉండవచ్చు. విదురుని జన్మమును మాత్రమే వ్యాసునితో సంబంధం కలిపినచో వ్యాసుని శీలానికి లోపం వస్తుందనే భావంతో కురువంశోద్ధరణ అనే పవిత్ర కార్యాన్ని ప్రక్షిప్తకారుడు ఆధారంగా తీసుకొని ఉండవచ్చు. అందుచేతనే ధృతరాష్ట్రాదులు దేవర న్యాయమున వేదవ్యాసుడు కారణంగ అంబికాంబాలికా గర్భాలలో జన్మించారని చెప్పటం జరిగి ఉంటుంది.' ఈ అభిప్రాయాన్ని బలపరుచుకొంటూ వెంకటశాస్త్రిగారు "పూర్వము బ్రాహ్మణ సంఘము శూద్రుడైన విదురుని గుణోత్తమత్త్వమును సహింపలేక విదురుడు వ్యాసవీర్య సముద్భవుడు, బ్రాహ్మణ వీర్య సంభవుడు కనుకనే యంతటి వాడైనాడని చెప్పుటకీ ఘట్టమును కల్పించి యుందురు"[34] అని అన్నారు. ధృతరాష్ట్ర పాండురాజుల జననాన్ని వ్యాసునితో ముడిపెట్టటం, విదురునకు వ్యాసునితో సంబంధం సమకూర్చటానికే అన్న వెంకటశాస్త్రిగారు చూపిన కారణం కొంత పేలవంగా ఉన్నా, ఈ అంశమంతా అర్వాచీనులెవరో భారతంలో చేర్చి ఉంటారని భావించే సందర్భంలో వీరి అభిప్రాయం పరిగణనలోకి తీసుకోతగిందిగా ఉంది.

విచిత్రవీర్యుని మరణానంతరమే ధృతరాష్ట్రాదులు జన్మించారని స్థాపించటానికి కురువంశోద్ధరణ అనే అంశాన్ని కల్పనచేసి, వీరి జననాన్ని వేదవ్యాసునితో ముడిపెట్టటానికి వ్యాసుని తరువాతి వారెవరో ప్రయత్నించి ఉంటారని భావించటం సమంజసంగా ఉంటుంది. ఇంకా ఈ ఘట్టమంతా ఖచ్చితంగా కల్పనయేనంటూ కేతవరపు వెంకటశాస్త్రి "దురహంకారులగు బ్రాహ్మణు లీ ఘట్టమునందు కొన్ని మార్పులు చేయనిశ్చయించి యశ్వినీరూపుడును, దేవతుల్య పరాక్రముడగు విచిత్రవీర్యుని క్షయ రోగముతో చంపించి, పై కథయంతయు కల్పించియుందురు"[35] అని తమ అభిప్రాయం వెలిబుచ్చారు. శాస్త్రిగారి ఈ అభిప్రాయం కొంత పరుషంగా ఉన్నప్పటికి సత్యదూరంకాక పరిశీలించదగిందిగా ఉంది. విచిత్రవీర్యుని ప్రాధాన్యం తగ్గించటం సంస్కృత భారతంలోకన్నా కవిత్రయ మహాభారతంలో స్పష్టంగా గమనించవచ్చు. అయితే ఈ మార్పులు చేయటానికి ప్రయత్నించిన వారు అంబికాంబాలికలయందు వ్యాసుని నియోగాన్ని వివరించే ఘట్టంలో నియోగం విషయంలో ధర్మశాస్త్రాలలో నెలకొన్న వైవిధ్యాన్నికాని, గ్రంథంలోని పూర్వాపర వైరుధ్యాన్ని కాని గుర్తించినట్లు లేదు. ధర్మశాస్త్ర విరుద్ధం మాట ఎలావున్నా, గ్రంథంలోని పూర్వాపర వైరుధ్యం ఈ సంఘటన తరువాతి వారెవరో చేర్చిందేమో అనే అనుమానాన్ని బలపరుస్తుంది.

ఇంతవరకు పరిశీలించిన అంశాలను క్రోడీకరించినట్లయితే ధృతరాష్ట్రుల జననానికి వ్యాసుడే కారణమని భారతంలో ఉన్నప్పటికీ, ఆ అంశం మొత్తం తరువాతి వారెవరో కల్పించిందని, కురువంశోద్ధరణలో వ్యాసునకు ఎలాంటి సంబంధంలేదనీ, ధృతరాష్ట్రులు విచిత్రవీర్యునకు ఔరస పుత్రులుగా అంబి కాంబాలికల యందు జన్మించి ఉంటారని భావించటం సమంజసంగా ఉంటుంది. ఇంకా గావి పరిశీలకులు పరిశోధనలు నిర్వహిస్తే వ్యాసుని నియోగం ప్రక్షిప్తమనే విషయంలో క్రొత్త అంశాలు వెలికిరావచ్చు.

అధస్సూచికలు :

1. పి. రాజగోపాల నాయుడు, కురుక్షేత్రే: పు. 83.
2. సం. మ. భా, ఆది. సంభవ; ప. 105 ఆ-41.
3. పైది, ఒకటి; పు. 82.
4. ఋగ్వేదము, X మం. 40-2
5. గౌ. ధ. సూ. 18; 4-8.
6. వ. ధ. సూ, 17; 56-61.
7. కౌటిల్యుడు, అర్థశాస్త్రం; I-17; II! 6
8. మనుస్మృతి; IX. 59.
9. పైది; IX. 60, 61.
10. యాజ్ఞవల్క్యస్మృతి: 1-68
11. ఆప. ధ. సూ; II 10-27-5to 7.
12. పైది, 8; IX 64-68.
13. పైది; IX 69-70.
14. బోధాయన ధర్మసూత్రం; II. 2-4.9.
15. పైది, II. 2-3. 33 to 35.
16. పైది, 4; VII 4-7, 8.
17 పైది, 5; 18; 11. 9.

18. పైది, 8; IX-181.
19. వ. ధ. సూ, 17-9; ఆప. ధ. సూ, II; 6. 13-6; బోధాయన ధ. సూ. II. 2.3-17, 18.
20. P. V. Kane, History of Dharma Sastra; Vol. II. Part I P. 601
21. పైది; పు. 606.
22. పైది; పు. 607.
23. పైది; రెండు; 106 అ-2.
24-25. పైది; 20; పు. 605.
26. పైది; రెండు; 106 అ-8, 9.
27. John E. Anderson, the Psychology of Devolopement and Personal Adjustment; chap IV. P. 88.
28. కేతవరపు వేంకటశాస్త్రి, ధృతరాష్ట్రాదుల జననము; భారతి, మే, 1932.
29. పైది, 8: IX-144.
30. పైది, 20; పు. 605.
31. పైది, రెండు; 102 అ-53, 54; 65-71.
32. పైది; 28.
33. పైది;
34. పైది;
35. పైది:

# 1.3 వివాహం

వ్యక్తి జీవితంలో గార్హస్థ్యం అత్యంత ప్రధానమైంది. మానవ సమాజం సామాజిక, రాజకీయ, ధార్మిక పురోగమనానికి వ్యక్తి గృహస్థ జీవితమే ఆలంబనం. వివాహంతో కాని ఒక వ్యక్తి గృహస్థాశ్రమం ప్రారంభంకాదు. వివాహం వల్ల సహధర్మచారిణి లభిస్తుంది. ఆవిడతో అతడి జీవితం పరిపూర్ణత్వాన్ని, సార్థక్యాన్ని పొందుతుంది. డాక్టర్. చంచల్‌కుమార్ ఛటర్జీ "Marriage is the only important institution which initiates entry in to the householder's status of life for the discharge of several civic and sacred duties including the five Mahayagnas" [1] అని వివాహ ప్రాధాన్యాన్ని వక్కాణించారు. ఇది నూరేళ్ళపంట అని వాడుక. సాంఘిక కార్యక్రమాల్లోనూ, యజ్ఞయాగాది కర్మల నిర్వహణంలోను, అతిథిసత్కారాది ధార్మిక కార్యకలాపాల్లోను భార్యా సమేతుడై సంతానవంతుడైన గృహస్థునకే అధిక ప్రాధాన్యం ఇవ్వటం జరిగింది. భార్యాభర్తల పరస్పర సహృదయగాహన, సానుకూలత, సమైక్యం వివాహం ద్వారానే జరుగుతుంది అంటూ "హైవస్థమ్మావిహౌస్థమ్" [2] అని ఋగ్వేదసూక్తి. సంతానహీనుడు, భార్యాహీనుడైనవాడు నిష్ప్రయోజకుడూ జీవచ్ఛవం వంటివాడని ప్రాచీన గ్రంథాల్లో కథలెన్నో ఉన్నాయి. మానవ జీవితవిధానం, సంఘవ్యవస్థ, వర్ణవ్యవస్థాశ్రమం ఛిన్నాభిన్నం కాకుండ, నిర్దిష్టమైనరీతిలో నిలిచిఉండటానికి వివాహ వ్యవస్థ ఎంతో తోడ్పడుతుంది.

**వివాహావశ్యకత:-** ప్రాచీన మానవుడు అరణ్యాలలో పశుప్రాయుడై సంచరించే దశనుంచి సామూహిక జీవితానికి అలవాటుపడే దశలో సంఘ ప్రయోజనాన్ని, వ్యక్తిప్రయోజనాన్ని సమకూర్చుకోవటానికి సహకారం అవసరమైంది. స్త్రీ పురుష ప్రకృతుల పరస్పర సహకారావశ్యకత వివాహ కార్యక్రమానికి నాంది అంటూ ఎడ్వర్డ్‌మార్క్ "The institution of marriage sprang from the human instinct of living together" అని 'the History of Human Marriages' అనే గ్రంథంలో వెలిబుచ్చిన అభిప్రాయాన్ని చంచల్‌కుమార్ ఛటర్జీ ఉట్టంకించారు. [3] స్త్రీ పురుషులమధ్య భౌతిక సంబంధమైన, న్యాయసంబంధమైన సమైక్యతే వివాహవిధి అంటూ మాలినోవిస్కీ "Marriage may be defined

either as the act, ceremony or process by which the legal relationship of husband and wife is constituted; or as a Physical, legal and moral union between men and women in complete community of life for the establishment of a family"[4] అని ఒకవ్యక్తి కుటుంబీకుడు కావటానికి వివాహావశ్యతను వివరించారు. ఈ సందర్భంలో "పెండ్లికి కారణం ఉపయోగమే. సహాయం కోసమే. పనిపాటులు చేసుకోవటంలో తోడ్పడటానికి చేసుకొన్న ఒక ఏర్పాటు. సహకారం కావలసి వచ్చినపుడే, ఒకవ్యక్తి అంతపనీ చూసుకోవటానికి వీలులేనప్పుడే ఈ పెళ్లి తోడుకోసం చూస్తారు"[5] అన్న తాపీ ధర్మారావుగారి మాటలు గమనించ దగ్గవి. అంటే పెండ్లి అనే విధానంవల్ల మగవాడికి ఆడది అండగాను, ఆడదానికి మగవాడు సహాయంగాను ఉన్నట్లు తెలుస్తుంది.

**వివాహ ప్రయోజనం :-** "వివాహమన విశేషమగు బరువు వహించు శక్తియని యర్థము".[6] బరువనగా సంసార భారమని పేర్కొనవచ్చు. ఒకవ్యక్తి గృహస్థుకావటం, భార్యతో కలిసి యజ్ఞయాగాది దైవకార్యాలు నిర్వర్తించటం, సంతానం పొందటం అనేవి వివాహ ప్రక్రియ ప్రధానోద్దేశ్యాలని ప్రాచీనతమమైన ఋగ్వేద వివరణ. భార్య అర్ధాంగి కనుక వివాహంలో భార్యను సంపాదించుకొనని, తద్వారా సంతానాన్ని పొందనివాని జీవితం అసమగ్రమనీ, అట్లా పొందిననాడే వ్యక్తి జీవితం సర్వ సంపూర్ణమౌతుంది అని శతపథ బ్రాహ్మణం.[7] గ్రీకుదేశస్థుడు మెగస్తనీస్ వివాహ ప్రయోజనం భార్యను సంపాదించుకోవటం, బిడ్డలను పొందటమే అంటూ "Some they marry hoping to find in them willing helpmates and others for pleasure and to fill their houses with children" అని వెలిబుచ్చిన అభిప్రాయాన్ని కొడాలి లక్ష్మీనారాయణ ఉట్టంకించారు.[8]

ఆపస్తంబ ధర్మసూత్రం ధర్మబద్ధంగా సంతానం పొందటమే వివాహం ప్రధానలక్ష్యం అంటూ "ధర్మప్రజా సంపన్నే దారేనాన్యాంకుర్వీత"[9] అని వివరిస్తుంది. ఈ అభిప్రాయాన్నే 'వెస్టరుమార్కు' సాంఘికబద్ధంగా రాజకీయ ప్రయోజనం పరంగా వివాహ ప్రయోజనం అంతగాలేకున్నా, సంతానాన్ని పొందటంద్వారా మానవజాతి నిరంతర పురోగమనానికి ఇది దోహదం చేస్తుందని చెప్పారు. జైమిని గృహ్యసూత్రంకూడ "తావేహిసంభవావసహరేతో దధానహై పుంసే పుత్రాయ

వేత్తవై" [10] అని సంతానోత్పత్తి వివాహబంధంలో ప్రధానాంశంగా పేర్కొన్నది. ఉపనిషత్తులు కూడ ఆమరణాంతం భార్యాభర్తలు కలిసి మెలసి గృహస్థ కార్యకలాపాలను నెరవేరుస్తూ, అతిథి అభ్యాగతాది పూజలతో కాలం గడుపుతూ యజ్ఞయాగాది దైవకార్యాలను నిర్వహిస్తూ సుపుత్రోత్పత్తిని పొందటమే వివాహ ప్రధాన ప్రయోజనంగా పేర్కొన్నాయి. బోధాయనుడుకూడ "వివాహో ప్రజాయైనతు భోగాయేతి మహాత్మనః" అని నుడివాడు.

ఇంకా మహాభారతంకూడ సతి, గుణవతి, ప్రజావతి, అనువ్రత అయిన భార్యను అవజ్ఞాన్విత దృష్టితో చూసేవాడికి ఇహము, పరము చెడతాయని చెబుతూ

**"సంతత గృహమేధి ఫలం**
**బంతయు బడయంగనోపు ననుగుణ భార్యా**
**వంతుండగు వాడు క్రియా**
**వంతుఁడు దాంతుండుఁ బుత్రవంతుడునగున్** (ఆది. 4-83)

అని వ్యక్తి జీవితంలో భార్యప్రాధాన్యాన్ని సూచించింది. ఇంకా

**"వినుగార్హ పత్యమనున**
**గ్న్యనలము విహరింపబడి తదాహవనీయం**
**బున వెలుగునట్లు వెలుగును**
**జనకుడు దాఁ బుత్రుడై నిజద్యుతితోడన్"** (ఆది. 4-87)

అని జనకుడే పుత్రునిగా జన్మిస్తాడని, గృహమేధి జీవితంలో భార్యాపుత్రుల ప్రాశస్త్యం వక్కాణించబడింది.

మొత్తంమీద భార్యభర్తకు అర్ధాంగిఅని, యజ్ఞయాగాది సమస్త ధార్మిక సామాజిక కార్యకలాపాలలో ఇద్దరు కలిసి పాల్గొని ఉత్తమ సంతానాన్నిపొంది వంశాభివృద్ధికి దోహదం చేయటమే గార్హస్థ్య జీవితం ప్రధాన ప్రయోజనం అయినట్లు తెలుస్తుంది.

**వివాహ పద్ధతులు :-** ప్రాథమిక దశలో తోడుకోసమూ, సంతానోత్పత్తికీ వివాహవ్యవస్థ ఆవశ్యకమైనప్పటికీ, మానవుడు నాగరకుడై వర్ణవ్యవస్థా

విధానం కట్టుదిట్టంగా ఏర్పడ్డ తరువాత వివాహ కార్యక్రమంలోకూడ కొన్ని మార్పులు సహజంగా వచ్చాయి. ఆయావర్ణాలలో ఏకవర్గీయుల మధ్యనే వైవాహికానుబంధం ఏర్పరచుకొనే ఆవశ్యకత కలిగి ఉంటుంది. ఆ కారణంగానే భిన్న వర్ణాల వారిలో భిన్న పద్ధతుల్లో వివాహాలు జరిగాయి. సంఘ సమ్మతాలైన ఆ పద్ధతులే ధర్మశాస్త్రాలలో ఉట్టంకించబడి తరాలవారికి శిరోధార్యాలై అనుసరణీయాలయ్యాయి. ప్రాచీన కాలంలో భారతదేశంలో ఎనిమిది విధాలైన వివాహ పద్ధతులున్నట్లు మనుస్మృతిలాంటి ధర్మశాస్త్రాలు తెలియ చేస్తున్నాయి. అంతమాత్రాన ఈ ఎనిమిది విధాలైన వివాహాలు తప్ప ఇతర పద్ధతులలో జతగూడటం లేదని నిష్కర్షగా చెప్పలేము. సభ్య సమాజానికి నాగరక ప్రపంచానికి దూరంగా ఆటవిక జీవితాన్ని గడిపే కొన్ని ప్రాచీన జాతుల్లో వింతవింత భిన్నమైన వివాహ పద్ధతులున్నట్లు సామాజిక శాస్త్రవేత్తల పరిశోధనలవల్ల తెలుస్తుంది. అయితే ఈ అష్టవిధ వివాహాలు ప్రసిద్ధంగా ప్రాచీన నాగరక సమాజంలో బహుళాదరణ పొంది ఉంటాయి.

బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచికం అనేవి ధర్మశాస్త్రాలు పేర్కొన్న అష్టవిధ వివాహాలు. వీటిని మనుస్మృతి

"బ్రాహ్మో దైవ స్తథై వార్షః ప్రాజాపత్య స్తథాఽసురః
గాన్ధర్వోరాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః" [12]

అని వివరించింది. వీటిలో

1. వధువు నడగటానికి వరుని వర్గంవారు రాకపూర్వమే వరుని గుణగణాలు విని కన్యాదాత స్వయంగా ప్రయత్నించి వేదపండితుల ఆశీర్వచనంతో వధూవరులను అలంకరించి కన్యాదానం చేయటం బ్రాహ్మ్య పద్ధతి.

2. కన్యాదాత యజ్ఞం చేయిస్తున్నప్పుడు ఋత్విజులచే ఆశీర్వదించబడి అలంకరించబడ్డ కన్యను దానంచేయటం దైవ వివాహం అవుతుంది.

3. గోమిథునాన్ని కాని, ఒక్క గోవునుకాని యజ్ఞాది ధర్మకార్యాలలో కన్యాదాతకు దానంగా ఇచ్చి విధిపూర్వకంగా వధువును పొందటం ఆర్ష వివాహం అవుతుంది. ఈ గోదానంలో ధనలాభాపేక్ష ఉండరాదని ఒక అంశ.

4. కన్యను వరుని పక్షంవారు అడగటానికి వచ్చినప్పుడు, సభాస్థలంలో వధూవరు లిద్దరిచేత ధర్మచారులమై సంచరిస్తామని చెప్పించి వస్త్రాలంకారాలతో కన్యాదానం చేయటం ప్రాజాపత్యం.

5. కన్యసంబంధీకులకు యథాశక్తి ధనమిచ్చి స్వేచ్ఛగా కన్యను స్వీకరించటం ఆసురవివాహ స్వరూపం.

6. వధూవరులిరువురు ఇచ్ఛాను సారంగా పరస్పర స్నేహంతో సంయోగాన్ని పొందటం గాంధర్వ వివాహం అవుతుంది.

7. కన్య పక్షంలోని వారిని సంహరించికాని, అంగ వికలురను చేసికాని ఆ కన్యను బలాత్కారంగా ఎత్తుకుపోయి వివాహంచేసుకోవటం రాక్షస వివాహం.

8. నిద్రిస్తున్నట్టి, మత్తురాలైనట్టి, శీల రక్షణ విషయంలో ప్రమత్తురాలైన కన్యను అనుభవించి వివాహం చేసుకోవటం పైశాచికం అవుతుంది. [13]

ఈ పద్ధతులన్నింటినీ పరిశీలిస్తే ప్రాచీనకాలంలో వివాహ పద్ధతులెంతో వైవిధ్యంతో కూడి ఉండేవని తెలుస్తుంది. కొన్నిచోట్ల వరునకు బహుమానాలిస్తే మరికొన్నిచోట్ల వధువు తండ్రికి వరుడు కానుకలిచ్చుకోవటం కనపడుతుంది. కొన్నిచోట్ల స్త్రీ పురుషుల స్వేచ్ఛాప్రవృత్తి కనపడుతుంటే మరికొన్నిచోట్ల బలాత్కారం, దొంగతనం గోచరిస్తున్నాయి. ఇంకొన్నిచోట్ల రెండు వర్గాలలోని పెద్దల ప్రమేయం, ఋత్విజుల ప్రాధాన్యం ఉంది.

సమాజంలోని ఆయా వర్గాలవారి నైతిక, ధార్మిక, సామాజిక స్థాయి, లర్థికపరమైన స్తోమత వారి వివాహ పద్ధతులపై తప్పకుండా ప్రభావం చూపిస్తాయి. వేదవేదాంగ విదుడైన శ్రోత్రియ బ్రాహ్మణ యువకుని సంస్కారాది యోగ్యతలు కాని, యుద్ధ విద్య, రాజనీతి విశారదుడైన క్షత్రియ కుమారుని పరాక్రమాతిశయాలు కాని ప్రాకృత జీవనం గడుపుతూ బానిస వృత్తిచేసే శూద్రునకు సాధారణంగా ఉండవు. కనుక యోగ్యతా సంస్కారాలనుబట్టే వివాహ పద్ధతులుకూడ ఉండేవి. పండితులు ఏయే వర్ణంవారు ఏ వివాహ పద్ధతికి యోగ్యులో పరిశీలించి నిర్దేశించారు. ఈ నిర్దేశానికి అనుగుణంగానే సర్వసాధారణంగా వివాహాలు జరుగుతుండేవని భావించవచ్చు. అగ్రవర్ణంగా గౌరవించబడ్డ బ్రాహ్మణులకు బ్రాహ్మ, దైవ, ఆర్ష,

ప్రాజాపత్య, అసుర, గాంధర్వాలు; క్షత్రియులకు అసుర, గాంధర్వ, పైశాచ, రాక్షసాలు; వైశ్య, శూద్రులకు అసుర, గాంధర్వ, పైశాచిక వివాహ పద్ధతులు తగిఉంటాయి. అని మనుస్మృతి నిర్దేశించింది.[14] ఇట్లాగా సాధారణ నిర్దేశంచేస వీటిలో బ్రాహ్మణులకు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య వివాహాలు; క్షత్రియులకు రాక్షస వివాహం; వైశ్య శూద్రులకు అసుర వివాహం ప్రశస్తమని విద్వాంసులు నుడివినట్లు

"చతురో బ్రాహ్మణాఖ్యాద్యాన్ప్రశస్తావయో విదుః
రాక్షసం క్షత్రియస్యైక మాసురం వైశ్యశూద్రయోః[15]

అని మనుస్మృతి ఉట్టంకిస్తుంది. అంతేగాక క్షత్రియులకు గాంధర్వ రాక్షస మిశ్రమ వివాహం శ్రేష్ఠమని మనుస్మృతి సూచన.[16] ఈ సూచనను బోధాయన ధర్మ సూత్రంకూడ బలపరుస్తుంది. అష్టవిధ వివాహాలలో బ్రాహ్మ్యం అత్యుత్తమమైందనీ, పైశాచ పద్ధతి అతి నికృష్టమైందని శాస్త్రగ్రంథాలు వక్కాణించాయి.

బహుభార్యాత్వం, బహు భర్తృత్వం గూర్చి కూడ ధర్మశాస్త్రాలు కొంత పరిశీలన చేశాయి. అనేక సందర్భాల్లో బహు భార్యాత్వం కనపడుతున్నా, బహు భర్తృత్వం మాత్రం చాలా కొద్దిచోట్ల మాత్రమే ఉపహరించబడింది. ఈ శాస్త్ర గ్రంధాలు రచించే కాలానికి బహు భార్యాత్వం అతి ప్రచురంగా సమాజంలో అంగీక రించబడినట్లు, బహు భర్తృత్వం సభ్య సమాజంనుంచి తొలగిపోతూ అక్కడక్కడ మాత్రమే దాని గుర్తులు కనపడుతున్నట్లు తలంచవచ్చు. మహాభారతంలో కూడ బహు భార్యాత్వం పలుచోట్ల కనపడుతున్నప్పటికీ బహు భర్తృత్వం మాత్రం ఒక్క ద్రౌపది విషయంలోనే పొడకడుతుంది.

**ధృతరాష్ట్రుని వివాహం:** మహాభారతం పరిశీలిస్తే భిన్న భిన్న వివాహ ప్రక్రియలు కనపడతాయి. స్మృతిగ్రంధాల్లో కనిపించే పద్ధతుల్లోనేకాక వివిధ రీతుల్లో స్త్రీ పురుష సంబంధాలు గోచరం అవుతాయి. వర్ణాంతర, అనులోమ, ప్రతిలోమ వివాహాలు, అతిమానుష మానుష సంబంధాలు పొడకడతాయి. అట్లాంటివి సకృత్తుగానే కనపడినా స్మృతిగ్రంథాలు పేర్కొన్న సంప్రదాయ పద్ధతులే బహుళంగా అనుసరించబడ్డాయి. అందునా ప్రాజాపత్యం, గాంధర్వం, రాక్షసం, గాంధర్వ రాక్షస

సమ్మేళనం కొంత ప్రచురంగా ఉన్నట్లు గోచరం అవుతుంది. స్వయంవర వివాహాలు, వాటిలో రాక్షస ప్రక్రియ సమ్మేళనం క్షత్రియ కులంలో బహుళాదరణ పొందినట్లు స్పష్టమవుతుంది.

ఈ నేపథ్యంలో గాంధారీ ధృతరాష్ట్రుల వివాహాన్ని గూర్చిన పరిశీలన అవసరం. ధృతరాష్ట్రుడు ఆరూఢయౌవనుడైన తరువాత భీష్ముడు అతడికి వివాహం చేయాలని సంకల్పించాడు. అప్పటికి ధృతరాష్ట్రుడు వేదవేదాంగాది విద్యలను అధ్యయనంచేసి రాజవిద్యలలో జితశ్రముడై కుమారాయిత శక్తిశాలి అయ్యాడు. రాజ్యాభిషిక్తుడై కురుసామ్రాజ్యాధిపతి అయ్యాడు. ఆ కాలంలో కురుసామ్రాజ్యం భీష్మాభిరక్షితమై నికృత్త విరోధి సమూహమై వర్ధిల్లుతుంది. అట్లాంటి రాజ్యానికి అధిపతి అయిన ధృతరాష్ట్రునకు కన్యనిచ్చి వివాహం చేయటానికి ఎందరో రాజన్యులు ఉత్సాహపడటం సహజమే. కాని ఉత్తమాంగాలైన కన్నులులేని జాత్యంధుడవటంచేత తమ కుమార్తెల నివ్వటానికి ఆలోచించి ఉంటారు. అందువల్లే భీష్ముడు తగిన వధువుకై స్వయంగా అన్వేషణ ప్రారంభించాడు.

ఆ ప్రయత్నంలో గాంధారరాజు సుబలుని కుమార్తె గాంధారి తగిన కన్య అని గ్రహించాడు. ధర్మశాస్త్రవేత్తలు ఉత్తమ వధువుల లక్షణాలుగా పేర్కొన్న అతిశయ రూపలావణ్య శీలాభిజాత్యాది గుణాలు గాంధారిలో ఉన్నట్లు బ్రాహ్మణుల వల్ల తెలిసింది. కురువంశ వివర్ధనమే లక్ష్యంగాగల భీష్ముడు, తన లక్ష్యసాధన గాంధారివల్ల అవుతుంది అన్న ప్రగాఢ విశ్వాసంతో ఉన్నాడు. అంతేగాక గాంధారపతి తమతో సంబంధానికి తగినవాడనే నిశ్చయంతో ధృతరాష్ట్రునకు గాంధారిని ఇచ్చి వివాహం చేయాలని నిర్ణయించాడు.

ఆ విధంగా నిశ్చయించి సుబలుని వద్దకు తగిన వృద్ధులను పంపించాడు. భీష్ముని అభీష్టాన్ని విన్న సుబలుడు సంతసించి "కురుకుల విస్తారకుండయిన ధృతరాష్ట్రుండ యిక్కన్యకకు నర్హుండు గావున నా రాజునకు గాంధారి నిచ్చితి" (ఆది. 5-10) అని తన సంపూర్ణాంగీకారాన్ని వ్యక్తం చేశాడు. సంస్కృత భారతంలో వరుడు సర్వలక్షణ సమన్వితుడు సమస్త విద్యలనభ్యసించినవాడు, కుల విస్తారకుడైనప్పటికీ అంధుడే అని సుబలుడు విచారించినట్లు కనపడుతుంది. "అచక్షురితి తత్రాసీత్ సుబలస్య విచారణా"[17] అని మూలంలో ఉండగా

"అంగములలోన మేలుత్తమాంగమందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టికన్నులు లేవనుటంతెకాక
యుత్తముడుగాడె సద్గుణ యుక్తినతడు (ఆది. 5-11)

అని అతని బంధుజనులు తలచి సద్గుణాలచేత అర్హుడని వరుని లోపాన్ని సమర్థించినట్లు నన్నయ మార్చాడు. స్మృతిగ్రంధాలు కూడ ఉన్మత్తుడు, పతితుడు, కుష్ఠరోగ పీడితుడు, షండుడు, చక్షుశ్రోత్ర విహీనుడు, అపస్మారు దూషితుడు, ఉత్తమ వరుడుకాదని చెప్పిన అంశాన్ని పి. వి. కాణే ఉట్టంకించారు.[18] అందువల్ల సర్వ లక్షణ శోభితయైన తన పుత్రికను అంధునకు ఇవ్వవలసి వచ్చిందే అని సుబలుడు కొంత ఆలోచనలో పడి ఉంటాడు. కాని ఉత్తమ కులం, ప్రఖ్యాతి, బుద్ధి వికాసం మొదలైన వాటిని పర్యాలోచించి వరుని దృష్టి లోపాన్ని సరిపెట్టుకొని ఉంటాడు.

కన్యను ఇవ్వటానికి తండ్రే పునరాలోచనకు లోనైనప్పుడు ఆ కన్య సంపూర్ణాభీష్టంతో వరుణ్ణి భర్తగా స్వీకరించటం సాధ్యం కాదు. ఆ కారణంగా తిరస్కరించినట్లయితే కురుసామ్రాజ్యాధిపతి ధృతరాష్ట్రుని వ్యక్తిత్వానికి, కుటుంబ గౌరవానికి, కురుసామ్రాజ్య ప్రాభవానికి వెలితి ఏర్పడుతుంది. అందువల్లే నన్నయగారు మూలంలో సుబలుడు విచారించినట్లున్న సందర్భాన్ని బంధుజనులు బాధపడినట్లు చెప్పిఉండవచ్చు. ఇట్లాంటి శుభకార్య సమయాలలో ఆత్మబంధువులు తలకొకమాట అనుకోవటం తెలుగునాట ఇప్పటికీ చూస్తూనే ఉన్నాం. సుబలుడు ధృతరాష్ట్రుని అంధత్వాన్ని దృష్టిలో పెట్టుకొని తిరస్కరిద్దామని అనుకొన్నా, విచిత్రవీర్యుని వివాహంనాటి సంఘటనలు, భీష్ముని పరాక్రమం, కురుసామ్రాజ్యౌన్నత్యం అతడికి గుర్తుండే ఉంటాయి. అందువల్లే తిరస్కరించ లేకపోయాడు. సంస్కృత భారతంలోని సుబలుని మనసులో ఉన్న ఈ ఉపేక్షాభావాన్ని వెలికి రానివ్వి, సమర్థన చెప్పి ధృతరాష్ట్రుని వ్యక్తిత్వానికి మచ్చతెచ్చేకంటే అతడు హృదయపూర్వకంగా కన్య నీయటానికి అంగీకరించినట్లు చెపితే ఇరువంశాలవారి గౌరవం ఇనుమడిస్తుందనే అభిప్రాయంతో నన్నయ మూలానికి మెరుగుదిద్ది ఉంటాడు.

మొత్తంమీద ధృతరాష్ట్రుని అంధత్వం విషయంలో అంతఃపురంలోని వారి మనస్సులలో కొంత ఆలోచన చోటుచేసుకొన్నట్లు తెలుస్తుంది. కాని ధృతరాష్ట్రిడు

కన్నులొక్కటే లేనివాడు కాని సుందరుడు, గుణవంతుడు, బలవంతుడు. కనక వరించటానికి కావలసిన ఉత్తమ వరుని లక్షణాలన్నీ అతనికి ఉన్నాయి. ఈ విషయాన్ని గ్రహించి పుట్టింటి క్షేమం కోరి గాంధారి తండ్రి అభీష్టం గ్రహించింది కనుక "పితృవచన దత్తగా దన్ను నిశ్చయించి నాకు బతినిమ్మహీపతియగాని నొరుల నొల్లను" (ఆది. 5-12) అని ఒక జాత్యంధునకు ఇల్లాలు కావటానికి అంగీకరించింది. ఇది గాంధారి త్యాగనిరతికి నిదర్శనంగా చెప్పవచ్చు. విల్లి రచించిన తమిళ భారతంలో గాంధారి అరుంధతితో పోల్చబడినట్లు వి. ఎస్. రాఘవన్‌గారి పరిశీలన.[19] తండ్రి అంగీకారమైన తరువాత గాంధారి సహోదరుడైన శకుని ఆమెను మహావిభూతితో హస్తినాపురం తీసుకొని వచ్చాడు. కురుప్రముఖుల సాన్నిధ్యంలో ధృతరాష్ట్రుడు గాంధారిని వైభవోపేతంగా పరమోత్సవంతో వివాహం చేసుకొన్నాడు.

ధర్మశాస్త్రాలలో నిర్దేశించిన అష్ట విధ వివాహ పద్ధతులలో గాంధారీ ధృతరాష్ట్రుల వివాహం ఏ ప్రక్రియకు అనుగుణంగా జరిగిందో పరిశీలించటం అవసరం. క్షత్రియులకు ఆసుర, గాంధర్వ, పైశాచ, రాక్షస వివాహ పద్ధతులు తగినవని, అందునా రాక్షస పద్ధతి వివాహం ప్రశస్తమనీ, శాస్త్రకారులు నిర్దేశించిన విషయం పూర్వోక్తం. రాక్షస పద్ధతిలో కన్య బంధువులను, సంబంధీకులను జయించి వరుడు కన్యను ఎత్తుకొనిపోవటం ప్రధానాంశం. ధృతరాష్ట్రుని వివాహంలో రాక్షస పద్ధతికి స్థానంలేదు. గాంధారీ ధృతరాష్ట్రులు వివాహానికి పూర్వమే మనసు ఇచ్చిపుచ్చుకొని వివాహానికి స్వయంనిర్ణయం చేసుకొన్నవారు కాదు కనుక గాంధర్వ విధి అనటానికి వీటులేదు. వీరి వివాహంలో పైశాచిక విధికి కూడ అవకాశం లేదు. కన్య సంబంధీకులైన గాంధారరాజుకు ధృతరాష్ట్రుని పక్షంవారు ధనరాసులిచ్చి గాంధారిని గ్రహించలేదు. కనుక ఆసుర పద్ధతి అనటానికి వీలులేదు. అంటే స్మృతికారులు క్షత్రియులకు నిర్దేశించిన వివాహ విధానాలేవీ గాంధారీ ధృతరాష్ట్రుల వివాహ విధానానికి పొసగటంలేదు.

క్షత్రియులకు నిర్దేశించక పోయినప్పటికీ ప్రాజాపత్యలక్షణం ధృతరాష్ట్రుని వివాహానికి సరిపోలుతున్నట్లు పరిశీలనవల్ల తెలుస్తుంది. మనుస్మృతి ప్రాజాపత్య వివాహాన్ని గూర్చి

"సహనౌ చరతాం ధర్మమితివాచా ఒనుభాష్యచ
కన్యాప్రదాన యభ్యర్చ్య ప్రాజాపత్యో విధిఃస్మృతః"[20]

అని వివరించింది. సభాస్థలంలో వధూవరులిద్దరు ధర్మచారులమై సంచరిస్తామని చెప్పించి వస్త్రాలంకారాల నొందించి కన్యాదానం చేయటం ప్రాజాపత్యమని మను స్మృతికారుని అభిప్రాయం. బ్రాహ్మదైవ వివాహ పద్ధతుల్లో కన్య తండ్రి వరాన్వేషణ చేస్తాడు ప్రాజాపత్యంలో వరుని సంబంధీకులు సలక్షణవతియైన కన్యకోసం అన్వేషిస్తారు. దైవ ఆర్ష పద్ధతుల్లో వరుడు వధువు తండ్రికి గోవులు, ధనం చెల్లించవలసి ఉంటుంది. ప్రాజాపత్యంలో వరుడు బహుమానాలు చెల్లించవలసిన అవసరంలేదు. కాని జీవితాంతం సహధర్మచారిణిగా చేసుకొని ధర్మార్థాలలో భార్యకు విధేయుడై ఉండేటట్లు శపథం చేయవలసి ఉంటుంది. బహు భార్యాత్వం ప్రబలంగా ఉన్న కాలంలో తన కుమార్తె ఏకపత్నీవ్రతుడైన భర్తతో సుఖజీవనాన్ని పొందాలనే ఉద్దేశంతో ఈ ఆంక్ష విధించి ఉంటారు. ఈ విషయం పరిశీలించిన చంచల్ కుమార్ ఘటర్జీ "It seems that the prajapatya form of Marriage come in to Vogue at a time when polygamy was the practice of society. So the guardians being anxious of the future of their daughters, tried to impose some conditions on the bridegroom with the intention that in case the groom takes a new wife, he will hesitate or Just think over it before doing that As a matter of fact we cannot even think of a marriage more ideal than the Prajapatya along with its condition"[21] అనే అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ పండితుని పరిశీలనను అనుగమిస్తూ హేరంబ ఛటర్జీశాస్త్రి ప్రాజాపత్య వివాహపద్ధతి ఏకపత్నీవ్రతస్థాపనకు చేసిన ప్రయత్నమే అంటూ "In the Prajapatya form we find a modest attempt to regulate the marriage as monogamous"[22] అనే అభిప్రాయానికి వచ్చారు. ప్రాజాపత్య విధిని వివాహమాడిన భార్యే జీవితాంతం భర్తను అనుగమిస్తూ యజ్ఞయాగాదులలో పాల్గొనే అర్హతను కలిగిఉంది. ఆనాటి సమాజం త్రికరణ శుద్ధిగా ఈ ఏర్పాటును అంగీకరించి ఉంటుంది అంటూ "Perhaps the salient features of the Prajapatya form, namely, association with the husband in religious rites and monogamy were regarded as generally acceptable conditions to all sections of the society"[23] అని ఛటర్జీశాస్త్రి అభిప్రాయపడ్డారు.

భీష్ముడు వరుడైన ధృతరాష్ట్రుని నిమిత్తం కన్యాన్వేషణ చేశాడు. ఇది ప్రాజాపత్య విధి ప్రథమ లక్షణం. ఆంధ్రమహాభారతంలో గాంధారి కాక నూటపది మంది భార్యలున్నారని చెప్తున్నప్పటికీ, అధికారిక కార్యక్రమాలన్నింటిలోను ధృతరాష్ట్రునితో గాంధారికే ప్రాధాన్యం లభించింది. సహధర్మచారిణియై జీవితాంతం చేదోడుగా ఉండి వానప్రస్థానికి కూడ భర్తతో గాంధారి వెళ్లింది. భర్తతో సహగమనం కావించి పతివ్రతాధర్మాన్ని నిర్వర్తించి స్త్రీలోకానికి ఆదర్శప్రాయం అయింది. గాంధారి ధృతరాష్ట్రునకు తగిన వధువు అని నిర్ణయించే సందర్భంలో ఆమె పుత్రవతి అయ్యేటట్లు శంకరుని వరంపొందిన విషయానికి భీష్ముడు ప్రాధాన్యమిచ్చాడు. ఈ సందర్భంలో 'Hindu Marriage past and present' అనే గ్రంథంలో కె. యస్. చటర్జీ వెలిబుచ్చిన "In the Prajapatya for the firs time in human history the concept of children as the only goal for Marriage must have originated"[24] అన్న అభిప్రాయాన్ని హేరంబ చటర్జీశాస్త్రి ఉదాహరించిన అంశం గమనించతగింది. వీటన్నింటినీ పరిశీలించిన మీదట ధృతరాష్ట్రునకు గాంధారితో అయిన వివాహం ప్రాజాపత్య విధి అని భావించటం సమంజసం.

**ధృతరాష్ట్రుని ఇతర వివాహాలు :** ధృతరాష్ట్రుడు గాంధారితో పాటు ఆమె సహోదరులు పదిమంది కన్యలను ఒకే లగ్నంలో వివాహం చేసుకొన్నట్లు, ఇంకా కులంరూపం శీలంగల కన్యలను నూరుమందిని పరిణయమాడినట్లు ఆంధ్రమహాభారతంలో ఉంది. నూటపదనొకండుగురు భార్యలున్నట్లు కనిపిస్తున్నప్పటికీ ధృతరాష్ట్రునకు సంబంధించిన సమస్త కార్యకలాపాల్లోను గాంధారి ఒక్కతే భార్యగా మనకు దర్శనమిస్తుంది.

ధృతరాష్ట్రుడు వీరందరిని వివాహం చేసుకొన్నాడా అనే అంశం ఆలోచించతగింది. వీరంతా ఈతని రాణులే అయితే భారతంలో ఏదో ఒక సందర్భంలో వారి ప్రసక్తి వచ్చి ఉండేది. వీరిలో కూడ గాంధారి తోబుట్టువులు మాత్రమే నామసంకేతాలతో పేర్కొనబడ్డారు కాని మిగిలిన నూరమంది నామరూపాలు మనకు తెలియవు. సంస్కృత భారతంలో ఒక్క గాంధారి తప్ప మిగిలిన వారి ఉనికి కనపడదు. మహాప్రస్థానిక పర్వంలో యుయుత్సుడు వైశ్యాపుత్రునిగా చెప్పబడ్డాడు కాని అతడి తల్లి పేరు మాత్రం కన్పించదు.

పేరుప్రతిష్ఠలు కలిగిన రాజవంశాల్లోని చక్రవర్తులతో సామంతులు, ఇంకా చిన్న వంశాలవారు సన్నిహిత సంబంధాలు కలుపుకోవటానికి తహతహలాడతారు. ఆ ప్రయత్నంలో తమ కుమార్తెలను వివాహంలో ఆ చక్రవర్తులకు సమర్పించటం ఒక సంప్రదాయంగా కనిపిస్తుంది. వీరంతా రాజాంతఃపుర స్త్రీలుగా పరిగణన పొందుతారు. వీరికి కలిగిన సంతానం రాజపుత్రులుగా గణనకెక్కుతారు. రాజ్యాధికారం వారసత్వం విషయంలో మాత్రం వీరికి ప్రాధాన్యం ఉండదు. ధృతరాష్ట్రుడు కురుసామ్రాజ్యాధిపతి, బలవన్నాగాయుత బలసంపన్నుడు కావటంచేత దేశదేశాల రాజులు కొందరు తమ కుమార్తెలను వివాహంలో అతడికి ఇచ్చినట్లు కల్పనచేసి నన్నయ సమకాలీన రాజలోకంలోని సంప్రదాయాన్ని మన్నించి ఉంటారేమో! సామంతులు తమ పుత్రికలను ధృతరాష్ట్రునకు సమర్పించారని చెప్పటం ద్వారా నన్నయ ఆ రాజు వ్యక్తిత్వాన్ని, గౌరవాన్ని పెంచటమేకాక అతడే కురుసామ్రాజ్యాధిపతి అనే అంశాన్ని స్థిరీకరించినట్లయింది. ఈ రెండంశాలను మనసులో ఉంచుకొనే నన్నయ మూలానికి ఈ మార్పుచేసి ఉంటారని తలంచటం సమంజసం.


గ్రంథసూచికలు :

1. Dr. Chenchal Kumar Chatterjee, Studies in the Rites and Rituals of Hindu Marriage in Ancient India; P. 4.
2. ఋగ్వేదము; X. 85. 42.
3. పైది, ఒకటి; పు. 19.
4. B. Malinowske. Encyclopadia Britanica; Vol. XIV. P. 950.
5. తాపీ ధర్మారావు, పెళ్ళి దాని పుట్టుపూర్వోత్తరాలు; పు. 61.
5. కోలాచలం శ్రీనివాసరావు, వివాహకట్టడములు; పు. 3.
7. శతపథ బ్రాహ్మణం; V. 2-1-10.
8. కొడాలి లక్ష్మీనారాయణ. వివాహముల చరిత్ర; పు. 33.
9. ఆప. ధ. సూ; II 5 - 11.

10. జై. గృ. సూ; 21-8.

11. భో. గృ. సూ; 1. 11-17.

12. మను. 3-21;

14. పైది. 3- 27-34.

14. పైది. 3-23.

15. పైది. 3-24.

16. పైది. 3-26.

17. సం. మ. భా; ఆది. 109-9 శ్లో.

18. P. V. Kane, History of Dharma Sastra; Vol II. Part I Chap. IX. P 4?1.

19. వి. ఎస్. రాఘవన్, తమిళాంధ్రభారతముల తులనాత్మక పరిశీలనము; పు. 99.

20. పైది; 12; 3-30.

21. పైది, ఒకటి; పు. 42.

22. Heramba Chatterjee Sastry, Studies in the Social Background of the forms of Marriage in Ancient India; Vol. II, P. 463.

23. పైది; పు. 488.

24. పైది; పు. 498.

# 1.4 దాంపత్యం

భార్యాభర్తల దాంపత్యమనేది జోడెద్దులు బండిలాగటం లాంటిదనటం లోకోక్తి. సదవగాహన, సౌశీల్యం, సామరస్యం, ఆత్మీయత, పరస్పర త్యాగం అనే అంశాలపై దాంపత్యసుఖం ఆధారపడి ఉంటుంది. భర్తకు హితం కూర్చే స్త్రీలు స్వర్గాన్ని జయిస్తారు అంటూ "భర్తృహితేయతమానా స్వర్గం లోకం జయేరన్"[1] అని బోధాయన ధర్మసూత్రం. అట్లాగే భర్తకూడ తన సర్వస్వమును భార్యకు అంకితం చేయాలంటూ కొడాలి లక్ష్మీనారాయణ "భగవంతుడు మానవునకిచ్చిన వరములలో నతి ముఖ్యమైనది ఉత్తమమైన, పవిత్రమైన భార్య నొసంగుటయే. ఈమెతో నాయన ప్రశాంత జీవనము గడపవచ్చును. అతనియొక్క సర్వస్వమును, అతని ప్రాణమును, సంక్షేమము నామెకు సమర్పించవచ్చును"[2] అని వెలిబుచ్చిన అభిప్రాయం ప్రశంసార్హం. భార్యాభర్తల్లో ఒకరివల్ల లోపాలున్నా రెండవవారు సర్దుబాటు ధోరణి అవలంబించి అనుసరిస్తే వారి జీవితం సుఖమయమవుతుంది. ఈ సర్దుబాటు సదవగాహననే మనుస్మృతి

సంతుష్టోభార్యయా భర్తా భర్త్రా భార్యాతథైవచ
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్రవై ధ్రువం"[3]

అని కొనియాడి, అది కులానికే కల్యాణ ప్రదమవుతుందని ఆకాంక్ష వెల్లడించింది. భార్య భర్త శరీరంలో, జీవితంలో అర్ధభాగంగా మిళితమవుతుందని ప్రాచీనుల భావన. మహాభారతం కూడ "భార్య పురుషునందర్ధంబు, పురుషుండు భార్యయందు ప్రవేశించి గర్భంబునఁ బుత్రుండై తాన యుద్భవిల్లు" (ఆది. 4-86) అనిచెప్పి దాంపత్యంలోని ఉన్నత ప్రమాణాలను వ్యక్తం చేసింది.

అట్లాకాక భార్యాభర్తలు దురభిమానాలకులోనై ఎవరి స్వంతాభిప్రాయాల్ని వారు కలిగి వాటినే రెండవవారు అనుసరించాలని పట్టుబడితే కాడికుదరని జోడెద్దుల బండి ప్రయాణంగా ఉంటుందే కాని ఆ సంసారం సుఖమయం కాదు. సామాన్యుల జీవితాలు ఎక్కువగా వారివరకే పరిమితం. కాకపోతే తమ సంబంధిత బంధువర్గానికి మాత్రమే పరిమితం అవుతుంది. కాని రాజవంశాల్లోని వారిజీవితాలు, వారి సుఖసంతోషాలు, కష్టనష్టాలు వారితోపాటు దేశ భవిష్యత్తు, ప్రజాశ్రేయస్సుపై కూడా ప్రభావం చూపిస్తాయి. రాజక్షేమమే ప్రజాక్షేమం, ప్రజలు సుఖంగా ఉంటే రాజు క్షేమంగా

ఉంటాడనేది ప్రాచీనసూక్తి. అనుకూలవతియై యజ్ఞయాగాది అతిథ్యభ్యాగత పూజాది ధర్మకార్యాల్లో భర్తననుసరిస్తూ ప్రజాశ్రేయస్సుకూ, దేశక్షేమానికీ దోహదం చేసే భార్య లభించటం సహజంగా ఏ రాజుకైనా అది అతని అదృష్టం అని చెప్పవచ్చు.

ఆధునిక యుగంలో స్త్రీకిగల భావ స్వాతంత్ర్యం ప్రాచీన కాలంలోని స్త్రీలు అనుభవించినట్లు లేదు. వివాహానంతరం స్త్రీకి పతిసేవ, పతిమాటే ప్రధానం కాని ఇతరమేమీ కాదని ధర్మశాస్త్రాలు వక్కాణించాయి. స్త్రీలకు 'వివాహవిధియే వైదిక సంస్కారమగు ఉపనయనము, పతిసేవయే గురుకులవాస వేదాధ్యయనము, గృహకృత్యమే అగ్ని పరిచర్య'[4] అని మనుస్మృతి. వసిష్ఠ ధర్మసూత్రం కూడ 'స్త్రీకి పతిలోకమును మించిన లోకము లేదు. పతి శుశ్రూష వల్ల స్వర్గము సిద్ధిస్తుంది. పతికి అప్రియము చేయు భార్యకు ఏ లోకము లభించదు. కనుక భార్య పతికి అప్రియము చేయరాదు'[5] అని స్త్రీ పరాధీనతను స్పష్టం చేసింది. మహాభారతాన్ని పరిశీలిస్తే ద్రౌపది, కొంతవరకు కుంతి తప్ప మిగిలిన స్త్రీలందరు తండ్రిచాటు బిడ్డలు, భర్తచాటు భార్యలుగా పురుషాధీనలై ఉన్నట్లు తెలుస్తుంది. ఈ సంప్రదాయ నేపథ్యంలో గాంధారి ధృతరాష్ట్రుల దాంపత్యజీవితాన్ని పరిశీలించటం ప్రస్తుతాంశం.

**గాంధారి త్యాగం :-** గాంధారీ ధృతరాష్ట్రుల వివాహం ప్రాజాపత్య విధిని జరిగిందనేది పూర్వోక్త విషయం. ధృతరాష్ట్రుడు అంధుడని తెలిసికూడ వంశము, ప్రతిష్ఠ తలచి సుబలుడు గాంధారిని అతనికిచ్చి వివాహం చేయటానికి అంగీకరించాడు. "వ్యాసుడు చేసిన వివాహములలో ఇదియొక విధమైన బలాత్కార వివాహము"[6] అని వి. ఎస్. రాఘవన్ అభిప్రాయం. అయినా భారతాన్ని పరిశీలిస్తే ఈ అభిప్రాయానికి ఆధారం కనిపించదు. కురుసార్వభౌముడు ధృతరాష్ట్రునకు తన నిచ్చి వివాహం చేయాలని నిశ్చయించిన తండ్రి ఆలోచనను గ్రహించిన గాంధారి పితృవచన దత్తగా అతడికి తనను సమర్పించుకొన్నది. భర్త జాత్యంధుడు కనుక "పరపురుష సందర్శనంబు పరిహరించి తన పతి కనుగుణంబుగా నేత్రపట్టంబు గట్టికొని" (ఆది. 5-12) త్రికరణశుద్ధిగా పతిని అనుసరించ పూనుకొన్నది. పతివ్రతా ధర్మాన్ని నిర్వహించి ఆజన్మాంతం భర్తృ సహధర్మచారిణియై ఉండేందుకు గాంధారి నిర్ణయం తీసుకొన్నట్లు భారతంలో ఉంది. ఈ కఠోర నియమం ఆమె స్వచ్ఛందంగా, సంపూర్ణాంగీకారంతో తీసుకొన్నట్లే కనపడుతుంది. ఈ సందర్భంలో గాంధారి త్యాగనిరతిని కొనియాడుతూ సామి వెంకటాచలం శెట్టి "the act of

volentarily giving up one's sight is a sacrifice which can perhaps be hardly appreciated by Non-Indians, but it is a deprevation which cannot be sufficiently praised, as it is a symbol of the greatest sacrifice which a wife makes to be in perfect unison with her husband even in his physical deformities"[7] అని వెలిబుచ్చిన అభిప్రాయం పరిశీలించదగింది.

ఇరావతీకార్వే గాంధారీ ధృతరాష్ట్రుల దాంపత్య జీవితం దుర్భరంగా, వైమనస్యంతో సాగిందని చెప్పారు. గాంధారి అంధుడైన ధృతరాష్ట్రుణ్ణి మనసు లేకుండానే వివాహం చేసుకొందనీ, ఆమె అసంతృప్తికి నిదర్శనంగానే నేత్రపట్టం కట్టుకొందనీ, ఆశ్రమవాసంలో గాంధారీ ధృతరాష్ట్రులు మనసులువిప్పి మాట్లాడుకొనే సమయంలో ధృతరాష్ట్రుని సుదీర్ఘమైన ఉపన్యాసం ద్వారా ఇరావతీకార్వే వివరించారు. ధృతరాష్ట్రుడు జీవితంలో తానుపడ్డ సంఘర్షణను, అంధుడైన తన కారణంగా ఆమె జీవితం నాశనం అయిందనీ, అందుకు ప్రతీకారంగానే నేత్రపట్టం కట్టుకొన్నదనీ ఉద్వేగంతో అన్నాడు. పుత్రుడు కలిగినప్పుడు భర్తకోసం కాకపోయినా పుత్రుణ్ణి చూసుకోవటానికైనా గంతలు తీసివేయమని శాసిద్దామనుకొన్నాడు. కాని అప్పటికే అతని హృదయం పాషాణ సదృశమైంది. గాంధారి కన్నకొడుకు ముఖం చూడలేకపోయిందని అనుకొని ఒకరకంగా పగ తీర్చుకొంటున్నట్లు హాయిని అనుభవించాడు. చివరకు పుత్రప్రేమే తామిద్దరిని కొంత దగ్గరకు చేర్చిందనిచెబుతూ, కురువులపల్ల గాంధారి వంటి ఎందరో రాజకాంతలు ఇష్టంలేని దాంపత్యాలు చేయవలసి వచ్చిందని పశ్చాత్తాపం వ్యక్తం చేశాడు. అంబ కోపం మూలంగా భీష్ముడు నాశనమయ్యాడనీ, గాంధారి కోపం మూలంగా తాను మాడిపోయాడనీ, తన కొడుకులందరూ నాశనమైపోయారనీ ఎంతో ఉద్వేగంతో అన్నాడు. ఇప్పటికైనా తనను మన్నించి నేత్రం పట్టం తీసివేయవలసిందిగా అర్థించాడు. భర్త కోరికను మన్నించి గాంధారి నేత్రపట్టం తొలగించింది. కాని దీర్ఘకాలం అంధకారానికి అలవాటుపడ్డ కన్నులు వెలుగును స్వీకరించి ప్రకృతిని సందర్శించ లేకపోయాయి. కుంతి ఆసరాతో సంచరిస్తూ వెలుతురుకు క్రమంగా అలవాటై భర్తకు చేదోడుగా ఉంటే సమయం ఆసన్నమయ్యేసరికి దంపతులిరువురు దావాగ్నిలో దగ్ధులయ్యారు'.[8] ఇరావతీకార్వే వ్యక్తం చేసినట్లున్న ఈ అంశాలు సంస్కృతాంధ్ర భారతాలు రెండింటిలోను గోచరంకావు. ఇవి ఆమె స్వంత అభిప్రాయాలే లేక ఏ భాషా భారతాల్లోనైనా

ఉన్నాయేమో పరిశీలించవలసిన అంశం. ఇతరత్రా ఏ గ్రంథంలోను లేకుండ ఆమె స్వంతభావాలే అయితే, అవి కార్యకారణ సంబద్ధంగా ఉండటం అవసరం. అయితే వారి దాంపత్య జీవితాన్ని గూర్చి ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాలకు హేతువులేమీ చెప్పలేదు. అందువల్ల ఈ అంశంలో మూలభారతానికి భిన్నంగా ఇరావతీకార్వే వెల్లడించిన అభిప్రాయాలు ఆమోదయోగ్యాలుగా కనిపించవు.

ఈ సందర్భంలో మనకు కూడ ఒక ప్రశ్న ఉదయించవచ్చు. గాంధారి నిజంగా పతిభక్తి పరాయణయై, పతివ్రతాతిలకమై, సహధర్మచారిణియై భర్తను అనుసరించేదే అయితే కనులులేని భర్తకు తానే కనులై ప్రవర్తించి చేదోడు వాదోడుగా ఉంటూ సేవలు చేయటానికి బదులు ఆ భర్తనే చూడటానికి వీలులేకుండా బలవంతపు అంధత్వాన్ని పొందటంలో ప్రయోజనం ఏమిటి ? అనేది ఆ ప్రశ్న. గ్రుడ్డివాడైన భర్తను చూడటానికి ఇష్టంలేకనే అంధత్వాన్ని కొని తెచ్చుకొన్నదేమో అనే అనుమానం రావచ్చు. అది కేవలం అనుమానమే. గ్రుడ్డివాడైన భర్తకు సేవ చేయవలసిన బాధ్యత ఆమెకు తప్పకుండా ఉంది. భర్తపై ఇష్టం లేకుండానే బలవంతపు అంధత్వాన్ని కొని తెచ్చుకొన్నట్లయితే కనీసం పుత్రవ్యామోహమైనా ఆమెను ప్రలోభపెట్టి, సంతానం కలిగిన తరువాత వారిని చూసుకోవటానికైనా ఆ అంధత్వం వదిలి వేసేటట్లుగా చేసి ఉండేది. స్త్రీకి మాతృత్వం పొంది సంతానాన్ని కళ్లారా చూసుకోవటంకన్నా అధికమైనది ఏదీ ఉండదు. కడుపుతీపి అట్లాంటిది. గాంధారి కుమారులను చూడటానికి కూడ నేత్రపట్టం తొలగించలేదు. భర్తను చూడటం ఇష్టంలేకనే నేత్రపట్టం తొలగించలేదనుకొంటే, సంతానాన్ని చూడటం కూడ ఆమెకు ఇష్టంలేదని అనుకోవలసి ఉంటుంది. గాంధారి హృదయం అంత పాషాణకర్కశమని అనలేము. స్త్రీ పర్వంలో మరణించిన కుమారుల కోసం పరితపించి విలపించే గాంధారిలో మూర్తీభవించిన మాతృత్వాన్ని చూడగలం. దుర్యోధనుని కళేబరం సమీపించినప్పుడు గాంధారి "యిలద్రెళ్లెనటికిన యనటి క్రియన్ జిత్తమవశం" (స్త్రీ. 2-25) కాగా మూర్ఛలో మునిగింది. కనుక గాంధారి ధృతరాష్ట్రుని ఎడ పైమనస్యంతోను, అయిష్టంతోను కాక భర్తతోడిదే లోకంగా భావించి సహధర్మచారిణియై భర్త చూడలేని లోకం తానుకూడ చూడటం ఇష్టంలేకనే కృత్రిమ అంధత్వాన్ని ఒక నియమంగా పెట్టుకొన్నది. ఆమె పాతివ్రత్య దీక్షలో ఈ నియమం ఒక కఠోర పరీక్ష. జీవితాంతం ఈ పరీక్షకు నిలిచి బిడ్డల్ని

చూసుకోవాలనే ఆవేదన దహించినా సహించి భర్తతో సహగమనం కావించి మరణంలో కూడ భర్తను అనుసరించిన ఉత్తమ ఇల్లాలై వర్ధిల్లింది.

**పరిమిత ప్రాధాన్యం :** మహాభారతంలో గాంధారి ధృతరాష్ట్రుని అర్ధాంగిగా పరిమిత ప్రాముఖ్యాన్ని మాత్రమే పొందినట్లు తెలుసుకోవచ్చు. ప్రధానమైన సామాజిక కార్యక్రమాలన్నింటిలోను ఆమె భర్తతో పాల్గొన్నది. పాండురాజు దిగ్విజయం చేసిన తరువాత ధృతరాష్ట్రుడు చేసిన యజ్ఞాలలో గాంధారి ప్రక్కన ఉన్నట్లు భారతంలో లేదు. కాని భార్యలేకుండా యజ్ఞం చేయటం సాధ్యంకాదు కనుక భార్యతో కలిసే అన్ని యజ్ఞాలలో అతడు పాల్గొన్నట్లు తలంచవచ్చు. పాండవులు శతశృంగం నుంచి వచ్చినప్పుడు సౌహార్దంగా ధృతరాష్ట్రుడు గాంధారితో కలిసే కుమారులను ఆహ్వానించాడు. సోదరుని మరణానికి విలపించేటప్పుడు కూడ గాంధారి ప్రక్కనే ఉంది. కుమారాస్త్ర ప్రదర్శన సమయంలో అంతఃపుర కాంతలతోపాటు పట్టమహిషి గాంధారి కుంతీసహితయై వచ్చింది. పాండవులు వారణావతం వెళ్లేముందు ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రులిద్దరి వద్ద సెలవు తీసుకొన్నాడు. లాక్షాగృహంలో పాండవులు మరణించారని ఆవలచినట్లరచి విలపించిన ధృతరాష్ట్రునితో కలిసి తానుకూడ శోకించింది. కొన్ని ప్రధాన ఘట్టాలలో భర్తతో కలిసి గాంధారి కనిపించదు. ధర్మరాజు నిర్వహించిన రాజసూయ యాగానికి ఈమె వచ్చినట్లు లేదు. అట్లాగే దుర్యోధనుని వైష్ణవ యాగ సమయంలో కూడ గాంధారి కనిపించక పోవటం విశేషంగానే ఉంది. ఈ రెండు సన్నివేశాలు ప్రాముఖ్యం వహించినవే. పాండవులు ద్యూతవిజితులై సమయ పాలనకై అరణ్యానికి పోయే సందర్భంలో కూడ ధృతరాష్ట్రునితో కలిసి కనిపించదు.

ధృతరాష్ట్రుడు ప్రధానమైన కొన్ని నిర్ణయాలు చేసేటప్పుడు భార్యగా గాంధారికి ప్రాధాన్యం ఇచ్చినట్లు లేదు. జీవిత భాగస్వామిగా ఆమె కొన్ని సన్నివేశాలలో నిర్లక్ష్యానికి గురి అయినట్లు తెలుస్తుంది. రాజకీయ పరమైన రహస్య సమాలోచనల్లో ధృతరాష్ట్రుడు భార్యకు ప్రమేయం కల్పించలేదు. పాండవులను వారణావతం పంపటానికి ముందు జరిగిన సమాలోచనల్లోగాని, ద్రౌపదీ స్వయంవరానంతరం పాండవులకు ద్రుపదునకు భేదం కలిగించే విషయం ఆలోచించటానికి జరిగిన సమావేశంలో కాని, ధర్మరాజును సుహృద్ద్యూతానికి ఆహ్వానించాలని నిశ్చయించిన సందర్భంలో కాని గాంధారి ప్రమేయంలేదు. రాజకీయ రహస్యకలాపాల్లోను

కొన్ని సామాజిక కార్యాలలోను పాల్గొనేందుకు ఆ కాలంలో స్త్రీలకు పరిపూర్ణ స్వాతంత్ర్యం లేకపోవటమే ఇందుకు కారణం అని తలంచవచ్చు.

ఆంధ్రమహాభారతంలో ధృతరాష్ట్రుడు కొన్ని విషయాల్లో సుయోధనుని ప్రభావానికి లోనైనవానివలె కనిపించి దురాలోచనతో కూడిన దుష్ట నిర్ణయాలు చేశాడు. ఆ నిర్ణయాలు సభామధ్యంలో అప్పుడప్పుడు ఆ రాజును చాలా ఇరుకున పెట్టాయి. సన్నిహితులు, హితులు తండ్రీకొడుకులను నిశితంగా విమర్శించేవారు. అలాంటి సందర్భాల్లో జరిగిన అనర్థంలో తన ప్రమేయంలేదని అందరూ అనుకొనేటట్లు భార్యను అడ్డంపెట్టుకొని తన ప్రతిష్ఠ దెబ్బతినకుండా ప్రయత్నించిన ఘట్టాలు కొన్ని కనిపిస్తాయి. సుహృద్ద్యూతంలో పాండవులు ఓడిపోయారు. సుయోధన ప్రేరితుడై దుశ్శాసనుడు ద్రౌపదిని అవమానించాడు. దీనితో కౌరవ సభలో ఉద్రిక్త వాతావరణం ఏర్పడుతుంది సభలోని వారంతా సపుత్రకుడైన ధృతరాష్ట్రుణ్ణి నిందిస్తున్నారు. గాంధారి తాను మెట్టిన కులానికి కుమారులకు ఆపదను శంకించింది. విదురునితో కలిసి భర్తనుచేరి విషయతీవ్రతను వివరించింది. ఈ సందర్భంలో మెట్టినింటి ప్రతిష్ఠ పరంగా గాంధారి అభిలాష, మాతృమూర్తిగా పుత్ర మమకారం, అత్తగారుగా సాటి స్త్రీ అవమానంఎడ సానుభూతి వ్యక్తమవుతాయి. ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాలిచ్చే నెపంతో యుధిష్ఠిరునకు ద్యూతనష్టమైన సామ్రాజ్యాన్ని ఇచ్చివేసి, అతడికి కోపోపశమనం కలిగేందుకు "ఏనుబుద్ధిలేక జూదం బుపేక్షించితి నల్పబుద్ధి సత్త్వుండయిన వృద్ధు నన్నును, మీ తల్లియయిన గాంధారినిం దలంచి దుర్యోధనాదులుసేసిన దుర్నయంబులు సేకొనకుండునది" (సభా. 2-267) అని తన బుద్ధిలేని తనాన్ని అంగీకరిస్తూ, పెదతల్లి ముఖంచూసి సుయోధనాదుల తప్పు మన్నించమని వేడుకొన్నాడు.

అనేక సందర్భాలలో గాంధారి భర్తను అనుసరించి ఉండి అతని మనోభీష్టానికి అనుగుణంగా ఫలితంతో సంబంధం లేకుండా ప్రవర్తించింది. పాండవుల వద్దకు రాయబారిగా వెళ్లివచ్చిన సంజయుడు ఏకాంతంలో ధృతరాష్ట్రుని తప్పిదాలను ఏకరువుపెట్టి నిందిస్తాడు. తనూజవశవర్తియైన ధృతరాష్ట్రుడు పాండవులను తన సుతుడు మర్దింపనోపునా! అని దురాశతో ప్రశ్నిస్తాడు. సమాధానంగా సంజయుడు వ్యాసుణ్ణి గాంధారిని పిలిపింపుము, వారి సమక్షంలో వినిపిస్తానని అంటాడు. సంజయుని మాటల్లో గాంధారి నీతిపరురాలు, ధర్మజ్ఞచిత్త అని తెలుస్తుంది. ఆమె

సచ్ఛీలవతి అని, భార్యగా భర్త తప్పిదాలను నిష్పక్షపాతంగా ఆలోచించగల శక్తి కలిగినదని అర్థం అవుతుంది. వారి సమక్షంలో సంజయుడు వంశ శ్రేయస్సుపరంగా చెప్పిన మాటల్లోని సత్యాన్ని గ్రహించి ధృతరాష్ట్రుడు కుమారునకు నీతిగరప ప్రయత్నించి విఫలుడవుతాడు. మాతృప్రేమ అయినా కుమారుణ్ణి శాంతికాముక మార్గంలో పెడుతుందేమోననే ఆశతో

"నీ తనూజుడు దుర్మాని నీతిబాహ్యుఁ
డుద్ధతుం డీసుమాని నా బుద్ధివినడు
వీడు సెడుగాక బ్రతుకంగలేడు సుమ్ము" (ఉ. 2-323)

అని పలికి, అతడికి బుద్ధిగరప వలసిందిగా కోరతాడు. ఈ సందర్భంలో 'నీ తనూజుడు' అనే ప్రయోగం ధృతరాష్ట్రుడు లోకంలో ఉన్న తండ్రులందరిలాగే ప్రవర్తించినట్లు చేసింది. కుమారులు వృద్ధిలోకివచ్చి సమాజంలో పేరు ప్రఖ్యాతులు పొందిన వారైతే తండ్రి 'ఎవరనుకున్నావు నా కొడుకు' అని మీసం మెలివేస్తాడు. సంఘ విద్రోహ కార్యకలాపాల్లో పాల్గొంటూ కుటుంబానికి మచ్చతెస్తుంటే 'నీ కొడుకు నిర్వాహకం చూశావా' అని భార్యతో ఇంటివద్ద ఫిర్యాదు చేస్తాడు. ఇక్కడ తిక్కన లోకవృత్త పరిశీలనం శ్లాఘించతగింది. గాంధారి భర్త అనుజ్ఞమేరకు పుత్రుని క్షేమంకోరి బుద్ధిగరప ప్రయత్నించింది. కాని సుయోధనుని మార్గం మరల్చ లేకపోయింది.

ఇట్లాంటిదే ఇంకొక సంఘటన. శ్రీకృష్ణుడు కౌరవసభకు పాండవ రాయబారిగా వచ్చాడు. పాండవులతో సంధి చేసుకొని శాంతియుత సహజీవనం సాగించమని కృష్ణుడు, ఇతరులు ఎన్నిచెప్పినా సుయోధనుడు పెడచెవిని పెట్టాడు. పైగా రాయబారినే బంధించే ప్రయత్నం చేశాడు. సభలోనివారంతా చలించిపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు దుష్టాత్ముడైన ఒక్కని త్యజించి కులాన్ని రక్షించటం సముచితం అని హెచ్చరిస్తాడు. తాను కంసుణ్ణి సంహరించి తండ్రిని యాదవ రాజ్యానికి అధిపతిని చేసిన విషయం గుర్తుకు తెచ్చి, కురువంశీయులు కూడ ఆ విధంగా సుయోధనుని బంధించటం ఉచితమని హితవు చెప్తాడు. అట్లా చేసినట్లయితే ఆపదలన్నీ తీరి కురుపాండవులకు క్షేమం కలుగుతుందని స్నేహంగా పలుకుతాడు. కృష్ణుని మాటలకు అంధరాజు అదిరిపడ్డాడు. కుమారుని ప్రాణాలకే

ముప్పు వచ్చేటప్పటికి అతడి ప్రాణం విలువ తెలిసివచ్చింది. అప్పటికి ధృతరాష్ట్రునకు ఆ కుమారుని తల్లి తప్ప వేరు మార్గాంతరం లేకపోయింది. భార్య గుణగణాలు ఆ అంధరాజుకు బాగా తెలుసు. వెంటనే

''బుద్ధిమంతురాలు బొందుగఁ బలుకంగ
నేర్చు వచ్చి కొడుకుఁ దేర్చిపోవుఁ
గాన వేగనీవు గాంధారిఁ దోడితెమ్ము'' (ఉ. 3-382)

అని విదురుణ్ణి పంపాడు. భర్త ఆజ్ఞానువర్తియై వచ్చిన గాంధారితో ఆ రాజు

''నీ తనూభవుడు దు
ర్వినయంబునఁ జనియె నిట్టి వెంగలిగలఁడే'' (ఉ. 3-384)

అని కుమారుని దుర్వినయాన్ని ఎత్తిచూపి సుయోధనునకు హితవు గరపవలసిందని వేడుకొన్నాడు. ఇదంతా చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్న చందంగా ఉంది. కుమారుని దుశ్చేష్టలన్నిటిని ఆశాపాశబద్ధుడై అంగీకరించి, అతడి ఉనికికి భంగం కలిగే సమయం ఆసన్నమయ్యేసరికి తన భార్య, కుమారుని తల్లి జ్ఞాపకం వచ్చింది. వేరు మార్గాంతరం లేక భార్యను ఆశ్రయించాడు. ఇప్పటికైనా ధృతరాష్ట్రుడు వ్యక్తి జీవితంలో భార్య విలువను, మాతృత్వపు విలువను గుర్తించాడు.

ఏ మాతృమూర్తి అయినా ఎల్లప్పుడు పుత్రుల శ్రేయస్సునే కోరుతుంది. గాంధారి కూడ అంతే. పుత్రవ్యామోహం కలిగిన దైనప్పటికి కుమారునకు కలగబోయే కష్టంలో భర్త బాధ్యత ఎంతో ఆమెకు బాగా తెలుసు. ఆలోచనలు చేసేటప్పుడు 'తండ్రి కొడుకు', ఆపద ముంచుకొని వచ్చినప్పుడు 'తల్లి కొడుకు' అనటం ఆమెకు కష్టం కలిగి ఉండవచ్చు. తల్లి చేలో మేస్తుంటే, దూడ గట్టున ఎలా మేస్తుంది అనే గ్రామీణ నానుడి మనకు తెలిసిందే. ముందుగా తండ్రి నీతిమార్గ వర్తనుడైతే, కుమారుడు అనుసరిస్తాడు. అందుకే కుమారునికంటె ముందు తండ్రికి కర్తవ్యం బోధించటం మంచిదనుకొన్నది. విషం ప్రాణాంతకమని తెలిసీ సేవించటం అవివేకం అంటూ

''నీ పుత్త్రు డవినీతుఁడగుట యెఱిఁగి
యెఱిఁగి వాని వశంబున నేలపోయె

దీవు పాండవులకు నేమి యిచ్చితేని
నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప చెపుము'' (ఉ. 3-386)

అని భర్తకు కర్తవ్యం ఉపదేశించింది. ఈ సందర్భంలో 'నీ తనూజుడు', 'అధిప' అనే పదాలను తిక్కన సాభిప్రాయంగా ప్రయోగించాడు. చక్రవర్తి అయినవాడు పుత్ర వ్యామోహానికి లోనై లోక హాని చేయటం సమంజసం కాదని, రాజైనవాడు తన సామ్రాజ్య భాగాలను ఎవరికి ఎంత దానంచేసినా అడిగే హక్కు, అధికారం కుమారునకు సైతం లేదని చక్కని ఉపదేశం చేసింది. 'కరణేషు మంత్రి' అనే ఆర్యోక్తికి అనుగుణంగా ఉంది గాంధారి ప్రవర్తన.

భర్తకు ఉపదేశం చేయటంతో ఆమె పని పూర్తికాలేదు. కుమారుని శ్రేయస్సు, క్షేమంకోరే మాతృమూర్తిగా విదురుణ్ణి పంపి కుమారుని పిలిపించింది. కుమారునకు "ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రమకుఁదెరువును నిజశక్తియు సహాయంబు గొలదియుఁ గులజన చిత్తప్రకారంబును బాండుపుత్రుల బలపరాక్రమంబులుఁ దెలియునట్లుగాఁ దెఱంగుబడం జెప్పి బుజ్జగించియు, గినిసియు ననేక విధంబుల" (ఉ. 3-388) హితవు ఉపదేశించింది. అయినా ఆ కుమారుడు వినలేదు. అది అతడి ప్రారబ్ధం. గాంధారి మాత్రం భార్యగా, మాతృమూర్తిగా తన అస్తిత్వాన్ని ప్రకటించిన ఘట్టాల్లో ఇది ఒక ప్రధానమైనది. గాంధారీ ధృతరాష్ట్రుల దాంపత్య జీవితంలో ఇది ఒక మరపురాని ఘట్టంగా పేర్కొనవచ్చు.

**గాంధారీ ధృతరాష్ట్రుల అనుబంధం :** దాంపత్య జీవితంలో భార్యాభర్తలిరువురకు ముదిమి సమీపించే సమయంలో వారి అనుబంధం గాఢతరం అవుతుంది. వయసు పొంగుతో శరీరంలో శక్తి ఉన్నంతకాలం దంపతులిద్దరూ కష్టపడి సంతానం శ్రేయస్సుకు పాటుపడుతూ వారినిలోకం పొగిడే విధంగా ఉన్నత దశకు చేరేటట్లు చూస్తారు. వివాహం ప్రధాన ప్రయోజనం కూడ ఇదే నన్న అంశం పూర్వోక్తం. ముదిమి సమీపించి శరీరంలో పటుత్వం తప్పిన సమయంలో కుటుంబ బాధ్యత కొడుకులపై ఉంచి సమాజంలో వారు ఉన్నత స్థితిలో కీర్తి ప్రతిష్ఠలు పొందుతుంటే చూసి ఆనందిస్తూ, హాయిగా కాలక్షేపంచేయటం నిజంగా దంపతుల అదృష్టమే అనాలి. ఆవయసులోనే ఐహిక వాంఛలపై వైముఖ్యం పొంది ఆముష్మికం వైపు సాగించే ప్రయాణంలో భార్యాభర్తలు ఆత్మీయంగా దగ్గర కావట

సహజం. ఆసమయంలోనే వారి జీవితంలో పరస్పర రాగానుభూతి, స్నేహ మాధుర్యం వెల్లివిరుస్తుంది. జీవితంలో అనుకొన్నవన్నీ సాధించి తనవారి నందరినీ తాను కోరిన రీతిలో తీర్చిదిద్దుకోవటం కన్నా ఏ తల్లీ తండ్రీ కోరుకునేది ఉండదు. ఇంతటి అదృష్టం లోకంలోని దంపతులందరినీ వరించదు. జీవితంలో మధురాను భూతుల కన్నా చేదునిజాల్ని నెమరు వేసుకోవటం కొందరివంతు అవుతుంది. ఆ సంస్మరణంలో భార్యా భర్తలు ఒకరిఎడ ఒకరు సానుభూతితో సన్నిహితం అవుతారు. జీవితంలోని అన్నిదశలలో కన్నా భర్తకు ముదిమిలోనే భార్య ఆసరా, అండ, తోడు ఎక్కువ అవసరం అని పెద్దల అనుభవం వల్ల తెలుస్తుంది.

గాంధారీ ధృతరాష్ట్రుల దాంపత్య జీవితంలో చరమదశ అత్యంత హృదయ విదారకంగా మనసున్న ప్రతివ్యక్తి సానుభూతికి పాత్రమయ్యేదిగా ఉంది. ఉత్తమ సంతానాన్ని పొందినా వారి వివర్ధనం కళ్లారా చూసే అదృష్టానికి ఈ దంపతులు నోచుకోలేక పోయారు. ధృతరాష్ట్రుడు కుమారుల శ్రేయస్సుకోసం, ఉజ్వల భవిష్యత్తునుకోరి లోకంలోని తండ్రులందరిలాగే పాటుపడ్డాడు. ఆ ప్రయత్నంలో పుత్ర వ్యామోహంతో కొన్ని సమయాల్లో అడ్డదారులు తొక్కటానికి ప్రయత్నించాడు. అవకాశంలభించినప్పుడు తండ్రీ కొడుకులకు హితవు చెప్పటానికి ధర్మపత్నిగా గాంధారి ప్రయత్నించింది. బుద్ధి కర్మానుసారిణి కనుక భీష్మాది కురు వృద్ధుల ప్రయత్నాలలాగానే గాంధారి హిత వాక్యాలుకూడ తండ్రీ కొడుకుల పరంగా బూడిదలో పోసిన పన్నీరులాగా వ్యర్థం అయ్యాయి. పర్యవసానంగా కురుక్షేత్ర సంగ్రామంలో వృద్ధరాజు కొడుకులందరను కోల్పోయి రెక్కలు తెగిన విహంగం లాగామిగిలాడు. పౌలికలనిలో మరణించిన కుమారులను తలచుకొని అనాథలాగా విలపించాడు. ఆసమయంలో ధృతరాష్ట్రుడు.

"ఎఱకలు విఱిగిన గరుడుని
తెఱఁగునఁ దేజంబు సెడిన దినకరుగతి నం
దఱిబంధులు దెగి విభవం
బఱి వెలువెలఁబాఱు చునికి యది బ్రతుకగునే" (స్త్రీ. 1-11)

అని జీవితాశనే కోల్పోయినట్లు దుఃఖించాడు కుమారుల ఐశ్వర్యాభివృద్ధిని, అభ్యున్నతిని కోరి ఎంత పాటు పడ్డాడో చివరకు అంత ఆశాభంగం కలిగింది,

తానొకటి తలిస్తే దైవం వేరొకటి తలచినట్లుగా ఆ వృద్ధరాజు తాను జీవించి ఉండగానే జరుగుతున్న పరిణామాలకు విలవిల్లాడి పోయాడు. అలాంటి హృదయ విదారకమైన సందర్భంలో మాతృమూర్తి గుండె చెఱువు అవుతున్నప్పటికీ ధర్మం ఉన్నచోట జయం ఉంటుందన్న తలపుతో గాంధారి భార్యగా భర్తను అంటిపెట్టుకొని ఉన్నది.

యుద్ధంలో మరణించిన కుమారులను తలచుకొని గాంధారి హృదయ విదారకంగా విలపించింది. మధ్య మధ్య మూర్ఛపోతూ తెలివి పొందుతూ పరి పరి విధాల పలవించింది. యుద్ధ ధర్మానికి విరుద్ధంగా భీముడు సుయోధనుని నాభి అధో భాగాన గదాఘాతంతో సంహరించటం, దుశ్శాసనుని రొమ్ము చీల్చి రుధిర పానం చేయటం జుగుప్సాకరమైన దుఃఖంతోపాటు కోపాన్ని కలిగించాయి. శ్రీకృష్ణ వ్యాసులసాంత్వన వాక్యాలు కూడ పూర్తిగా స్వస్థతను చేకూర్చలేక పోయాయి. అప్పుడు ఆమె భీమునితో

"అంధులకు నూత కోలగా నకట యొకని
నైన నిలుపక నూర్వురనదయవృత్తి
గ్రమింగితందెవ్వఁడేనియు మీకు నెగ్గు
లాచరింపనివాఁడు లేడయ్యెనయ్య" (స్త్రీ 1-170)

అని పలికిన మాటలు పాషాణ హృదయాన్ని సైతం కరగించి వేస్తాయి. ధృతరాష్ట్రుడు కూడ కృష్ణుడు, భీష్మద్రోణాది హితులు, జామదగ్న్యాది మునులు చెప్పిన బుద్ధులు 'దుర్బుద్ధినగుట బాటింపనైతి' అని పలవిస్తూ జీవితేచ్ఛ నశించిన వానిలాగ దుఃఖిస్తాడు. పురుషుడు కనక అతడు కొంత నిబ్బరించు కొన్నాడు. కాని ఒక దశలో గాంధారి నిబ్బరించుకోలేక దుఃఖోద్వేగంతో నరికిన అరటి బోదెలాగా మూర్ఛిల్లింది. పుత్రశోకంతో పొగులుతూ కూడ భర్తను గూర్చియే ఆమె చింతన. సమీపస్థుడైన అర్జునునితో యుద్ధంలో వీరమరణం చెందిన కుమారుల కన్న "ఉల్లంబు ధృతరాష్ట్రు దిక్కు లేమిఁదలచి పొక్కుచున్నె" (స్త్రీ 2-35) అని వాపోయింది. అనువ్రతయైన ఇంతటి ఉత్తమ ఇల్లాలిని ఇరావతీ కార్వే భర్త ఎడ వైమనస్యంతో కృత్రిమ అంధత్వాన్ని కొని తెచ్చుకొన్నదని చెప్పటం సమంజసంగా కన్పట్టదు. దుఃఖోద్వేగంతో ఆమెలో అసహనం పెల్లుబికింది. ఆమె దృష్టి కృష్ణునిపై

మళ్లింది. కుమారులు సమరానికి సిద్ధమయ్యే సమయంలో అడ్డపడ కలిగిన సామర్థ్యం ఉండికూడ ఉదాసీనత ప్రదర్శించినందుకు కృష్ణునిపై కోపోగ్దీపితయై, అప్పటికి సరిగ్గా ముప్పైఆరోఏట దిక్కులేని విధంగా అతడు మరణిస్తాడని, యాదవ స్త్రీలు తనవలె విలపిస్తారని ఘోరంగా శపించింది. దుఃఖోద్వేగం ఆమె వివేకాన్ని మ్రింగివేసింది.

యుద్ధ భూమిలో కుమారుల కళేబరాల దుస్థితిని చూసి ఆ దంపతుల హృదయాలు విషాద రోషాలతో దగ్ధం అయ్యాయి. ఆ విషాదాగ్ని జ్వాలల్లో పాండవులందరు దహించబడతారనే ఆందోళనతో శ్రీకృష్ణుడు ఆ వృద్ధదంపతులను సాంత్వనపరచే ప్రయత్నం చేస్తాడు. జరిగిన అనర్థంలో సుయోధనుని భాగమే అధికమని చెప్పి మాతృమూర్తిగా పాండవులను కనికరించ వలసిందని అర్థిస్తాడు. అంతటి విషాదంలో కూడ గాంధారి "అంధుడు దీనుడు వృద్ధునైన యీ, నృపునన యంగఁ బాండవులు నీవును యుక్తులుగారె" (శల్య. 2-373) అని భర్తను గూర్చిన ఆందోళన వ్యక్తంచేసి 'పయిచీర చెఱంగు మొగంబున నదిమికొని' ఏడ్చింది. భర్త పట్ల ఆమె అనువ్రత విధానం అలాంటిది. ఆమె తపః ప్రభావ మహిమ కృష్ణుని చేతనే పొగడ్త నందిందంటే ఆశక్తి పతివ్రతా ధర్మాన్ని అనుష్ఠించి ఉండటం వల్లనేనని తలంచవచ్చు. వృద్ధదంపతులు కుమారుల మరణానికి కారకులైన పాండుకుమారులను క్షమించలేక పోయారు. గాంధారి "ఉల్లంబు నిజతనూజుల మరణంబునకుం దాపంబునొంద" (స్త్రీ 1-150) ధర్మరాజును శపించ ప్రయత్నించింది. ఆమె తీక్షమైన చిట్టూర్పుతో పట్టా వృతమైన కన్నులలోని అగ్నికణాలు అనతుడైన ధర్మరాజు పదనఖాలను కందేటట్లుగా చేశాయి. ధృతరాష్ట్రుడు కూడ నమస్కరించేందుకు భీముడు దగ్గరకు రాగా అతణ్ణి తన బిగి కౌగిలిలో అంత మొందించ సన్నద్ధమయ్యాడు. పుత్రమమకారంతో కక్ష తీర్చుకొనే అంశంలో కూడ గాంధారి భర్తను అనుసరించింది. ఆ దంపతుల హృదయాక్రోశం ఈ సందర్భంలో మనం తెలుసుకోవచ్చు.

పుత్ర మరణ జనిత శోకావేశంలో ఉద్విగ్న మానసులై ప్రవర్తించిన గాంధారీ ధృతరాష్ట్రులు వ్యాసుడు, కృష్ణుని సమయోచిత బోధలవల్ల కొంతమేరకు స్వస్థులయ్యారు. కృష్ణుడు పాండవుల ఎడ ధృతరాష్ట్రుని అలసత్వాన్ని ఎత్తి చూపి "నీ యవినీతియుం గొడుకుల దుశ్చరిత్రంబును దలంచి శోక రోషంబులు

విడిచి శాంతుండవై యుండుము" (స్త్రీ 1-147) అని కర్తవ్యం ఉపదేశిస్తాడు. స్వస్థచిత్తుడైన ధృతరాష్ట్రుడు

"తెలిసితి నీమాటలఁ బు
త్రులదెస నెవ్వగలనెల్ల దొఱఁగి యనుజ పు
త్రుల నాకుఁ బ్రియమొనర్పం
గలవారుగ నడచువాఁడ గంసారాతీ" (స్త్రీ. 1-149)

అని పలికి పాండవులను అక్కున చేర్చుకొన్నాడు. అట్లాగే ధర్మ రాజును శపింప నుంకించిన గాంధారి కోపం ఉపశమించేటట్లు వ్యాసుడు బోధించగా ఆమె స్వస్థురాలై "యిక్కౌంతేయ వర్గంబు గొంతి పెట్టిట్ల నాకును భరింపవలదె" (స్త్రీ 1-154) అని పలికి మాతృహృదయాన్ని వ్యక్తంచేసింది. ఈ విధంగా దంపతులు జీవిత కఠోర సత్యాలను ఎదుర్కొని అనుభవించటం అలవరచు కొన్నారని తెలుస్తుంది.

కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు కురుసామ్రాజ్యానికి సామ్రాట్టుగా పట్టాభిషిక్తుడయ్యాడు. యుద్ధంలో పుత్రులందరను కోల్పోయిన ఆ వృద్ధదంపతులు ధర్మరాజు రక్షణలో జీవించక తప్పలేదు. ధర్మరాజు, సోదరులు, కోడండ్రు కూడ వారిని ఎంతో గౌరవ పురస్సరంగా పుత్రవియోగ జనిత దుఃఖం మరచే విధంగా సంభావించ సాగారు. అశ్వమేధయాగ సమయంలో ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రు లకే ప్రాధాన్యం ఇచ్చాడు. గాంధారీ ధృతరాష్ట్రుల అనుమతి పొంది కుంతీ సమ నుజ్ఞాతుడై అశ్వమేధమఖానికి ఉన్ముఖుడయ్యాడు. వారు గతం కొంతవరకు మరచి "అప్పాండవాగ్రజువలన నిజాత్మజు వలనికంటె నక్కురురాజు ప్రియం బందుచు" (ఆశ్రమ 1-16) కాలం గడపసాగారు కాని ఏకాంతంలో భీమసేనుడు మాత్రం గతాన్ని గుర్తుచేస్తూ ఆ ముసలి ప్రాణాల్ని ములుకుల్లాంటి మాటలతో క్షోభపెట్టే వాడు. అతడి మాటలకు వారి హృదయం భేదిల్లింది. వారిరువురు "కాలపర్యాయం బుగనికొని డెందంబులుగంద" (ఆశ్రమ1-20) చేసేది లేక నిస్సహాయులై కాలం గడుపుతున్నారు. ముదిమిలో పుత్రపౌత్ర సంతానంతో హాయిగా కాలం వెళ్ళబుచ్చ వలసిన సమయంలో ఆ దంపతుల కీస్థితి కడుదయనీయంగా పరిణమించింది. జీవితంపైనే విరక్తి జనించింది.

అట్లాంటి పరిస్థితుల్లోనే గాంధారీ ధృతరాష్ట్రులు పదిహేను సంవత్సరాలు ధర్మరాజు రక్షణలో గడిపారు. ధృతరాష్ట్రుడు వానప్రస్థ జీవితం గడిపేందుకు తపోవన గమనానికి దృఢంగా నిశ్చయించుకొని ధర్మరాజు అనుజ్ఞవేడాడు. దుర్యోధనునిపై మమకారంతో ఎందరు ఎన్ని చెప్పినా ఉత్తిపలకలేక పోయానని చెపుతూ "గాంధారి నన్ను దూఱి చెప్పెనమ్మాటలేఁబెడచెవుల నిడితి" (ఆశ్రమ 1-21) అని వాపోయాడు. భార్య పలుకుల్లోని సత్యాన్ని జీవిత చరమాంకంలో కాని అర్థంచేసుకోలేకపోయాడు. పెదతండ్రి కోరికను మన్నించలేక ధర్మరాజు ఎంతో బ్రతిమిలాడాడు. కాని దృఢనిశ్చయంతో ఉన్న ధృతరాష్ట్రుడు ధర్మరాజును ఒప్పించే భారం విదుర, కృప, సంజయులపై పెట్టాడు. అప్పటికే ముఖశోష తను గ్లాని కలిగి నాలుక తొట్రువడగ "డప్పిగదిరిన గాంధారి తనువున మేనుసేర్చి" (ఆశ్రమ 1-39) మూర్ఛిల్లాడు. ఎంతటి మహారాజునకు ఎంతటి దయనీయస్థితి! విధివక్రిస్తే ఎలాంటి వారికైనా ఇలాంటి స్థితి తప్పదు. ఈ సందర్భాన్ని లోకజ్ఞుడైన తిక్కన 'విధి యెవ్వరి హీనులఁజేయ డకటవక్రుండైనన్" (ఆశ్ర 1-40) అని ధర్మరాజుతో అనిపించి జీవిత సత్యాన్ని తెలిపాడు. అభ్యంతర మందిరంలో గాంధారి తపోవన ప్రయాణ సమయంగురించి భర్తను ప్రశ్నిస్తుంది. గాంధారి అనువ్రతాశీలానికిది మరొక ఉదాహరణ. ఆమె ప్రశ్నకు ధృతరాష్ట్రుడు చెప్పిన సమాధానంలో ఆ వృద్ధ రాజు పశ్చాత్తాపం, ఐహిక జీవితం పరంగా విరక్తి భావం ద్యోతకం అవుతుంది. భార్య ఏనాడో సమయజ్ఞతతో బోధించిన నీతివాక్యాల్ని వినక పుత్రవ్యామోహంతో బోధించిన నీతివాక్యాల్ని వినక పుత్రవ్యామోహంతో, రాజ్యలోభంతో పెడచెవిని పెట్టినందుకు అతని హృదయం పశ్చాత్తాపంతో కుమిలి పోతుంది. తన ఉదాసీనతయే ఇంతటి నాశనానికి కారణం అని తననేరాన్ని అంగీకరించి దోషిలాగా భార్య ఎదుట తల ఒగ్గుతున్నాడు. భర్తలో 'ఈ విధమైన భావపరిణామాన్ని తన సద్గుణాలతో సహధర్మ చారిణియై గాంధారిసాధించింది. భర్త జీవితంలో భార్యకున్న ప్రాధాన్యాన్ని భార్యభర్తల దాంపత్యంలోని ఆత్మీయతాను బంధాన్ని వివరించటానికి ఈ సన్నివేశం ఒక మచ్చుతునక. దీన్ని తీర్చిదిద్దిన తిక్కన కవిలోక పూజితుడు.

ధర్మరాజు అనుజ్ఞపొందిన గాంధారీ ధృతరాష్ట్రులు తపోవన గమనానికి అనుమతికై పౌరజనులను అర్థించారు. పౌరులంతా అశ్రుపిహిత దృష్టులై ఎలుగు గాద్గద్యం వహించగా వారి ప్రయాణానికి అనుమతించలేక విలపించారు. అప్పుడు ఆ వృద్ధరాజు గాంధారిని చూసియైనా అనుజ్ఞ ఇవ్వవలసిందని అర్థిస్తూ

"వృద్ధ కృపణ పుత్ర విరహిత గాంధారి
యీ నెలంతఁ జూచియైన మీర
లకట కాననమున కరుగుట మేలని
మాకనుజ్ఞ యిండు మాన్యులార" (ఆశ్రమ 1-92)

అని విన్నవించాడు. ధృతరాష్ట్రుని ఈ విన్నపంలో భార్యపై అతడి గౌరవాభిమానాలు, ప్రజాభిమానం వ్యక్తం అవుతున్నాయి. ఆ వృద్ధాప్యంలో ఏ భార్య అయినా ఇంతకన్నా కోరుకొనే దేముంటుంది. వృద్ధ పౌర జానపదుల అనుజ్ఞ కూడ పొంది ఆ దంపతులు వల్కలాజినాలు ధరించి తపోవనానికి ప్రయాణం అయ్యారు. సపర్యల నిమిత్తం కుంతికూడ వారితో పాటు ప్రయాణం అయింది.

తపోవనంలో ధృతరాష్ట్రుణ్ణి సందర్శించేందుకు ధర్మరాజు పరివార సమేతుడై వస్తాడు. ధర్మరాజుకు తమ తపస్సుసాగే విధానం వివరిస్తూ ఆ రాజు పలికిన

"వినుము గాంధారియు ననఘ చరిత్ర ద
పోనిష్ఠ కోర్చు నిమ్మాననీయ
మిము దలంచిన యప్డు మెచ్చి దీవించు" (ఆశ్రమ. 2-57)

అనే మాటలు గాంధారి ఎడ అతని ఆత్మీయత, జీవిత చరమయానంలో ఆ వృద్ధ దంపతుల అనుబంధాన్ని వ్యక్తం చేస్తున్నాయి. అట్లానే తనను సందర్శించిన వ్యాసునకు కుశలం తెలియచేస్తూ

"నన్ను, గాంధారిఁ బుత్రశోకం బొకింత
యేనియుఁ బొందంగనీడు" (ఆశ్రమ. 2-80)

అని అర్ధాంగిని మరచిపోకుండ ఆమె పుత్రశోకం మరచి కుశలంగానే ఉన్నదని చెప్పాడు. ఆ సందర్భంలోనే ధృతరాష్ట్రునకు మరణించిన కుమారుల ఉనికి తెలుసుకోవాలనే కోరిక కలిగింది. మరణించిన వారిని సందర్శింపచేయడం అద్భుతావహామే అయినా, గాంధారి భర్త కోరికను బలపరుస్తూ

"లోకంబులెన్ని, యన్నియు జూపంగనైనను జాలుదు
నిర్మల తపము పేర్మి నీవు
పుత్రుసాన్నిధ్య మీ భూపతి కొనరించు
టెంతటి పని నీకు..." (ఆశ్రమ. 2-90)

అని అతని అభ్యర్థనను మన్నించవలసిందిగా వ్యాసుణ్ణి ప్రార్థిస్తుంది. భర్త అనుజ్ఞ ఇచ్చి అభిప్రాయం వ్యక్తం చేయమన్నప్పుడు మాత్రమే గాంధారి పెదవి విప్పటం మనకు విదితపూర్వమే. అట్లాంటిది ఇప్పుడాతని మనోరథం తీర్చేందుకు ఎవరి ప్రోత్సాహం లేకుండానే వ్యాసుణ్ణి వేడుకొన్నది. ఐహికవాంఛల పరంగా వైముఖ్యం పొంది ఆముష్మికం వైపు ప్రయాణమయ్యే సమయంలో ఆ దంపతులు ఎంతో ఆత్మీయులయ్యారు.

అనంతరం కొంత కాలానికి ధృతరాష్ట్రుడు శతయూపుని ఆశ్రమంవదలి గంగాద్వార పరిసరారణ్యాలలో తపంచేయ పూనుకొన్నాడు. అతడు వాయుభక్షకుడై దుష్కర తపం చేస్తున్నాడు. ఈ అంశంలో కూడ గాంధారి భర్త ననుసరించి 'నీళ్ల నాహారకలన మోపి' తపంచేయ పూనుకొన్నది. ఆ సమయంలో అరణ్యంలో మహానలం రగిలింది. ధృతరాష్ట్రుడు స్థిరచిత్తంతో ప్రాఙ్ముఖుడై నేలపై కూర్చున్నాడు. మరణంలో కూడ భర్తనే అనుసరించదలచిన గాంధారి భర్తతోపాటు ఆసీన అయింది. ఆ కార్చిచ్చులో 'అక్కురు పుంగవుండు, భార్యయుఁ బాండుని పత్నియు సద్గతిన్' పొందారు. ఈ విధంగా గాంధారి మరణంలో కూడ అనువ్రతా శీలంతో భర్తకు సహధర్మచారిణి అయింది.

మొత్తం మీద గాంధారీ ధృతరాష్ట్రుల దాంపత్యం అందరి మానవ జీవితాల్లాగే చేదు తీపి కలయికతో, కష్టసుఖాల సమ్మేళనంగా జరిగినట్లు తలంచవచ్చు. జాత్యంధుడైన భర్తను పొంది భౌతికంగా మానసికంగా భర్తతో ఏకత్వం పొందేందుకు ప్రయత్నించి, ఆ యత్నంలో మాతృత్వంలోని లోభాన్ని కూడ అధిగమించి, మరణంలో కూడ భర్తనే అనుసరించిన త్యాగశీలి, పతివ్రతా శిరోమణియై గాంధారి వర్ధిల్లింది. భార్య ప్రాధాన్యాన్ని కొన్ని సందర్భాల్లో గుర్తించకపోయినా జీవిత చరమాంకంలో ఆమె విలువను గ్రహించి ఆత్మీయతాను బంధాల్ని పెంచుకొని ఆముష్మిక ప్రయాణంలో భార్యను సహచారిణిగా అనుగ్రహించిన ధృతరాష్ట్రుడు ధన్యజీవి.

## అధస్సూచికలు :

1. బోధాయన ధర్మసూత్రం: 2. 2-48
2. కొడాలి లక్ష్మీనారాయణ, వివాహముల చరిత్ర: పు. 40.
3. మనుస్మృతి: 3-60.
4. పైది: 2-67
5. వ. ధ. సూ: 21-14.
6. వి. ఎస్. రాఘవన్, తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము: పు. 99.
7. S Venkatachalam, Dhrita rashtra, Glory of Bharat Series I, P. 5
8. ఐరావతీకార్వే, యుగాంత: పు. 32-36.

# 1.5 సోదరానుబంధం

లోకంలో ఏక గర్భజనితులను సోదరులంటారు. ఈ సోదర శబ్దాన్ని తండ్రి ఒక్కరై, తల్లులు వేరయినప్పుడు కూడ రూఢ్యర్థంలో వాడుతున్నారు. గోత్ర సంబంధం కలిగిన వారినికూడ సోదర శబ్దంతోనే సంభావిస్తారు. ఒకవంశం అవిచ్ఛిన్నంగా సాగటానికి సోదరులే మూలాధారం. భారతీయ సంప్రదాయంలో వంశాభివృద్ధి పురుష సంతానంద్వారా జరగటమే ఇందుకు కారణం. ప్రాచీన సమాజంలో విస్తృతవ్యాప్తిలో ఉన్న అవిభక్తకుటుంబ వ్యవస్థలో సోదరులు పరస్పరాదరాభిమానాలతో కుటుంబంలో సమిష్టి బాధ్యతను స్వీకరించి వంశం సామాజికంగా, ఆర్థికంగా ప్రసిద్ధి చెందటానికి పాటుపడతారు. వెనుకటి రోజుల్లో పదిమంది ఉన్న కుటుంబమే అనుకూలమైందిగా భావించేవారు. 'ఒకకన్ను కన్నూకాదు, ఒక కొడుకు కొడుకూ కాదు' అనే నానుడి మనకు తెలిసిందే.

ప్రాచీన పురాణాల్లోను, సాహిత్యంలోను ఎందరో సోదరుల చరిత్రలు ఇతివృత్తాలయ్యాయి. ఈ సోదరుల్లో సజ్జనులు, దుర్జనులు రెండు రకాలవారు ఉన్నారు. వీరి కథలు సమాజంలోని వ్యక్తుల ప్రవర్తన, మనస్తత్వాలను ప్రతిబింబించేవేనని పండితులంగీకరించిన అంశం. ప్రాచీన గాథలు పేర్కొన్న సోదరులు కొందరిలో ఆత్మీయత, ఆరాధన, అగ్రజుని మాట జవదాటని భక్తిభావం కనిపిస్తుంది. కొందరు అనుజులు ప్రత్యర్థులుగా ఒకరినొకరు సాధించుకోవటం, కొన్ని సందర్భాలల్లో ఒకరి చేతిలో వేరొకరు చావటం జరుగుతుంది. ఇంకా కొందరు అభిప్రాయ భేదాలున్నప్పటికీ, వేరు వేరు వర్గాల్లో ఉన్నా చాకచక్యంగా లౌక్యంతో ఎంతో సన్నిహితులుగా ఉన్నట్లు ప్రవర్తిస్తారు. ఈ మూడు వర్గాల సోదరులు ఆధునిక కాలంలోకూడ కనిపిస్తుంటారు. అందునా మూడో వర్గంవారే అధికంగా దర్శనం ఇస్తున్నారు. ఆధునిక కాలంలో బాగా ప్రబలుతున్న వ్యక్తి భావనవల్ల సమిష్టిభావం సన్నగిల్లి ఆత్మీయతలు లోపిస్తున్నాయని సామాజిక పరిశీలకులుకూడ అభిప్రాయ పడుతున్నారు. సోదరులే అయినప్పటికీ బహిరంగంగా ఎంతో ప్రేమను, గౌరవాదరాలను వ్యక్తం చేసుకుంటూ చాపక్రింద నీరులా ప్రవర్తించే వారెందరో ఈనాడు సమాజంలో కనిపిస్తున్నారు. ఈ నేపథ్యంలో ధృతరాష్ట్రుని సోదరానుబంధాన్ని పరిశీలించటం ప్రస్తుతాంశం,

**ధృతరాష్ట్రుడు - పాండురాజు :** ధృతరాష్ట్ర పాండురాజులు విచిత్రవీర్యునకు ఔరససంతానం అయివుంటారన్న విషయం పూర్వోక్తం. కాశీ రాజు కుమార్తెలు అంబికాంబాలికలు వీరి మాతృమూర్తులు. అంబిక దాసివల్ల జన్మిం చిన విదురుడు, జన్మచేత హీన కులజుడైనా ధృతరాష్ట్రుని జీవితంలో సోదరునిగా ఎంతో ప్రాధాన్యం వహించాడు. ఈ సోదరులు ఏకోదరులు కాకపోయినా అన్యో న్యానురాగాలతో మెలిగారు. వివాహానంతరం విచిత్ర వీర్యుడు ఏడు సంవత్సరాలు మాత్రమే జీవించినట్లు సంస్కృతభారతంలో ఉండటంవల్ల ధృతరాష్ట్రపాండురాజులు ఊహతెలియని వయసులోనే పితృ విహీనులైనట్లు తలంచవచ్చు.

ముగ్గురు సోదరులలో పాండురాజు మధ్యవయసులోనే మరణించాడు. అందువల్ల ధృతరాష్ట్రునకు పాండురాజుతో ప్రత్యక్షానుబంధం పరిమితమనే చెప్పవలసి ఉంటుంది. విదురుడు మాత్రం ధృతరాష్ట్రుని జీవితాంతం సోదరుని జీవితంలో ప్రముఖపాత్రనే వహించినట్లు భారతాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

బాల్యమాదిగా ధృతరాష్ట్ర పాండురాజులు భీష్మాభిరక్షితులై పెరుగుతూ ఉపనయనానంతరం రాజవిద్యలలో అధ్యయనం చేసి జితశ్రములయ్యారు. భీష్ముని అనుశాసనంతో కురురాజ్యం సాటి రాజన్య లోకంలో ప్రసిద్ధి వహించింది. భీష్ముని కనుసన్నలలో పాండురాజు అగ్రజునకు అండగా నిలిచి రాజ్యరక్షణ భారం వహిం చాడు. సంస్కృత భారతంలో ధృతరాష్ట్రుడు జాత్యంధుడు కావటంచేత పాండురాజు కురుసామ్రాజ్యానికి ప్రభువైనట్లుగా కనిపిస్తుంది (సం. మ. భా, ఆది. సంభవ. ప: 109 అ. 25 శ్లో). నన్నయ ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి అయినట్లు, పాండు రాజు రాజ్యరక్షణ భారం వహించినట్లు చెప్పారు. ఏమైనా పాండురాజు జీవించినంత కాలం కురుసామ్రాజ్యాధిపతి ఎవరు? రాజ్యరక్షణ భారం వహించిందెవరు? అనే అంశంలో అనుమానాలకు తావులేకుండ ఈ సోదరులిద్దరూ సౌహార్దంగా ప్రేమాభి మానాలతో సహజీవనం సాగించారనేది అంగీకరించవలసిన అంశం.

భీష్ముని ఆధిపత్యంలోనే ఈ సోదరులకు వివాహాలు జరిగాయి. వివాహా నంతరం పాండురాజు అపార చతురంగబల సమేతుడై దిగ్విజయం చేసి నలుదిక్కుల కురుసామ్రాజ్య ప్రాభవాన్ని ప్రసరింపచేశాడు. యుద్ధాలలో జయించి తెచ్చిన కానుక లను పాండురాజు సోదరుని అనుమతితో భీష్మునకు, సత్యవతికి, అంబికాంబాలికలకు,

విదురునకు, సుహృజ్జనులకు, బ్రాహ్మణులకు సమర్పించి ఆశీర్వచనాలు పొందేవాడు. శత్రువులను జయించి సాధించిన సొత్తుపై పాండురాజు స్వామ్యం ప్రకటించుకొన్నా అడ్డగించేవారులేరు. తనంతతాను స్వేచ్ఛగా ఆ ధనాన్ని దానం చేసినా అడిగేవారు ఉండరు. కాని అగ్రజుడైన ధృతరాష్ట్రుని అనుమతి తీసుకొనే ఆ కార్యక్రమం నిర్వర్తించటంలో పాండురాజు భక్తి ప్రపత్తులు, వినయ విధేయతలు అన్నింటినీ మించి సోదరానుబంధం వ్యక్తం అవుతుంది. పాండురాజు దిగ్విజయం చేసి తెచ్చిన ధనరాసులతో సోదరునిచేత శతాశ్వమేధయాగాలు చేయించాడు. అతడు వినయ విధేయతలతో పూరు, భరత, కురుపతులతో తుల్యుడనే కీర్తిని బుధజనులవల్ల పొందాడు. ఈ సమయంలో ధృతరాష్ట్రి పాండురాజుల సోదరానుబంధం అదర్శ ప్రాయంగానే ఉంది.

వేట రాజులకొక వినోదం. కురుసామ్రాజ్యం శత్రుంజయమై సుభిక్షంగా ఉన్న రోజుల్లో పాండురాజు భార్యలతో కలిసి మృగయా వినోదార్థం అరణ్యాలకు ప్రయాణం అయ్యాడు. వేట నిమిత్తమై అరణ్యం ప్రవేశించిన పాండురాజుకు పరివారానికి ఏ మాత్రం క్లేశం కలగకుండ 'ఇష్టాన్నపాన మాల్యాను లేపన భూష ణాదులను' ధృతరాష్ట్రుడు ప్రతిరోజు రాజధానినుంచి పంపే ఏర్పాట్లు చేశాడు. అర ణ్యంలో సోదరునకు శ్రమతెలియకుండ చేయటంలో అన్న అకాంక్ష ఈ సందర్భంలో వ్యక్తం అవుతుంది.

ప్రత్యక్షంలో పరస్పరం ఆదరాభిమానాలను, ఆత్మీయతలను వ్యక్తం చేయటం సహజం. కాని కష్టకాలంలోను, వ్యక్తి పరోక్షంలో అనుసరించే విధానంలోనే వ్యక్తి ఆత్మీయతలతోపాటు అసలుస్వరూపం బహిర్గతం అవుతుంది. ప్రత్యక్షంలో ప్రేమ ఒలక బోసేవారు లెక్కకు మిక్కిలి ఉన్నా పరోక్షంలో ఆత్మీయతానుబంధం వ్యక్తం చేసేవారు చాలా అరుదుగా ఉంటారు. రక్తసంబంధీకులలో అయితే ఈ పరిస్థితి ఇంకా స్పష్టంగా అర్థమవుతుంది. వినోదార్థం వేటకు వెళ్లి కిందముని శాపోపహతుడైన పాండురాజునెడ సోదరునిగా ధృతరాష్ట్రుని ప్రవర్తన ప్రశ్నార్థకంగా మిగులుతుంది.

భార్యలతోకలిసి వినోదంలో తేలియాడే పాండురాజు కిందముని శాపానికి గురై వల్కలాజినాలు ధరించి వానప్రస్థ జీవితం గడప నిశ్చయిస్తాడు. ఈ నిర్ణ యానికి వచ్చిన పాండురాజు అమూల్యమైన ధనధాన్య రాసులను బ్రాహ్మణ శ్రేష్ఠులకు

దానంగా ఇచ్చి, మిగిలిన వస్తువులను, భృత్యవర్గాన్ని హస్తినాపురం పంపాడు. హస్తినాపురం తిరిగి వచ్చిన భృత్యవర్గం పాండురాజు శాపం, తదనంతర నిర్ణయం తప్పకుండ ధృతరాష్ట్రునకు తెలిపి ఉంటారు. తనకు కుడిభుజమై రాజ్యరక్షణ వ్యవహారంలో కనురెప్పగా వ్యవహరించే సోదరుని దురవస్థకు ఆ మహారాజు స్పందించినట్లు కనిపించలేదు. సమక్షంలో ఎంతో ఆప్యాయతానుబంధం పంచుకొనే సోదరుని ఎడ కష్టం కలిగినప్పుడు పరోక్షంలో ఈ విధమైన ఉదాసీనత ఆశ్చర్యం కలిగిస్తుంది.

పాండురాజు కుంతీదేవివల్ల ధర్మరాజును ప్రథమ పుత్రునిగా పొందుతాడు. కురువంశంలో ధృతరాష్ట్రుని తరంలో ప్రథమ సంతానం ఉదయించినందుకు ఎంతో సంతోషంతో అంతఃపురంలో ఉత్సవం చేయవలసింది. అప్పుడు పాండురాజుకు సోదరునిగా, ధర్మరాజుకు పెదతండ్రిగా ధృతరాష్ట్రుని ప్రతిష్ఠ ఇనుమడించేది. ధృతరాష్ట్రుని తమ్మునకు పుత్రోదయంలో గాంధారి గర్భతాడనం చేసుకొన్నట్లు భారతంలో ఉంది. గాంధారి జీవితంలో చివరివరకు ఈ ప్రవర్తన ఒక మచ్చగానే మిగిలిపోయింది. ధృతరాష్ట్రుడు ధర్మరాజాదులకు ఉపనయన సంస్కారాలు చేయటానికి పురోహితులను, సంభారాలను హస్తినాపురంనుంచి పంపలేదు. వసుదేవుడు తన పురోహితుడైన కశ్యపుని రత్నహాపాంబరాలతో పంపాడు. తన తమ్మునకు సంతానం కలిగితే ఆ సంతోషం తనది, ఆ ఉత్సవం కురువంశానిది. అయినప్పటికీ ఆ వార్త ఎడకాని, ఆ ఉత్సవంవల్ల కలిగే ఆనందం పటంగా కాని ఉదాసీనత ప్రదర్శించిన ధృతరాష్ట్రుని ప్రవర్తన మానవ ప్రవృత్తి దృష్టితో పరిశీలించినా ఆశ్చర్య జనకంగానే ఉంది. ధృతరాష్ట్రుని ఈ ఉదాసీనత శతశృంగమునుల నిరసనకుకూడ గురి అయింది. కనీసం భీష్మాది వృద్ధులైనా ధర్మరాజాదుల జననోత్సవం చేయవలసిందని సలహా యిచ్చినట్లు లేదు.

ఆ సోదరుల జీవితంలో తొలినాట నెలకొన్న అనుబంధం, ఆత్మీయత, పాండురాజు అరణ్యాలకు పోయి మునివృత్తి స్వీకరించిన తరువాత దూరమైనట్లు భావించవచ్చు. కురుసామ్రాజ్యంలో పాండురాజు వైభవం ధృతరాష్ట్రుని హృదయం అంతరాంతరాల్లో న్యూనతావహమైన (Inferiority Complex) అసూయాభావాన్ని కలిగించి ఉంటుంది. తన నేత్రలోపం కూడ ఈ న్యూనతా భావానికి దోహదం చేసి ఉంటుంది. అయితే పాండురాజు చూపే గౌరవాదరాలు ధృతరాష్ట్రుని ఈ అసూయాభావాన్ని హృదయంలోనే అణచివేసి ఉంటాయి. పాండురాజు ప్రజాజీవనంలో

ఉన్నంతకాలం తన న్యూనతాభావ జనిత అసూయాభావాన్ని వెల్లడించలేకపోయాడు. అయినా ఒక విధమైన అభద్రతా భావానికిలోనై జీవితం సాగించినట్లు తలంచవచ్చు. సోదరుడు అరణ్యంలో కిందముని శాపానికి గురికావటంవల్ల ధృతరాష్ట్రుని న్యూనతా భావజనిత అసూయాగ్రస్త హృదయపుటంతరాంతరాల్లో కొంత ఊరటతోకూడిన ఆనందరేఖ మెరసి ఉంటుంది. ఆ ఆనందాన్ని మాత్రం బహిర్గతం చేయలేదు. కాని మనసు కొంత భద్రతా భావానికి లోనై ఉంటుంది. ఒక వేళ బహిర్గతం చేస్తే వృద్ధులు, పెద్దలు, పౌరులు నిరసిస్తారనే భయం ధృతరాష్ట్రుని ఆపి ఉంటుంది. అందుకే తమ్మునకు కలిగిన ఆపద నిమిత్తంగా శోకతప్తుడై దుఃఖాన్ని ప్రకటించి తరుణోపాయం ఆలోచించవలసిన సమయంలో ఉదాసీనంగా ఉన్నాడు. ఈ ఉదాసీనతయే ధృతరాష్ట్రుని హృదయంలోని న్యూనతాభావాన్ని జయించిన భద్రతా భావానికి ప్రతీక అని తలంచవచ్చు.

అయితే ధర్మరాజు జననం పాండురాజు ముని వృత్తి స్వీకరించటంవల్ల ఏర్పడిన భద్రతాభావానికి అడ్డుకట్టవేసి ఉంటుంది. తనకు సంతానం కలగకపూర్వమే సోదరునకు సంతానం కలిగిందే అనే మానవ సహజమైన దాయాది మాత్సర్యం ఇందుకు కారణం కావచ్చు. ధృతరాష్ట్రుడు మాత్సర్యజనిత అసహన భావాన్ని మనసులో దాచుకొని, ఏ విధమైన మనోవికారాన్ని ప్రదర్శించకుండ మౌనమే సమాధానంగా నిలిచినట్లు కనిపిస్తుంది. వంశంలో ప్రథమ సంతానం కలిగితే సుహృద్భావం కలిగిన ఏ పెద తండ్రి అయినా ఆనందోద్వేగాన్ని వెల్లడించటం సహజం. కాని ధృతరాష్ట్రుని వంటి న్యూనతాభావ జనిత అభద్రతా భావంలో మునిగి ఉన్నవారు ఇంతకన్న వేరుగా ప్రవర్తించలేరు. ఈ మనః ప్రవృత్తే జీవితం అంతా కొనసాగాలని లేదు. గ్రంథాల్లోని నాయకులకయితే పరివృత్తి రాహిత్యం (Consistancy) ఒక లక్షణం. కాని సమాజంలో భిన్నవ్యక్తుల మధ్య, భిన్న ప్రవృత్తుల వారితో జీవితం సాగించే వ్యక్తి జీవితాంతం ఒకే విధంగా ప్రవర్తించ టం సాధ్యం కాదు. పరిస్థితుల ప్రభావానికి అనుగుణంగా, ప్రవృత్తులను అనుసరించి సమయానుకూలంగా స్పందించటం జరుగుతుంది. అట్లా భిన్న స్పందనలను కలిగిన వారు సాధారణ మానవుడనిపించుకుంటే, జీవితాంతం ఒకే విధంగా ప్రవర్తించేవారు ఆదర్శమూర్తులై వర్ధిల్లుతారు. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుడు సాధారణ మానవుల మధ్య ఉండే సోదరునిగా మాత్రమే ప్రవర్తించగలిగిననట్లు భావించడం సమంజసం.

సాధారణ మానవ మనస్తత్వ విశ్లేషణకు ప్రతీకగా ధృతరాష్ట్రుని తీర్చిదిద్దిన కవి ప్రశంసనీయుడు.

బ్రతికి ఉన్న రోజుల్లో వ్యక్తిగత సమస్యలు, సమాజ స్థితిగతులు కొన్ని సందర్భాల్లో సోదరుల మధ్య దూరాన్ని కల్పించినప్పటికీ, రక్తబంధం అవసర సమయాల్లో ఆత్మీయులను చేస్తుంది. సుఖాల్లో కన్నా కష్టాల్లోనే మానవునకు ఆత్మీయుల అవసరం అధికంగా ఉంటుంది. ఆత్మీయుల ఎడ స్పందన కూడ కష్టాల్లోనే శీఘ్రగతిని కలుగుతుంది. ధృతరాష్ట్రుడు, సోదరుడు శాపోపహతుడై ముని వృత్తి స్వీకరించాడన్న విషాదవార్త విన్నప్పుడు కాని, సోదరునకు ప్రథమ సంతానం కలిగాడనే సంతోష వార్త తెలిసినప్పుడు కాని ఎలాంటి స్పందనకు లోనుకాకుండ ఉదాసీనంగా ప్రవర్తించాడు. ఆ ధృతరాష్ట్రుడే సోదరుడు మరణించాడన్న విషాద వార్త విన్నప్పుడు కుప్పకూలిపోయాడు. అంతకు పూర్వం మనసులో ఉన్న భావాలన్నీ పటాపంచలయ్యాయి. పేగు బంధం పెనవేసుకొన్న సోదరానుబంధమే మిగిలింది. ధృతరాష్ట్రుని మనసు రోష భావాలన్నింటిని, ఒక్క ఆత్మీయతానుబంధమైన ఆర్ద్రతా భావంలో ఇముడ్చుకొని స్పందించింది. ఆ స్పందనే శోకంగా పరిణమించింది. ఇలాంటి సందర్భంలో అన్నీ కట్టుత్రాళ్ళు తెంచుకొని మమతానుబంధంతో కూడిన రక్త స్పర్శ స్పందనకు లోనుకావటం సహజమేనని అనిపిస్తుంది.

ధృతరాష్ట్రుడు సోదరుని మరణానంతరం అనేక సందర్భాలలో మమతాను రాగాలను నెమరువేసుకొంటూ పాండురాజు నెడ సుహృద్భావంతో కూడిన ఆత్మీయతనే వ్యక్తం చేశాడు. సోదరుడు బ్రతికి ఉన్న రోజుల్లో వీరిద్దరి మధ్య మరణానంతరం కూడ మనసులలో నిలిచి ఉండే ప్రగాఢ శత్రుభావం ఏమీ లేదు. కాకపోతే ధృతరాష్ట్రుడు అభద్రతా భావంతో పీడించబడి ఉంటాడు కాని, పాండురాజు విషయంలో ఆ మాత్రం కూడ అనుమానించేందుకు అవకాశంలేదు. అందువల్ల మధ్య వయసులోనే అర్ధంతరంగా మరణించిన సోదరుని మధురస్మృతులను నిష్కల్మషంగానే స్మరించినట్లు భావించవచ్చు. ఇది మానవ సహజం కూడ.

కురు కుమారులందరకు అగ్రజుడైన ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం చేసిన సందర్భంలో అసూయాసూనసుడైన కుమారుని అభీష్టానికి అనుగుణంగా పాండుకుమారులకు ఆపద తలపెట్టటానికి ధృతరాష్ట్రుని మనసు వెనుకాడింది. వ్యక్తి

జీవితంలో సోదరానుబంధం ప్రాశస్త్యాన్ని సుయోధనునకు వివరించే ప్రయత్నంలో సోదరుని వ్యక్తిత్వాన్ని గుర్తుచేశాడు. పాండురాజు పరాక్రమాన్ని, వాత్సల్యాన్ని తలచుకొంటూ

"లోకనుతుండు పాండుఁడమలుండు మహాగుణ రత్నపూర్ణర
త్నాకరుఁడత్యుదారమతి నంధుఁడ నైనను నన్నురాజుగాఁ
జేకొని నాకు భక్తిఁబనిసేయుచు సర్వజగజ్జిగీషుఁడై
యీకురువంశ రాజ్యభరమింతయుఁదాల్చెఁ బరాక్రమంబునన్"

(ఆది 6-125) అని ఆత్మీయంగా భ్రాతృప్రేమను వ్యక్తంచేశాడు. ఇంకాపాండురాజును 'భరతకుల శ్రేష్ఠుడు' అని సంభావించి సోదరుని శ్రేష్ఠత్వాన్ని నోరారా కొనియాడాడు.

ధృతరాష్ట్రుడు గాంధారీ సహితుడై ఆశ్రమ వాసానికి ప్రయాణమయ్యే సమయంలో వ్యాసుడు ధృతరాష్ట్రపాండురాజుల సోదరానుబంధాన్ని శ్లాఘిస్తాడు. పాండురాజు అగ్రజునిచే అనేక క్రతువులు చేయించి, ప్రీతితో శిష్యుని లాగా సేవించాడంటూ

"......పాండుఁడీనృపాలు
గద్దియనిడికొని క్రతువులు సేయించి
యవిరళభోగానుభవము నడపి
యీతనివారలఁ బ్రీతినీక్షించితా
శిష్యుండ పోలె సంసేవనంబు
భక్తిమై నొనరించె......" (ఆశ్రమ. 1-51)

అని ఆ సోదరుల అనుబంధాన్ని కొనియాడాడు. ధృతరాష్ట్రపాండురాజుల సోదరానుబంధం జీవితం ప్రథమభాగంలో ఎంతో ఆత్మీయంగా ప్రబలింది. పరిస్థితుల ప్రాబల్యంవల్ల కొన్ని సంవత్సరాల్లో ధృతరాష్ట్రుడు సోదరుని ఎడ ఉదాసీనంగా ప్రవర్తించాడు కాని పాండురాజు మాత్రం అగ్రజుని భక్తిశ్రద్ధలతో కొలిచినట్లు తెలుస్తుంది. ఇతడి భక్తివిశ్వాసాలు వ్యాసునివంటి వారిచేత కూడ పొగడ్తలందాయి. ధృతరాష్ట్రుడు కూడ జీవితంలో కొన్ని సమయాల్లో సోదరుని స్నేహపూర్వక భక్తి భావాలను స్మృతికి తెచ్చుకొని ఆత్మీయమైన అనుబంధాన్ని ప్రకటించినట్లు తెలుస్తుంది.

**ధృతరాష్ట్రుడు - విదురుడు :** విదురుడు శూద్రకాంత యందు జన్మించిన వాడైనప్పటికీ ధృతరాష్ట్ర పాండు రాజులతో పాటు అంతఃపురంలోనే పెరిగి, అనుజునిగా కురువంశం వారి గౌరవాదరాలను పొందాడు. జీవితాంతం విదురుడు స్నేహితుడు, సచివుడు, మిత్రుడు, బంధువుగా సోదరుణ్ణి కొలిచాడు. ఏ సందర్భంలో కూడ విదురుడు సంకీర్ణ జాతీయుడు అనే భావం ధృతరాష్ట్రుని హృదయంలో జనించలేదు. పాండురాజు సోదరుణ్ణి గౌరవ భావంతో సేవిస్తే, విదురుడు కురువంశ శ్రేయస్సును, ప్రజాక్షేమాన్ని, ధృతరాష్ట్రుని ఔన్నత్యాన్ని పెంపొందించే మార్గంలో సోదరునకు సమయోచిత సలహాలనిస్తూ జీవితాంతం అండగా నిలిచాడు.

విదురుడు ధృతరాష్ట్ర పాండురాజుల కన్న వయసులో చిన్నవాడైనప్పటికీ విద్యావిజ్ఞాన విశేషంతో అందరి మన్ననలకు పాత్రుడయ్యాడు. ధృతరాష్ట్రుని వివాహం విషయంలో భీష్ముడు విదురుణ్ణి సంప్రతించడం అతడి ప్రాముఖ్యాన్ని విశదపరుస్తుంది. శతశృంగం నుంచి మునులు మాద్రి పాండుల అస్థికలను తెచ్చినప్పుడు వ్యాస భీష్మ ధృతరాష్ట్రుల అనుమతితో విదురుని ఆధ్వర్యంలోనే శ్రాద్ధ కర్మలు నిర్వహించబడ్డాయి. కుమారాస్త్ర విద్యాప్రదర్శనం జరిగే సమయంలో అక్కడి విశేషాలన్నీ గాంధారీ ధృతరాష్ట్రులకు విదురుడే వివరించాడు. అట్లాగే సుహృద్ద్యూత అనుద్యూత సమయాల్లో సభలో జరిగిన రభసనంతటిని వివరించినవాడు కూడ విదురుడే.

అనేక సందర్భాలలో ధృతరాష్ట్రుడు విదురుని ఆలోచన ప్రియం కాకపోయినా తమ్ముని మనసుకు తృప్తికలిగేందుకు సంతోషాన్నే ప్రకటించేవాడు. పాండవులు లాక్షాగృహంనుంచి తప్పించుకొని ద్రుపదపురంలో సురక్షితంగా ఉన్నారన్న వార్తను విదురుడు సంతోషంగా అగ్రజునకు తెలియచేస్తాడు. ఆ వార్త విని ధృతరాష్ట్రుడు విదురునకు 'మనఃప్రియంబుగా' పాండవుల భుజవీర్యాన్ని, వైభవాన్ని హార్దికంగా ప్రశంసిస్తాడు. సోదరుడైన విదురుని మాట తప్ప తండ్రి తమ గోడు వినిపించుకోవటం లేదంటూ

> "...... అతి విమోహంబున న
> వ్విదురు వచనంబ నిలుపుదు
> హృదయంబున నతడు పెద్ద యిష్టుఁడు మీకున్" (ఆది. 8-19)

అని సుయోధనుడు విష్ఠూరంగా వలుకుతాడు. సమాధానంగా ధృతరాష్ట్రుడు "నాదు హృదయంబు విదురునకెన్నండు నెఱిగింప" అని కుమారునకు ఓదార్పుగా తన నిజ స్వరూపాన్ని ప్రదర్శిస్తాడు. సమీప బంధువులను మెప్పించటానికి 'అనేకమంది' ధృతరాష్ట్రుని లాగానే లౌక్యాన్ని ప్రదర్శించటం లోకంలో కనిపిస్తుంది.

ధృతరాష్ట్రుడు కార్యనిర్వహణంలో పొరబడుతున్నాడని అనిపించి నప్పుడు, మనసులో దాచుకోకుండ వంశ శ్రేయస్సుకోరి నిర్భయంగా హితవు బోధించేందుకు విదురుడు అనేక సందర్భాలలో ప్రయత్నించాడు. ధృతరాష్ట్రుడు కూడ కొన్ని సమయాల్లో తమ్ముని విమర్శలను ఆత్మీయంగానే స్వీకరించి ఆ సలహా లను పాటించేవాడు. ద్రౌపదీ వివాహానంతరం ద్రుపదుని ఆశ్రయంలో ఉన్న పాండవులను ఎట్లాగైనా వేరుచేయాలనే ఆలోచన సుయోధనాదులు చేస్తారు. విదురుడు ధర్మరాజు ధర్మగుణము, పాంచాలురితో కూడిన పాండవ బలాధిక్యాన్ని విస్తారంగా వివరించి భీష్మద్రోణాది వృద్ధులు చెప్పినట్లుగా ప్రవర్తించి "పాండుసుతుల వేగ రావించి వారలకుఁ బ్రీతివర్ధ రాజ్యమిమ్ము" (ఆది. 8-43) అని సలహా ఇస్తాడు. ధృతరాష్ట్రుడు పరిస్థితిని మనసులోనే సమీక్షించుకొని, కారణం ఏదైనా సోదరుని అభిప్రాయం సర్వోత్తమమైనదని, అవశ్యాను సరణీయమని నిశ్చయించుకొన్నాడు. పెద్దల ఆలోచనే తనకు శిరోధార్యమనే అభిప్రాయాన్ని ప్రకటిస్తూ

"మీ వచనమున కవజ్ఞత
గావింపఁగ నంత కార్యగతి మూఢుఁడనే" (ఆది. 8-50)

అని ఎంతో గౌరవంతో ఆ తమ్ముని సలహాను అంగీకరిస్తాడు. అంగీకరించటంతో ఆగక పాండవులను హస్తినాపురం తీసుకురావటానికి విదురుణ్ణే పంపించాడు. అన్న ఆజ్ఞానుసారం పాంచాలనగరం పోయిన విదురుడు ధృతరాష్ట్రుని అనురాగాన్ని ప్రత్యేకంగా ప్రశంసించి సోదరుని సహృదయాన్ని విశదపరుస్తాడు. ఈ సోదరుల పరస్పరాభిమానం, గౌరవభావం శ్లాఘించ తగిందిగా ఉంది.

విదురుని ధీశక్తి, బుద్ధివైశద్యము, ధర్మాధర్మ గుణవిశేష పరిశీలనా శక్తిపై ధృతరాష్ట్రునకు అపారమైన విశ్వాసం. విదురుని ఆలోచనను మన్నించినా మన్నించకపోయినా అనుజుని జ్ఞానవిశేషాన్ని నోరారా కొనియాడేవాడు. ద్యూతంలో ధర్మరాజు సంపదను సాధించాలనే ప్రయత్నంలో సుయోధనుడు తండ్రి అనుమతి

కోసం అర్థిస్తాడు. అయితే ధృతరాష్ట్రుడు విదురుణ్ణి సంప్రతించకుండ అనుమతి నీయటానికి వెనుకాడతాడు. ధీరమతి, నయవిశారదుడు, కళాపారగుడు, దీర్ఘదర్శి అయిన విదురుని బుద్ధివిశేషాన్ని, నిష్పాక్షికతను ప్రస్తుతిస్తూ "సురపతి గురుండైన బృహస్పతి చేసిన నీతిశాస్త్ర రహస్యంబు లందెవ్వరికంటె విదురుం డెంతయు విశారదుండు" (సభ. 2-125) అని తమ్ముని నీతి, ధర్మశాస్త్రపాండితీ వైభవాన్ని ఉగ్గడించి, అతని బుద్ధిబలం సహాయంతోను భీష్ముని భుజబలంతోను కురురాజ్య తంత్రం వర్తిల్లుతుందని పలుకుతాడు. సుయోధనుని ద్యూతప్రయత్నం నుంచి మరల్చే ప్రయత్నంలో "ధర్మాధర్మ విదుండైన విదురునకిది సమ్మతంబు గాదు" (సభా. 2-137) అని సోదరుని అభిప్రాయానికి ప్రాధాన్యం ఇచ్చినట్లు ప్రవర్తిస్తాడు. ఇంకా తాను విదురుని శాసనంతోనే నడుస్తాననీ "అతండర్థానర్థ నిరూపణ నిపుణుండు సకలకార్య సమర్థుండు జూదంబున విగ్రహంబగుననియె" (సభ. 3-148) అని సోదరుని అభిప్రాయానికి ఎంతో విలువ ఇస్తాడు. అయినా కుమారుని ఉద్యమంనుంచి మరల్చలేనివాడై, ద్యూతంనిమిత్తంగా ధర్మరాజాదులను ఆహ్వానించేందుకు విదురుణ్ణే పంపటానికి నిశ్చయిస్తాడు.

సోదరుడైన విదురుని బుద్ధిబలం, ధర్మాధర్మగుణవిచారణశక్తిపైన ఎంతో విశ్వాసం ప్రకటించినప్పటికీ, ధృతరాష్ట్రుడు అతడు చెప్పిన హితవాక్యాలు ఇంపితములు కానపుడు ప్రతిసమాధానం ఇవ్వకుండ మౌనంవహిస్తాడు. అయినా విదురుడు మాత్రం సోదరు క్షేమం, కురువంశాభివృద్ధి కోరి మంచి అని తోచిన విషయాన్ని నిష్కాపట్యంతో చెప్పేవాడు. జూదంలో శకుని మోసంతో ధర్మరాజును జయిస్తున్నాడనే అనుమానం కలిగి విదురుడు మోసపువిజయం కురుకులక్షయకారణం అవుతుందని తలచి, కురువంశం శ్రేయస్సే జీవితలక్ష్యంగా భావించి రహస్యంగా ధృతరాష్ట్రునకు విషయాలన్నీ వివరించి జూదాన్ని నిలుపు చేయవలసిందని అర్థిస్తాడు. కులాన్ని రక్షించటానికి ఒక కులపాంసనుణ్ణి త్యజించటం ధర్మమే నని హితోక్తులాడతాడు. సోదరుడు బోధించే హితోక్తులలో సత్యం ఎంతఉన్నా, కుమారుణ్ణి త్యజించటం ధృతరాష్ట్రుని మనసుకు అంగీకారంకాలేదు. అదీకాక జూదంలో కుమారుని విజయపరంపర ఆరాజు మనసు లోపలి పొరలలో ఆనందంతో కూడిన తృప్తినే కలిగించి ఉంటుంది. అట్లని తమ్ముని హితోక్తులు బహిరంగంగా తిరస్కరించి చిన్నబుచ్చటం ద్వారా సభామధ్యంలో వెలితికావటం కూడ ఇష్టంలేదు. అందుకే విదురుడు ఉపేక్షవిడిచి దుష్టద్యూతం వారించమని అర్థించినపుడు మౌనం

వహించాడు. ఆ విధంగా మౌనం వహిస్తే తన ఆంతర్యం ఇతరులు గ్రహించే అవకాశం ఉండదు. ఆ పరిస్థితుల్లో ఏ వ్యక్తి అయినా అంతకన్నా భిన్నంగా ప్రవర్తించగలిగే వాడుకాదు. ఇట్లా మౌనం వహించటం ద్వారా ధృతరాష్ట్రుడు భావ ప్రకటన చేసినట్లు నన్నయ చెప్పటం పాత్రోచితంగాను, సందర్భోచితంగాను ప్రకాశిస్తుంది.

అగ్రజుడు ఉపేక్ష వహించినా వంశక్షేమమే పరమ ధ్యేయంగా భావించిన విదురుడు తన ప్రయత్నం మానలేదు. అన్యాయమార్గంలో జూద విజయం మంచిది కాదని, పరాక్రమోపేతులై వర్ధిల్లే పాండవులకు ఆపద తలపెట్టటం మేలుకాదని సుయోధనునకు హితవుగరప ప్రయత్నిస్తాడు. సుయోధనుడు పినతండ్రి మాటలు పెడచెవిని పెడతాడు. తండ్రీకొడుకులిరువురూ ఉదాసీనంగా ప్రవర్తించటం విదురునకు మనఃక్షోభాన్ని కలిగించి ఉంటుంది. చేయగలిగింది లేక కురువంశ క్షేమమే తన ప్రధాన లక్ష్యం అంటూ "ఏను సపుత్రకుండయిన వైచిత్రవీర్యు కార్యంబునకు హితుండనై నెగడునట్టి నన్నన్యథా బుద్ధినొల్లక పలికితి. పాండవులతోడి విగ్రహంబు లగ్గు గాదు" (సభా. 2-193) అని పలికాడు. ఈ సందర్భంలో అగ్రజుడు తన హితోక్తులు ఆలకించక పోయినా, సోదరుని ఎడ కుమారుల కార్యం పరంగా తన అభిలాషను విదురుడు ప్రకటించటం కనిపిస్తుంది. ఇలాంటి సంఘటనలు లోకంలో అన్నదమ్ముల జీవితంలో జరగటం సహజ విషయమేనని భావించవచ్చు.

ఒక్కొకసారి మానవుడు తనకు అత్యంతాత్మీయులైన వారిని, తన వారైనాసరే, అదే పనిగా నిందిస్తుంటే సహించలేడు. శత్రువర్గం వారిని పొగడుతూ తన వారిపై నేరారోపణ చేస్తుంటే సహనాన్ని కోల్పోతారు. ఆ సహనాన్ని కోల్పోయిన స్థితిలో ఉచితానుచిత జ్ఞానం కూడ పరిగణించరు. కొంత సమయం గడచిన తరువాత పర్యాలోచనానంతరం తమ తొందరపాటుకు వగచటం జరుగుతుంది. ఇలాంటి సంఘటన ధృతరాష్ట్రుని జీవితంలో జరిగిన ఘట్టం ఒకటి ఉంది. ద్యూత విజితులైన పాండవులు సమయానుసారం అరణ్యవాసం పోయారు. అరణ్యంలో పాండవులు ఎట్లా జీవితం సాగిస్తున్నారనే విషయం తెలుసుకోవాలనే ఉత్కంఠతో ధృతరాష్ట్రుడు సోదరుని పిలిపించి "నీవు భార్గవుకంటె బుద్ధిమంతుడవు, పాండవ కౌరవులకు సమ్మతుండవు" అని సంభావించి అరణ్యంలో ఉన్న పాండవుల వృత్తాంతం విశదపరచమని అర్థిస్తాడు. విదురుడు పాండవుల పరాక్రమౌద్ధత్యాలను

వివరించి, సుయోధనాదుల దౌష్ట్యాన్ని నిరసించి దుశ్శాసనుని పంపి వారిని పిలిపించి రాజ్యప్రతిష్ఠితులను చేయవలసిందని హితవు చెప్తాడు. అరణ్యంలో పాండవులు అనుభవించే బాధలను తెలుసుకొందామనే ఉత్కంఠతో ఉన్న ధృతరాష్ట్రునకు, విదురుడు తన కుమారుల దౌష్ట్యాన్ని నిరసించటం భరించరానిది అయింది. సోదరుని మాటలా రాజుకు ఎంతో కోపాన్ని తెప్పించాయి. కోపం విపరీతమైతే మానవుడు వివేకం కోల్పోవటం సహజం. ధృతరాష్ట్రుడు నిగ్రహాన్ని కోల్పోయి విదురుడు తనకు ఆత్మీయుడు, సోదరుడు అనే విచక్షణా జ్ఞానంకూడ మరచి "నీవు నాకొడుకుల యున్నతి కెన్నండు సహింపవు, నీ సహాయత్వంబు నేనొల్లఁ బాండవుల కడకేనియు నొండుగడకేనియు నీకిష్టంబైన చోటికి నరుగుము" (అరణ్య 1-53) అని అంతఃపురం నుంచి వెళ్లగొట్టాడు.

విదురుడు కామ్యకవనంలో ఉన్న పాండవుల దగ్గరకు చేరతాడు. ధృతరాష్ట్రుని మనసులో పొంగుగా వచ్చిన కోపం తగ్గటంతో వివేకం మేలుకొని హృదయం తమ్మునికోసం తల్లడిల్లింది. ఆ ఆలోచనతోనే "ధృతిహీనుండై తన హృదయంబును దృష్టియుంబోని విదురుంబాసి నిమిషంబేని నిర్వహింప నోపక" (అరణ్య. 1-62) తమ్ముని తీసుకొని రావటానికి సంజయుణ్ణి పంపేందుకు నిశ్చయిస్తాడు. సంజయుని పిలిచి కామ్యకవనం పోయి

**"నెమ్మిగల వాని నా చి**
**త్తమ్మెఱిఁగెడు వాని విదురు ధర్మప్రియు నా**
**తమ్ముని టవేగ తోడ్కొని"** (అరణ్య. 1-63)

రావలసిందని ఆజ్ఞాపిస్తాడు. ఈ సందర్భంలో తమ్మునిఎడ తన తొందరపాటుకు చింతించే అగ్రజుడు ధృతరాష్ట్రునిలో మనకు దర్శనం అవుతాడు.

విదురుడు ధర్మరాజు అనుజ్ఞ తీసుకొని సంజయుతో హస్తినాపురం చేరతాడు. అనుజుని ఆగమనంతో అగ్రజుని హృదయంతోపాటు మేనుకూడ పులకించింది. కొద్దికాలంపాటే అయినా ఆ తమ్ముని వియోగం అతనికి యుగాలు గడిచినట్లనిపించి ఉంటుంది. తనకు నమస్కరించిన సోదరుని "అతి స్నేహంబున గౌగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి నీవు నిత్యక్షమాన్వితుండవు నాబుద్ధి లేమికి క్షమియింపుము" (అరణ్య. 1-69) అని తన తొందరపాటుకు పశ్చాత్తాపం

వ్యక్తం చేశాడు. వదలితే సోదరుడు తనకెక్కడ దూరం అవుతాడో అనే ఉత్కంఠ ఆ రాజు విదురుని కౌగిలించుకోవటంలో వ్యక్తమవుతుంది. విదురుడు కూడ అగ్రజుని తొందరపాటు తనాన్ని మన్నించి ఎప్పటిలాగానే సోదరునకు కార్య సహాయుడై ప్రవర్తిల్లాడు. సుయోధనుడు చేసిన వైష్ణవయాగానికి ఆహూతులై వచ్చిన రాజన్యులకు, మునులకు సముచిత సత్కారాలు చేసే బృహత్తర బాధ్యత ధృత రాష్ట్రుడు విదురునకే అప్పగించాడు. ధృతరాష్ట్రుని ఔదార్యం, విదురుని సామర్థ్యం ఎడ విశ్వాసాన్ని, సోదరానురక్తిని ప్రకటిస్తున్నది. ఈ సందర్భం అంతా ఆవే శంతో అన్నదమ్ముల మధ్య దూరం ఏర్పడ్డా ఆలోచన వారిరువురను ఆత్మీయంగా దగ్గరగా చేరుస్తుందనటానికి నిదర్శనంగా నిలుస్తుంది. ధృతరాష్ట్రుని జీవితంలో తమ్మునితో ఇలాంటి సన్నివేశాలు పునరావృతం కాలేదు.

ధృతరాష్ట్రుడు రాజనీతి సంబంధమైన కొన్ని విషయాల్లో విదురుని ఆలోచన అంగీకార్యం కాకపోయినా సోదరుని హితవచనాలను మాత్రం ఎంతో ఆదరంగా వినేవాడు. ప్రత్యేకించి సుయోధనుని సంబంధంగా మనసు ఆందోళనకు లోనైనప్పుడు చిత్తశాంతికై విదురుణ్ణే ఆశ్రయించేవాడు. ఉపప్లావ్యంలో ఉన్న పాండవుల వద్దకు కౌరవ రాయబారిగా వెళ్లి వచ్చిన సంజయుడు ఏకాంతంలో ధృత రాష్ట్రుని సందర్శించి, ఆ రాజు పుత్రవ్యామోహంవల్లే కురువంశానికి ప్రమాదం వాటిల్లుతున్నదని నిరసించి, పాండవుల వైభవాన్ని వారి నిశ్చితాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తాడు. సంజయుని మాటలు ధృతరాష్ట్రుని హృదయంలో ఆందోళన రేకెత్తించాయి. తన ఆందోళన తీర్చగలవాడు విదురుడొక్కడే అనే ఆశతో అతణ్ణి పిలిపించినే 'సంజయుడు తనను విడిచిపోయిన దగ్గరనుంచి మనసు ఆందోళనతో కలతచెంది ఉందనీ, శరీరంకూడ నిప్పులు చెరగుతూ నిద్రకు దూరమైంది' అని చెప్తాడు. ఎంతో ఆత్మీయత ఉంటే కాని మహారాజైన ధృతరాష్ట్రుడు తన వేలతనాన్ని వెల్లడించడు. హృదయం ఆందోళనతో నిండిఉన్న కష్టసమయంలో ఆత్మీయుల అండకోరటం సహజమే. ధృతరాష్ట్రుడు 'శుద్ధవిచారా' అని తమ్ముని సంభావించ టంలో విదురుని పరిశుద్ధమైన ఆలోచనా విధానంపై అగ్రజుని అభిమానం, విశ్వాసం వ్యక్తం అవుతుంది. సంధి విషయంలో ధర్మరాజు ఆలోచనా విధానం తెలియక పోవటమే నిద్రలేమికి, ఆందోళనకు కారణం అని అంటాడు. తన మనస్సులోని ఆందోళనను పోగొట్టటానికి

"......ఓపుదీవు
దెలియజెప్పి నాయలమట మలగజేయ" (ఉద్యోగ. 2-23)

అని అనుజుని సామర్థ్యాన్ని ప్రశంసిస్తాడు. ఇంకా "నీవు ధర్మాధర్మ విదుండవు నయానయజ్ఞుండవు నాకుంబ్రజాగరం బొనర్చుచున్న సంతాపంబుపశమించునట్లుగా భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొల్పుము" (ఉద్యోగ 2-30) అని తమ్ముణ్ణి అర్థిస్తాడు. ఈ వేడుకోలులో సోదరుని బుద్ధి విశేషం ఎడ ఆతడి విశ్వాసం ప్రకటితం అవుతుంది.

విదురుడు మొహమాటం లేకుండ వంశ శ్రేయస్సునుకోరి మనసులో మాట స్పష్టంగా ధృతరాష్ట్రునకు చెప్పేవాడు. వినయ వివేకాలతో వర్ధిల్లే ధర్మరాజు కష్టాలకు సుయోధనాదులతో కలిసి ధృతరాష్ట్రుడుకూడ కారణం అయ్యాడని నిర్ద్వం ద్వంగా పలుకుతాడు. అర్థిస్తే శత్రువుకైనా ఇవ్వటం మాన్యుల లక్షణం, అట్లాంటిది సోదరుని కుమారులకు రాజ్యభాగం ఇవ్వకుండా ఉండటం నీతిబద్ధం కాదని హితవు చెప్తాడు. ధృతరాష్ట్రునకు తమ్ముని ఈ ధోరణి నచ్చలేదు. అయినా తన అయిష్టత బయటపడనీయకుండ విదురుడు చెప్పిన మాటలు ధర్మబోధకాలే అయినప్పటికీ, పుత్రవాత్సల్యంవల్ల అనుసరించలేక పోతున్నానని తన అసమర్థతను స్వచ్ఛందంగా అంగీకరిస్తాడు. 'జ్ఞాతులు గుణహీనులైనప్పటికి దూరంగా ఉండటం ధర్మంకాదు, ధర్మరాజు నేతృత్వంలో పాండవులు నీ ఆశ్రయం కోరుతున్నారు, నేను నీకు హితము కోరేవాడను, మనసులో జాగ్రత్తగా ఆలోచించి ధర్మరాజును దగ్గరకు చేర్చి అందరి సమక్షంలో కుమారులకు పొందుచేయ వలసిందని' విదురుడు అర్థిస్తాడు. నిష్పక్ష పాతంగా, నిష్కల్మషంగా ఉన్న విదురుని నీతివాక్యాలు ధృతరాష్ట్రుని మనసును స్పందింపచేసి ఉంటాయి. పర్యవసానంగా సోదరుని మాటలవల్ల మనసు కలత తేరిందని చెప్తూ

"......నీదు పలుకులఁ
గలక దేఱిబుద్ధి దెలివినొందె
నిట్లు చేయువాడ నిదియ కర్జము ధర్మ
మును యశంబు లాభమును దలంప" (ఉద్యోగ. 2-9౦)

అని విదురుని మతాన్నే అనుసరించదలచినట్లు నిశ్చయంగా పలుకుతాడు. అన్న మనసులో కలిగిన పరిణామానికి విదురుడెంతో ఆనందాన్ని పొంది, ఎట్టకేలకు సోదరుణ్ణి అంగీకరింపచేసి కురువంశం విచ్ఛేదం కాకుండ కాపాడ గలిగాననే సంతృప్తి పొందుతాడు. ఆ సంతోషంతో 'పెద్దవడి కక్కటిట నీమదికార్యవృత్తి నూల్కొనియె' అని సోదరుని కొనియాడి, 'సుయోధనుని చూసిన వెంటనే నీవు అతడి మార్గాన అనుసరించకుండా ఉంటే మాబోటి వారికి ఎంతో ప్రియమవుతుంది కదా!' అనే ఆకాంక్షను వ్యక్తంచేస్తాడు. ఉపప్లావ్యంనుంచి వచ్చిన సంజయుడు కౌరవ సభలో పాండవుల బలసంపదను వివరించినప్పుడు, కౌరవ పక్షంలోని అనైక్యతను తలచుకొని ధృతరాష్ట్రుడు, సుయోధనుడు కర్ణునితో కలిసి నాశనం అయ్యేటట్లున్నాడు "మనకు నింకజేయంగనగు పని పెద్ది చెప్పుము" (ఉద్యోగ. 2-29) అనిఆందోళనతో నిస్సహాయంగా సోదరుణ్ణి అర్థిస్తాడు. అట్లాగే కృష్ణరాయబారసమయంలో సంధికి సంపూర్ణంగా వ్యతిరేకతను ప్రదర్శించే సుయోధనుడు తల్లి హితవునన్నా ఆలకిస్తాడనే ఆశతో గాంధారిని తీసుకురావటానికి ధృతరాష్ట్రుడు విదురుణ్ణే నియోగించాడు. ఎవరి హితవాక్యాలు వినని సుయోధనుడు రాయబారిని బంధించే ప్రయత్నం చేసినప్పుడు విదురుడు అడ్డుపడ్డాడు. సుయోధనుని అనుచితకార్యం కురువంశనాశనానికిదారితీస్తుందనే భయంతో కులక్షేమాన్ని కోరి, పుత్రుని ఆలోచన కార్యరూపం ధరించకుండ ప్రయత్నం చేయవలసిందని అగ్రజుని అర్థిస్తాడు. కష్టసుఖాల్లో సోదరులిద్దరూ ఒకరికొకరు ఆత్మీయంగా ప్రవర్తించారు అనటానికి ఈ సంఘటనలు కొన్ని నిదర్శనంగా నిలుస్తాయి.

కురుక్షేత్ర సంగ్రామంలో కొడుకులందరను కోల్పోయి జీవితమే దుర్భరంగా ఉన్న సమయంలో ఆ మహారాజుకు బ్రతికి ఉన్న సోదరుడొక్కడే ఆధారం అయ్యాడు. కుమారుల దారుణ వధతో ధృతరాష్ట్రుడు దిక్కులేని వాడినయ్యాననే భావనకు లోనయ్యాడు. ఆ భావంతోనే జీవించి ఉన్న ఒక్కసోదరుణ్ణి ఆలంబనం చేసుకొని "పుత్రహీనుండ వనాథుండనగుట యెఱింగితిః దమ్ముండ యిటమీద నీవ నాకు గతియగుము" (శల్య.1-10) అని విదురుని ఆలింగనం చేసుకొని మూర్ఛకు లోనయ్యాడు. పుత్రమరణశోక విహ్వలుడైన ధృతరాష్ట్రునకు, వంశ శ్రేయస్సును కోరి విదురుడు హెచ్చరికతో బోధించిన పూర్వవిషయాలెన్నో మనసులో మెదల సాగాయి. సోదరుడు ఎంతో ముందు చూపుతో చెప్పిన హిత వాక్యాలను పెడ చెవుల పెట్టినందుకు ఫలితం అనుభవానికి వచ్చింది అంటూ

"అప్పుడటులతఁడు సెప్పఁగఁ
దప్పఁదలచిన ఫలంబు దగఁగుడువకపోఁ
జొప్పడునె ..." (శల్య. 1-37)

అని పశ్చాత్తప్త హృదయంతో పలికాడు. పుత్రవియోగ దుఃఖంతో మనోస్థైర్యం కోల్పోయి ఉన్మత్తునిలాగా విలపించే సోదరునకు చిత్తతాపోపశమనంగా విదురుడు జీవిత పరమార్థాన్ని తెలియచెప్ప ప్రయత్నించాడు. జీవితంలో మానవునకు ఏదీశాశ్వితంకాదని, పుట్టినవన్నీ గిట్టేవేనని, అందువల్ల మానవుడు అశాశ్వితమైన ఈ శరీరం కోసం తాపత్రయ పడవలసిన అవసరంలేదని చెప్తాడు. మరణించిన వారంతా వీరస్వర్గం అలంకరిస్తారు కనుక వారికై చింతించవలసిన అవసరంలేదని చెపుతూ ధృతరాష్ట్రునకు భౌతిక విషయాలపై ఆత్మసంయమనం కలిగించి పారమార్థి కాంశాలపై మనసులగ్నం అయ్యేటట్లు హితవచనాలతో ప్రయత్నించాడు. విదురుని ప్రయత్నం కొంత ఫలించి ధృతరాష్ట్రుని హృదయం కలత తేరింది. అంతటితో తనవి తీరక

"హిత ముపదేశించితినీ
వతినిర్మల చిత్తవృత్తివగుట సుజనసం
స్తుతగుణ యింకను జెప్పుము" (స్త్రీ. 1-53)

అని విదురుని నిర్మల చిత్తవృత్తిని కొనియాడి, చిత్తశాంతికై ఇంకా హితవచనాలు బోధించ వలసిందిగా అర్థించాడు.

ఈకష్టకాలంలో ధృతరాష్ట్రునకు సోదరునిరూపంలో పుత్రశోకార్ణవంనుంచి తరింపచేయగల నావ అండగా లభించి నట్లయింది. విదురుడుకూడ ఎంతో ఆత్మీయంగా అగ్రజుని శోకాన్ని పోగొట్టటానికి చిత్తశుద్ధితో ప్రయత్నించాడు. అముదిమిలో అగ్రజుని విడనాడక తోడుగా ఉండి కొలిచాడు. వానప్రస్థాశ్రమం స్వీకరించి తపస్సునిమిత్తమై ఆశ్రమవాసానికి పోవాలని సంకల్పించిన ధృతరాష్ట్రునితో విదురుడుకూడ ప్రయాణం అయ్యాడు. మహాసామ్రాజ్యాధిపతియై వెలుగొందిన కురుసార్వభౌముడు పుత్రుల శ్రాద్ధకర్మలు తీర్చటానికి తమ్మునికొడుకులను అర్థించ వలసిన దయనీయస్థితిలో ఉండ వలసివచ్చింది. విదురుడు ధర్మరాజు అనుజ్ఞ

తీసుకొని సుయోధనాదులకు శ్రాద్ధకర్మల నిమిత్తమై సమస్త సంభారాలు సిద్ధంచేయించి సోదరుని మనసు కుదుటపడేటట్లు చేశాడు. శతయూపుని ఆశ్రమంలోకూడ అగ్రజుని సేవలోనే కాలంగడుపుతూ ధృతరాష్ట్రునికన్న ముందే శరీరత్యాగం చేశాడు.

ధృతరాష్ట్రుడు సోదరులైగా పాండు విదురులతో కొన్ని సందర్భాలల్లో వ్యక్తిగత బలహీనతలకు, పరిస్థితుల ప్రాబల్యాలకులోనై ఉదాసీనంగా ప్రవర్తించి నప్పటికీ, మొత్తంమీద గాఢానుబంధాన్నే పెంపొందించు కోవటానికి ప్రయత్నించి నట్లు పరిశీలనవల్ల తెలుస్తుంది. పాండు విదురులు వంశశ్రేయస్సు, దేశక్షేమాన్ని దృష్టిలోఉంచుకొని జీవితాంతం అగ్రజుని సేవించారు. ధృతరాష్ట్రుని ఉదాసీనతలో కూడ సామాన్య మానవ జీవితంలో సంఘటిల్లే భావపరిణామాలే ద్యోతకం అయినట్లు తలంచవచ్చు. మొత్తంమీద ధృతరాష్ట్రుని సోదరానుబంధం ఆదర్శవంతం కాకపోయినప్పటికీ, మానవ సహజప్రవృత్తి క్రమంతోనే వర్తిల్లినట్లు భావించటం సమంజసంగా ఉంటుంది.

## 1.6 పుత్రవ్యామోహం

సంతానం పొందటం దాంపత్యజీవితం ప్రధానలక్ష్యం. "ధర్మప్రజాసంపన్నే దారే నాన్యాంకుర్వీత"[1] అని ఆపస్తంబ ఉవాచ. సంతానం ఉత్తమమైనదైతే ఆతల్లి దండ్రులు సమాజంలో గౌరవం పొందటమేకాక, అనుభూతి విశేషమైన ఆనందాన్ని అనుభవిస్తారు. పుత్రసంతానం అయితే పున్నామనరకం నుంచి రక్షణకూడా లభిస్తుందని ప్రాచీనుల విశ్వాసం. పుత్రుడనేవాడు

> "పుంనామ్నోనరకాద్యస్మాత్త్రాయతే పితరంసుతః
> తస్మాత్పుత్ర ఇతిప్రోక్తః స్వయమేవ స్వయంభువా"[2]

అని మనుస్మృతి. పుత్రుడు సత్ప్రవర్తనతో సమాజంలో ఉన్నత స్థానం పొందటమే కాక జన్మనిచ్చినవారి జీవితాలకు ధన్యత చేకూరుస్తాడు. అందుకే

> "పుత్రోత్సాహము తండ్రికి
> పుత్రుడు జన్మించినపుడె పుట్టదు, జనులా
> పుత్రుని కనుఁగొని పొగడఁగ
> పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ"

అని సుమతీ శతకం వ్యక్తిజీవితంలో పుత్రుని ప్రాధాన్యాన్ని ఒక్కాణించింది. 'Child is the father of the Man' అని వర్డ్స్‌వర్త్ కవి అభిప్రాయం. మహాభారతం కూడ "పురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్రుండై తాన యుద్భవిల్లు" (ఆది 4-86) అని తండ్రే కుమారునిగా ఉద్భవిస్తాడని వివరించింది. ఇంకా ఆ తండ్రి

> "తాన తననీడ నీళ్లుల
> లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుతః త
> త్సూను జనకుండుసూచి మ
> హానందముఁ బొందు నతిశయప్రీతిమెయిన్" (ఆది. 4-88)

ఆనందం పొందుతాడని నన్నయ అభిప్రాయం. ఒక దీపం మరొక దీపాన్ని వెలిగించినట్లు తండ్రి కుమారుని జననానికి కారకుడవుతాడు. తండ్రి జీవకణాలే

కుమారునకు రూపాన్నిస్తాయి కనుక పుత్రుడు అనువంశికంగా వచ్చే లక్షణాలతో పాటు తల్లిదండ్రుల శారీరక మానసిక లక్షణాలనేకం కలిగి ఉంటాడు. ఎక్కడైనా తండ్రి లక్షణాలకు పూర్తి విరుద్ధలక్షణాలుకల పుత్రులు కూడ జన్మించటం కద్దు.

సంతానాన్ని ప్రేమించటం అనేది సర్వప్రాణి సాధారణమైన అంశం. ప్రకృతి సహజంకూడ. అయితే పశుపక్ష్యాదుల్లో బిడ్డలు స్వతంత్రంగా ఆహారం స్వీకరించి, స్వేచ్ఛాజీవితం గడపేశక్తి వచ్చేంత వరకే పెద్దల రక్షణలో ఉండటం జరుగుతుంది. అనేక జాతుల్లో తల్లి బిడ్డల రక్షణభారం వహిస్తే, కొన్ని పక్షి జాతుల్లో మాత్రం తండ్రి ఆ బాధ్యత స్వీకరించటం జరుగుతుందని జీవశాస్త్రవేత్తల పరిశీలన. మానవ సమాజంలో ఈ బాధ్యత తల్లిదండ్రులిద్దరి పైనా ఆధారపడి ఉంటుంది. తల్లిదండ్రులతో బిడ్డల సంబంధం పరిమిత ప్రయోజనంతో కాక, అనూచానంగా తరతరాలు నిరంతరం సాగుతూనే ఉంటుంది.

వ్యక్తిపరిపూర్ణ వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవటానికి పునాది ఇంట్లోనే పడుతుంది. బిడ్డలకు ప్రథమ గురువులు తల్లిదండ్రులేనని 'మాతృదేవోభవ', 'పితృదేవోభవ' అనే ఉపనిషద్వాక్యం గుర్తుచేస్తుంది. తల్లిదండ్రులు కుమారుణ్ణి ఎంత అధికంగా ప్రేమించినా, అతని జీవితాన్ని ఉత్తమ పథంలో తీర్చిదిద్దటంలో ఏకాగ్రతతో కూడిన జాగరూకతవహించాలి. బిడ్డలకు ప్రథమ పాఠశాల ఇల్లే కనుక, ఇంట్లోని వాతావరణం, తల్లిదండ్రుల పరస్పరసదవగాహన, సోదర సోదరీమణుల సంబంధాలు వ్యక్తి భావిజీవితంపై ఎంతో ప్రభావాన్ని చూపిస్తాయని మనస్తత్వశాస్త్రకారుల పరిశోధనలు తెలియచేస్తున్నాయి. అందువల్ల ముందుగా తల్లిదండ్రులు బిడ్డలకు ఉదాహరణలుగా ప్రవర్తించి మార్గదర్శకులైనట్లయితే సమాజంలోని ఒడిదుడుకులను సదవగాహనతో అర్థంచేసుకొనే శక్తి ఆ బిడ్డలకు లభిస్తుంది. బిడ్డలపై తల్లిదండ్రుల వ్యామోహం, ప్రేమ నియతమైన రీతిలో ఉంచేవారు ఆ ప్రేమమాధుర్యాన్ని ఆస్వాదించి అనుభవించ గలుగుతారు. అట్లాకాక తల్లిదండ్రులు వ్యామోహంతో బిడ్డలకు క్రమశిక్షణ, మానవతా విలువలు నేర్పలేక పోయినట్లయితే వారి ప్రేమ విషభాండంపై తేనె పొరలాగ ఉండి, ఆ బిడ్డల భావిజీవితం విచ్ఛిన్నమై నిష్ప్రయోజకులయ్యే అవకాశం ఉంది. బాల్యంలోనే నియతమైన క్రమశిక్షణ నేర్పకపోయినట్లయితే సంతానం నిష్ప్రయోజకత్వానికి తల్లిదండ్రులు విచారించవలసి ఉంటుంది. కొందరు చిన్నతనంలో అతిగా గారాబంచేసి, క్రమశిక్షణతో పెంచలేక

పెద్దవారయిం తర్వాత వారు సమాజానికి, కన్నవారికి కంటకంగా తయారైనప్పుడు నిస్సహాయతను వ్యక్తం చేస్తారు. కొందరేమో తమకుమారుని అప్రయోజకత్వానికి, దుష్టత్వానికి ఎవరినో కారణంగా ఎంచటానికి ప్రయత్నిస్తారు. 'మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా' అనే సామెత ఇలాంటివాళ్లను చూసే ప్రచారంలోకి వచ్చి ఉంటుంది.

కురుసార్వభౌముడైన ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని గూర్చి

''తగు మాటలాంబికేయుం
దగునని కైకొనునె యెన్నఁడైనను గొడుకున్
మగఁటిమి గలఁడని యెడు న
మ్మిగజూచుచు నుండు విషము మ్రింగిన యేనిన్'' (ఉ. 1-315)

అని ధర్మరాజు సంజయునితో అంటాడు. పెదతండ్రిపై ఈ అభియోగం చాలా తీవ్రంగానే కనపడుతుంది. ఆ ప్రత్యర్థి ధర్మజుని నోట వెలువడటం ఆ అభియోగం తీవ్రతను ద్విగుణీకృతం చేస్తుంది. పాండురాజు మరణానంతరం పాండవులను, కుమారులను

''తనసుతులు పాండుసుతులని
మనమున భేదింప కతి సమంజస భావం
బున నొక్కరూపకాఁ జే
కొనియుండెం బాండురాజు కొడుకుల బ్రీతిన్'' (ఆది. 5-162)

సమానంగా సంభావించిన ధృతరాష్ట్రుడు సంజయరాయబార సమయానికి కొడుకు విషంమ్రింగినా నివారించకుండ నమ్మకంగా చూస్తూఉండే దశకు చేరినట్లు ధర్మరాజు అభియోగం వల్ల తెలుస్తుంది. ధృతరాష్ట్రుని నిష్పక్షపాతవైఖరిని కొనియాడగా, ధర్మరాజు పెదతండ్రి పుత్రవ్యామోహాన్ని నిరసన భావంతో వ్యక్తీకరించాడు. నన్నయసాభిప్రాయం, ధర్మరాజు అభియోగం-ఈ రెండు అభిప్రాయాలను దృష్టిలో ఉంచుకొని ధృతరాష్ట్రునకు పుత్రులపరంగా నెలకొన్న వాత్సల్యాన్ని పరిశీలించటం అవసరం.

ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహం వల్లే సుయోధనుడుచేసే దుష్ట కార్యాలన్నింటికీ వంతపాడి, పాండవులను అన్యాయం చేయటంలో ప్రధానపాత్ర వహించాడని, భారతంలోని అంశాలను ఆధారంగా చూపి, పరిశీలకులు అభిప్రాయం వ్యక్తంచేశారు. అయితే పాండవులపై ద్వేషభావాన్ని, వ్యతిరేకతను పెంచు కోవటానికి ధృతరాష్ట్రుని పుత్ర వ్యామోహమే ప్రధాన కారణమా? లేక ఏ ఒక్కరి ప్రమేయం వల్లగాకాక, పరిస్థితుల ప్రాబల్యం, వాటి క్రమ పరిణామంవల్లే కురువంశం నాశనం అయిందా? అన్నది పరిశీలించవలసినఅంశం. కన్న బిడ్డలను ప్రేమించటమనేది ప్రకృతి సహజమనే విషయం పూర్వోక్తం. సర్వప్రాణి సామాన్యమైన ఈ పుత్రవాత్సల్యం ఆంధ్రమహాభారతంలో ధృతరాష్ట్రునిస్థానాన్ని ఏ విధంగా స్థిరీకరించిందన్న విషయం పరిశీలించటం ప్రస్తుతాంశం.

ప్రతి తండ్రికీ ప్రథమ సంతానంపై ఎంతో ఆకాంక్ష, ఉత్కంఠ నెలకొని ఉండటం సహజం. ధృతరాష్ట్రుడుకూడ ప్రథమ సంతానమైన సుయోధనుని జనన సమయంలో ఇలాంటి ఉత్కంఠకే లోనయ్యాడు. అయితే ఆదిలోనే హంసపాదుపడింది. వంశోద్ధారకుడు పుట్టి బట్టకట్టకముందే ఆ తండ్రి ఒక గడ్డు సమస్యను ఎదుర్కొన్నాడు. సుయోధనుడు జన్మించిన సమయంలో అంతఃపురం లోపలి భాగమంతా నక్కల, గుడ్లగూబల, గార్దభాల అరపులతో మార్మోగింది. బ్రాహ్మణ పురోహితులు ఈ పరిణామాలు రాజవంశానికి అపశకునంగా నిర్ణయించి, పుట్టినబిడ్డ జగజ్జన సంక్షయజననుడు అవుతాడు కనుక అతణ్ణి త్యజించి కులాన్ని రక్షించవలసిందని సలహా ఇచ్చారు. దుర్నిమిత్తాలు భావిసూచకాలని విశ్వాసమేకాని అప్పటికప్పుడే దుష్ఫలితాలేమీ సంభవించలేదు. ఒకవేళ దుష్ఫలితాలు కలిగినా వంశోద్ధారకుడు, అగ్రజుడైన కుమారుణ్ణి ప్రేమబంధం తెంచుకొని ఏ తండ్రీ త్యజించలేడు. అందువల్లే ధృతరాష్ట్రుడుకూడ 'పుత్రమోహంబున' వారి పలుకులు స్వీకరించలేక ఉదాసీనంగా ఉన్నాడు. ధృతరాష్ట్రుని ఈ ఉదాసీనత లోకసహజంగానే భావించటం సమంజసం.

బాల్యక్రీడా వినోదాల్లో ధార్తరాష్ట్రులు భీమునిచేత అధికంగా బాధించబడే వారు. ఆ బాధలు తట్టుకోలేని సుయోధనుడు భీష్మ విదురులకు తెలియకుండ భీమునకు అపాయం తలపెట్టాడు. 'భీష్మ విదురులకు తెలియకుండ' అనటంవల్ల పరిశేషన్యాయంతో తండ్రి ధృతరాష్ట్రునకు చూచాయగానైనా, అతని ప్రయత్నాలు

తెలిసి ఉండవచ్చునని తలంచవచ్చు. తెలిసీ ధృతరాష్ట్రుడు ఉపేక్ష వహించాడంటే పిల్లల తగాదాలలో కల్పించుకోవలసిన అవసరం లేదనే భావంతోనేకాని భీముణ్ణి అంతంచేసే అంశంలో అతడి అంగీకారంకూడ ఉన్నదని భావించటానికి ఆధారం మృగ్యం.

ధృతరాష్ట్రుడు కుమారుని వేడుక తీర్చటానికి తీసుకొన్న నిర్ణయాలలో అంగరాజ్యాభిషేకం ప్రధానమైంది. పాండవ ధార్తరాష్ట్రులు కృప, ద్రోణాచార్యుల పర్యవేక్షణలో విలువిద్యాభ్యాసం చేసి నిష్ణాతులయ్యారు. శిష్యుల శస్త్రాస్త్ర పాండిత్యపాటవాన్ని కురువృద్ధులకు ప్రదర్శించాలనే సంకల్పంతో ద్రోణుడు పెద్దల అనుజ్ఞతో కుమారాస్త్ర విద్యాప్రదర్శనం ఏర్పాటు చేశాడు. ఆ విద్యాప్రదర్శనలో అర్జునుడు కురుకుమారులలో అద్వితీయుడుగా ప్రసిద్ధికెక్కాడు. ఆసమయంలో కర్ణుడు అర్జునునకు ప్రతిద్వంద్విగా తారసిల్లాడు. సుయోధనునకు పాండవులను అధిగమించేందుకు కర్ణుడు ఆలంబనం అవుతాడనే ఆశకలిగింది. ఆ ఆశతోనే అతనితో చెలిమి చేయనిశ్చయించి చేరదీశాడు. కృపాచార్యుడు కర్ణుని కులంప్రసక్తి తెచ్చి అవమానిస్తాడు. తన మిత్రునకు జరిగే అవమానం తనకే జరిగినట్లుగా సుయోధనుడు భావించాడు. పాండవుల ధాటిని ఎదుర్కొనటానికి తనకు లభించిన ఆలంబనాన్ని నిష్ప్రయోజనం చేసేందుకు పెద్దల ప్రయత్నం అతనికి కోపాన్ని పట్టుదలను పెంచింది. రాజ్యం లేకపోవటమే విద్య ప్రదర్శించటానికి కర్ణునకు అనర్హత అయినట్లయితే

"ఎల్లవారలు జూడంగ నీక్షణంబ
రాజుఁజేసెద నేనంగరాజ్యమిచ్చి" (ఆది.6-48)

అని, భీష్మ ధృతరాష్ట్రుల అనుమతిలో కర్ణుని అంగరాజ్యాధిపతిని చేశాడు.

సుయోధనుడు అంగరాజ్య ప్రదానంచేయటం పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఆక్షణంలో జరిగిన నిర్ణయమేకాని, దాని పూర్వాపరాలు ముందుగా పెద్దలతో ఆలోచించి చేసిన నిర్ణయంకాదు. కర్ణునకు అంగరాజ్యం ఇవ్వాలని ప్రకటించిన అనంతరమే భీష్మ ధృతరాష్ట్రుల అనుమతి కోరటంజరిగింది. అలాంటి సమయంలో కుమారుని అభీష్టాన్ని కాదన్నట్లయితే సుయోధనుడు రెండువిధాలుగా అవమానాన్ని భరించవలసినవాడవుతాడు. అర్జునుణ్ణి ఎదుర్కొనకలిగిన సరిజోడు కౌరవపక్షంలో

లేదనే బాధ ఒక వంకపీడిస్తుంటే, తనప్రతిష్ఠ నిలవగలడనుకొన్న హితునకు రాజ్య ప్రదానంచేయ నిశ్చయిస్తే బాల్యచేష్టగాకొట్టివేసి అనుమతి నిరాకరించినట్లయితే సకలరాజన్యలోకంలో చిన్నతనమవుతుంది. అనంతరం సుయోధనునకు మహా వీరునిగా, ధార్తరాష్ట్రాగ్రజునిగా లభించవలసిన గౌరవపురస్కారాలు దూరం అవుతాయి. భృత్యవర్గం అతణ్ణి తక్కువ చేసిచూస్తారు. ఏ తండ్రీ తనకుమారుడు ఈ పరిస్థితిని ఎదుర్కోవటం భరించలేడు. అదీగాక కర్ణునకు అంగరాజ్యాభిషేకం చేసినందువల్ల వెనువెంటనే రాజకీయంగా విపరీత పరిణామాలేమీ సంభవించవు. చక్రవర్తిగా మంత్రి, పురోహిత, కవిపండితులకు రాజ్యభాగాలెన్నో దానంచేయటం సహజంగా జరిగేవిషయమే. స్వీకరించినవారు దానివల్ల ప్రయోజనాలను పొందుతూ, సార్వభౌముని అధీనంలో ఉండవలసిన వారేకాని స్వతంత్ర పాలకులుకాలేరు. చక్రవర్తి మంచితనం కోల్పోయిన మరుక్షణం వారు పదవీభ్రష్టులవుతారు. అందువల్లే ధృతరాష్ట్రుడు సభామధ్యంలో కుమారుణ్ణి చిన్నబుచ్చటం ఇష్టంలేకను, అతడి కోర్కెను తీర్చినందువల్ల వెంటనే సంభవిల్లగల ప్రమాదం ఏదీలేదని భావించటంచేతను సుయోధనుని కోర్కెకు అంగీకారం తెలిపాడు. అయితే కర్ణుని అంగరాజ్యాభిషేకం భారత కథలో అనంతర పరిణామాలకు ప్రధానకారణమైంది. అది వేరేవిషయం. ఏమైనా కుమారాస్త్ర విద్యాప్రదర్శన సమయంలో నెలకొన్న పరిస్థితుల్లో ధృతరాష్ట్రుడు కుమారుని కోర్కెను తీర్చటం సమంజసంగానే ఉంది.

ధృతరాష్ట్రుడు కుమారుని మనోభీష్టాన్ని తీర్చటానికి చేసిన మరొక ప్రధానకార్యం కుంతీసహితులైన పాండవులను వారణావతం పంపటం. ద్రోణునకు గురుదక్షిణగా బంధితుడైన ద్రుపదుణ్ణి సమర్పించినందుకు సంతోషసూచకంగా కురుపాండవులందరకూ అగ్రజుడైన ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం చేశాడు. ధర్మరాజు యువరాజయిన తరువాత పాండవ వైభవం సుయోధనునకు అసూయా కారణమైంది. పాండవుల అడ్డును తొలగించే ప్రయత్నంలో కర్ణ శకునులతో ఆలోచించి కణికుని ఉపదేశంతో తండ్రిదగ్గరచేరి తన మనోవేదనంతా వ్యక్తంచేస్తాడు. అయితే సంస్కృత భారతంలో పాండవుల వైభవానికి ధృతరాష్ట్రుడే అసూయాగ్రస్తమానసుడై కణికుని పిలిపించి, హృదయవేదనను తెలిపి, వారితో తాను ఏవిధంగా ప్రవర్తించవలసి ఉందో చెప్పవలసిందంటూ

"ఉత్సక్తాః పాండవా నిత్యం తేభ్యో ఒ సూయే ద్విజోత్తమ

**తత్రమే నిశ్చితతమం సంధివిగ్రహకారణం**
**కణికత్వం మనూచక్ష్వ కరిష్యే వచనం తవ''**[3]

అని అర్థిస్తాడు. నన్నయ కణికునితో మంత్రాంగం చేసినవాడు సుయోధనుడే అనిమార్చటం కుమారుని ప్రాధాన్యాన్ని పెంచి, ధృతరాష్ట్రుడు పుత్రుని అభీష్టానుసారం ప్రవర్తించేవాడేకాని స్వతంత్రంగా వ్యవహరించే సామర్థ్యంలేనివాడని చెప్పటానికే కావచ్చు.

సుయోధనుడు ఆత్మరక్షణ ఆలోచనతో, పాండవులను చూసి భయపడుతున్నట్లు, అంటే కుతోడు ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం చేయటంవల్ల పౌరజానపదులు అతడికే అనురక్తులై ప్రజ్ఞాచక్షువు రాజ్యపాలనకనర్హుడని త్రోసిపుచ్చి ధర్మరాజుకే పట్టాభిషేకంచేస్తారు అని తండ్రితో తనబాధను చెప్పుకొంటాడు. ఈమేరకు ప్రజలు ఆలోచనలు చేస్తున్నారనీ, ప్రజాభీష్టం తనవైపు మళ్లేంత వరకు పాండవులను హస్తినాపురానికి దూరంగా పంపవలసిందని కోరుతాడు. ప్రస్తుతం ధర్మరాజు రాజైతే శాశ్వతంగా కౌరవసంతతి వారిభృత్యులై సేవించ వలసి ఉంటుందనీ, తండ్రిహృదయానికి హత్తుకొనే విధంగా తన బాధను వ్యక్తంచేస్తూ

**''... అట్లుగా**
**కుండ మమ్ము జేయనోపుదేని**
**పాండురాజు తొంటిభక్తియు నప్పాండు**
**తనయులందు దయయు దలపకుండు''** (ఆది. 6-128)

అని అర్థిస్తాడు. ధృతరాష్ట్రుడు పాండవుల ఔన్నత్యం ఎడ కుమారుని మనసులో ఉన్నభయాందోళనలే తనమనసులోకూడ ఉన్నాయని, వారిని వారణావతం పంపటం తనకు అంగీకారమే అయినప్పటికీ గాంగేయ విదురాదులు అంగీకరించరేమో ! అనే అనుమానం వ్యక్తంచేస్తాడు. ధృతరాష్ట్రుని నిర్ణయానికి వారెవరూ అడ్డు చెప్పలేరని ధైర్యంచెప్పగా, కుంతీసహితులైన పాండవులను వారణావతం పంపించాడు.

పాండవులను వారణావతం పంపటానికి పుత్రమమకారంతోపాటు ధృతరాష్ట్రుని మనోభయంకూడ కారణం అని సంస్కృత భారతం వల్లతెలుస్తుంది. కొంతకాలంవారు హస్తినాపురానికి దూరంగాఉంటే ప్రజలలో వారిఎడ అభిలాష

సన్నగిల్లుతుందనే అభిప్రాయమేకాని, పాండవులను మట్టుపెట్టాలనే శత్రుభావం ధృతరాష్ట్రునకు ఆదశలో ఉన్నట్లు తలంచలేము. లోకంలో ఏతండ్రి అయినా తనకుమారులతో శత్రుభావం ఉన్నవారితో తనవారిని దూరంగాఉంచాలనే ప్రయత్నం చేయటం సహజం. అంతేకాని శత్రుత్వం పెంచటానికి అంగీకరించడు. అయితే ధృతరాష్ట్రుడు సార్వభౌముడు కనుక తనఅధికారాన్ని ఉపయోగించి పాండవులనే దూరంగా పంపించాడు.

మానవజీవితంలో జరిగేకొన్ని సంఘటనలు జీవితపథాన్నే మార్చివేస్తాయి. మానవుడు ఒక ఫలితాన్ని ఆశించికార్యం చేయ తలపెడితే పరిస్థితుల ప్రాబల్యంవల్ల వ్యతిరేక ప్రయోజనంసిద్ధిస్తుంది. పాండవులను వారణావతం పంపి కొంతకాలం హస్తినాపురానికి దూరంగా ఉంచాలని మాత్రమే ధృతరాష్ట్రుని ఆలోచన. కాని సుయోధనుడు పురోచనుని నియోగించి పాండవహత్యా ప్రయత్నంచేశాడు. ధృతరాష్ట్రుడు తన ప్రమేయంలేకుండానే పాండవ హత్యాయత్నంలో భాగం పంచుకోవలసినవాడయ్యాడు. వ్యాసుడు, శ్రీకృష్ణుడు, భీముడు, వారణావత ప్రజలు కూడ ధృతరాష్ట్రుణ్ణే ప్రధానబాధ్యుణ్ణిచేసి నిందించారు. అందుకే సంకల్పం మంచిదైనా దానివల్ల కలిగే ప్రయోజనాలనుకూడ ముందుగానే పరిశీలించటం అవసరం. కుమారుని అభిలాష తీర్చేముందే ఈ దుష్పరిణామాలు సంభవిస్తాయని ధృతరాష్ట్రుడు ఆలోచించకపోవటం అతడిలోపంగానే తలచవలసి ఉంటుంది.

పాండవులు లాక్షాగృహంలో దహించబడ్డారని తెలిసి సుయోధనాదులు సంతోషించారు. భీష్మ, ధృతరాష్ట్రాదులు, ప్రజలు విషాదాన్ని పొందారు. అయితే ధార్తరాష్ట్రుల ఆనందాన్ని వమ్ముచేస్తూ పాండవులు ద్రౌపదీవివాహంతో పాంచాలుర బంధుత్వాన్ని పొందారు. పాండవ పాంచాలానుబంధం సుయోధనుణ్ణి తీవ్రమైన ఆలోచనకు గురిచేసింది. ఎట్లాఅయినా పాండవులను ద్రుపదునినుంచి వేరుచేయాలనే సంకల్పంతో ద్రుపదునకు పాండవులకు భేదంకల్గించటం, కౌంతేయ మాద్రేయులకు భేదం కల్పించటం, భీముణ్ణి సంహరించి తక్కినవారిని బలహీనులను చేయటం వంటి ప్రత్యామ్నాయ మార్గాలను ఆలోచించారు. ఆ ఆలోచనతోనే తండ్రినిచేరి ఎల్లప్పుడూ విదురుడు తండ్రి చెంతనే ఉండటంవల్ల సాన్నిహిత్యం పొందటానికి అవకాశంలేక పోతోందని, తండ్రి విదురుని మాటేవింటాడని సుయోధనుడు నిష్ఠూరంగా పలికాడు. తనమీద అభిమానం చూపటంలేదని కన్నకొడుకే నిందమోపుతుంటే ఏ కన్నతండ్రీ

భరించలేడు. ప్రతితండ్రీ ఎల్లప్పుడూ పుత్రుని ప్రయోజనాన్నే ఆకాంక్షిస్తాడు. అందుకే సుయోధనుని నిష్ఠురోక్తులు ఆతండ్రి హృదయాన్ని బాధకుగురిచేశాయి. అందుకే విదురుడు తనచెంత ఉన్నప్పుడు పాండవులపై ప్రేమఉన్నట్లు ప్రవర్తిస్తానుకాని, నామనసును ఎన్నడూ ఎరిగించననీ, మీరు ఆలోచించినట్లే ఆలోచిస్తూంటాననీ. ఇప్పుడు చేయదగ్గ కర్తవ్యం ఏమిటో వివరించమని' తన ఆంతర్యం కుమారునకు వివరించాడు. అందుకు సుయోధనుడు

"... పాంచాల పతియొద్ద
నుండకుండఁజేయు టుచిత మిపుడు" (ఆ. ది: 8-21)

అని తన ఆలోచనను నివేదిస్తాడు.

పాంచాల పాండవ సంయుక్తశక్తి సుయోధనాదులకు లాగానే ధృతరాష్ట్రునకుకూడ భయకారణమై ఉంటుంది. లాక్షాగృహ సంఘటన పాండవుల హృదయాలలో శత్రుభావాన్ని పెంచింది. అందువల్లే ద్రౌపదీవివాహానికి ధృతరాష్ట్రులను ఆహ్వానించలేదు. పాంచాల పాండవ యాదవ సయోధ్య తనకు, కుమారునకు ప్రమాదకారి అనితలచి, పెద్దల అనుమతి ప్రకారం ప్రవర్తించినట్లు పైకి కనిపిస్తూ, తమ్ముని కుమారులపై అభిమానం ప్రకటిస్తూ, శత్రుకూటాన్ని బలహీనపరచే ఉద్దేశంతోనే పాండవులను పాంచాలురనుంచి విడదీయాలనే ఆలోచనకు సమ్మతించాడు. భీష్మవిదురాదుల హితవచనాలకు అనుగుణంగా పాండవులను సాదరంగా హస్తినాపురానికి రప్పించి అర్ధరాజ్యం ఇచ్చి సత్కరించాలని నిశ్చయించాడు. అర్ధరాజ్య ప్రదానంలో కూడ రాజధానిలో కుమారునకు అడ్డంకి లేకుండాచూడటమే ప్రధానాంశం అనిభావించటం సమంజసంగా ఉంటుంది. ఇలాంటి సందర్భాల్లో ఏతండ్రి అయినా ఇంతకన్నా వేరువిధంగా ప్రవర్తించలేడని భావించటం సమంజసం

పుత్రమమకారంతో ధృతరాష్ట్రుడు అనుసరించిన వివాదగ్రస్తమైన మరొక అంశం పాండవులను ద్యూతానికి ఆహ్వానించటం. ఇంద్రప్రస్థం రాజధానిగా రాజసూయం దిగ్విజయంగా నిర్వహించి ధర్మరాజు రాజన్యలోకంలో కీర్తిశేయుడయ్యాడు. రాజసూయ నిర్వహణంలో సుయోధనాదులు ప్రముఖస్థానాలే నిర్వహించారు. పాండవైశ్వర్యం సుయోధనునకు అసూయాకారణమైంది. మయసభలో పొందిన అవమానం, ద్రౌపదీభీముల అవహేళన ఆ అసూయను ద్విగుణీకృతంచేసి శరీరాన్ని కంపింపచేసింది. శకుని సుయోధనుని మనస్తాపాన్ని తెలుసుకొని, నివారణ

మార్గం అన్వేషించి, పాండవైశ్వర్యాన్ని అపహరించేందుకు ధృతరాష్ట్రుని అనుజ్ఞ పొందితే సాధించటం సులభమని సలహా ఇస్తాడు. శకుని అవమాన దగ్ధశరీరుడైన సుయోధనునితండ్రి ప్రత్యక్షంలోకి తీసుకొనివచ్చి అతడి 'శరీర కార్శ్యవైవర్ణ్యంబులు' వివరించి చెపుతాడు. అగ్రనందనుని మనోతాపానికి ఆతండ్రి హృదయంక్షోభచెంది, ఆవేదనతో ఒడలంతా తడవి అధికంగా దుఃఖిస్తాడు. ఈసమయంలో ధృతరాష్ట్రుని పుత్రప్రేమ సహజమై వర్తిల్లుతుంది. కుమారుని ఖేదానికి కారణం ఏదైనా అతడి పరిస్థితిని భరించలేక పోయాడు. కుమారుని ఓదార్చే ప్రయత్నంలో

"కౌరవైశ్వర్యంబు గౌరవంబున సమ
ర్పితమయ్యె నీ యంద పేర్మితోడ
ననుజులు మిత్రులు ననుచరులు నీకుఁ,
బ్రీతులుకాని యప్రియులు లేరు
వివిధోపభోగముల్ దివిజేశునకుఁగల,
యట్టుల కలవు నీకనుభవింప
సకల భూపతులుఁ బాయక భక్తియుక్తులై
యొలసి నీపనుపు సేయుదురు పేర్మి
నేమి గొఱతయయ్యె నిట్లు డయ్యను దను
చ్ఛాయ తఱిగియుండ సకలధరణి
రాజ్యభోగ సుఖపరాఙ్ముఖత్వముఁబొంద
నేలనీకుఁ గురుకులేశ్వరుండ" (సభా. 2-102)

అని చెప్పి సకలైశ్వర్యాలు అనుభవిస్తున్ననీకు శోకకారణం ఏమిటని ప్రశ్నిస్తాడు. 'కురుకులేశ్వరుండ' అనేసంభావనలో కుమారుణ్ణి తానేవిధంగా చూచుకోవాలను కుంటున్నాడో ఆత్మీయంగా వ్యక్తచేశాడు.

సుయోధనుడు పాండవరాజసూయ విశేషాలను వివరించి, శత్రువర్గంవారి వైభవాన్ని చూసి

"ఏను నొక రాజ సుతుఁడనై యెట్లు దీనిఁ
జూడనోపుదుఁ బాభవశూన్యునట్లు (సభా. 2-107)

అని వాపోయాడు. రాజసూయ సభా మధ్యంలో ధర్మరాజు వైభవాన్ని చూసి

"యేను మొదలుగా మహీపతులెల్లను
దీప్తి దఱిఁగి యుండఁ దివిరిమమ్ము
నగిరి కృష్ణ పాండునందన ద్రౌపదీ
సాత్యకులుఁ గరంబు సంతసమున" (సభా. 2-119)

అని వారి వైభవంవల్ల కలిగిన అసూయకన్న, తత్పక్షీయుల పరిహాస ధోరణి భరించరాని అవమానమై హృదయ శల్యమౌతుందని తండ్రి హృదయానికి హత్తుకునేటట్లు విన్నవించాడు. 'మొగుడు మొత్తినందుకుకాదు, తోడికోడలు నవ్వినందుకు' అనే సామెత సుయోధనుని ఎడ సక్రమంగా సరిపోతుంది. ఈ అవమానం భరిస్తూ

"కష్టపురుషునట్టు లోరుల
పేర్మిఁజూచుచుండఁ బెద్దయునేనోప" (సభా. 2-121)

అని ప్రస్తుత స్థితిలో ఆత్మత్యాగం తప్ప మార్గాంతరం లేనట్లు తన మనోవ్యధను వెల్లడించాడు.

ధృతరాష్ట్రుడు కుమారుని వ్యధను తీర్చి మనసుకు సుఖం కలిగించటం తక్షణ కర్తవ్యంగా భావించాడు. పాండవైశ్వర్యమే కుమారునకు బాధాకరమైందని మనసులో నిశ్చయించుకొని "ధర్మజు ధన సంపదకంటె నేనుమదుంగులు నీకు ధన సంపద గలదు వాని చేసిన యజ్ఞంబుకంటె విశేషంబుగా దక్షిణలిచ్చి నీకిష్టంబయిన యజ్ఞంబు సేయుము నీకును భూలోకంబునం గల రాజులెల్లం దమ సర్వస్వమ్ములుఁ దెచ్చియిత్తురు" (సభా. 2-137) అని చెప్పి సుయోధనుని మనసును ఊరట పరచ ప్రయత్నించాడు. అయితే తండ్రి సూచించిన ప్రకారం యజ్ఞం చేస్తే అది ఐశ్వర్య ప్రదర్శన అవుతుందేకాని, మయసభలో జరిగిన అవమానానికి ప్రతీకారం కాదు. పాండవులను హీనపరచటమే ప్రత్యపమానంగా భావించి అందుకు ఋజు మార్గఁ సాధ్యం కానట్లుంటే మోసానికైనా సిద్ధం కావాలని ఆలోచించాడు. తాను అనుసరించే అక్రమ మార్గం తండ్రి అనుమతి పొందాలంటే తండ్రి హృదయానికి హత్తుకొనేలాగా తన దీనత్వాన్ని ప్రదర్శించాలి. అందుకే మయసభలో 'నన్నుం జూచి వృకోదరుండు నగియె' అని ప్రత్యేకంగా విన్నవిస్తాడు. ఇట్లా తన మనో

వ్యధకు అసలు కారణం వ్యక్తంచేసి, ఎట్లాగైనా పాండవ సంపదను హరించాలనీ, అందుకు శకుని జూదంలో పాండవులను పరాజితులను చేయటం తన మనోరథం అని వివరించాడు. తండ్రికి మరొక మాట మాట్లాడే అవకాశం ఇవ్వకుండ

"దీనికొడఁబడు యొడఁబడవేని నేఁడ
యీక్షణము సర్వభక్షుచే భక్షితుండ
నగుదుఁ దెల్లమేనట్లైన నగపుడక్కి
విదురుడును నీవు నుండుఁడు ముదముతోడ" (సభా. 2-127)

అని విస్ఫూరంగా శాసించినట్లు పలుకుతాడు.

కుమారుడు అంత తెగించి మాట్లాడుతుంటే ఏ తండ్రి మాత్రం ఏమి చేయగలడు? కుటుంబ శ్రేయస్సుకోసం వ్యక్తిని త్యాగం చేయాలని ధర్మశాస్త్రాలు చెపుతున్నా, ఆ ధర్మాన్ని పాటించేవారు లోకంలో చాలా అరుదుగా ఉంటారు. ఎన్ని ధర్మపన్నాలు పలికినా తన కుటుంబం, కుమారుడు అనేటప్పటికి త్యాగం చేయలేరు. మానవ ప్రకృతి కది సహజం. ధృతరాష్ట్రుడు కూడ లోకసామాన్యమైన తండ్రుల స్థాయిని అధిగమించలేకపోయాడు. అందుకే ఇతడు కావ్యాదర్శమైన పాత్రగా కాకుండ లోక సామాన్యమైన ఒక తండ్రికి ప్రతీకగా సజీవమైన వ్యక్తిగా భారతంలో కపిపిస్తాడు. అందువల్లే జూదంవల్ల వచ్చే అనర్థాలన్నీ ఎరిగి, అది ఉచితం కాదని మనసుకు తెలిసినా 'ఆత్మజునకు ఆహ్లాదము' కలిగించేందుకు సుహృద్ద్యూతానికి అనుమతి ఇచ్చాడు.

పాండవుల ఐశ్వర్యం, బలపరాక్రమాలు, కీర్తి ప్రతిష్ఠలు, రాజ్యవైభవం ధృతరాష్ట్రుని హృదయంలో కూడ కొంత అలజడిని కలిగించి ఉంటుంది. కుమారుని ఆలోచనకు ప్రోద్బలకంగా ఆ అలజడి కూడ అతడి ప్రవర్తనకు కారణం అయి ఉండవచ్చు. అదీగాక కుమారుని వ్యక్తిత్వం పైన, ప్రయోజకత్వం మీద విశ్వాసం ఏర్పడి ఉండవచ్చు. కొడుకు విషయ పరిజ్ఞానంతో ప్రయోజకుడైనాడని విశ్వాసం కలిగినట్లయితే, వయసుమీదపడే ప్రతి తండ్రీ అనేక విషయాల్లో అతని ఆలోచన పైనే ఆధారపడటం సహజం. తండ్రి తన కళ్లతో కాకుండ సమాజాన్ని కుమారుని లోచనాలతో చూసి, ఆ కుమారుని మనసుతోనే ఆలోచించ మొదలు పెడతాడు. ధృతరాష్ట్రుని పరిస్థితి కూడ ఇంతకన్నా భిన్నంగా కనిపించదు. ఆ రాజు ఈ

మనస్తత్వాన్ని చక్కగా అర్థం చేసుకొన్న ధర్మరాజు, ధృతరాష్ట్రుని పుత్రాధీనతను సంజయునకు విశదం చేస్తాడు.

ధృతరాష్ట్రుడు సుహృద్ద్యూతానికి, అనుద్యూతానికి అనుమతి నీయటం వల్ల-కలిగిన విపరీత పరిణామాలు కురుక్షేత్ర యుద్ధం వరకు విస్తరించాయి. ఈ మధ్య కాలంలో జరిగిన సంఘటనలు ఇరువర్గాల మధ్య దూరాన్ని పెంచాయేకాని సుహృద్భావాన్ని సంపాదించాన్ని పెంపలేక పోయాయి. ధృతరాష్ట్రుడుకూడ ఆ మార్గంలో చిత్తశుద్ధితో ప్రయత్నించలేదు. ఇందుకు కుమారుని ప్రభుత్వపై, అతడి అభివృద్ధిపై మక్కువ కారణంకాగా ఎదిరి పక్షంనుంచి సదవగాహనతో కూడిన ప్రోత్సాహం లభించక పోవటం ఇంకొక కారణం కావచ్చు.

కురుపాండవ సంబంధాలపై ధృతరాష్ట్రుని హృదయంలో కలిగిన ఈ పరిణామంవల్లే అనేక సందర్భాలల్లో ఉదాసీనంగా, నిర్లిప్తంగా వ్యవహరించాడు. శకుని ధర్మరాజుల మధ్య సాగే జూదంలో పట్టుదలలు పెరుగుతున్న సమయంలో విదురుడు ఆ నిష్టద్యూతాన్ని ఆపుచేయించమని అర్థిస్తాడు. ధృతరాష్ట్రుడు 'పుత్ర స్నేహంబున నెద్దియుంజేయునది నేరక' మౌనంవహించాడు. ధర్మరాజు జూదంలో సమస్తమూ కోల్పోయినప్పుడు సభలో ఎంతో ఆందోళన రగులుతుంది. ఆ అలజడికి కారణం తెలుసుకొని వారించే ప్రయత్నం చేయకుండ "ఇదియేమి సభాక్షోభం బెవ్వరెవ్వరేవస్తువు లోడ్డిరి" (సభా. 2-199) అని అమాయకంగా ప్రశ్నిస్తాడు. అతడికి పుత్రుల విజయంపట్ల ఉన్న ఉత్కంఠ సభాసంక్షోభకారణం తెలుసుకొని నివారించటంలో ఉన్నట్లు గోచరించదు. చక్రవర్తిగా, కుటుంబంలో పెద్దవాడుగా ధృతరాష్ట్రుని ప్రవర్తన ఈ సమయంలో ప్రశ్నార్థకంగా మిగులుతుంది. అయితే సభలో ఈ విషమ పరిస్థితికి ఆ రాజు పుత్రవ్యామోహం ఒక్కటే కారణం అని చెప్పలేము. ధర్మరాజు జూద వ్యసనంకూడ తోడైనట్లు తలంచవచ్చు. ద్రౌపదీ భీములుకూడ ధర్మరాజు ద్యూతవ్యసనాన్ని నిరసించారు. అందువల్ల ద్యూతసమయంలో ధృతరాష్ట్రుని ప్రవర్తన ప్రశ్నార్థకంగానే కనిపిస్తున్నా, అందుకు పరిస్థితుల ప్రాబల్యమే కారణంకాని, ఆ రాజు పుత్రవ్యామోహం మాత్రమేననటం సమంజసంకాదు.

ద్యూతసమయంలో సంభవిల్లిన పరిణామాలపై సభలో నిరసన వెల్లడయింది. ఆ నిరసనను దృష్టిలో ఉంచుకొని, పెద్దల మాటకు విలువనిచ్చి పాండ

వులను దాస్యవిముక్తులను చేసి రాజ్యదానం చేస్తాడు. రాజ్యప్రదానమైతే చేశాడు కాని సభలో భీముడుచేసిన ప్రతిజ్ఞలు ఆ రాజుహృదయాన్ని భేదిస్తూనే ఉండి ఉంటాయి. సుయోధనుడుకూడ వారికి రాజ్యాన్నిచ్చివేయటం విషసర్పాన్ని కదలించి కంఠం సమీపంలో వదలటం వంటిదే అని చెప్పి, ఏ విధంగానైనా "వారలననుద్యూతంబునఁ బరాజితులంగావించి విరళ దేశ నిర్వాసితులంజేయుట కార్యంబు" (సభా. 2-274) అని క్రొత్త ప్రతిపాదన చేస్తాడు.

పాండవులకు ధృతరాష్ట్రుడు దానంచేసిన రాజ్యంవల్ల బలవంతులౌతారే కాని, ఏ విధంగాను బలహీనులుకారు. తాత్కాలికంగా మిన్నకున్నప్పటికీ, మిత్ర బంధు సముదాయాన్ని కూర్చుకొని సుయోధనాదులకు భయకారణం కావచ్చు. భీముని ప్రతిజ్ఞలు కార్యరూపం ధరిస్తే సుయోధనుని మరణం తప్పదు. రాజ్యదానంవల్ల పాండవులు రాజ్యభోగాలు అనుభవిస్తుంటే తన కుమారులు ప్రమాదం వంచనే ఉన్నట్లు ఆ రాజు దృఢమైన నిర్ణయానికి వచ్చాడు. దూరప్రాంతాలకు పంపినట్లయితే రాజ్య భ్రష్టులవటంతో వారు బలహీను లవుతారు. ప్రస్తుతానికి ప్రమాదం తప్పుతుంది. ఈ కోణంలో ఆలోచిస్తే సుయోధనుని ప్రతిపాదన ఆ తండ్రికి సహేతుకంగా కని పించింది. ఒకవేళ అనుద్యూతంలో ధర్మరాజు గెలిస్తే వచ్చే పరిణామాలేమిటో ధృతరాష్ట్రుడు ఆలోచించలేదు. అయితే శకుని కైతవనైపుణ్యంపై ఆతని విశ్వాసం ప్రగాఢమైందని తలచ వలసి ఉంటుంది. ఈ అంశాలన్నీ ఆలోచించే భీష్మవిదు రాదుల ప్రమేయం లేకుండానే అనుద్యూతానికి అనుమతి ఇచ్చాడు.

సంస్కృత భారతంలో మాత్రం అనుద్యూత ప్రయత్నంనుంచి కుమారుణ్ణి విరమింప చేయటానికి ధృతరాష్ట్రుడు ఎన్నో విధాలుగా ప్రయత్నిస్తాడు. గాంధారి విదురులుగూడ ప్రయత్నించి విఫలులవుతారు. చివరకు గత్యంతరంలేక భారం అంతా విధికి వదలి అనుద్యూతానికి అనుమతి ఇస్తాడు.[4] ఈ సందర్భంలో నన్నయ చేసిన మార్పు సందర్భోచితంగాను, సాత్రోచితంగాను ఉండి మానవ స్వభావాను గుణంగా వర్తిల్లుతున్నది. ప్రస్తుత పరిస్థితుల్లో ఏ తండ్రికూడ తన కుమారుల ప్రాణాలకు ముప్పుతెచ్చిపెట్టగల వారిని ఆదరించలేడు. ఒకవేళ ఆదరించినా సుహృద్భావం అభివృద్ధి చెందుతుందనే ఆశలేదు. పరిస్థితుల ప్రాబల్యం ఇరువర్గాల సంబంధాలను అంత తీవ్రస్థాయికి చేర్చింది. ధృతరాష్ట్రునకు అనుద్యూతానికి అను మతించటం తప్ప మార్గాంతరం కనపడదు.

మహాభారత కథలో జరిగిన అనంతర పరిణామాలు, ధృతరాష్ట్రుడు కుమారునిపై మమకారం పెంచుకొని, ఆత్మీయంగా దగ్గరై అతడి ఆధీనంలో ఉన్నట్లు తెలియచేస్తున్నాయి. కుమారుణ్ణి ఎవరైనా నిందించినా సహించలేని స్థితికి వచ్చాడు. ఒక సందర్భంలో విదురుడు సుయోధనుణ్ణి త్యజించ వలసిందని సలహా ఇస్తాడు. ఎవరైనా ఇతరులకోసం కుమారుణ్ణి వదులుకుంటారా! అంటూ

"నా దేహంబునఁ బుట్టిన
యాదిసుతున్ విడువ నెట్టులగు నాత్మజులం
గాదనక విఘాతించు ద
యాదూరులు గలరె యిట్టులన నీకగునె" (అరణ్య. 1-53)

అని సామాన్య మానవునిలాగా పుత్రవ్యామోహాన్ని ప్రదర్శించాడు. అట్లాగే వ్యాసునితోకూడ "దుర్యోధనుం బుత్రస్నేహంబున విడువనోపను" (అరణ్య. 1-80) అని వాపోతాడు. ఆ పుత్రవ్యామోహంతోనే పాండవులకు అపకారం జరిగేందుకు అవకాశం ఉందని తెలిసికూడ ఘోషయాత్రకు అనుమతి ఇచ్చాడు. ఆ వ్యామోహంతోనే సుయోధనునితో వైష్ణవయాగం చేయించాడు. అజ్ఞాతవాస సమయంలో సుయోధనుడు పాండవుల ఉనికిని తెలుసుకొనేందుకు గూఢచారులను నియోగించిన విషయం ధృతరాష్ట్రునకు తెలిసినట్లు భారతంలో చెప్పకపోయినప్పటికీ, తెలిసినా ఉదాసీన భావంతో మౌనం వహించినట్లు తలంచవచ్చు. పాండవులను గుర్తించ గలిగితే వారు కురుసామ్రాజ్యంలో ప్రవేశించే అవకాశం కోల్పోతారు. ఆ విధంగా సుయోధనాదులకు రాగలదనుకొన్న ప్రమాదాన్ని వారించవచ్చు.

ధృతరాష్ట్రుని పుత్రాధీనత ఉద్యోగ పర్వంలో ఇంకా బహిర్గతమై ఇతరుల నిందకుకూడ గురి అయింది. అయితే వారిలో ఎక్కువమంది పాండవ హితైషులు. ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భంలో ఏర్పాటు చేసిన సభలో ద్రుపదుడు "తనూజతృష్ణనూనినవాడు"

"కొడుకు గొన్నవేదుఱ
కొని కొట్టిన తిండికాడు కుటిలుండు" (ఉద్యోగ. 1-36, 56)

అని ధృతరాష్ట్రుని నిందిస్తాడు. ఈ నింద కొంత వాస్తవంగా కనపడుతున్నప్పటికీ, తన మనోరథం నెరవేరే విధంగా ఎంతో ప్రేమతో కుమారుణ్ణి పెంచుకొన్న ద్రుప

డుడు ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని విమర్శించటం సమర్థనీయంకాదు. పాండవ రాయబారిగా వచ్చిన ద్రుపద పురోహితుడు, పాండవులను సుయోధనాదులు మోసం చేస్తుంటే

"దీనికి నెల్లనియ్య, కౌనియె నీపెద్దరాజు నేమనగనేర్తు"

(ఉ. 1-231)

అని ధృతరాష్ట్రుని ఉదాసీనతను ఆక్షేపిస్తాడు. ద్రుపద పురోహితుడు అంతకన్న ఏమి మాట్లాడ గలడు? ఇతడి వాక్పారుష్యాన్ని పెద్దలు కూడ అభిశంసిస్తారు. సంజయ రాయబార సమయంలో వాసుదేవుడు "తానొత్తికుమారులంగినియనోపడ" (ఉ. 1-346) అని నిందిస్తాడు. పాండవులకు హితుడు, సన్నిహితుడై వారి నిమిత్తం బల సమీకరణచేసి మిత్రబాంధవులందరనూ బలప్రదర్శనకే సమాయత్తం చేసిన శ్రీకృష్ణుడు ఇంతకన్న మేలైన విధంగా మాట్లాడలేడు.

ధృతరాష్ట్రునకు అత్యంత సన్నిహితుడైన విదురుడు కూడ సోదరుని పుత్రవ్యామోహాన్ని అనేక సందర్భాల్లో నిరసిస్తాడు. విదురుడు కుటుంబ క్షేమాన్ని, వంశ శ్రేయస్సును అభిలషించి చేసిన హెచ్చరికలు మనసులో బంధుప్రీతిని కలిగించి నప్పటికీ, భీముని ప్రతిజ్ఞలు వగ్గింపేసేవి అందువల్లే ధృతరాష్ట్రుడు తమ్ముని మాటలు సముచితాలు, సమంజసాలు, రాజనీతి బోధకాలయినప్పటికీ, 'పుత్రవిడువ నోప' అని ఖండితంగా పలుకుతాడు. ఏకాంతంలో సంజయుడు ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని నిరసించి, అతడి ఉపేక్షా భావమే కౌరవకులానికి చిచ్చుపెట్టిందని అంటాడు. అప్పుడు అతడు "నేను దైవాధీనత కతంబున బిడ్డలనొత్తి చెప్పను నియమింపనుంజాల" (ఉ. 2-198) అని సన్నిహితుడైన సంజయుని ఎదుట పుత్ర మమకారాన్ని దాచుకోలేక పోయాడు. భీష్మద్రోణులుకూడ కర్ణసుయోధనుల దురాలోచనలను, గర్వాంధకారాన్ని నిరసించి పాండవులతో సఖ్యత ఏర్పరచుకోవలసిందని హితవు చెపుతారు. కుమారుణ్ణి నిందించి శత్రువీరులను పొగడటం తండ్రిగా ఏ వ్యక్తికైనా కుందింపచేస్తుంది. అందుకే వారి పలుకులు ఆదరంతో వినక ఉపేక్ష వహించాడు. అయితే వంశ క్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని, పాండవులతో సఖ్యత పెంపొందించు కోవలసిందని ఒత్తి చెప్పినప్పుడు, వారి ఆలోచనకు అనుగుణంగా నడచుకోవటం మంచిదని కుమారుణ్ణి మెప్పించ ప్రయత్నించాడు. తనకు సాధ్యంకాక గాంధారిచేతకూడ చెప్పించాడు. కాని అప్పటికే స్వయం నిర్ణయాధి

కారంతో ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పరచుకొని, వారి ఆలోచనలతో ప్రవర్తి సుయోధనుణ్ణి తండ్రి బోధ ప్రభావితుణ్ణి చేయలేక పోయింది. ముదిమి సమీపిం ధృతరాష్ట్రుడు కుమారుణ్ణి నిర్బంధించలేక పోయాడు.

కృష్ణరాయబారం సందర్భంలో కూడ ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహ విమర్శకు స్థానమైంది. సంధి నిమిత్తంగా శ్రీకృష్ణుణ్ణి కౌరవసభకు పంపేటప్పు ధర్మరాజు సుయోధనుని దౌష్ట్యాన్ని నిరసిస్తూ "కొడుకు వలచినట్టివాడు గాన యత వక్రతమాన్పలేడు"(ఉ.3-9) అని ఆ రాజుబలహీనతను బయటపెట్టాడు. పగ,ద్వే లేకుండా దాయాదులు సంమీభావంతో ఉండటం వంశానికి మేలు చేకూరుస్తుం సంధిపరంగా తనఅభిప్రాయాలు వ్యక్తంచేస్తూ, "సుతువాడై వినయంబు సేకొనక చొప్పుందగం జెప్పక" (ఉ. 3-25) ధృతరాష్ట్రుడు అవినీతిమార్గాన వర్తిం ప్పటికీ ఆవేశపడకుండ కార్యంసాధించ వలసిందని కోరతాడు. ధృతరాష్ట్రు 'సుతువాడ'ని ధర్మరాజు అభియోగంగా స్పష్టం అవుతుంది. అయితే ధర్మరా సంధి ప్రతిపాదనలో సామరస్యంకన్న, సుయోధనుని దోషాన్ని ఎత్తిచూపి రెచ్చగొ విధానమే కనిపిస్తుంది. శ్రీకృష్ణుడుకూడ కౌరవసభలో సుయోధనుని అధర్మ ప్ర ర్తనను ఉగ్గడించి, అవసరమైతే అతణ్ణి సంహరించ వలసిందిగా సభలోనివా రెచ్చగొడతాడు. దూత ఈవిధంగా ప్రవర్తిస్తే సఖ్యతను ఏర్పరచటం సాధ్యంకా కృష్ణుని హెచ్చరికలు ధృతరాష్ట్రుణ్ణి ఆందోళనక్కుగురిచేశాయి. నారదాదిమహర్షు కూడ, సుయోధనుని మార్గంవిడిచి పాండవులకు అర్ధరాజ్యం ఇవ్వవలసిందని సల ఇస్తారు. ఈస్థితిలో వీరి సలహానుపాటించి ఏ తండ్రీ కుమారునకు ఆపదక తెచ్చుకోలేడు. అందుకే

"నాముఖంబునఁ గార్యంబు నడవ దేమి
సేయువాఁడ నొండెద్దియుఁ జెప్పలేదు" (ఉ. 3-327)

అని తన అశక్తతను వెల్లడించి నేరంతనపైనుంచి దించుకొన్నాడు. ఈసమయం ధృతరాష్ట్రుడు తెలివైన తండ్రిగా ప్రవర్తించాడు. కుమారునకు నీతిగరపటం అశక్తుడైనందువల్ల పాండవులకు రాజ్యభాగం వెంటనే ఇవ్వవలసిన అవసరంలేకు తప్పింది. ధృతరాష్ట్రుడు కొడుకును సన్మార్గంలో నడపటంలో నిజంగానే అశక్ తనేసానుభూతి పొందటానికి అవకాశం ఏర్పడింది.

సంధిప్రయత్నాలన్నీ విఫలమై కురుపాండవయుద్ధం అనివార్యం అయింది. ధృతరాష్ట్రుడు కుమారుని ప్రాభవంకోసం మానవప్రయత్నం అంతాచేశాడు. అయితే కురుసేనా నాయకులలోని విభేదం, శత్రువు పరంగా గురువులు, ఆచార్యుల సాభిప్రాయం, కృష్ణుని మంత్రాంగం. పాంచాల, మాత్స్య, యాదవ విజృంభణ ఆ రాజు ఆశలన్నింటిని వమ్ముచేశాయి. వానప్రస్థ జీవితంగడిపేందుకు ఆశ్రమవాసంపోయేం తవరకు యుద్ధమరణ వీరులైన కుమారుల నిమిత్తం, బంధు జనులకోసం ఏకాకిగా విలపించటమే ఆ రాజుకుమిగిలింది. మానవుడు ఒక ప్రయోజనాన్ని ఆశించి కృషి సల్పితే విరుద్ధ ఫలితం పొందినదానికి ధృతరాష్ట్రుని జీవితం దృష్టాంతంగా నిలుస్తుంది.

యుద్ధం ప్రారంభంనుంచి ధృతరాష్ట్రుడు పుత్రుల విజయం ఎడ ఎంతో అభినివేశం ప్రదర్శించాడు. సంజయుడు చెప్పే యుద్ధవార్తలలో కుమారుల విజయాలను ఎంతో ఆహ్లాదంగా, సంతృప్తిగా స్వీకరిస్తూ అపజయాలను ఉదాసీనంగా స్వీకరించేవాడు. ఏతండ్రి అయినా కుమారుల విజయాలనే ఆకాంక్షించటం సహజమే. యుద్ధంలో కుమారుల ప్రాథమిక విజయాలు ధృతరాష్ట్రుణ్ణి సంతోష పరచాయి. భీమార్జునుల విజృంభణంతో కుమారుల అపజయాలు బాధను కలిగించేవి. ఆబాధలో

"అనితల నీవు పాండుతనయావలి కెప్పుడు మేలుచేయు నా
తనయులకుం బరాక్రమము తక్కువయుం బ్రకటింప విందు"
(భీష్మ. 2-258)

అని అసహనాన్ని ప్రదర్శించి సంజయుని నిష్పాక్షికతను శంకించాడు. అరవరోజు యుద్ధంలో భీమసేనుడు సుయోధనుణ్ణి పరాభవించినప్పుడు ధృతరాష్ట్రుడు తీవ్ర ఖేదాన్ని పొందాడు. అల్లాగే ఏడవరోజు యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు సుయోధనుణ్ణి విరథుణ్ణి చేశాడని విని ఆ తండ్రి

"విఱుగుట నొచ్చుట మనదెస
దఱచుగ నాడెదవు పాండు తనయుల బలమే
త్రెఱ దఱుఁగక పెనగుట పలు
ఘఱుఁ జెప్పెదవకట యేమి ఘాయయొదలపన్" (భీష్మ. 3-31)

అని ఆశ్చర్యంతో కూడిన ఖేదాన్ని వ్యక్తం చేశాడు. ధృష్టద్యుమ్నుడు సైతం కుమారుణ్ణి బాధించటం ఆ రాజుకు మాయగానే కనిపించింది. ఎనిమిదోరోజు యుద్ధంలో భీముని చేతిలో సునాభుడు మొదలైన కుమారులు మరణించారని విని దుఃఖాన్ని ఆపుకోలేక వాపోయాడు. శోకం అతిశయించినప్పుడు వ్యామోహం దూషణగా మారుతుంది. ఆ దూషణ నిస్సహాయత నుంచి ఉద్భవిల్లేది. గురుభీష్ములుండి కూడ నా కుమారులకు ఇట్లా జరిగిందా అంటూ

గురుడు భీష్ముండుఁ గలుగఁగఁ గురుకుమారు
లిట్టు వొలిసెతరే మున్నయింత వట్టు
దల్లియును నేనుఁజెప్పినఁ బొల్లసేసి
దాని ఫలమిప్పుడు సుయోధనుడు గనియె'' (భీష్మ. 3-83)

అని కుమారుల మరణానికి శోకిస్తూనే, తల్లి పండ్రుల హితవు వినని సుయోధనుడు ఆ ఫలితాన్ని పొందుతున్నాడని దూషిస్తాడు. ఎన్నో ఆశలు కల్పించుకొన్న కుమారునకు అపజయం వాటిల్లుతున్నదే అనే అసహనం ఈ ఆక్రోశంలో వ్యక్తం అవుతుంది. పాండవ పక్షంలో అర్జున సాత్యకుల ఔద్ధత్యం ఎంతో విచలితుణ్ణి చేస్తుంది. అతడు ఎంతో దీనంగా

''దొరలున్ సేనలుఁ బెల్లు గూలుటకు నా దుర్యోధనుం
డెంత యా
తురతంబొందెనొ దంతి ఘోటక పదాతుల్ సాత్యకిస్ఫారదో
స్ఫురణన్ ద్రుగ్గుటకెట్లు దాను ననుజుల్ శోకించెనో యక్కటా''
(ద్రోణ. 4-20)

అని కుమారుని దుస్థితికి దురపిల్లాడు. ఆ రాజు విషాదం నిస్సహాయతతో కూడిన ఉక్రోషంగా మారింది. ఆ ఉక్రోషంలో

''ఒక్కనికో, త్తలకోర్వక విఱిగిన పు
త్రుల నేమనివిందు నేను రోయక యింకన్'' (ద్రోణ. 4-80)

అని కుమారుల ఓటమిని భరించలేనని వాపోయాడు.

యుద్ధంలో భీష్మద్రోణుల పతనం, విజయం కౌరవ పక్షానికి దుర్లభమనే విశ్వాసం ధృతరాష్ట్రునకు కలిగించింది. భీష్మణ్ణి కోల్పోవటం కుమారుల సౌభాగ్యమంతా మంట కలిసినట్లేనని శోకించి, ఇక తన కుమారులకు ఆధారం ఎవ్వరని విపరీత క్లేశానికి లోనయ్యాడు. అయినా ఆశ మానవుణ్ణి ప్రలోభ పెడుతుంది. అయితే చివరకు కర్ణుని పతనంలో కొన ఊపిరితో ఉన్న ఆ ఆశకూడ నశిస్తుంది. కర్ణునితోపాటు సుయోధనుడు కూడ మరణించాడనే తలపుతో విహ్వాలించి మూర్ఛిల్లాడు. సుయోధనుడు ధైర్యం అవలంబించి జయార్థియై ఉన్నాడని సంజయుని వల్ల విని కొంత సేద తీరి 'నాడుకుకడిమికి' ఊరడిల్లాడు. సర్వం కోల్పోయానను కున్న ఈ దశలో కూడ ధృతరాష్ట్రునకు కుమారుని శక్తిపై ఆశ చావలేదు. దింపుడు కళ్లం ఆశ అంటే ఇదేనేమో!

ధృతరాష్ట్రుని మనసులో కొన ఊపిరితో ఉన్న ఆశను అడియాశచేస్తూ, శల్యుని మరణంతో కురుక్షేత్ర సంగ్రామం ముగుస్తుంది. సైన్యం అంతా చిందర వందరకాగా సుయోధనుడు గదాకలితుడై ఒంటరిగా పోయాడని విన్న ధృతరాష్ట్రుడు "ఆపదలిట్టివి చిలపె మనుజ పతులకు నెందున్" (శల్య. 2-3) అని కుమారుని దయనీయ స్థితికి వగచాడు. యుద్ధ భూమి నుంచి తొలగి ద్వైపాయన హ్రదంలో దాగిన సుయోధనుని పరిహాసోక్తులతో ధర్మరాజు రెచ్చగొట్టటం ఆ వృద్ధరాజు హృదయాన్ని కలచివేసింది. నేలనాలుగు చెరగుల ప్రభుతతో వెలిగిన కుమారుడు శత్రువుల నిష్ఠురోక్తులను ఎట్లా భరించాడో అనే ఆవేదనకు లోనవుతాడు. మడుగు నుంచి వెలువడ్డ సుయోధనుణ్ణి పాంచాల పాండవులు ఒండొరులు చేతులప్పళించి అపహాస్యం చేస్తారు. ఈ అపహాస్యానికి గురి అయిన కుమారుని దురవస్థ ఆ తండ్రి హృదయాన్ని ముక్కలుముక్కలు చేసి ఉంటుంది. భీమ సుయోధనుల గదా యుద్ధాన్ని తిలకించేందుకు బలరాముడు యుద్ధ భూమికి వచ్చాడని విని

"బలభద్రుడు సనుదెంచిన
నలఘు గదా స్ఫురిత భుజ సహాయత్వ నము
జ్జ్వలుఁడగు మత్పుత్రునకుం
దెలివి మిగులకున్నె......" (శల్య. 2-227)

అని ఆశతో కొడిగట్టే దీపం కాంతిలో వెలుగును చూడ ప్రయత్నిస్తాడు. కాని

రెండు పక్షాలలోని సైన్యం చాలవరకు నశించి, పాండవులు విజయాన్ని సంపూర్ణంగా పొందుతున్న దశలో సమస్తం తనకు అనుకూలంగా మారుతుందని భావించే ధృత రాష్ట్రుని పుత్రవ్యామోహ జనిత బలహీనతకు జాలి కలుగుతుంది.

ధృతరాష్ట్రుని చిగురించే ఆశను మొగ్గలోనే తుంచేస్తూ సుయోధనుడు భీముని గదా ఘాతానికి నికృష్టంగా బలి అవుతాడు. కుమారునితో సహా అందరూ మరణించటం వల్ల ధృతరాష్ట్రుడు మనోస్థైర్యాన్ని సంపూర్ణంగా కోల్పోయాడు. అతడి హృదయం శిథిలమైంది. ఆ స్థితిలో విదురుణ్ణి ఉద్దేశించి "పుత్రహీనుండ ననాథుండ నగుట యెఱింగితిఁ దమ్ముండ యిఁకమీఁద నీవ నాకు గతి" (శల్య. 1-10) అని వాపోయాడు. అలాంటి సమయంలో ఏ తండ్రి కడుపుకోత అయినా అనుభ వైక వేద్యమే కాని వర్ణనకు అతీతం.

శత్రువులు విజయగర్వంతో ఉల్లాసంగా ఉండి, కుమారులంతా రణరంగా నికి బలి అయినందుకు ఆ వృద్ధరాజు హృదయం దహించింది. పుత్రులంతా మరణించినా చెక్కు చెదరని తన హృదయం వజ్రమయమై ఉంటుందని తన హృదయ కాఠిన్యాన్ని నిందించుకొంటాడు. ఆవేదన అతిశయించగా శరీరం, మనసు అదుపు తప్పి ఉన్మత్తుని లాగా వ్యవహరించాడు. ఆ ఉన్మత్త ప్రేలాపనలో కుమా రుణ్ణి తలచుకొని కుమిలి కుమిలి విలపించాడు. యుద్ధంలో కుమారుడు విజయం సాధిస్తాడనుకొంటే ఫలితం విపరీతంగా ఉంది అంటూ

"...... భవదీయానివార్య విక్రమమునఁ బాం
డు నరేంద్ర సుతులుఁ దెగుదుర
యని తలఁచితి నీవెతెగితె యవ్వీరులచేన్" (శల్య. 1-23)

అని తన దురదృష్టాన్ని నిందించుకొన్నాడు. విషాదరూపకాల్లో నాయకుని జీవితంలో ఈ పరిణామాన్ని వ్యత్యస్తం (Reversal) అంటారు. ధృతరాష్ట్రుడు కొడుకును కన్న ఫలితం విఫలంకాగా, ఆ కొడుకు తాను జీవించి ఉండగానే నీచమరణానికి లోనైతే ఆశలన్నీ అడియాశలై ముదిమితో రెక్కలు తెగిన పక్షిలాగా విలపిస్తుంటే ఎంతటి పాషాణ హృదయమైనా ద్రవించకుండ ఉండదు.

మానవుడు పుట్టుట గిట్టుట కొరకే. కాలం చెల్లిన ప్రతి వ్యక్తి పోక తప్పదు. పోయిన వారితోపాటు ఉన్నవారు పోలేరు. కాని వారి నిమిత్తమై ఈ లోకంలో జరిపే కర్మకాండలు భారతీయ సంప్రదాయంలో అనూచానంగా వస్తున్నాయి. కురుక్షేత్ర సంగ్రామంలో సర్వస్వం కోల్పోయిన ధృతరాష్ట్రునకు మరణించిన కుమారులకై ఈ లోకంలో చేయవలసిన కర్మలు నిర్వహించక తప్పలేదు. ఏ తండ్రి అయినా సాధారణంగా కొడుకు ఉన్నతిని, మనుమ సంతానాన్ని చూసి, వంశం నిలిచిందన్న తృప్తితో ఆ కొడుకు చేతుల్లో అంతిమ శ్వాస వదలాలని ఆశిస్తాడు. కాని ధృతరాష్ట్రుడు ఆ అదృష్టానికి నోచుకోలేదు. తన చేతుల మీదుగా కుమారులకు శ్రాద్ధకర్మలు నిర్వర్తించాలనే ఆలోచన ఆ వృద్ధరాజును తల్లడిల్ల చేసింది. అందువల్లే ఆ కర్తవ్యాన్ని గూర్చి సంజయుడు జ్ఞాపకం చేసినపుడు మొదలు నరికిన వృక్షంలాగా వివశుడై ధరణిపై పడ్డాడు. పుత్రవర్గం అంతా వ్యర్థమై యుద్ధంలో మరణించగా దీనంగా ఇతరుల దయాదాక్షిణ్యాలపై బ్రతకటంకన్నా దుర్భరమైంది లేదనే ఆలోచనతో జీవితంపైనే వైరాగ్యం పెంచుకొన్నాడు. పుత్ర వియోగజనిత దుఃఖం మానవునకు సహజమేనని వ్యాసునితో

> "ధనమంతయు బోలియ దారుణంబుగాఁ
> దనయవ్రజంబు దెగ దైన్యమారఁగాఁ
> దన బంధులందఱు మృతంబు బొంద నె
> వ్వనికైన శోక మనువహ్ని గాల్పదే" (శ్రీ. 1-63)

అని సంపదంతా కోల్పోయి పుత్రులు బంధువులంతా మరణిస్తే శోకవహ్ని కాల్చకుండ ఎలా వుంటుంది అని దయనీయంగా విన్నవిస్తాడు. ధర్మరాజు పుత్ర మరణ శోక విహ్వలులైన గాంధారీ ధృతరాష్ట్రులను కుంతీదేవికన్నా మిన్నగా ఎంతో భక్తితో గౌరవించేవాడు. ధర్మరాజు సహృదయంవల్ల ధృతరాష్ట్రుడు ఎంతో ప్రీతితో కనకాది దానక్రియలతో కుమారులకు శ్రాద్ధకర్మలు నిర్వర్తించేవాడు. ధర్మరాజు తల్లిదండ్రులఎడ గౌరవాదరాలు ఎంతగా చూపినా ధృతరాష్ట్రుడు ఏకాంతంలో కుమారులను తలచుకొని శోక సమాక్రాంతుడయ్యేవాడు.

ఈ స్థితిలో ధృతరాష్ట్రునకు లౌకిక జీవితంపై విరక్తి జనించి తపో వనానికి పోవాలనే నిశ్చయానికి వచ్చాడు. తన పుత్రవ్యామోహమే కురువంశానికి

చేటు అయింవని వృద్ధాప్యంలో ఆ తండ్రి పశ్చాత్తాప హృదయుడయ్యాడు. కుమారులు రాజ్యంకోసం పోరాడి క్షత్రియ సహజంగా వీరమరణం చెందారనే సంతృప్తి ధృతరాష్ట్రునకు కలిగింది. ఆశ్రమానికిపోయి వానప్రస్థ జీవితం గడుపుతూ కుమారుల సుగతికై పాటుపడాలనే సంకల్పం కలిగింది. ఈ అంశాన్నే ఆ రాజు గాంధారితో

"ఇంక దడయనేల యింతి వేవెడలుద
మట్లు గల్గఁ జూదమాడి పాప
భాగులైన నీదుపట్టుల సుగతికి
ననుచు వాడఁ దపము నతిశయమున" (ఆశ్రమ. 1-83)

అని కుమారులకు సుగతి కలిగేటట్లు చేయటమే తనకు మిగిలిన కర్తవ్యం అని అంటాడు. కుమారులు ఎంతటి పాపభాగులైనా వారిని ఏ తండ్రీ తిరస్కరించ లేడు. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుడు కూడ లోకంలో సామాన్యులైన తండ్రుల్లాగే పుత్రుల శ్రేయస్సుకే జీవితాన్ని అంకితం చేశాడు. తన ఆముష్మిక శక్తిని కూడ పుత్రుల హితార్థం ధారపోయటానికి సన్నద్ధమయ్యాడు.

ఈ విధంగా ధృతరాష్ట్రుడు అనేకమైన ఒడిదుడుకులను ఎదుర్కొన్నప్పటికీ జీవితమంతా పుత్రుల ఔన్నత్యం కోసమే పాటుపడ్డాడు. మానవ జీవితంలో ప్రతి తండ్రికీ ఇది సహజమేనేమో! కాని దీనివల్ల ధృతరాష్ట్రుడు మాత్రం భారతకథలో చేదు అనుభవాలనే చవి చూశాడు.

అధస్సూచికలు :

1. ఆప. ధ. సూ. II. 5— 11
2. మనుస్మృతి: 9-138
3. సం. మ. భా, ఆది. సంభవ. ప, 140 అ—3 శ్లో
4. పైది, అనుద్యూత. ప: 75 అ— 1 నుంచి 12 శ్లో వరకు.

# 1.7 పెదతండ్రి

సాధారణంగా పెదతండ్రితో తమ్ముని కొడుకుల సంబంధ బాంధవ్యాలు ఆధునిక యుగంలో విభక్త కుటుంబ సంప్రదాయంలో అంతగా గుర్తించలేము. ప్రాచీన కాలంలో అవిభక్తకుటుంబ వ్యవస్థలో సోదరానుబంధం, పితృవ్యానుబంధం పటిష్ఠంగా ఉండేది. యజమానిగా అగ్రజుడు కుటుంబ క్షేమాన్ని చూస్తుంటే, సోదరులు సోదరపుత్రులు అతని ఎడ గౌరవాదరాలతో మెలగుతూ నియుక్త కార్యక్రమాలను నిర్వహిస్తూ గాఢమైన అనుబంధంతో కలసి మెలసి ఉండేవారు. యజమాని కూడ స్వార్థచింతన లేకుండ అందరి ఎడ సమతాదృష్టితో ప్రవర్తించి ఆ కుటుంబం ఆదర్శవంతంగా వర్ధిల్లేందుకు కృషిచేసేవాడు. అయితే ఆ కాలంలోకూడ స్వార్థ చింతనకులోనై కొందరు సోదరులను, సోదరపుత్రులనుకూడ కుట్రలు కుతంత్రాలతో నాశనంచేయటానికి ప్రయత్నించిన సందర్భాలు ఉన్నాయి. ఇలాంటివి సాధారణంగా వారసత్వం విషయంలో పొడకడతాయి. ఈ అనిశ్చితస్థితి రాజకుటుంబాలలోనే ఎక్కువగా కనిపిస్తుంది కాని, సామాన్య జనజీవనం ఆత్మీయతాను బంధాలతో పెనవేసుకొని ఉండేది. సోదరపుత్రుల ఎడ ఎంత అభిమానం ఉన్నా అధికారదాహం, ధన ప్రలోభం మానవుణ్ణి స్వార్థలోలుపునిగా మారుస్తుంది. పరిస్థితుల ప్రభావానికి లోనై కొందరు, బుద్ధ్యనుసారం కొందరు తమ్ముని కుమారులను ఇబ్బందులకు గురి చేస్తారు మరి కొందరు తన కుమారులతో సమానంగా సంభావిస్తారు. భిన్న మనస్తత్వాలతో భిన్న ప్రవృత్తులతో మెలగేవారు అన్ని కాలాలలోను కనిపించటం లోక సహజం.

ఈ నేపధ్యంలో ఆంధ్రమహాభారతంలో ధృతరాష్ట్రునకు తమ్ముని కుమారులైన పాండవులతో నెలకొన్న సంబంధం సమీక్షించటం అవసరం. ధృతరాష్ట్రి పాండురాజులు, ఊహ తెలియకముందే తండ్రి మరణించటంతో, పెదతండ్రి భీష్ముని అదుపాజ్ఞలలో ప్రవర్ధమానమయ్యారు. ఈ సోదరుల్లాగానే ధర్మజాదులు కూడ బాల్యంలోనే తండ్రిని కోల్పోయిన బిడ్డలయ్యారు. శతశృంగంనుంచి హస్తినాపురంలో ప్రవేశించింది మొదలు ధృతరాష్ట్రుని నిర్యాణం వరకు సాగిన భారతకథలో పాండవుల జీవితం పెదతండ్రితో పెనవేసుకొనిఉంది. మహాభారతంలోని అనేక సంఘటనల్లో ధృతరాష్ట్రి ధర్మరాజుల ప్రమేయం స్పష్టం. ఒకరి ఎడ మరొకరు నిర్దిష్టమైన అభిప్రాయాలున్నవారు ఒకరు మెత్తనిపులి అయితే, ఇంకొకరు ప్రజ్ఞా

చక్షువు. జాగ్రత్తగా పరిశీలిస్తే భారతంలో ప్రధాన ప్రత్యర్థులు వీరిద్దరేనని అని పిస్తుంది.

పెదతండ్రిగా ధృతరాష్ట్రుడు, తమ్ముని కొడుకులుగా పాండవుల అనుబంధం మూడు అంతరాలలో వృద్ధి చెందినట్లు తెలుస్తుంది. బాల్యంలోనే తండ్రిని కోల్పో యిన బిడ్డలను కుటుంబ పెద్దగా అవ్యాజమైన అనురాగంతో చేరదీసి, రక్షణ కల్పించి వారి పురోభివృద్ధికై చిత్తశుద్ధితో ప్రయత్నించే పెదతండ్రిగా ధృతరాష్ట్రుడు ప్రారంభ దశలో కనిపిస్తాడు. పాండవులు స్వశక్తితో అన్ని రంగాల్లో వర్ధిల్లి పెద్దలకు ప్రజ లకు గౌరవాస్పదులవుతుంటే, తన కుమారులకన్న గొప్పవారవుతున్నారనే ఆవేదనతో సహజమైన పుత్రవ్యామోహంవల్ల ధృతరాష్ట్రుని ప్రవర్తనలో పెదతండ్రిగా కొంత మార్పువచ్చినట్లు కనిపిస్తుంది. ఇది రెండవ దశగా భావించవచ్చు. ఈ దశలో ధృతరాష్ట్రుడు, పాండవులు ఒకరినొకరు గౌరవించుకొన్నట్లు, అభిమానించినట్లు కనపడినా పరస్పరం అనుమానంతో, భయ సందేహాలతో శత్రుభావాన్నే ప్రదర్శిం చారు. మహాభారతంలో సుదీర్ఘమైన భాగం ఈ దశలోనే సాగింది. కురుక్షేత్ర సంగ్రామంలో కుమారులందరు మరణించి మనోభీష్టం గాలిమేడలాగా కూలిపోతే రెక్కలుతెగిన విహంగంలా నిస్సహాయుడై ఏకాకిగా క్రుంగిపోయే పెదతండ్రిని ఆదు కొని మనోధైర్యం కలిగించి జీవితం చరమదశలో పుత్రులులేని లోపాన్ని తీర్చేందుకు ధర్మరాజు చిత్తశుద్ధితో ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో అతడు కొంతవరకు కృతకృత్యుడయ్యాడు. వీరి అనుబంధంలో దీనిని మూడవ దశగా పేర్కొన వచ్చు.

శతశృంగంలో పాండురాజు మరణించే నాటికి ధర్మరాజాదులు పదహారు సంవత్సరాల వయసువారై బ్రహ్మర్షి ప్రణీత ఉపనయనులై శ్రుతాధ్యయన సంపన్ను లయ్యారు. మాద్రి భర్తతో సహగమనం చేస్తుంది. మాద్రి పాండురాజుల అస్తి కలు సంగ్రహించి శతశృంగమునులు హస్తినాపురం వచ్చేంతవరకు పాండురాజు మరణవార్త అంతఃపురంలోని వారికి తెలిసినట్లు లేదు. సోదరుని మరణజనిత శోకా నలంలో క్రుంగిపోతూ ధృతరాష్ట్రుడు సూర్యతేజంతో ప్రకాశిస్తున్న కుమారులను అక్కున చేర్చుకొన్నాడు. తండ్రిని కోల్పోయి అనాధలై ఉన్న తమ్ముని బిడ్డలను 'అతిస్నేహంబున నెత్తికొని' సంభావించాడు, సంతోషంలోకన్నా దుఃఖోద్వేగంలోనే,

రక్తస్పర్శజనిత బంధం పెల్లుబకటం సహజం. ధృతరాష్ట్రుడు ఆర్ద్రితతో కూడిన అభిమానంతో

"తన సుతులు పాండుసుతులని
మనమున భేదింప కతిసమంజస భావం
బున నొక్కరూపకాఁజే
కొనియుండెం బాండురాజు కొడుకులఁ బ్రీతిన్" (ఆది. 5-162)

ఆత్మీయంగా సంభావించ సాగాడు. పాండవులుకూడ పెదతండ్రి అవ్యాజానురాగాలలో పెరుగుతూ, వినయాన్వితులై ధార్తరాష్ట్రులతో క్రీడా వినోదాలతో కాలం గడపసాగారు. ఈ సందర్భం తమ్ముని కొడుకుల ఎడ ధృతరాష్ట్రుని అవ్యాజానురాగాన్ని, ఆ అనురాగాన్ని చవిచూసే బిడ్డలుగా పాండవుల వినయ విధేయతలను ప్రదర్శిస్తుంది.

బాల్యక్రీడా వినోదాలలో పేరుమాడే కుమారులలో చిలిపి తగాదాలు, మనస్పర్థలు చోటు చేసుకొనేవి. భీముని ధాటికి సుయోధనాదులెవరూ తాళలేకపోయేవారు. ఓర్వలేని సుయోధనుడు భీముని మట్టుపెట్టే ప్రయత్నాలుచేసి విఫలుడయ్యాడు. ఈ ప్రయత్నాలు పెద్దలకు తెలిసినట్లులేదు. పెద్దలకుతెలిస్తే ఉపేక్షాభావంతో ఉండేవారు కాదు. ఈ సమయంలోనే కురుకుమారులకు విలువిద్య నేర్పేందుకు కృప ద్రోణులను నియోగించారు. శతశృంగారణ్యాలలోనే కొంత అస్త్ర విద్యాభ్యాసం చేసిన పాండవులు సుయోధనాదులతో కలిసి విద్యాభ్యాసం చేసే అవకాశం కల్పించటం వారిని ధార్తరాష్ట్రులతో సమానంగా చూస్తున్నారనేందుకు నిదర్శనంగా చెప్పవచ్చు.

కురుకుమారులు యుద్ధవిద్యలో నిష్ణాతులైనారని నిశ్చయించుకొన్న ద్రోణుడు ధృతరాష్ట్రుని అనుజ్ఞతో శిష్యుల అస్త్రవిద్యా ప్రదర్శనం ఏర్పాటు చేశాడు. విద్యా ప్రదర్శన రంగంలో ద్రోణ ప్రియశిష్యుడైన అర్జునుడు ప్రవేశించగానే-అభినందన సూచకంగా సభలో చెలరేగిన కలకలానికి ఆ పెదతండ్రి హృదయం ఎంతో ఉప్పొంగింది. విదురునివల్ల విషయం తెలుసుకొని, పాండుసుతుల విద్యాశక్తి వినటంవల్ల ఏమిలున్న ప్రయోజనం పొందాననీ, పాండవ త్రేతాగ్ని తన కులానికి ఆపదలనే భయంకరారణ్యాలను కాల్చివేస్తుందని ఆనందోద్వేగం వ్యక్తం చేశాడు. మనోవాక్కాయ కర్మలతో మనసు ప్రధానం. సంకల్పస్థానం మనసే. కన్నుక

ధృతరాష్ట్రుడు 'మనమున సంతోషమంది' అని నన్నయ చెప్పటం ధృతరాష్ట్రుని ఆనందోద్వేగం అనుభూతి విశేషమే కాని ప్రదర్శన మాత్రం కాదని స్పష్టం అవుతుంది. బ్రతికిఉన్న రోజుల్లో తన తమ్ముడిలాగానే, తమ్ముని కుమారులుకూడ కురుసామ్రాజ్య ప్రాభవాన్ని వెలుగొందచేస్తారని అతడి ఆకాంక్ష. ఇప్పటికి ధృతరాష్ట్రుని అంతరంగం కల్మష భరితం కాలేదు.

కుమారాస్త్ర ప్రదర్శనానంతరం గురుదక్షిణగా ద్రుపదుణ్ణి బంధించే సంరంభంలో సుయోధనాదులు విఫలులవుతారు. ఆ సమయంలో అర్జునుడు ద్రుపదుణ్ణి బంధించి గురుదక్షిణగా సమర్పించి కురువంశ ప్రతిష్ఠ నిలబెట్టాడు. పాండవులు సాధించిన ఈ మహత్కార్యానికి సంతసించిన ధృతరాష్ట్రుడు పాండవ ధార్తరాష్ట్రులందరకు అగ్రజుడైన "యుధిష్ఠిరు రాజ్యభార దురంధరుంగా నెఱింగి భీష్మ విదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుంజేసి" (ఆది 6-92) సత్కరించాడు. జ్యేష్ఠుడైన సుయోధనునకు యౌవరాజ్యాభిషేకం చేయకుండ ధర్మరాజుకీ సత్కారం చేయటం విశేషం. ద్రుపదుణ్ణి బంధించటంవల్ల గురువును సంతోష పరచడం, ప్రధాన ప్రత్యర్థులుగా నిలవగల పాంచాలురపై ఆధిపత్యం సాధించటం అనే రెండు ప్రయోజనాలు సమకూరాయి. ఆ సంతోషంలోనే ధర్మరాజుకు జరిగిన సత్కారంవల్ల రాబోయే దుష్పరిణామాలు ఆలోచించ లేదు. అప్పటికి ధృతరాష్ట్రుని హృదయంలో పాండవులఎడ వేరుభావం లేకుండ మమకారమే నెలకొని ఉన్నట్లు తలంచటం సమంజసం. ధర్మరాజు యౌవరాజ్యాభిషేకం పెదతండ్రిగా ధృతరాష్ట్రుని అంతస్తును పెంచిందని చెప్పవచ్చు.

యౌవరాజ్యభార దురధరుడైన ధర్మరాజు అసదృశ గుణాలతో అందరకు ఆరాధ్యుడయ్యాడు. పాండవుల ఔన్నత్యం సుయోధనునకు కంటగింపుగా తోచింది. ధృతరాష్ట్రుని హృదయంలో కూడ తమ్ముని కుమారుల పరంగా భయావహమైన విషబీజాలు పాదుకొన ప్రారంభించాయి. కుమారాస్త్ర ప్రదర్శన సమయంలో పాండవుల ఔన్నత్యం సుయోధనాదులకే భరించరానిదిగా ఉందికాని ధృతరాష్ట్రునకు సంతోషావహమే అయింది. అయితే ధర్మరాజు యౌవరాజ్యాభిషేకానంతరం పాండవుల ఔన్నత్యం, కుమారుల హీనత్వం తలచుకొని, రెండు భావాలను త్రాసులోపెట్టి తూస్తే మమకారం కుమారుని వైపు మొగ్గు చూపింది. ఎంత సంయమనం కలవ్యక్తికైనా మనసు కుమారుని వైపు మొగ్గటమే సహజం. దీని పర్యవసానమే పాండవుల వారణావత ప్రయాణం.

పెదతండ్రిగా ధృతరాష్ట్రునకు పాండవులతోడి సంబంధంలో అను మానాలకు, భయానికి, వైమనస్యానికి బీజాలు వారణావత ప్రయాణంతో ప్రారంభం అయ్యాయి. ధృతరాష్ట్రుని నిర్ణయాన్ని హస్తినాపుర ప్రజలు శోక సంతప్త హృదయంతో నిరసించారు. అయితే ఈ నిర్ణయంవల్ల ధృతరాష్ట్రుడు, పాండవులు కొంతకాలం హస్తినాపురానికి దూరంగా ఉండటంవల్ల సుయోధనాదులు ప్రసిద్ధి వహించేందుకు అవకాశం కలుగుతుందని ఆశించాడు కాని, వారణావతంలో పాండవు లను మట్టుపెట్టే కుట్రలో ఆ రాజుకు భాగం ఉన్నట్లు కాని, ఆ కుట్ర అతడికి తెలిసి నట్లు కాని భావించలేము. వారణావతంలో లాక్షాగృహ దహనంలో పాండవులు మరణించారని విని దుఃఖితాత్ముడై "అలఱచినట్లఱచెన్ వివిధ ప్రలాపుడై" (ఆది. 6-169) విలపించాడు. ఆ రాజు విలాపం ఎదుటివారి సానుభూతి పొంద టానికి చేసే ప్రయత్నంగా సాధారణ దృష్టికి కనిపిస్తుంది. కాని వారణావతంలో పాండవులను సంహరించే ప్రయత్నం గురించి అతడికి తెలిసినట్లు ఆధారాలు లేవు కనుక, కొద్ది రోజుల క్రితమే ధర్మరాజును యువరాజుగా చేసిన పెదతండ్రి అనతి కాలంలోనే వారిని మట్టుపెట్టే ప్రయత్నం చేస్తాడని విశ్వసించలేము. ఒకవేళ తన కుట్ర బయటపడితే భీష్మాది పెద్దలు, పౌరులుకూడ తిరస్కరిస్తారనే భయం కూడ ఉండి ఉండవచ్చు. కనుక వారణావతంలో పాండవులు మరణించటం తన ఉపేక్ష వల్ల జరిగిన అనర్థమేనని దుఃఖించాడేకాని, వారు మరణించిన వార్తకు మనసులో సంతోషిస్తూ బహిరంగంగా విషాదాన్ని వెలిబుచ్చాడని నిర్దుష్టంగా చెప్పలేము. ఏమైనా సుయోధనాదులు పాండవులను వారణావతం పంపించమని అర్థించినపుడు, ఆ అభ్యర్థనను మన్నించటమే పెదతండ్రిగా ధృతరాష్ట్రుని ప్రవర్తన ప్రశ్నార్థకంగా నిలుస్తుంది.

వారణావతంలో జరిగిన ప్రమాదం పాండవులకు భీతావహమైంది. వారందరిలోను భీముణ్ణి ఆ విపత్కరం మరీ విచలితుణ్ణి చేసింది. తమకు సంభ విల్లిన ఆపదను తలచుకొని

**"ఖలుడై ధృతరాష్ట్రుడు పు**
**త్రులు దానును గూడి మమ్ము దూరస్థులుగా**
**నిలువెలువరించి లాక్షా**
**నిలయంబున నునిచెఁ బాపనిశ్చిత బుద్ధిన్"** (ఆది. 6-181)

అని పెదతండ్రిని నిరసించాడు. భీముని హృదయంలో ఏర్పడ్డ ఈ భావం ధృత రాష్ట్రుడు ఆశ్రమవాసం పోయేంతవరకు దృఢంగా నిలిచే ఉంది.

వారణావతంలో మరణించి ఉంటారనుకొన్న పాండవులు, ద్రౌపదీ వివాహంతో, జీవించి ఉన్నారని తెలియటం ధృతరాష్ట్రునకు ఆనందం కలిగించ వలసిన విషయం. తమ్ముని కొడుకులు జీవించి ఉన్నందుకు తనకు, తన కుమారు లకు ఆపాదించిన నింద తొలగుతుంది అనే తృప్తిపొంది ఉండవలసింది. అట్లా కాకుండ ద్రౌపదీ వివాహంతో మిత్రబల సమృద్ధులైన పాండవులు ప్రతీకారం తీర్చు కొంటారనే భయంతో కూడిన సంకోచానికి లోనయ్యాడు. మనసులో సంకోచం ఉన్నా విదురుని మనసుకు ప్రీతి కలిగేటట్లుగా

"కొడుకుల యభ్యుదయము విని
కడు సంతసమయ్యె నిపుడు కౌరవకుల మే
ర్పడ వెలిఁగె నెల్లరాజుల
నొడిచిన భుజవీర్యమున మహోత్సాహమునన్" (ఆది. 8-15)

అని పాండు కుమారుల భుజవీర్యంవల్ల కౌరవకులం వెలుగొందుతుందనే ఆకాంక్ష వ్యక్తం చేశాడు. తమ్ముని కుమారుల భుజవీర్యం తమకు కూడ ప్రమాదకారి అనే భయమే ధృతరాష్ట్రుని ఆంతర్యంగా కనిపిస్తుంది. పాండవ పాంచాలమైత్రి తమ ఉనికికి భంగం కలిగిస్తుందనే ఆందోళనతో పాండవులను ద్రుపదుని నుంచి వేరు చేయాలని కర్ణాదులు చేసిన వివిధ ప్రతిపాదనలు ఆ మహారాజుకు ఆమోద యోగ్యాలయ్యాయి. ధృతరాష్ట్రుని ఈ ఆలోచన పెదతండ్రిగా పాండవులతో అనుమానంతోను, భయంతో కూడిన భావి సంబంధాలకు నాందిగా నిలుస్తుంది.

అయితే భీష్మద్రోణులు సుయోధనుని దురాలోచనను వ్యతిరేకించి పాండవులతో సుహృన్మార్గంలో వర్తించవలసిందని బుద్ధిగరపి, ధర్మరాజుకు కురు సామ్రాజ్యంలో సగభాగం ఇచ్చి సత్కరించి పెదతండ్రిగా కర్తవ్యం నిర్వహించ వలసిందని హితవు చెప్తారు. వీరి అభిప్రాయాల్ని బలపరుస్తూ విదురుడు పాంచాల యాదవ సన్నిహితులైన పాండవులు మిక్కిలి బలవంతులయ్యారనీ, ద్రౌపదీ

స్వయంవరంలో వారి బలపరాక్రమాలు అందరకూ దృష్ట పూర్వాలేననీ చెప్తూ "నీయందుఁ బురోచన దిగ్ధంబైన దుర్యశఃపంకంబుఁ బాండవానుగ్రహంబులంజేసి కడిగికొనుము" (ఆది. 8-49) అని కర్తవ్యోపదేశం చేస్తాడు. వారి హితవును ఆలకించి పాండవులను తోడ్కొని వచ్చేందుకు విదురుణ్ణి పాంచాల నగరం పంపుతూ "మీ వంచిన విధంబున నప్పాండవుల కర్ధరాజ్యం బిచ్చెద" (ఆది. 8-51) అని పలికి పాండవులపై పెదతండ్రి అభిమానాన్ని ప్రదర్శించాడు.

విదురుని వెంట హస్తినాపురం వచ్చిన పాండవులు సుయోధనాదులతో రాజ్య వినోదాలలో ఐదు సంవత్సరాలు గడిపారు. అనంతరం ధృతరాష్ట్రుడు పాండవులకు సన్నిహితుడు, ఆత్మబంధువునైన కృష్ణుని సమక్షంలో అర్ధరాజ్యం ఇచ్చి వారిని తృప్తి పరచాడు. పాండవులను హస్తినాపురంలోనే ఉంచుకొని, ధర్మరాజు యౌవరాజ్యాభిషేకం తర్వాత జరిగిన కొన్ని పరిణామాలు పునరావృతమై గృహచ్ఛిద్రం జరగకుండ ఉండటానికే ప్రధానంగా ఈ ఏర్పాటు చేసినట్లు భావించ వచ్చు. ఇట్లా చేయటంవల్ల రాజ్యప్రదానం చేసిన పెదతండ్రి ఎడ పాండవులు విధేయులై ఉంటారు. శత్రుభావం పిడనాడటానికి అవకాశం ఏర్పడుతుంది. పాండవ శ్రేయోభిలాషులైన పెద్దలను తృప్తిపరచినట్లు ఉంటుంది. ప్రజలు కూడ పెదతండ్రిగా ధృతరాష్ట్రుని పెద్దరికాన్ని కొనియాడేందుకు అవకాశం కలుగుతుంది.

ధృతరాష్ట్రుడు అర్ధరాజ్య ప్రదానంవల్ల పాండవులు వారణావత సంఘట నను మరచి సంపూర్ణ విధేయులుగా ఉంటారని ఆశ పడ్డప్పటికీ వారు మాత్రం జరిగిన ప్రమాదాన్ని మరువలేకపోయారు. దాని ఫలితంగానే ధర్మరాజు చేసిన రాజసూయ యాగానికి ధృతరాష్ట్రుడు వచ్చినప్పటికీ పితామహుడు, శ్రీకృష్ణుడు పొందిన ప్రాముఖ్యాన్ని పెదతండ్రి పొందలేకపోయాడు. ఈ పరిణామ నికి ఎవరినీ తప్పుపట్టలేము. కొన్ని సమయాల్లో పరిస్థితుల ప్రాబల్యం మనుషులను, మనసులను దూరం చేస్తుందనేందుకు వీరి వృత్తాంతం నిదర్శనంగా నిలుస్తుంది.

సుయోధనుని ప్రేరణపై ధృతరాష్ట్రుడు ధర్మరాజును సుహృద్ద్యూతానికి ఆహ్వానించటం సమర్థనీయమైన అంశంగా కనిపించదు. ఈ చర్య వంశ శ్రేయస్సుకు మేలు చేకూర్చదనీ, కుమారుల మధ్య వైమనస్యాన్ని పెంచుతుందని విదురుడు అతణ్ణి సమాధానపరచ ప్రయత్నించాడు. ధృతరాష్ట్రుడు సోదరుని

హితవాక్యాలు పెడచెవిని పెట్టటమేకాక, మనం ఇందరం ఉండగా విద్వేష వాతావరణం ఎందుకు ఏర్పడుతుంది ? అని విదురుని హితవును విస్మరిస్తాడు. అయితే జూదంవల్ల సంభవించే దుష్పరిణామాలను ఆ రాజు మనసు భీతిల్లక పోలేదు. జూదంవల్ల సోదరుల మధ్య భేదం ఉద్భవిల్లుతుంది, అదికారణంగా ప్రజలకు ఆపదలు సంభవిస్తాయని చెప్తూ

"వంచనఁ బరార్థ పరిగ్రహబుద్ధిఁ జేసి పా
పమ్మగుఁ బాపకారులకుఁ బాయు నవశ్యము నర్థధర్మముల్"
(సభా. 2-136)

అని పాండవుల ఐశ్వర్యం అపహరించే ప్రయత్నం తగదని, వారిఎడ సామరస్యభావం పెంపొందించుకోవలసిందిగా కుమారునకు హితవు చెప్తాడు. ఏకాంతంలో పలికినవి కనుక ధృతరాష్ట్రుని ఈ మాటలలో చిత్తశుద్ధి ఉన్నట్లు భావించవచ్చు. కాని అపమార్గం నుంచి కుమారుని మళ్లించి పెదతండ్రిగా కొడుకుల సంక్షేమంచూసే విషయంలో స్థిరసంకల్పుడైనట్లు తలంచలేము.

కురువృద్ధులు భయపడ్డట్లుగానే ద్యూతసమయంలో ఎన్నో అవాంఛనీయ సంఘటనలు జరిగాయి. ఆ సంఘటనలకు భీష్మ విదురాదులు స్పందించారు కాని ధృతరాష్ట్రుని మనోభావాలు ఏ మాత్రం వెల్లడికాలేదు. పరిస్థితి విషమించి విపత్కర స్వరూపం ధరిస్తుందని భావించి విదురుడు హెచ్చరించినా ధృతరాష్ట్రుడు మౌనంగాగానే ఉన్నాడు. ధృతరాష్ట్రుని మౌనానికి కేవలం అతడినే తప్పుపట్టటం సాధ్యంకాదు. జూదానికి ఆహ్వానం అందినప్పుడు అంగీకరించటం రాజధర్మమే అనుకొన్నా, ఆహ్వానించిన వారి ఆంతర్యం గ్రహించవలసిన బాధ్యత ధర్మరాజుపై ఉంది. ఒకవేళ ఆహ్వానాన్ని అంగీకరించి ద్యూతానికి వచ్చినా, అన్యాయం జరుగుతున్నదని పసికట్టినప్పుడైనా అధర్మద్యూతాన్ని విడనాడటం విజ్ఞుల లక్షణం. అట్లా కాకుండ ధర్మరాజు ద్యూతవ్యసనంతో మోసం జరుగుతున్నదని తెలుస్తున్నా పట్టుదలకుపోయి, ద్యూతపణంగా తాను ఒడ్డే వస్తువుల ప్రాధాన్యాన్ని కూడ గుర్తించలేని అవస్థలో ద్యూతవిజితుడయ్యాడు. అట్లాంటి వ్యక్తిని రక్షించేందుకు ధృతరాష్ట్రుడు పూనుకోకపోవటం కేవలం అతడి దోషం అనలేము. ఈ సందర్భంలో పెదతండ్రి ఉదాసీనత విమర్శకు అర్హమౌతున్నప్పటికీ, ధర్మరాజు ద్యూతవ్యసనం కూడ ఖండించదగిందిగానే కనిపిస్తుంది.

ద్యూతసమయంలో అనివార్యంగ జరిగిన అనేక సంఘటనలకు స్పందిం చిన సభాజనులు సపుత్రకుడైన ధృతరాష్ట్రుణ్ణి నిందించారు. సభలో తమకు విరుద్ధంగా వచ్చిన స్పందనకు ఆ మహారాజు ప్రతిస్పందించాడు. ఆ ప్రతిస్పందన ఫలితంగానే ద్రౌపదికి వరాలీయటానికి పూనుకొన్నాడు. అనుజ సహితుడైన యుధిష్ఠిరుని పిలిపించి "నీవు సర్వసంపదలు స్వరాజ్యంబును నొప్పుగొని యెప్పటి యట్ల యింద్రప్రస్థపురంబున కరిగి సుఖంబుండుము నీకు లగ్గయ్యెడు" (సభా. 2-264) అని ఆశీర్వదించి సాగనంపాడు. ధృతరాష్ట్రుడు పాండవులకు రాజ్యదానం చేయటంలో తమ్ముని కొడుకులనే ఆదరణకన్నా, ఆ సమయంలో ఏర్పడ్డ విషమ స్థితిని అధిగమించటమే ప్రధాన ప్రయోజనమని తలంచవచ్చు.

సుహృద్ద్యూతంమాట అలాఉంచితే, అనుద్యూతానికి అనుమతి నివ్వటం పెదతండ్రిగా ధృతరాష్ట్రుని వైఫల్యాన్ని స్పష్టం చేస్తుంది. ధర్మరాజుకు ఇంద్రప్రస్థ రాజ్యం అప్పగించేటప్పుడు జూదం ఉపేక్షించినందుకు తనను క్షమించవలసిందని కోరుతూ "సర్వశాస్త్ర విదుండయిన విదురుండు మంత్రిగా సర్వధర్మ విదుండవైన నీవు రక్షకుండవుగా నిక్కురుకులంబునకు లగ్గగు" (సభా. 2-267) అని కురువంశ క్షేమమంతా ధర్మరాజు ధర్మవేత్తత్వంలోనే నిలిచి ఉన్నట్లు సంభావిస్తాడు. ఈ సంభావనలో పెదతండ్రి సుహృద్భావం వెల్లివిరుస్తుంది. అయితే కుమారుని విన్నపానికి అనుగుణంగా "వారల ననుద్యూతంబునఁ బరాజితులంగావించి విరళదేశ నిర్వాసితులం జేయుట కార్యంబు" (సభా. 2-274) అని నిర్ణయానికి రావడంవల్ల ఆ సుహృద్భావం అంతా బూడిదలో పోసిన పన్నీరులాగా వ్యర్థమైంది. శత్రువును ఏదో ఒకవిధంగా పరాజితుణ్ణి చేసే ప్రయత్నం రాజకీయంగా సమర్థనీయం అవుతుం దే కాని, పెదతండ్రిగా కుటుంబక్షేమం చూసినప్పుడు ధృతరాష్ట్రుని ఈ నిర్ణయం నేరమే ఔతుందని భావించటం సమంజసం. అనుద్యూతంలో ఓడిన పాండవులు ద్యూత సమయానికి అనుగుణంగా అరణ్యవాసం పోయేసమయంలోనైనా కురుసార్వభౌముని గా తన అధికారాన్ని వినియోగించి పెదతండ్రిగా వారిని నిలువరించే ప్రయత్నం చేయలేక పోయాడు. కనుక ఆంధ్రమహాభారతంలో ద్యూత సన్నివేశం ధృతరాష్ట్రి పాండవుల మధ్య తండ్రీకొడుకుల సామరస్య భావాన్ని నశింపచేసి శత్రుభావాన్ని వృద్ధి చేసిందని దృఢంగా విశ్వసించవచ్చు.

ద్యూత సమయంలో పరస్పరం ఏర్పడ్డ అనుమానాలు వైరభావం దినదిన ప్రవర్ధమానమై ధృతరాష్ట్రునకు భయకారణం అయింది. ఆ రాజుకు పాండవు లందరికన్నా భీముడంటే ప్రత్యేకమైన భయం ఉన్నట్లు

"...... మధ్యముండు
మొగము జేవురింప ముడివడు బొమలతో
నవుడు గఱచుచును భయంకరముగ
నున్న రూపు వాయకుండు నామది వాఁడ
మిత్తి నాదు పుత్త్రమిత్త్ర తతికి" (అరణ్య. 5-335)

అన్న మాటలవల్ల తెలుస్తుంది. ధృతరాష్ట్రుని భయం నిజమేనని "దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవ ప్రముఖంబగు దుష్టలోకంబు నధోలోకంబున కనుచు నంతకు మదీయాంతరంగంబు చింతాభర భగ్నంబును నవమాన పంకమగ్నంబును గోపోద్విగ్నంబునునై వేగిరపడుచున్నయది" (విరాట. 2-235) అని భీముడు ద్రౌపదితో పలికిన పలుకులు ఋజువుచేస్తున్నాయి. ఈ భయంవల్లనే సుయోధనాదులు అరణ్యవాసంలోనే పాండవులను అంతంచేయాలనే ప్రయత్నాన్ని ఆపలేకపోయాడు. అతడి ఈ అశక్తతే తమ్ముని కుమారులతో శత్రుభావంతో పరస్పరానుమానాలతో ఏర్పడ్డ అఖాతం ఇంకా దూరంకావటానికి దోహదం చేసింది.

పెదతండ్రి భయాన్ని ద్విగుణీకృతం చేస్తూ పాండవులు నిర్విఘ్నంగా అజ్ఞాతవాసం పూర్తిచేశారు. అజ్ఞాతవాసం చివరలో కురుక్షేత్ర సంగ్రామానికి భూమికగా జరిగిన ఉత్తర గోగ్రహణంలో అర్జునుడు ఒక్కడే కురుసైన్యాన్ని శిక్షించాడు. గోగ్రహణం ఫలితంగా పాండవ మాత్స్య వైవాహిక బంధం ఏర్పడింది. పాంచాల యాదవ సుహృద్భావంతో, వారి ఆశీస్సులతో ఉత్తరాభిమన్యుల వివాహం జరిగింది. ఈ వివాహానికి ధృతరాష్ట్రుణ్ణి ఆహ్వానించలేదు. అర్ధరాజ్య ప్రదానం చేసిన తరువాతి పరిణామాలు పాండవులకు పెదతండ్రితోడి సంబంధాలలో సౌహృద స్యాన్ని దూరంచేశాయి. ఈ పరిస్థితుల్లో ధర్మరాజు అభిమన్యుని వివాహానికి పెద తండ్రికి ఆహ్వానం పంపకపోవటం సహజమే. ద్రుపదునితో సంబంధం కలుపు కొన్న పాండవులే తనకు ప్రమాదకరంగా పరిణమిస్తారనే ఆందోళనతో వారిని ద్రుపదుని నుంచి వేరుచేసి తనవారిని చేసుకొనేందుకు అర్ధరాజ్య ప్రదానంచేసిన ధృత రాష్ట్రుడు, విరాటునితోకూడ సంబంధం కలుపుకొని శస్త్రాస్త్రాలు సంపాదించటంతో

సుస్థిరస్థితిలో ఉన్న పాండవులను మచ్చిక చేసుకొని పెదతండ్రిగా సుహృద్భావాన్ని ప్రకటించలేక పోవటం గమనార్హం. అర్ధరాజ్య ప్రదానం తరువాత, అంతకు పూర్వం ఉన్న పరస్పర అనుమానాలు విచ్ఛేదనం కాకపోగా, పాండవ ధార్తరాష్ట్రుల మధ్య శత్రుభావం పెరిగి ద్యూతం, ఘోషయాత్ర, గోగ్రహణాలలోని అనుభవాలే ఇందుకు కారణమై ఉండవచ్చు. ఏమైనా అజ్ఞాతవాసం పూర్తయ్యే నాటికి పాండవులకు పెద తండ్రితో సంబంధాలు బాగా దెబ్బతిని ప్రతివర్గ కూటంగా స్థిరపడ్డట్లు భావించ వచ్చు.

ఉద్యోగపర్వంలో కొనసాగిన రాయబారాలు అన్నింటిలోను ధృతరాష్ట్రి పాండవుల మధ్య ఈ ప్రతివర్గ భావమే కొనసాగింది. ధృతరాష్ట్రుడు ధర్మరాజు రాజకీయ ప్రత్యర్థులుగానే గోచరిస్తారు కాని తండ్రీకొడుకుల అనుబంధం మచ్చుకైనా కనిపించదు. ద్రుపద పురోహితుడు రాయబారిగా వచ్చిన సమయంలో భీష్ముడు "లోకము మెచ్చగ నిజసుతు నివహ మునట్లు" పాండవులను సంభావించటం ఉత్తమ మని చెప్పాడు. ఆ సమయంలో ధృతరాష్ట్రుడు అంతరంగాన్ని బయట పెట్టక, పెద్దలతో మాట్లాడి 'బిడ్డలపాలికిప్డు వర్తెంచెద సౌమ్యునొక్కరుని, అని తత్కాలో చితంగా మాట్లాడతాడు. ఆ పరిస్థితుల్లో పాండవులను బిడ్డలుగా సంభావించటం వాగమృతమేకాని హృదయానుభూతి కాదు. రాయబారితో ధర్మరాజాదులను 'బిడ్డలు'గా సంభావించిన పెదతండ్రి, సంజయునితో 'పాండునరపాల సుతులు' అని చెప్పటమే ఇందుకు నిదర్శనం. పరాయివ్యక్తితో పాండవుల ఎడ ఆత్మీయతను కలిగిఉన్నట్లు ప్రవర్తించి, తనవాడైన సంజయునితో తన ఆత్మగత భావాన్ని వ్యక్తం చేశాడు. కాని ధర్మరాజుతో మాత్రం

"మీ అయ్య మీరు వనవా
సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్ముం
డై యిట పుత్తెంచె నన్ను ననుమీ మొదలన్" (ఉ. 1-260)

అని ఆత్మీయతను ప్రదర్శించ వలసిందిగా చెబుతాడు. అంటే ప్రపంచానికి వారు 'బిడ్డలు', తాను 'అయ్య', మనసుకు మాత్రం వారు 'పాండునరపాల సుతులే'. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుని మాటల్లో మాత్రమే తేనెలొలికే తేట తెలుగు పదాలను ప్రయోగించిన తిక్కన ఉత్తమ మనస్తత్వ శాస్త్రజ్ఞుడు.

ధృతరాష్ట్రునకు తగిన సచివుడే సంజయుడు. ప్రభుకార్యజ్ఞుడవటం చేత వాక్చాతుర్యంతో ధర్మరాజును ప్రసన్నుణ్ణి చేసుకొనే ప్రయత్నంలో 'వితాంత స్నేహపూర్ణ చేతోవృత్తి'తో ధృతరాష్ట్రుడు అందరి యోగక్షేమాలను అరసిరమ్మన్నాడని సస్నేహంగా పలుకుతాడు. సంజయుడు ధృతరాష్ట్రుని సచివుడైతే ధర్మరాజు అతని జ్ఞాతియే కదా! ఆ పెదతండ్రి మనసు ఈ కుమారునకే తెలుస్తుంది. అందుకే

"ఆ రాజు మాదెసంగల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లున్నారము"

(ఉ. 1-276)

అని నర్మగర్భంగా పలుకుతాడు. ధర్మరాజు ధృతరాష్ట్రుని ప్రత్యర్థి అయిన సాటి చక్రవర్తిగానే పరిగణించాడుకాని పెదతండ్రిగా గౌరవించలేక పోయాడు. సంజయుడు ఎంతో ప్రీతిగా 'మీ తండ్రి' అన్నదానికి సమాధానంగా, నిజంగా పుత్రులతో సమానంగా చూస్తున్నట్లయితే

"వస్త్ర మాల్యానులేపనావసరములును
జతురతూర్యత్రయంబుల సమయములును
నేమువెలిగాగ మా తండ్రి కించునెట్లు
పుత్రులన పట్టి మమ్మేల పోవఁద్రోచు" (ఉ. 1-309)

అని పెదతండ్రిగా ధృతరాష్ట్రుని వైఫల్యాన్ని నిరసిస్తూ నిష్ఠూరంగా మాట్లాడి రాజకుమారునిగా హక్కులకు సంబంధించి కొన్ని ప్రాథమిక సమస్యలను లేవనెత్తుతాడు. ధర్మరాజు ఈ ధోరణి సంజయుణ్ణి నిరుత్తరుణ్ణి చేస్తుంది. సభలో తీవ్రంగా మాట్లాడిన ధర్మరాజు కీడ్కొలు చెబుతూ సంజయునియెడ స్నేహం, ఆత్మీయత ప్రదర్శిస్తాడు. హస్తినాపురంలోని వారి యోగక్షేమాలను పేరుపేరునా అరయవలసిందని చెప్తూ "మా తండ్రిగని యేను బ్రీతి మ్రొక్కుటగాగ దండప్రణామంబు గద నొనర్పు" (ఉ. 1-366) అని ప్రీతికరంగా మాట్లాడతాడు. 'మా తండ్రి' అన్న ధర్మరాజు సంభావన ధృతరాష్ట్రుడు చేసిన 'మీ అయ్య'

అన్న సంభావనను పోలి ఉన్నది. ఈ ఘట్టంలో వీరి సంబంధంలో వేర్పాటు ధోరణి, లౌక్యమే ప్రదర్శితం అవుతుంది కాని ఆత్మీయత ఏ మాత్రమూ గోచరించ టం లేదు.

ఉపప్లావ్యం నుంచి తిరిగివచ్చిన సంజయుడు పెదతండ్రిగా ధృతరాష్ట్రుని వైఫల్యాన్ని నిరసించి, రాజుక్షేమం కోరే ఆత్మీయునిగా ఆ తండ్రీ కొడుకుల వ్యక్తిత్వాలలోని వ్యత్యాసాన్ని నిరూపించి వంశక్షేమం కోసం పట్టుదల సడిలించు కోవలసిందని అర్థిస్తాడు. ధృతరాష్ట్రుడు తన వారి హితోక్తులకు చలించినట్లు కనిపించినా తన మార్గం మార్చుకోలేకపోయాడు. అప్పుడప్పుడు తమ్ముని కుమారు లకు తాను అన్యాయం చేస్తున్నానేమో అని ఆత్మపరిశీలనతో కూడిన ఆలోచన అతడికి రాకపోలేదు. కాని కార్యం నడపవలసి వచ్చేటప్పటికి తమ్ముని కుమారు లను విస్మరిస్తాడు. వీరి మధ్య సామరస్యంలేని ఈ స్థితి పరిస్థితుల ప్రాబల్యా పరిణామమేనని చెప్పవలసి ఉంటుంది.

ధర్మరాజు తన పక్షాన శ్రీకృష్ణుని కౌరవసభకు రాయబారిగా పంపే సమయంలో పాండవులు వ్యక్తం చేసిన అభిప్రాయాలలో పెదతండ్రిపై గౌరవభావం వ్యక్తం కాదు. పుత్రవ్యామోహంలో తమ్ముని బిడ్డలమైన తమను అన్యాయంచేసి వంశ నాశనానికి దోహదం చేస్తున్నాడని నిందిస్తారు. ద్రౌపదీ సహదేవులు మిగిలిన వారికన్నా తీవ్ర భావాలతో యుద్ధభేరినే మ్రోగిస్తారు. వీరి సంభాషణలలో 'తండ్రి' అనే సంబోధన పెదవులపై నుంచి వచ్చిందేకాని, ఆత్మీయత కనిపించదు.

పాండవ రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణుడు కౌరవ సభలో కురుపాండవుల మధ్య సామరస్యం, శాంతియుత సహజీవనం సాధించటంలో ధృతరాష్ట్రుని బాధ్యతను గుర్తు చేస్తాడు. కురు వంశానికి కుదురు అతడేననీ, కురు పాండవులలో ఎవరు కలత చెందినా అతడికే మనస్తాపం కలుగుతుందని, అందువల్ల ఉభయులకు మేలుచేకూర్చే కార్యం ఏ విధంగా చేసినా అది క్షేమకరమై అందరికీ శిరోధార్యం అవుతుందని సూచిస్తాడు. ధృతరాష్ట్రుని పెదతండ్రి బాధ్యతను

"పాండవులు దండ్రి సచ్చిన ప్రజలు వారి
నరసి ప్రోచితి శైశవమూదిగాగ
నడుమ నిష్కారణము దిగవిడువఁ దగునె
పారమొందంగ రక్షింపు గారవమున" (ఉ. 3-271)

అని గుర్తుచేసి ఉపేక్షవహించి పాండవ కౌరవులు క్షీరోదకగతి వర్ధిల్లేటట్లు వర్తించవలసిందని హితవు చెపుతాడు. ఇంకా పాండవులు "తల్లియుఁ దండ్రియు నెల్ల చుట్టంబులు నేడుగడయును మాకు దాన మావలన నేరమిగల్గినం గినిసి యిట్లుగా దట్లని చక్కం బెట్టునది" (ఉ. 3-272) అని పెదతండ్రి ఎడ ఎంతో భక్తి భావంతో ఉన్నారని, పెదతండ్రిగా అది నిలుపుకోవలసిందని హెచ్చరికగా బోధిస్తాడు. కృష్ణుని మాటలు రాజనీతి ప్రయోగాలేకాక, ఆత్మీయతా ప్రదర్శకాలు కావని ముందరి సంఘటనలు ఋజువు చేస్తాయి. జమదగ్ని నారదాది మునులు కూడ తమ్ముని బిడ్డలపై కనికరం వహించవలసిందని చెప్తారు. గాంధారి కూడ పాండవుల ఎడ బాధ్యతతో వ్యవహరించవలసిందని అర్థిస్తుంది. ధృతరాష్ట్రుడు అందరి హిత వచనాలకు తన అశక్తతను వ్యక్తం చేస్తాడు. అశక్తత, పుత్రవ్యామోహం కన్న పాండవుల ప్రతిజ్ఞలు, పరిస్థితుల ప్రాబల్యం ధృతరాష్ట్రుని ఉదాసీనతకు దోహదం చేసి ఉంటాయి. ఆ సమయానికి వారి సంబంధాలలో సామరస్యం కుదర్చటం ఎవరికీ సాధ్యం కాని స్థితి ఏర్పడింది.

కురుక్షేత్ర సంగ్రామం సాగేటప్పుడు కూడ ధృతరాష్ట్రుడు తమ్ముని కొడుకులను సామరస్య భావంతో చేరదీయలేకపోయాడు. పాండవ విజయాలు అతడి హృదయాన్ని దహించివేశాయి. తన మనస్తాపాన్ని సంజయునితో దాచు కోకుండ వెల్లడిస్తాడు. పుత్రులందరను కోల్పోయిన ఆ మహారాజు నిస్సహాయుడై అభద్రతా భావంతో ఉన్నట్లు తెలుస్తుంది. ఆ అభద్రతా భావమే కసితో హృద యాన్ని దహింప చేస్తుంది. ప్రధానంగా సుయోధన దుశ్శాసనులను నీచంగా సంహరించిన భీమునిపై విషాద రోషాలతో కూడిన కసిని పెంచుకొన్నాడు. ఈ విధంగా లాక్షాగృహ దహనం మొదలు భారత యుద్ధం పూర్తి అయ్యేవరకు జరిగిన కథలో ధృతరాష్ట్రి పాండవుల సంబంధాలలో సామరస్యం, సాన్నిహిత్యం, ఆత్మీయత లోపించి అనుమానం, విద్వేషం, ప్రతీకారంతో కూడిన శత్రుభావం నెల కొన్నట్లు స్పష్టమవుతుంది.

కురుక్షేత్ర సంగ్రామం ధృతరాష్ట్రి ధర్మరాజు లిరువురకు సుఖప్రదం కాలేదు. పుత్రులను బంధువులను కోల్పోయిన పెదతండ్రికి చిత్తక్షోభ మిగిలింది. విజయం సాధించిన తమ్ముని కుమారునకూ మానసిక అశాంతే మిగిలింది. వ్యాస

విదురాదులు పుత్రశోకం విడిచి పాండుపుత్రులనే స్వీయపుత్రులుగా సంభావించి చిత్తశాంతి పొందవలసిందని హితవు చెప్తారు. వారి హితవచనాలకు సాంత్వన చెందిన మనసుతో

"నిర్భర బాంధవంబు నొందెదఁ
బురుషోత్తములైన పాండు పుత్రకులదెసన్" (స్త్రీ. 1-94)

అని పాండవులతో బాంధవ్యం పెంచుకోవటానికి సిద్ధపడతాడు. పెదతండ్రి దయనీయ స్థితికి తల్లడిల్లిన మనసుతో ధర్మరాజు అతణ్ణి సాంత్వనపరచే ప్రయత్నంతో సమీపిస్తాడు. ఆ ఇరువురి సమాగమంలో

"ఉల్లంబు ప్రియమొందఁ గ్రొత్త సం
ధిల్లన్ నెవ్వగ దీన వక్త్రుడై
యొల్లం బోవుచునుచ్చె నవ్విభుం
డల్లం గౌగిట నానృపాలకున్" (స్త్రీ. 1-125)

చేర్చుకోవటంలో అనుమాన సంకోచాలతో క్రొత్త అనుభూతి నెలకొన్నది. సుదీర్ఘకాలం మనసుల్లో నెలకొన్న శత్రుత్వపు పొరలు తొలగింతరువాత జరిగే ప్రథమ సమాగమంలో ఈ క్రొత్త అనుభూతి తప్పదు. లోకజ్ఞుడైన తిక్కన పునస్సమాగమంలో వీరి చిత్త ప్రవృత్తులను సహజంగా తీర్చిదిద్ది ఈ సన్నివేశానికి జీవత్వాన్ని కలిగించాడు

ధర్మరాజు శత్రువులను నిర్జించిన తర్వాత కురు సామ్రాజ్యంలో తుఫాను వెలసిన ప్రశాంతత నెలకొన్నది. కుమారులందరను కోల్పోయి దయనీయస్థితిలో ఉన్న పెదతండ్రిని సానుభూతితో అర్థం చేసుకొని మనశ్శాంతి కలిగించి కుమారులు లేని లోటు తీర్చేందుకు ధర్మరాజు శాయశక్తులా ప్రయత్నించాడు. ధృతరాష్ట్రి పాండవుల సంబంధంలో దీనిని మూడవదశగా భావించవచ్చు.

పట్టాభిషేక సమయంలో ఆశీర్వదించి అభినందించటానికి వచ్చిన బ్రాహ్మణ పౌర జానపదులకు కృతజ్ఞతలర్పిస్తూ ధృతరాష్ట్రుణ్ణి పూర్వం సంభావించినట్లు సంభావించటమే తనకు ప్రియమని చెప్తూ ధర్మరాజు

"తండ్రియు గురువును దైవంబు నీతఁడ
మాకు మీరెల్ల నీ మనుజ విభుని
పనుపు సేయుటయు, నీతనికిఁ బ్రియంబు గా
వించుటయును మమ్ము వేనవేల
విధులఁ బ్రీతులఁజేత యుర్వీజనములఁ
బౌరులును మీరలును దొంటిభంగి దప్ప
కిమ్మహారాజునెడ వినయమ్ము తోడ
నడచుచుంటయ యెంతయు నాకుఁ బ్రియము" (శాంతి. 1-376)

అని విన్నవించాడు. సామ్రాజ్యాన్నంతటినీ ధృతరాష్ట్రునకు సమర్పించి "మీర లింతటికి నొడయులరేను మీ పనిచిన పనిసేసి పెట్టినయట్లగుడిచి యుండం గలవాఁడ" (శాంతి. 2-2) అని విధేయత ప్రదర్శించాడు. ధృతరాష్ట్రుడు కూడ చిత్తం కలకదేరి ప్రసన్నమైన వదనంతో "ప్రతిష్ఠితంబులయిన కలశంబులలో నుజ్జ్వ లంబగు నొక్కటి ధౌమ్యుండంది యీ నెత్తి యీ ఘనపోత్తము నభిషేకించి" (శాంతి. 1-375) తమ్ముని కొడుకులను చిత్తశుద్ధితో ఆత్మజులవలె సంభావించ ప్రయత్నించాడు.

ధర్మరాజు పట్టాభిషిక్తుడైన తర్వాత జరిగిన రాజకార్యాలన్నింటిలో పెద తండ్రికి పెద్దరికం ఇచ్చి గౌరవించాడు. అశ్వమేధయాగ నిర్వహణకు వ్యాసుడు ధర్మరాజును ఉత్సాహపరచగా, స్థిరనిశ్చయుడై పెదతండ్రికి విన్నవించి యజ్ఞా చరణకు అనుజ్ఞ పొందాడు. యజ్ఞాశ్వం వెంటవెళ్లిన అర్జునుడు యాగాశ్వాన్ని బంధించిన శకుని కుమారుణ్ణి జయించి కూడ 'విశేషించి గాంధారీ ధృతరాష్ట్రులం దలంచి' బంధుప్రీతితో విడిచిపెట్టాడు. నిర్విఘ్నంగా అజేయంగా యాగాశ్వంతో తిరిగి వచ్చిన అర్జునుణ్ణి ధృతరాష్ట్రుని పురస్కరించుకొనే ధర్మరాజు సాదరంగా ఆహ్వా నించాడు. అశ్వమేధయాగం జయప్రదంగా నిర్వహించి కురుసార్వభౌమునిగా స్థిరపడ్డ ధర్మరాజు పెదతండ్రికి పుత్ర మరణ జనిత దుఃఖం మరపుకు వచ్చేందుకు ఎక్కువ సమయం అతని సమీపంలోనే ఉండి

"ఆ తల్లికిఁ దండ్రికి సం
ప్రీతి యలరఁ గుడువఁ గట్టఁ బెట్టి నుదాత్త

స్ఫీతంబులైన వస్తు
వ్రాతంబుల ... అనుదినమున్'' (ఆశ్రమ. 1-6)

ఇచ్చి సంతోష పెట్టేవాడు. గుళ్లు, చెరువులు కట్టించి అగ్రహారాలు దానం చేసేందుకు అనుమతి ఇచ్చి పెదతండ్రిని తృప్తి పరచేవాడు. ధర్మరాజును సందర్శించి కొలవటానికి వచ్చిన వారు ముందుగా ధృతరాష్ట్రుని సందర్శించేవారు. అప్పుడు ధర్మరాజు హృదయం సంతోషంతో పొంగిపోయేది. ఇంకా ధర్మరాజు అతులితమైన భక్తితో

''సూనులులేమిం గలిగెడు
దీనత్వము దోఁపకుండఁ దేజస్సౌఖ్యా
నూనులుగ'' (ఆశ్రమ. 1-9)

చేసి గాంధారీ ధృతరాష్ట్రులకు మనశ్శాంతితో పాటు పాండుపుత్రులే తన పుత్రులని భావించే విధంగా ప్రవర్తించాడు. ధర్మరాజు ప్రవర్తనలో చిత్తశుద్ధి, లాలింపు ద్యోతకమవుతాయి. ధృతరాష్ట్రుడుకూడ పాండవులుచూపే గౌరవాదరాలకు 'నిజాత్మజు వలనికంటె ప్రియంబందుచు' సంతృప్తితో కాలం గడపసాగాడు.

అయితే పెదతండ్రితో పాండవుల బాంధవ్యం సదవగాహనతో ఏకమవుతుందనుకుంటున్న సమయంలో, భీముడు మాత్రం ధృతరాష్ట్రుని పూర్వపు ఉదాసీన భావాన్ని మరచిపోలేకపోయాడు. గతంలోని సంఘటనలు అతడి హృదయాన్ని జ్వలింపచేసేవి. ధర్మరాజు దృష్టికి రానీయకుండ ఏకాంతంలో నర్మగర్భమైన ములుకుల్లాంటి మాటలతో పెదతండ్రి హృదయం శల్యమయ్యే విధంగా ప్రవర్తించేవాడు. ధర్మరాజు సేవాతత్పరత, వాత్సల్యం, భక్తిభావం ధృతరాష్ట్రుని హృదయాన్ని ఊరట పరుస్తున్నా, భీముని ప్రవర్తనకు హృదయం భేదిల్లి జీవితంపై మమకార నశింప జొచ్చింది.

ఈ పరిస్థితుల్లోనే ఆశ్రమవాసం పోయేందుకు ధర్మరాజు అనుజ్ఞవేడాడు. ధర్మరాజు పెదతండ్రి అరణ్యానికి పోయేందుకు పుత్రమరణజనిత దుఃఖమే కారణం అని అనుమానించాడు. కాని, భీముని ప్రవర్తన అతడికి తెలియదు. అందువల్ల కుమారునిగా పెదతండ్రికి సేవ చేయటంలో చిత్తశుద్ధిని ప్రకటించి వనవాస ప్రయాణాన్ని మాన్పించే ప్రయత్నం చేస్తూ ''తల్లియుఁ దండ్రియున్ గురుడు దైవము

నాకరయంగ నీవ భూవల్లభ" (ఆశ్రమ. 1-32) అని తనకు తల్లితండ్రి సర్వస్వం అతడేనని ప్రాధేయపడతాడు. ఇంకా ధృతరాష్ట్రుని ఔరసుడైన యుయుత్సునకు హస్తినాపుర రాజ్యం అప్పగించి పెదతండ్రికి సేవ చేసుకోవటానికి ఆశ్రమవాసానికి తనకుకూడ అనుమతి ఇవ్వమని అర్థిస్తాడు. గాంధారి, కుంతి తనకు ఏకరూపులే కనుక తల్లిదండ్రుల సేవ చేసుకొనే అదృష్టం కలిగించ వలసిందంటూ

"నీకు శుశ్రూష యొనరించి నృపవరేణ్య
చిత్తతాపంబు మానంగ జేసికొందు
నని తలంచు నన్విడువంగ నగునె యవన
తుండనై నిన్ను వేఁడెదఁ దొఱగు వగలు" (ఆశ్రమ. 1-36)

అని ప్రాధేయ పడతాడు. ధృతరాష్ట్రుడు ఆ కుమారుని హృదయానికి హత్తుకొని

"నీవు శుశ్రూష చిరకాల నియతిఁ జేసి
తేను వృద్ధుండ నయితి నాకింకఁ దపము
వలవదయ్య ......" (ఆశ్రమ. 1-38)

అని ధర్మరాజును ఓదార్చి తన కృతనిశ్చయాన్ని వ్యక్తం చేస్తాడు.

ఆశ్రమవాస ప్రయాణానికి సిద్ధమైన ధృతరాష్ట్రుడు సప్తాంగమైన రాజనీతిని బోధించి

"మదాత్మయు నీదెసఁ బ్రీతి పెద్దయుం
బొరయుట నేనుఁ గొన్నియుతువోలిన భంగి నెఱుంగ జెప్పితిన్", (ఆశ్రమ. 1-78)

అని ఆత్మీయతను వ్యక్తంచేశాడు. పెదతండ్రి ఆత్మీయతలో పరవశించిన ధర్మరాజు నా శ్రేయోభిలాషి భీష్ముడులేడు, ఆత్మబంధువు శ్రీకృష్ణుడు నిజపురానికి పోయిన ఈ తరుణంలో "వాత్సల్యత నీవు దక్కఁగ నాకు హితము సెప్ప నొడయుడెవ్వడు" (ఆశ్రమ. 1-80) అని అనురాగ పూరితమైన భక్తిని ప్రదర్శిస్తాడు. తపోవనానికి పోయేందుకు హస్తినాపుర ప్రజల అనుమతి కోరుతూ ధృతరాష్ట్రుడు ధర్మరాజును గూర్చి 'దిక్పాలకమధ్య భాసితుండైన మఘవు బోలి' ప్రకాశిస్తున్నాడని ఆత్మీయంగా పలుకుతాడు. ఆశ్రమానికి ప్రయాణమైనధృతరాష్ట్రుణ్ణిచూసి, పెదతండ్రి వియోగాన్ని భరించలేక ధర్మరాజు

"శోకదీనుడై తప్పకచూచి యేడ్చి
హామహారాజ ముఖ్య యెందరిగె దనుచు
నొడలు కంపింపఁ జదికిలబడి" (ఆశ్రమ. 1-140)

మూర్ఛిల్లాడు. ఈ సంఘటనలన్నీ పెదతండ్రీ కుమారుల హృదయాలు జీవితాంతంలో ఆత్మీయతతో పెనవేసుకు పోయాయన్న విషయాన్ని తెలియ చేస్తున్నాయి.

ఆశ్రమవాసంలో వల్కలాజినాలు ధరించి తపోవృత్తిలో ఉన్న పెదతండ్రిని సందర్శించేందుకు ధర్మరాజు బంధువర్గంతో కలిసి ఆశ్రమానికి వస్తాడు. అప్పుడు ధర్మరాజు పరిపాలనను ధృతరాష్ట్రుడు, ధృతరాష్ట్రుని తపోవిధానాన్ని ధర్మరాజు పరస్పరం ఎంతో ఆత్మీయంగా పరామర్శించుకొంటారు. ఆశ్రమంలో పెదతండ్రి సేవలో నెల్లాళ్ల గడపి తిరుగు ప్రయాణమైన ధర్మరాజును "దీవించుచు నాలింగ నంబు సేచి భీమసేను సాంత్వన వచనంబులం బ్రీతుకావించి కౌగిలించుకొని గాండీవిం గౌవియాడి సంశ్లేషం బాచరించి కవల సంభావించి పరిరంభణంబు నిర్వర్తించి" (ఆశ్రమ. 2-142) ధృతరాష్ట్రుడు ఎంతో ఆదరంతో వీడ్కోలు పలికాడు. ఈ సమావేశమే పెదతండ్రితో పాండవులకు చివరిది. ధృతరాష్ట్రుని జీవితంలో పెద తండ్రిగా ఈ సన్నివేశం ఎంతో మధురమైంది. మనసు అమితమైన ప్రేమ, ఆత్మీ యతతో నిండి ఉన్నపుడు శరీరస్పర్శకు తహతహ లాడుతుందని మనస్తత్వ శాస్త్ర వేత్తల పరిశీలన. ధృరాష్ట్రునకు తమ్ముని కొడుకుల ఎడ ఆ హృదయస్పందనే వీడ్కోలు సమయంలో గాఢాలింగనాలుగా పరిణమించింది.

ఈ విధంగా కవిత్రయ భారతంలో ధృతరాష్ట్రుడు పెదతండ్రిగా లోకం లోని సామాన్య మానవుల్లాగే ప్రేమాభిమానాలకు, ఈర్ష్యాసూయలకు పశ్చాత్తాపాను కంపాలకు దూరం కాలేక పరిస్థితుల ప్రాబల్యానికి అనుగుణంగా ప్రవర్తించినట్లు తేటతెల్లమౌతుంది మానవుడు ఎంత స్థిరసంకల్పుడైనా సమాజంలోను, జీవితం లోను వచ్చే మార్పుల వ్యక్తి పురోగమనంలో, సంబంధ బాంధవ్యాలలో వింత పోకడలకు దారితీయటం సహజ పరిణామంగానే భావించవచ్చు. మానవ జీవితంలో జరిగే సహజ పరిణామాలే పెదతండ్రిగా ధృతరాష్ట్రుని జీవితంలో కూడ చోటుచేసు కొన్నాయని తలంచటం సమంజసంగా ఉంటుంది.

# 1.8 అతిథిసత్కారం

గృహస్థ ధర్మాల్లో అతిథిసత్కారం ఒక ప్రధాన అంశంగా ధర్మశాస్త్రాలు పేర్కొన్నాయి. పురాణాల్లోను, కావ్యాల్లోనుకూడ అతిథిసత్కారం బహుముఖంగా వివరించబడి ఉంది. 'అతిథిదేవోభవ' అనే ఉపనిషద్వాక్యం మానవ జీవితంలో అతిథిదేవులకున్న ప్రాధాన్యాన్ని వ్యక్తంచేస్తుంది. ఆతిథేయ ధర్మంలో అతిథి సత్కార విశేషాన్ని వివరించే సిరియాళుని కథవంటి కథలెన్నో భారతీయపురాణాల్లో దర్శనమిస్తాయి. ప్రబంధ సాహిత్యంలో ఉత్తమ గృహస్థులుగా కనిపించే ప్రవర, విష్ణుచిత్తుల జీవితాలు అతిథిసత్కార విషయంలో ఆదర్శంగా నిలుస్తాయి.

సమాజంలో ఆర్థిక సామాజిక పరిస్థితుల్ని బట్టి గృహస్థులలో అసమానత లున్నట్లే విద్యావిశేషాలనుబట్టి, రాజకీయాధికారాన్ననుసరించి, ఆత్మీయమైన స్నేహ బాంధవ్యాన్నిబట్టి అతిథుల్లోకూడ 'అనేక రకాల'వారుంటారు. వీరేకాక కొన్ని సంద ర్భాల్లో అనాహూతులుగా వచ్చే ఆగంతుకులైన అతిథులుకూడ తారసిల్లుతుంటారు. అతిథులను మర్యాదచేయటం సాధారణ సామాజిక ధర్మంగానే భావించవచ్చు. అతిథు లందరనూ ఒకే విధంగా సత్కరించటం సాధ్యంకాదు. వారిహోదాలను, విద్యా సంస్కారాలను, ప్రజ్ఞాపాటవాలను బట్టి ఈ సత్కారం వేరు వేరుగా ఉంటుంది. సామాజికంగా ఉన్నత స్థితిలో ఉన్న గృహస్థులు తమస్థాయికి తగ్గట్లుగా అతిథి సత్కారం ఘనంగా జరుపుతారు. ఈ అతిథిమర్యాద కేవలం గృహస్థులకు వ్యక్తి గత ధర్మంగానేకాక కొన్ని సందర్భాల్లో జాతిగౌరవ ప్రతిష్ఠలకుకూడ కొలబద్దగా ఉంటుంది. దేశవిదేశీయంగా వచ్చే గౌరవనీయులైన అతిథులను మర్యాద చేసేం దుకు భిన్నభిన్న దేశాలవారు భిన్న సంప్రదాయాలను అనుసరించటం ఆధునిక కాలంలో కూడ చూస్తున్నాము. కురుసార్వభౌముడైన ధృతరాష్ట్రుడు గృహస్థుగా, సామ్రా జ్యాధినేతగా ఆయావ్యక్తుల సామర్థ్య ప్రజ్ఞాప్రాభవాలను, అధికారికమైన హోదాలను ఆత్మీయతా గౌరవాలను దృష్టిలో ఉంచుకొని అతిథిసత్కార కార్యక్రమాన్ని సమర్థ వంతంగానే నిర్వహించినట్లు మహాభారతాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. ధృతరాష్ట్రుని సందర్శించిన వారిలో మునులు, సచివులు, రాయబారులు, బంధువులు ఇట్లా అనేక రకాలవారు ఉన్నారు. వీరందరికీ సముచితంగాను, కొన్నిసందర్భాల్లో అధికంగాను సత్కారాలు జరిపి ఆదర్శవంతుడైన ఆతిథేయిగా గౌరవ పాత్రుడయ్యాడు.

శతశృంగంలో పాండురాజు మరణించిం తరువాత అక్కడి మునులు మాద్రీ పాండురాజుల అస్థికలను సేకరించి, కురువృద్ధులకు అప్పగించేందుకు హస్తినాపురం తీసుకొని వస్తారు. ధర్మవేత్తలయిన మునులు కావటంవల్ల ధృతరాష్ట్రుడు వారికి స్వాగత సత్కారాలు చేసేందుకు మంత్రి పురోహిత బ్రాహ్మణ సముదాయంతో కలిపి సుయోధనాది కుమారులను రాజమందిర ముఖద్వారం వరకు పంపి వారి ఎడ విశేషమైన గౌరవాన్ని ప్రదర్శించాడు. సకల సత్కారాలతో అంతఃపురం ప్రవేశించిన ఆ మునులకు భీష్మవిదుర సత్యవత్యంబికాంబాలికలతో కలిసి ధృతరాష్ట్రుడు నమస్కరించి వినయంతో సత్కరించాడు. పాండుకుమారులను స్నేహంతో కౌగిలించుకొని సంభావించాడు. ఈ సందర్భంలో ధర్మవేత్తలైన మునులను, కుమారులైన పాండవులను సత్కరించిన విధానం సమయోచితంగాను, పాత్రోచితంగాను ఉంది.

ద్రోణుడు మొట్టమొదటి సారిగా హస్తినాపురంలో ప్రవేశించినపుడు ఆయనను సత్కరించినవాడు భీష్ముడు. క్రీడా వినోదులైన రాకుమారులతో వచ్చిన ద్రోణుణ్ణి అంతకు పూర్వం ఎఱిగినట్టి ఆత్మీయతను ప్రదర్శించి, కురుకుమారులకు శస్త్రవిద్యాచార్యునిగా నియమించి

"ఘనభుజు నభీష్ట పూజా
ధనదాన విధానముల ముదంబునదనిపి" (ఆది. 5-220)

గురుపూజ సగౌరవంగా నిర్వహిస్తాడు. వచ్చినవ్యక్తి ప్రసిద్ధుడే అయినా, అంతకు పూర్వం అభివ్యక్తం కాని ఆగంతకుడైన అభ్యాగతుడు. అతని ఘనకార్యాలను బట్టే సత్కారానికి అర్హమైనవాడయ్యాడు. ఇలాంటివారిని సత్కరించటానికి మహారాజే స్వయంగా పూనుకోవలసిన అవసరంలేదు. మహారాజు తరువాత కురువంశంలో అత్యంత ప్రధానమైన వ్యక్తి అయిన భీష్ముడు సత్కార బాధ్యతను స్వీకరించాడు. ఆధునిక యుగంలోకూడ అతిథి హోదాను గుర్తించి ఆ హోదాకు సరిపోలిన అధికారి స్వాగత సత్కారాలేర్పాటు చేయటం సంప్రదాయంగా కనిపిస్తుంది కాని, అందరినీ దేశాధినేతే సత్కరించటం సాధ్యంకాదు అందువల్ల ద్రోణాచార్యుని ప్రథమ సత్కారంలో ధృతరాష్ట్రుడు రాజమర్యాదను పాటించినట్లు విశదమౌతుంది.

ద్రౌపదీ వివాహానంతరం విదుర సహితులై హస్తినాపురంలో ప్రవేశించిన ధర్మరాజాదులకు జరిగిన స్వాగత సత్కారాలు రాజమర్యాదానుసారంగానే

జరిగినట్లు కనిపిస్తుంది. పాండవులను వారణావతం పంపటంవల్ల కలిగిన అనుభవాల స్మృతులు అందరి మనసులలోను ఉండి ఉంటాయి. ఆ అపవాదు తొలగి పాండవుల హృదయాల్లో పూర్వపు ఆత్మీయతతో కూడిన విశ్వాసం ఏర్పడాలంటే వారికి జరిగే మర్యాదలలో సంభావనలు వైభవంగా జరగవలసి ఉంది. వారి కష్టాలకు కారణంగా భావించే సుయోధనాదులే ప్రథమంగా వారికి కనిపిస్తే, అప్పుడే మానుతున్న గాయాలను రేపినట్లవుతుంది. అందువల్ల ధృతరాష్ట్రుడు పాండవ సత్కారాలు ఏర్పరచేందుకు వికర్ణ, చిత్రసేన, ద్రోణ, కృపాచార్యులను నియమించాడు. వీరిలో ద్రోణకృపులు గురుజనులుకాగా, వికర్ణ, చిత్రసేనులు పాండవుల దృష్టిలో వివాదాస్పదులు కారు. ఈ సమయంలో స్వాగత సత్కారాలు అతిథి మర్యాదతో పాటు, రాజకీయ ప్రయోజనాన్ని సాధించే ప్రయత్నంగాకూడ కనిపిస్తుంది.

సుహృద్ద్యూతం నిమిత్తం ఇంద్రప్రస్థంనుంచి హస్తినాపురం వచ్చిన పాండవులకు జరిగిన సత్కారం పైసన్నివేశానికి కొంత భిన్నంగా ఉంది. ద్రౌపదీ వివాహానంతరం పాంచాల నగరంనుంచి వచ్చిన ధర్మరాజు కేవలం తమ్ముని కొడుకు, ద్రుపదుని అల్లుడు మాత్రమే. సుహృద్ద్యూతానికి వచ్చే ధర్మరాజుకూడ తమ్ముని కొడుకే అయినా, ఒక స్వతంత్ర రాజ్యాన్ని పాలించే సమ్రాట్టు. అందువల్ల స్వాగత సత్కారాలు సకల ప్రభుత్వ లాంఛనాలతో జరపవలసిన ఆవశ్యకత ఎంతైనాఉంది. కనుకనే ధృతరాష్ట్రుడు "దుర్యోధన దుశ్శాసనాది పుత్రశతంబుతో భీష్మ శకుని సైంధవ, కర్ణ, గౌతమ, ద్రోణాశ్వత్థామ, సోమదత్త సమేతుడై" (స. 2-159) స్వాగతం పలికాడు. ఇంత ఆర్భాటంగా స్వాగతం పలికిన గాంధారీ ధృతరాష్ట్రులకు ధర్మరాజు వినమితాంగుడై నమస్కరించాడు. తెలుగు భారతంలో అంత వరకే ఉంది. సంస్కృత భారతంలో తనకు మ్రొక్కిన ధర్మరాజ భీములను ధృతరాష్ట్రుడు మూర్ధాఘ్రాణం చేసినట్లు ఉంది. మూర్ధాఘ్రాణం చేయటం ఎక్కువ ఆత్మీయతను వెల్లడిస్తుంది. నన్నయ భారతంలో పెద్దల ఎడ పిన్నలు చూపే విధేయత మాత్రమే కనిపిస్తుంది. సంస్కృత భారతంలో రాజోచిత మర్యాదలతో పాటు ఆత్మీయతకూడ ద్యోతకం అవుతుంది. ఈ ఆత్మీయతా ప్రదర్శన అనంతర పరిణామాలలో తన పాత్రను ధర్మరాజు శంకించకుండ ఉండేందుకు ధృతరాష్ట్రుడు చేసిన ప్రయత్నంగాకూడ భావించవచ్చు.

ఒకసారి కామ్యకవనంలో ఉన్న ధర్మరాజును సందర్శించిన అనంతరం మైత్రేయుడనే మహర్షి ధృతరాష్ట్రుని మందిరానికి వస్తాడు. ఆ మహర్షిని ధృతరాష్ట్రుడు "ఆత్మ నిశ్శ్రేయసలాలసుండయి విశేష సపర్యలఁజేసి భక్తితోన్" (అరణ్య. 1-92) పూజలు చేసి సత్కరించాడు. పూజితుడైన ముని సుఖ విశ్రాంతుడైన తరువాత ఆ రాజు 'ముకుళిత హస్తుడై భట్టారకా యెందుండి వచ్చితిరి' అని కుశల ప్రశ్నలతో ఆ మహర్షి యాత్రా విశేషాలను తెలుసుకొనే కుతూహలం వెలిబుచ్చుతాడు. ఈ కుతూహలమే నన్నయ తర్వాత వచ్చిన కావ్యాలలో ప్రవర విష్ణుచిత్తులవంటి శ్రోత్రియ గృహస్థులకు మార్గదర్శకమై ఉంటుందని తలంచవచ్చు.

సుయోధనుడు ధర్మరాజు చేసిన రాజసూయ యాగాన్ని ధిక్కరించే విధంగా వైష్ణవయాగం చేయాలని సంకల్పించాడు. యజ్ఞాహూతులైన వారికి సక్రమమైన మర్యాదలు చేసి సత్కరించవలసిన బాధ్యత యజ్ఞకర్తపై ఉంటుంది. ధృతరాష్ట్రుడు యాగదర్శనార్థం వచ్చిన అతిధి సంఘానికి తగిన సత్కారాలు చేసే బాధ్యత విదురునకు అప్పగించాడు. విదురుని ఆధ్వర్యంలో "ప్రసిద్ధ దక్షిణాన్వితంబై, ప్రభూతాన్నపాన సంతర్పిత సకలజనంబై యభిమతాంబరాభరణ పరిపూజిత భూసుర ప్రకరంబై యధాకాల విహిత కర్మకలాపంబై యధా శాస్త్రీయంబై" (అరణ్య. 6-84) వైష్ణవ యాగం ఘనంగా పరిసమాప్తమైంది. యజ్ఞాహూతులను సత్కరించేందుకు విదురుణ్ణి నియమించటంలోనే ధృతరాష్ట్రుని అతిథేయ సామర్థ్యం వెల్లడవుతుంది. ఆధునిక యుగంలో కూడ యజమాని చేసే మర్యాదలనుబట్టే ఆహూతులైన బంధుమిత్రాదులు పొగడటం కనిపిస్తుంది. వైష్ణవయాగం దర్శించిన వారు కూడ పురాతనాద్యతన రాజులు చేసిన యజ్ఞాలలో వైష్ణవయాగం తలమానికం అని సుయోధనుని సాన్నిధ్యంలో కొనియాడారు. కాని వీరిలోనే కొందరు

> "అయ్యుధిష్ఠిరు రాజ సూయంబు చివర
> పాలిఁబోల దీమఖము వైభవ సమృద్ధి" (అరణ్య. 6-90)

అని మనసులలో భావించారు. ఏ కార్యం జరిగినా ఇట్లా భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేసేవారు అన్ని కాలాలలోను ఉంటుంటారు. మొత్తం మీద వైష్ణవ యాగం

సమయంలో ధృతరాష్ట్రుని గురుపూజా విధానము, అతిథి సత్కార విశేషమూ ప్రశస్తంగా ఉన్నట్లు విశదం అవుతుంది.

కౌరవ పాండవులకు సంధి సమకూర్చే ప్రయత్నంలో పాండవ పక్షాన ద్రుపద పురోహితుడు ధృతరాష్ట్రుని వద్దకు వస్తాడు. ద్రుపద పురోహితునకు ప్రత్యేకమైన అతిథి మర్యాదలు చేసినట్లు భారతంలో లేదు. అతడే ధృతరాష్ట్రుని అంతఃపురంలో వ్యక్తిగతంగా సందర్శించి ప్రీతితో మాట్లాడతాడు. అతడు కేవలం రాయబారిగా వచ్చినవాడు కనుక, ప్రత్యక్షంగా ధృతరాష్ట్రుడు చేయకపోయినప్పటికీ, రాజ మర్యాదలన్నీ పాటించే ఉంటారని తలంచవచ్చు. ఆధునిక యుగంలో కూడ విదేశాలనుంచి వచ్చిన రాయబారులు రాజ్యాధినేతను అధికార నివాసంలో మర్యాద పూర్వకంగా కలుసుకోవటం సంప్రదాయంగా ఉంది. ఆ కాలంలో కూడ ఇదే మర్యాద అమలులో ఉన్నదని భావించవచ్చు. ద్రుపద పురోహితుడు తన కార్య కలాపాలు పూర్తి చేసుకొని తిరుగు ప్రయాణం అయ్యే సమయంలో ధృతరాష్ట్రి డాతనికి "విభూషణాంబరమ్ములతోఁ బన్ను మలంబు బెట్టి" (ఉ. 1-257) వీడ్కోలు పలికాడు. ఈ సత్కారం రాయబారి గౌరవానికి అనుగుణంగానే జరిగినట్లు స్పష్టం అవుతుంది.

పాండవుల వద్దకు రాయబారిగా వెళ్లి తిరిగివచ్చిన సంజయుడు ఏకాంత మందిరంలో ధృతరాష్ట్రుని దర్శించి మ్రొక్కుతాడు. ధృతరాష్ట్రుడు అత్యాదరంతో సంజయుణ్ణి తన సమీపంలో ఆసీనుణ్ణి చేసి సత్కరిస్తాడు. అట్లాగే సంజయుణ్ణి ధర్మరాజు వద్దకు పంపేటప్పుడు కూడ రథము సాగేంతవరకు వచ్చి సాగనంపుతాడు. ఈ సంఘటనల వల్ల ధృతరాష్ట్రుడు అతిథులుగా వచ్చిన పెద్దలయందేకాక, రాజ కార్యాలు నెరవేర్చే దూతల ఎడ కూడ ఎంతో మర్యాదగా ప్రవర్తించేవాడని స్పష్ట మౌతుంది.

ధృతరాష్ట్రుడు మనశ్శాంతి కోసం ధర్మబోధకాలైన విషయాలు తెలుసు కోవాలని సంకల్పించినపుడు, విదురుడు సనత్సుజాత మునీంద్రుని స్మరిస్తాడు. ప్రత్యక్షమైన ఆ మునీంద్రుని "ఎదుర్కొని దండ నమస్కారంబు లాచరించి యున్నతాసనంబిడి యర్ఘ్య పాద్యంబులిడి" (ఉ. 2-104) సత్కరించాడు. ధృతరాష్ట్రుడు 'ప్రత్యుత్థానంబును బ్రణామంబును' చేసి భక్తి ప్రపత్తులు కనపరచాడు. అట్లానే వ్యాసునకు కూడ "దండ ప్రణామంబులు సేసి సమున్నతాసనంబున

నునిచి యర్ఘ్య పాద్యాది విధులం బూజించి" (ఉ. 2-305) సత్కరించాడు. తత్త్వ వేత్తలు, వైదిక దార్శనికులైన మునీశ్వరులపై ఆ మహారాజుకు గల భక్తి విశ్వాసాలు ఈ సత్కారాలవల్ల తెలుస్తుంది.

ధృతరాష్ట్రుడు చేసిన అతిథి మర్యాదలన్నింటిలోను శ్రీకృష్ణునకు చేసిన మర్యాద తలమానికమై ఒప్పుతుంది. శ్రీకృష్ణుడు కుశస్థలంలో విడిది చేశాడని విన్న వెంటనే ధృతరాష్ట్రుడు పెద్దలందరకు కృష్ణాగమన వర్తమానం తెలిపి, అతడు తమకు అతిథి కావటం విశేషమనీ, అతణ్ణి సంతృప్తి పరిచినవారికి సకల శుభాలు జరుగుతాయని అంటాడు. అందువల్ల తగిన విధంగా పూజలుచేసే ప్రయత్నంలో 'గృహాలంకరణాది మంగళ ప్రకారంబులనుష్ఠింప' నియమించి, "అతని చిత్తంబును నీవిభవంబును ననమీది ప్రియంబును దోచునట్టి తెఱంగున" (ఉ. 3-149) సమస్త కార్యాన్ని నిర్వహించ వలసిందని సుయోధనుణ్ణి ప్రోత్సహిస్తాడు. తండ్రి అనుజ్ఞకు అనుగుణంగా పరివారాన్ని పిలిపించి 'మృగమదంతో ముగ్గులు పెట్టవలసిందనీ, కర్పూరంతోను, కుంకుమతోను గోడలు అలకవలసిందనీ, వీధి కూడలులలో మణిదామకములు కట్టవలసిందని' ఆజ్ఞాపిస్తాడు. శ్రీకృష్ణుని రాక సందర్భంగా పట్టణంలో ఉత్సవ దినంగా చాటించవలసిందని చెప్పి "వివిధ గంధ మహిత మాల్యంబులు సంపాదింపను, మణిభూషణ చిత్రాంబరంబులు సమకట్టను సరసాన్న స్వాదుపాన ద్రవ్యంబు లొడగూర్పను నేర్పరులగు తజ్ఞులను" (ఉ. 3-155) నియమించాడు. అతిథికి విడిదిగా సుయోధనుని గృహం కాని, దుశ్శాసనుని గృహం కాని శోభాయమానంగా రూపురేఖలు దిద్దవలసిందని ఆజ్ఞాపించాడు. శ్రీకృష్ణునకు ఏర్పాట్లు చేసే అంశంలో తండ్రీకొడుకుల ఆర్భాటంలో మర్యాదతోపాటు రాజకీయ ప్రయోజనాలుకూడ ఇమిడి ఉన్నాయి. ధృతరాష్ట్రుడు 'వివిధ మణిమయ రథాలు, గజాశ్వాలు, భద్రసామజాలు, రత్నవిభూషణాలు, దాసీనివహాన్ని' శ్రీకృష్ణునకు కానుకలుగా ఇచ్చి తృప్తి పరుస్తాననటంలో అతడి అంతర్యం తెలుస్తుంది.

శ్రీకృష్ణుడు కుశస్థలం నుంచి బయలుదేరినప్పుడు ఆ పురజనులు సుయోధనుని ప్రేరణతో పండ్లు పూలు విరివిగా సమర్పించారు. హస్తినాపురం వెలుపల శ్రీకృష్ణునకు స్వాగతం పలికేందుకు కులవృద్ధులు, గురువులైన బాహ్లిక, భీష్మ, ద్రోణాదులు, మిత్రులైన భూపాలురు, కుమారులు పెద్ద ఎత్తున చేరారు. వీరంతా

మంగళ తూర్యనాదాలతో అతిథికి స్వాగతం పలికారు. హస్తినాపుర వీధులలో కృష్ణుడు పయనించే మార్గంలో "మౌక్తిక మిళితంబులు, బహుగంధలుళితంబులు నగు నక్షత్రప్రకరంబులును, బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మొక్కుచుఁ జొక్కుచు" (ఉ. 3-174) ఇరువైపుల రమ్యహర్మ్యాలపై ఉండి అంగనాజనం అతడికి స్వాగతం పలికారు. ఈ సమయంలో కృష్ణుని రాక హస్తినాపురంలో ఎంతో ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని కలిగించింది.

శ్రీకృష్ణుడు మణితోరణాలతో సుందరంగా అలంకరించిన రాజమందిర ద్వారం చేరి ధృతరాష్ట్రుని అంతఃపుర ప్రవేశానికి ఉద్యుక్తుడయ్యాడు. ఈ విషయం భీష్మాది వృద్ధులవల్ల విని ధృతరాష్ట్రుడు ప్రత్యుత్థానంచేసి విదుర సంజయుల సాయంతో కృష్ణుని సమీపానికి చేరాడు. శ్రీకృష్ణుడు ఆ రాజును ఆలింగనంచేసి విదురాది సుహృజ్జనాన్ని బంధుదృష్టితో పరామర్శించాడు. రాజమందిరంలో ధృతరాష్ట్రుడు స్వయంగా పరిజనాన్ని పురికొల్పి కనకాసనం తెప్పించి రాయబారిని ఉపవిష్టుణ్ణి చేస్తాడు. ఆ మహారాజు అతిథి మర్యాదలో ఈ చర్య అపూర్వమైనదిగా ఉంది. అనంతరం అంతఃపుర పురోహితులు అర్ఘ్యపాద్య మధుపర్కాది సత్కారాలతో మర్యాద చేశారు.

ఇప్పటివరకు కృష్ణునకు వ్యక్తిగౌరవాన్నిబట్టి అపూర్వ స్వాగత సత్కారాలు లభించాయి. రాయబారిగా అధికారిక కార్యక్రమం నిర్వహించేందుకు సభలో ప్రవేశించినప్పుడు కూడ, సాధారణ రాయబారులకు జరిగే మర్యాదలకన్నా అధికంగానే మర్యాదలు లభించాయి. అతడు కేవలం రాయబారేకాక, బంధువు, వర్తమానకాలంలో బలీయమైన ఒక రాజవంశానికి నాయకుడు కావటమే ఈ ప్రత్యేకతకు కారణం కావచ్చు. విదురుని మందిరంలో విడిది చేసిన శ్రీకృష్ణుణ్ణి కౌరవ సభకు తోడుకొని వచ్చేందుకు కర్ణ, శకుని, దుశ్శాసన సహితుడై వచ్చిన సుయోధనుడు ప్రియోక్తులతో అతణ్ణి సంభావిస్తాడు. శ్రీకృష్ణుడు సభకు బయలుదేరిన తీరుకూడ ఆర్భాటంగానే కనిపిస్తుంది. సుయోధనుని ఆహ్వానాన్నందుకొన్న శ్రీకృష్ణుడు "ప్రియంబున గట్టాయితంబైన తేరెక్కి భేరీశంఖ చామర ప్రముఖ భద్ర చిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబుగ్రాలఁ గృతవర్మ సాత్యకు లొక్క రథంబునను బాహ్యంబులరాఁ బౌరులకుఁ గన్నుల పండువగుచు" (ఉ. 3-347)

రాజమందిర ద్వారం సమీపించాడు. అంతటి వైభవంతో వచ్చిన కృష్ణుని సమీపంలో కౌరవులు 'రవి సన్నిధి తారకాగ్రహాల' లాగా వెలవెలపోయినట్లు తిక్కన వివరించటం కృష్ణునకు సభ కూర్చిన గౌరవాన్ని తెలియచేస్తుంది. సభలో ప్రవేశించిన కృష్ణునకు ధృతరాష్ట్రుడు ప్రత్యుత్థానంచేసి గౌరవ పురస్సరంగా అతిధిని మణిమయ పీఠంపై ఆసీనుణ్ణి చేశాడు మొత్తం మీద పాండవ రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణునకు అతిథి సత్కారం 'నభూతో నభవిష్యతి' అన్నట్లు అత్యంత వైభవంగా జరిపి ధృతరాష్ట్రుడు రాజ్యాధినేతగా, అతిధేయిగా పొగడ్తకు స్థానం అయ్యాడని చెప్పటంలో సందేహం లేదు.

కౌరవసభలో కృష్ణుని రాజనీతి కౌశలాన్ని ప్రజ్ఞను సందర్శించాలనే కుతూహలంతో నారదాది మహర్షులు సభకువస్తారు భీష్ముడు పరిచారకులను పంపి కనక మణిమయ ఆసనాలను తెప్పించి, వారికి నమస్కరించి అర్ఘ్యపాద్యాది విధులతో పూజలుచేసి కూర్చుండే ఏర్పాట్లు చేశాడు. ఈ పురస్కారం కూడ ధృతరాష్ట్రుని అతిథిసత్కార కార్యక్రమంలో ఒక భాగంగా నిలుస్తుంది.

ధృతరాష్ట్రుడు మనసు ఆహ్లాదంగా ఉన్న సాధారణం పరిస్థితుల్లోనే కాక, మనోవైక్లబ్యం పొందినస్థితిలో కూడ పెద్దల ఎడ మర్యాదచూపటంలో లేశమాత్రం కూడ అలసత్వం చూపలేదు. కురుక్షేత్ర యుద్ధంలో కుమారుల మరణానికి క్రుంగి నిర్వేదంలో మునిగి ఉన్నప్పుడు వ్యాసుడు ఆ మహారాజును సందర్శిస్తాడు. అంతటి నిర్వేదంలోకూడ ధృతరాష్ట్రుడు వ్యాసమహర్షికి ఉచితమైన అర్చనలతో సత్కారాలు చేస్తాడు. పెద్దల ఎడ ఈ మర్యాద కొనియాడతగింది. ఎప్పటి కప్పుడు యుద్ధ వార్తలను తెలియచేసే సంజయునకు, యుద్ధవార్తలు శోకకారణాలై ఉన్న అంతటి విషాద స్థితిలోకూడ, ఆత్మీయతతో కూడిన స్నేహ హస్తాన్ని అందించి సత్కరించారు. ఈ సత్కారం ధృతరాష్ట్ర సంజయుల బాంధవ్యంలో ప్రభు భృత్య సంబంధంతోపాటు ఆత్మీయతతో కూడిన సుహృద్భావాన్ని ప్రకటిస్తుంది.

కురుక్షేత్ర సంగ్రామంలో పుత్రులందరను కోల్పోయి దుఃఖ వివశులై ఉన్న గాంధారీ ధృతరాష్ట్రులను ఓదార్చేందుకు శ్రీకృష్ణుడు వస్తాడు. అప్పటికే ఆ రాజును ఓదార్చటానికి వ్యాసుడు వచ్చి ఉన్నాడు. వ్యాస మునీంద్రుని మీది గౌరవంతో ధృతరాష్ట్రుడు నేలపైకూర్చున్నాడు. అంతటి దుఃఖోద్వేగ స్థితిలోకూడ

అతడు పెద్దల ఎడచూపే గౌరవమర్యాదలు సంభావనకు పాత్రమౌతాయి. శ్రీకృష్ణుడు కూడ ఆ మహారాజుతోపాటు నేలపైనే కూర్చొని

"అన్నరేంద్రు పాణియల్లన తన కరా
బ్జమునఁ గీలుకొల్పి బహుళ బాష్ప
కలిత వదనుఁడగుచు గళమున నెలుఁగురి
యాడవగచి" ... (శల్య. 2-316)

ఎంతో ఆత్మీయతా భావంతో ఓదార్చే ప్రయత్నం చేశాడు. శ్రీకృష్ణుడు పాండవ రాయబారిగా వచ్చినప్పటి ఆర్భాటం ఈ స్థితిలో కనిపించదు. అప్పుడు జరిగిన ఆర్భాటం రాజకీయ ప్రాధాన్యం సంతరించుకొంటే, ఇప్పటిస్థితి అత్యంతమైన ఆత్మీయతా ప్రదర్శనకు నిలయమై ఒప్పి ఉన్నది.

ధర్మరాజుచేసే అశ్వమేధ యాగానికి సకల బంధుసమేతుడై శ్రీకృష్ణుడు హస్తినాపురం వస్తాడు అప్పుడు కురుసామ్రాజ్యాధిపతి ధర్మరాజు అయినా వంశ జ్యేష్ఠుడైన ధృతరాష్ట్రుడు గౌరవనీయుడైన అతిథికి స్వాగతసత్కారాలు ఏర్పరచటానికి విదురుని, యుయుత్సుని నియమించాడు. వారు ఎంతో గౌరవంతో స్వాగతం పలుకగా, శ్రీకృష్ణుడుకూడ తొలుతగా ఇంటికి పెద్దఅయిన ధృతరాష్ట్రుణ్ణే సందర్శించి 'ప్రణతి పూర్వాతిమధుర వాక్యాలతో' ప్రీతి కలిగించి గౌరవం ప్రదర్శించాడు. రాజ్యాధికారం కోల్పోయినా వంశ జ్యేష్ఠునిగా ఇలాంటి అతిథి సత్కారాది కార్యాలు ధృతరాష్ట్రుడే నిర్వహించినట్లు తలంచవచ్చు.

వానప్రస్థం స్వీకరించిన ధృతరాష్ట్రుడు పరిజనంతో సహా గాంధారీ ద్వితీయుడై శతయూప రాజర్షి ఆశ్రమంలో నెలవు ఏర్పరచుకొన్నాడు. ఒకరోజు నారదాది మునీశ్వరులు ఆ మహారాజును పరామర్శించే వేడుకతో ఆశ్రమానికి వస్తారు. గాంధారీ ధృతరాష్ట్రులకు ప్రథమ సేవికగా ప్రవర్తించే కుంతీదేవి 'వినయ సంభృతయై యందఱను సంపూజితులుగ" (ఆశ్రమ. 2-3) చేసి వారి మనసులకు సంతోషాన్ని కలిగించింది. వారు ధృతరాష్ట్రుని సమీపస్థులు కాగా 'వినయ సంభ్రమంబులతో వినతుండై' గౌరవ ప్రపత్తులను ప్రదర్శించి ఆసీనులయేందుకు దర్భాసనా సమర్పించాడు. వ్యాసునకు చేసే సత్కారంకూడ మునిజనోచితంగ ఒప్పిఉంది.

తనను సందర్శించవచ్చిన ఇతర మునులకు సమయోచిత కార్యాలు నిర్వహించేందుకు ఏర్పాట్లు ఎంతో భక్తిభావంతో చేసేవాడు. ఎందరో అతిథులకు, రాయబారులకు, ఆత్మీయులకు మణిమయరత్న ఖచిత సింహాసనాలను, రత్నాంబరాభరణాలను ఏర్పాటుచేసిన ఆ మహారాజు ఈ మహర్షులకు దర్భాసనాలు సమకూర్చటం ఆ రాజర్షి వినయ సంపదకు, ఆశ్రమ జీవితానికి ఎంతో తగినట్లుగా ఉంది.

ఈ విధంగా ధృతరాష్ట్రుడు అతిథులుగా వచ్చిన వారిని వారివారి యోగ్యతా యోగ్యతలను, కార్యప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకొని వారి అంతస్తుకు, యోగ్యతకు తగిన విధంగా స్వాగత సత్కారాలతో కూడిన అతిథి మర్యాదలన్నింటిని చేసి ఉత్తమ గృహస్థుగా వర్ధిల్లాడు.

## 1.9 వ్యక్తిత్వం

మానవ ప్రవృత్తులన్నీ ఒక విధంగా ఉండవు. సమాజంలో భిన్న మన స్తత్వాలతో భిన్నమైన వ్యక్తిత్వం కలవారు అన్ని కాలాలలోను ఉంటారు. వ్యక్తి జీవితం ఆర్థిక, రాజకీయ సమాజికాంశాల్లో సమాజంతో ముడిబడి ఉంటుంది. అయితే వ్యక్తిత్వంమాత్రం ఆ వ్యక్తి మానసికస్థితి, వంశానుగుణంగా వచ్చే కొన్ని లక్షణాలకు అనుగుణంగా అభివృద్ధి చెందుతుంది. కొందరు తమ వ్యక్తిత్వం వల్ల చుట్టూ ఉన్న సమాజాన్ని ప్రభావితం చేస్తే, మరికొందరు ఏ విధమైన ప్రత్యేకతను సంపాదించుకోకుండానే జీవితం గడిపివేస్తారు. అనేక సందర్భాల్లో పరిస్థితుల ప్రభావాన్ని అనుసరించి వ్యక్తిత్వ స్వరూప స్వభావాలు బహిర్గతం అవుతుంటాయి.

సమాజంలోనే భిన్న ప్రవృత్తులతో వర్తించేవారు ఉన్నారనుకుంటే, ఒక వ్యక్తి మనస్తత్వంలోనే భిన్నరీతులు గోచరం అవుతుంటాయి. వ్యక్తి ప్రవర్తన అతడి మనస్తత్వానికి అద్దం పడుతుందని సాధారణ విశ్వాసం. కాని కొందరు వారి ప్రవర్తనకు భిన్నమైన వ్యక్తిత్వం కలిగి ఉంటారు. తమ అసలు స్వరూపం పది మందికి తెలిస్తే వ్యక్తిత్వం భంగపడుతుందని తలచినప్పుడు, లేదా తన మనసుపై తనకే అదుపులేని పరిస్థితులు కలిగినప్పుడు ఇలాంటి విచిత్రప్రవర్తనకు సాధారణంగా లోనవుతుంటారు. కొందరు అనివార్యపరిస్థితుల్లో వ్యక్తిగత అభిరుచులకు విరుద్ధమైన ప్రవర్తనకు లోనవుతారు. ఇంకా కొందరు తమ మనోగత వాంఛలను తీర్చుకొనేందుకు అసమర్థత, అశక్తత అనే ఆయుధాలను వాడుకొంటారు.

ధృతరాష్ట్రుని వ్యక్తిత్వం ఎంతో నిగూఢమైంది. ఆ మహారాజు ఆలోచనలు ఎలా సాగుతున్నాయి, అతడు నిర్వహించబోయే కార్యస్వరూపం ఎలా ఉంటుంది అనే విషయం ఆత్మీయులకు కూడ అవగతంకాని విధంగా సాగుతుంది. మహాభారతంలో అనేకులు ధృతరాష్ట్రుని గురించి అనేకమైన అభిప్రాయాలను కలిగి ఉండటమే అతడు భిన్న ప్రవృత్తుల సమ్మేళనం అనేందుకు అవకాశం కలిగిస్తుంది. ఆ మహారాజుకు ఆత్మీయులెవరో, కాని వారెవరోకూడ అంతరంగికులకే తెలియనంతటి నిగూఢమైనది అతడి వ్యక్తిత్వం. ఒక సందర్భంలో గురువులు, వృద్ధులు, హితులైనవారి అభిప్రాయాన్ని గౌరవించినట్లు ప్రవర్తిస్తాడు. వేరొక సన్నివేశంలో

ఎవరి ప్రమేయం లేకుండ స్వతంత్ర నిర్ణయాలు తీసుకోగల మహారాజుగా దర్శన మిస్తాడు. ఒకక్షణంలో ఒక నిర్ణయానికి ఆయత్తమైనట్లున్న అతడి మనసు మరు క్షణంలో విరుద్ధమైన నిర్ణయాలు, అభిప్రాయాలు వెల్లడించి అందరినీ సంభ్రమాశ్చ ర్యాలతో విభ్రాంతులను చేస్తాడు. ఇంకా కొన్ని సమస్యలపై నిర్ణయాలు తీసుకోవ టంలో అతడి అనిశ్చితస్థితి, విషయ గ్రహణంలో సౌలభ్యంలేకుండా చేయటమేగాక, ఆ మహారాజు మనసేమిటో తెలియని అయోమయస్థితికో పడవేస్తుంది. తనచుట్టూ ఉన్నవారు ఆ అయోమయ స్థితినుంచి తేరుకోకముందే తన మనోభీష్టానికి అను గుణంగా ఆ పరిస్థితిని ఉపయోగించు కోవటం కొన్నిసందర్భాల్లో కనిపిస్తుంది. మహా రాజుగా తన మనసేమిటో అత్యంత సన్నిహితులకు కూడ తెలియనీయక పోవటం సమర్ధనీయమే అయినా వ్యక్తిగా ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలోని కొన్ని విచిత్ర ప్రవృత్తులు పాత్రలతో పాటు పాఠకులనుకూడ ఆశ్చర్య చకితులను చేస్తాయి.

ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం జరిగిం తరువాత పాండవుల పై భవం సుయోధనునకు అసూయాజనకమైంది. పాండవులను హస్తినాపురంనుంచి వెళ్లగొట్టా లనే పట్టుదలతో కణికునితో ఆలోచించాడు. మూలభారతంలో ధృతరాష్ట్రుడే కణి కునితో ఆలోచించాడన్న అంశం పూర్వోక్తం. ధృతరాష్ట్రుని మనసులోనే అసూయ, భయం జనించి తదనుగుణంగా పాండవులను వారణావతం పంపినట్లయితే ఆశ్చర్య పడవలసిన అవసరంలేదు. ఆ చర్యలోని మంచిచెడులు ఎట్లావున్నా అతడి మనస్తత్వం అట్లాంటిదని అనుకోవచ్చు. అట్లాకాకుండ కుమారుని ఆవేదనను అర్థం చేసుకొని, అతడికి మనఃప్రీతి కలిగించేందుకు వారిని వారణావతం పంపినా పుత్ర వ్యామోహంతో అట్లాచేశాడని సరిపెట్టుకోవచ్చు. ఇవేమీ కాకుండ ధృతరాష్ట్రుడు సోదరుడైన పాండురాజు గుణగణాలను, పరాక్రమ విశేషాలను ఉగ్గడించి "వానికంటె గుణంబుల మిక్కిలి యయి జనంబులకు ననురక్తులై పరగుచున్న పాండురాజు కుమా రుల నెవ్విధంబున బాపనేర్తు" (ఆది. 6-127) అని పాండవుల ఎడ అవ్యాజాను రాగాన్ని వెల్లడిస్తాడు. ధృతరాష్ట్రుని ఈ ప్రవర్తన పాండవులపై అతడెంతో ఆద రంతో ఉన్నాడనే అభిప్రాయాన్ని ఎవరికైనా కలిగిస్తుంది. కుమారునితో వెలిబుచ్చిన అభిప్రాయానికే బద్ధుడై ఉన్నా ఆ మహారాజు మనస్తత్వం ఆ విషయంలో ఆ విధంగా ఉన్నది అని అనుకోవచ్చు. ధర్మరాజు ప్రాభవం పెరగటంవల్ల వంశపారంపర్యంగా తనకు నష్టం వాటిల్లుతుందని, అందువల్ల వారిని వారణావతం పంపించ వలసిందని సుయోధనుడు తండ్రిని బలవంత పెడతాడు. అపుడయినా కుమారుని కోరువడ

లేక తమ్ముని కుమారులను వారణావతం పంపించాడని అనుకోవచ్చు. కాని తమ్ముని కుమారులపై ఒక్కక్షణం ముందు వెలిబుచ్చిన గాఢాభిమానానికి విరుద్ధంగా 'ఏనెల్ల ప్రొద్దు నా యెదలోనఁ దలఁతు నీ యభిప్రాయంబ' అని కుమారుని అభిప్రాయంతో ఏకీభవిస్తూ "యిది దారుణంబుగాన వాకునకు జుల్కన తేరనోవ" (ఆది. 8-130) అని తన హృదయాన్ని విప్పి చెప్తాడు.

పాండవులను వారణావతం పంపటంకూడ గూఢవ్యవహారంగానే సాగింది. సుయోధనుని ఆలోచనే తన ఆలోచన అయితే పాండవులను వారణావతం పోయిరండని ఆజ్ఞాపించవచ్చు. అట్లా చేయకుండ వారణావతంపై పాండవులకు మక్కువ కలిగే విధంగా అక్కడి విశేషాలను పొగడేందుకు అనుకూలురైన వారిని నియోగించమని చెప్తాడు. పోనీ, ఆ తర్వాతయినా వారణావతం పోవాలనే అభిలాషతో పాండవులు అడిగేంతవరకు వేచిఉన్నాడా అంటే, అదీలేదు. అకస్మాత్తుగా ఒకరోజు ధర్మరాజునుపిలిచి వారణావతంలో కొంతకాలం గడపవలసిందని, మరొక మాటకు అవకాశం ఇవ్వకుండ, ఆదేశిస్తాడు. అట్లా శాసించదలచు కొన్నప్పుడు వారణావతంపై పాండవులకు ప్రీతి కలిగే విధంగా అక్కడి రామణీయకతను గొప్పగా వర్ణింపచేసే ఆవశ్యకమేమో అర్థంకాదు. ఈ సన్నివేశం అంతటిలోను ధృతరాష్ట్రుని అనిశ్చయస్థితి వ్యక్తమౌతూ ఒక్కక్షణంలోనే పూర్వాపర విరుద్ధంగా అతని మనః స్థితి ఎట్లా మారుతుంటుందో అర్థమౌతుంది.

లాక్షా గృహంలో మరణించి ఉంటారని భావించే పాండవులు ద్రౌపదీ వివాహంతో పాంచాలనగరంలో క్షేమంగాఉన్నారని తెలియటం ధృతరాష్ట్రుడు ఎంతో సంతోషించ వలసిన విషయం. ఆ వార్త తెలియచేసిన విదురునకు మనఃప్రీతి కరంగా, ద్రౌపదిని వివాహమాడి వర్ధిల్లిన పాండవులవల్ల కౌరవకులం వెలుగుతుందని పలుకుతాడు. ఇంతవరకు అతని మనసు ఎలాఉన్నా ప్రవర్తనమాత్రం పాండవులపై ప్రేమనే వ్యక్తం చేస్తుంది. కాని అంతఃపురంలోనికి పోయి 'అంతస్తాపం బేర్పడకుండునంత' అనే మాటల్లో ఆ మహారాజు హృదయం విశదమౌతుంది. విదురునితో ఒక్కక్షణం ముందటి ప్రవర్తన అతడి మనసుకు వ్యతిరేకమైందని దీనివల్ల స్పష్టం అవుతుంది.

పాండవులకు అర్ధరాజ్యం ఇచ్చి సత్కరించే సమయంలో కూడ ధృతరాష్ట్రుని మనసు నిశ్చితమైన అభిప్రాయంతో లేకుండ సలహాదారులలో ఇరువర్గాల

మధ్య డోలాయమానంగా అనిశ్చిత స్థితిలో ఊగిసలాడింది. తండ్రి ఎప్పుడూ విదురుడు నడపిన మార్గాన్నే నడుస్తాడని సుయోధనుడు నిష్ఠూరంగా పలికినప్పుడు, తన హృదయం విదురునకు ఎప్పుడూ తెలియచేయననీ, కుమారునకు అభీష్టమైనదే తనకు ఇష్టమని పలుకుతాడు. పాండవులను ద్రుపదుని నుంచి వేరుచేయటమే మేలని చెప్పిన సుయోధనుని అభిమతానికి 'ఇదియ కార్యంబగు' అని తన నిశ్చితాంగీకారాన్ని తెలియచేస్తాడు. పాండవులను సుహృన్మార్గాన హస్తినాపురం పిలిపిస్తే భీష్మాది కురువృద్ధులెవరూ అడ్డు చెప్పరు. పైగా సంతోషిస్తారు కూడ. కాని ధృతరాష్ట్రుడు 'మతిమంతులతో విచారించి చేయుదము' అని అనటం విషయాన్ని సాగదీయటమే అవుతుంది. చివరకు జరిగింది కూడ పెద్దల విజ్ఞప్తిపై పాండవులకు అర్ధరాజ్యప్రదానమే. మొదట విదురుడు సంతోషంగా పాండవుల ఉనికిని తెలియచేసినప్పటి అభిప్రాయమే చిత్తశుద్ధిగా అమలు పరచినట్లయితే విషయం ఇంతదూరం సాగవలసిన అవసరం లేదు. విదురునకు తన మనసును ఎరిగించక, కుమారుని ఆలోచన బాగున్నది అంటూనే తిరిగి పెద్దల మాటమీదగా నడవటం విచిత్రంగానే ఉంది. విషయాంతంలో ధృతరాష్ట్రుని నిజమైన వ్యక్తిత్వం ఏదో అర్థంకాని పరిస్థితి ఏర్పడుతుంది.

రాజసూయ నిర్వహణంతో సమస్త రాజన్య లోకంలో విస్తరిల్లిన పాండవ వైభవాన్ని సహించలేని సుయోధనుడు జూదంలో వారి ఐశ్వర్యాన్ని సాధించాలనే ఆలోచనతో అనుజ్ఞ కోసం తండ్రిని అర్థిస్తాడు. కుమారుని ప్రయత్నం వల్ల వచ్చే అనర్థం ఊహించి ధృతరాష్ట్రుడు అతణ్ణి కఠినంగా వారించి ఉంటే సమస్య ఉత్పన్నం అయ్యేది కాదు. లేదా వెంటనే అంగీకరించినా సమస్య మరొక రకంగా ఉండేది. అట్లా కాకుండ విదురుని సలహా తీసుకోవాలని అంటాడు. అలా అనటంలోనే ఆ మహారాజు హృదయం ఆ అంశంలో స్పష్టంగా లేకుండ అంతర్యంలో వేరొక భావాన్ని కలిగిఉన్నట్లు అనిపిస్తుంది. విదురునితో మాట్లాడిన వాడైనా అతడి సలహా తీసుకొన్నాడా అంటే అదీ లేదు. కుమారుని ఆలోచనను బలపరచి జూదంవల్ల కుమారులమధ్య వైరుధ్యం పెరగదని వాదిస్తాడు. అట్లా వాదించిన వాడు వెంటనే విదురుణ్ణి ఇంద్రప్రస్థం పంపించాడా అంటే, అదీ చేయకుండ ఏకాంతంలో, సుయోధనుణ్ణి జూదప్రయత్నం నుంచి విముఖుణ్ణి చేయటానికి శాయశక్తులా ప్రయత్నించినట్లు కనిపించాడు. పోనీ! ఆ అభిప్రాయానికైనా కట్టుబడి ఉన్నాడా అంటే, అదీ లేదు, సుదీర్ఘకాలం ఆలోచించి సుహృద్ద్యూతం

వేదవిహితమేనని చెప్పి ధర్మరాజును తీసుకొని వచ్చేందుకు విదురుణ్ణే పోయిరావల సిందని ఆజ్ఞాపిస్తాడు. కొద్ది సమయంలోనే ధృతరాష్ట్రుని మనసు అనేక విధాలైన ఆలోచనలను మార్చుకొని, విషయాన్ని స్పష్టంగా తేలనీయకుండ, అతడి ఆంతర్యం ఏమిటో ఎవరికీ అర్థంకాని అనూహ్య స్థితిలో ప్రవర్తిల్లింది.

శకుని ధర్మరాజుల మధ్య జరిగే ద్యూత విశేషాలను ఎప్పటికప్పుడు వివరించే విదురుడు ద్యూతంలో ఇమిడి ఉన్న స్నేహం, సుహృద్భావం నశించిందని, ఆ దుష్టద్యూతాన్ని ఆపుచేయవలసిందని అర్థింపుతో హెచ్చరిస్తాడు. ధర్మరాజు ద్యూతంలో ద్రౌపదిని పణంగా ఒడ్డిన సంఘటనకు సభ సంక్షుభితమౌతుంది. విదురునివల్ల అన్ని విషయాలు తెలిసినట్లుగానే ఈ అంశం కూడ ధృతరాష్ట్రునకు తప్పకుండా తెలిసి ఉండాలి. అతడు ఇవేమీ ఎరుగని వానిలాగా "ఇది యేమి సభాక్షోభం బెవ్వరెవ్వరే వస్తువు లొడ్డిరి" (స. 2-199) అని అమాయకంగా ప్రశ్నిస్తాడు. అట్లాంటి విషమ స్థితిలో ధృతరాష్ట్రుని ఉదాసీనత అతడి నిగూఢమైన మనసుకు అద్దం పడుతుంది.

ద్యూత సభలో అనేక అవాంఛనీయ సంఘటనలు జరిగాయి. వాటివల్ల వచ్చే లోకాపవాదాన్ని పోగొట్టుకొనేందుకు ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాలిచ్చే నెపంతో ధర్మరాజుకు రాజ్యప్రాప్తిని కలిగిస్తాడు. పెదతండ్రిగా ఇంతవరకు అతడి ప్రవర్తన సమర్థనీయంగానే ఉంది. కాని రాజ్యాన్ని పొందిన పాండవులు ఇంద్రప్రస్థం పూర్తిగా పోకముందే అనుద్యూతానికి ఆహ్వానించటం ఆశ్చర్యకరమైన విషయం. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుని ప్రవర్తన పూర్వాపర కార్యవ్యతిరిక్తమై విచిత్రంగా ఉంది. అనుద్యూతంలో కూడ ఓడి ద్యూత సమయాన్ననుసరించి అరణ్యవాసానికి పోయే పాండవుల వర్తనలోని అంతరార్థం ధృతరాష్ట్రునకు దుఃఖ వివశత్వంతో కూడిన భయాన్ని కలిగించింది. ఆ భయోద్వేగంలో "విమనుడై పడియుండె హా! యని వెచ్చనూర్చుచు విన్ననై" (స. 2-311) దుఃఖ భారంతో మునిగాడు. ఇంతవరకు ఆ మహారాజు పాండవులను గూర్చి ఆలోచిస్తున్నాడేమోననే సానుభూతి కలుగుతుంది. నిజంగా అంత భయం, ఆందోళన, విచారం ఉన్నవాడైతే కుమారులను రక్షించటానికి, ప్రజాక్షయం కాకుండ చూసేందుకు వారిని వెనక్కు పిలిపించవచ్చు. ఆ అధికారం తనకు ఉంది. అంతేకాక భీష్మాది వృద్ధులు చెప్పినా వినకుండ పాండవులకు అహితం సమకూర్చిన సుయో

ధనుణ్ణి ఉపేక్షించినందుకు సంజయుడు, విదురుడు ఆ రాజును తూలనాడారు. వీరు ఇంతగా హితవు చెప్పినప్పటికీ, తనకు దుఃఖోద్వేగంతో భయం కలిగినాకూడ వారి హితవును ఆలకించే ప్రయత్నం చేయకుండ

"వినియు విననియట్లు విపిన వాస
గతులఁ బాండుసుతులఁ గ్రమ్మఱింపక" (స. 2-316)

ఉపేక్ష వహిస్తాడు. ఆపద సంభవిస్తుందని తనకు భయం, అదే విషయం సన్నిహితులు చెప్పినప్పటికీ ఇట్లా ప్రవర్తించటం అతడి వ్యక్తిత్వంలో విచిత్ర ప్రవృత్తిగానే కనిపిస్తుంది.

ద్వైతవనంలో ఉన్న పాండవుల దగ్గరనుంచి వచ్చిన బ్రాహ్మణుడు అరణ్యంలో వారిక్లేశాలను వివరించినప్పుడు ధృతరాష్ట్రుడు "విషణ్ణ హృదయుండై కన్నీరు దొరుగం గొండొకసేపు వలుకకుండి" (అరణ్య. 5-326) కంఠం గాద్గద్యం వహించగా ఎంతో సానుభూతి ప్రదర్శిస్తాడు. సన్నిహితులకు కూడ తన మనసేమిటో తెలియనీయని ఆ రాజు ఒక సామాన్య బ్రాహ్మణుని ఎదుట సామాన్యునివలె కన్నీరు కార్చటం చిత్రంగానే ఉంది. తమ్ముని కుమారుల కష్టాలకు నిజంగానే స్పందించాడని సరిపెట్టుకొన్నా, కొద్దిక్షణాల తరువాత ఘోష యాత్ర నిమిత్తంగా సుయోధనునకు అనుమతి నివ్వటం ఆశ్చర్యం కలిగిస్తుంది. గోరక్షణ నెపంతో ద్వైతవనంలో ఉన్న పాండవులను, తన వైభవం ప్రదర్శించి, చిన్నబుచ్చాలనే ఆలోచనతో సుయోధనుడు తండ్రి అనుజ్ఞకై అర్థిస్తాడు. అంతకు పూర్వం బ్రాహ్మణునితో వెలిబుచ్చిన సానుభూతి ధృతరాష్ట్రుని హృదయగతమేఐతే సుయోధనుణ్ణి ఆ ప్రయత్నం నుంచి నిష్కర్షగా ఆపు చేయవచ్చు. కాని గోరక్షణ పేరుతో పాండవులకు అపకారం తలపెడతారేమో అని బ్రతిమిలాడే ధోరణిలో కుమారుణ్ణి ఆ యత్నం నుంచి విరమింప చేసేందుకు ప్రయత్నిస్తాడు. కాని శాసించే ఉద్దేశం ఉన్నట్లు కనిపించదు. కుమారులు ద్వైతవనంలో పాండవులకు ఇబ్బందులు కలిగిస్తారని అనుమానించి కూడ "బుద్ధిమంతులరై గోధనము నరసి తడయక రండని" (అరణ్య. 3-371) వారికి బుద్ధిచెప్పి అనుమతి నీయటం 'దొంగను చేయి కొరకక వద్ద'ని సలహా చెప్పినట్లుగా ఉంది. ద్వైతవనం నుంచి వచ్చిన బ్రాహ్మణుని ఎదుట పాండవుల ఎడ సానుభూతిని ప్రదర్శించి, ద్వైతవన

ప్రయాణానికి కుమారునకు అనుమతినీయటం ధృతరాష్ట్రుని ప్రవర్తన శంకావహం కావటంతో పాటు పూర్వాపర విరుద్ధమై ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. పాండవులు శ్రమకు లోనుకావటం విచార కారణమే. కాని వారి పరాక్రమం ఆందోళన కలిగించే పరిస్థితుల్లో వారికి అనుకూలంగా ప్రవర్తించాలా వ్యతిరేకంగా ప్రవర్తించాలా అనే విషయం తేల్చుకోలేని అనిశ్చిత స్థితి ధృతరాష్ట్రునికో గోచరం అవుతుంది.

కౌరవుల పక్షాన రాయబారిగా ఇంద్రప్రస్థం వెళ్లివచ్చిన సంజయుడు ఏకాంతమందిరంలో ధృతరాష్ట్రుణ్ణి సందర్శించి సంధిపరంగా తన అభిప్రాయాలను వివరిస్తాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు ఎంతో ఆదరంతో పాండవుల క్షేమసమాచారాలను తెలుసుకోవటంలో ఉత్కంఠ ప్రదర్శిస్తాడు. ఈ అభిమానం ఆత్మీయమే అయినట్లయితే సంజయుని అభిప్రాయాల్లోని అంతర్యాన్ని పరిశీలించే ప్రయత్నంచేసి వారితో సహజీవనం సాగించే అంశం సౌహార్దంగా ఆలోచించవచ్చు. అట్లా చేయకుండ సంజయుడు పోయింతరువాత కొంత సమయం 'కార్యచింత' మునిగి విదురునకు కబురంపి తన మనసు నిప్పులలో పొగలినట్లున్నదని ఆందోళన వ్యక్తం చేస్తాడు. విదురుడు కూడ, ధృతరాష్ట్రునకు చిత్తశాంతి కలిగించే మాటలు చెప్పేటప్పుడు, పాండవులతోడి సఖ్యతను ప్రస్తావించగా ఆ మహారాజు అనాసక్తి ప్రదర్శిస్తాడు. సంజయునితో పాండవులక్షేమం తెలుసుకోవటంలో ఎంతో ఆదరం, ఉత్కంఠ ప్రదర్శించిన ధృతరాష్ట్రుడు మరుక్షణంలో సంజయ, విదురులు వారి క్షేమంకోరి కర్తవ్యం బోధిస్తే అనాసక్తి ప్రదర్శించటం ఆ రాజు విచిత్ర ప్రవృత్తికి నిదర్శనంగా ఉంది. ఈ అనాసక్తికి వారి హితవాక్యాలు తన చిత్తశుద్ధిని విమర్శించేవిగా ఉండటమే కారణం అయి ఉంటుంది.

రాజ్యభాగం విషయంలో పాండవోద్యోగాన్ని విన్న భీష్మద్రోణాదులు వారి ఎడ సానుభూతితో వ్యవహరించ వలసిందని హితవు చెపుతారు. వారి అభిప్రాయం అవశ్యానుసరణీయం అని అంగీకరిస్తూ, యుద్ధం సంభవిస్తే సుయోధనుని మరణానికి అంత విచారం లేదుకాని, సమస్త ప్రజల మరణానికి విచారం కలుగుతుందని మహారాజుగా ప్రజాక్షేమంలో తన బాధ్యతను ప్రదర్శించి, కుమారుణ్ణి యుద్ధ విముఖుణ్ణి చేసే ప్రయత్నం చేస్తాడు. ఇంతవరకు ధృతరాష్ట్రుని ప్రవర్తన స్వార్థ దూషితం కాక ప్రశంసావహంగా ఉంది. కాని మరుక్షణంలో "కొడుకులు జయింప నోపుదురొ కో యనునాస" (ఉ. 2-2-255) లో విదురునితో కౌరవ పాండవ

బలాబలాలను లెక్కకట్టేందుకు పూనుకోవటం విస్మయం కలిగిస్తుంది. ఒక్క-క్షణం ముందున్న చిత్తవృత్తి మరుక్షణంలో మారటం విశేషమే. సంజయుడు సంధిపరంగా ధర్మరాజు దృఢ చిత్తాన్ని వివరించినప్పుడు ధృతరాష్ట్రుడు కుమారుల ఉన్మత్త ప్రలాపాలను నిరసించి "తాను బ్రబలుండైనను బెనఁకువ గీడకాక మేలగునే" (ఉ. 2-241) అని యుద్ధంవల్ల వచ్చే నష్టాన్ని వివరించి శ్లాఘ నీయుడవుతాడు. కాని వెంటనే

> "సమరమునకుఁ బురికొల్పుచు
> మముఁదలచిన నుల్లికుట్టు మాటలఁ దచ్చి
> త్తములుడికించుచుఁ బాండవ
> సమితింగడఁగించు వారచట నెవ్వరొకో" (ఉ. 2-242)

అని పాండవ పక్షంలో తమకు వ్యతిరేకంగా రెచ్చగొట్టే వారిని గూర్చిన సమాచారం అడుగుతాడు. యుద్ధం ప్రమాదకారి అనుకొన్నప్పుడు దాని నివారణకు చిత్తశుద్ధితో ప్రయత్నించటం సమంజసం అవుతుంది కాని యుద్ధం రెండు పక్షాలకు మేలు కాదం టూనే, ప్రతిపక్షంలో రెచ్చగొట్టే వారిని గూర్చి విచారించటం విచిత్రంగా ఉంది.

కురుక్షేత్రంలో కౌరవ పాండవ సైన్యాలమధ్య యుద్ధం ప్రారంభమైన సమయంలో వ్యాసుడు ధృతరాష్ట్రుని వద్దకువచ్చి యుద్ధరంగాన్ని చూడదలచినట్లయితే దివ్యదృష్టి ప్రసాదిస్తానని అంటాడు. దివ్యదృష్టి ఇవ్వటం అధిదైవిక ప్రదర్శనలో భాగం అనుకోవచ్చు. ఇందులోని సాధ్యాసాధ్యాలు ఎట్లా ఉన్నా, ధృతరాష్ట్రుడు "ఘోరముగ నన్నలుఁ దమ్ములుఁ బోరుక్రూరతం గనుఁగొనఁ జాలనేను" (భీష్మ. 1-7) అని అనాసక్తిని ప్రదర్శిస్తాడు. కాని వెంటనే "వినఁగా వలతుం దదను గ్రహంబు సేసినఁ గడులెస్స" అని యుద్ధ విశేషాలను వినాలనే కుతూహలాన్ని వెల్లడిస్తాడు. వినటంవల్ల యుద్ధరంగంలో భీభత్సాది భయంకర దృశ్యాలు తగ్గిపోవు. కాని చూడవలసివస్తే శత్రుసంహారంతోపాటు స్వపక్ష బలిదానంకూడ చూడవలసి ఉంటుంది. ఆ పరిస్థితి అతడికి భరించరానిది. అందువల్ల స్వపక్షీయుల విజయాన్ని మాత్రమే వినాలనే ఆకాంక్ష ఆ రాజు అర్థింపులో గోచరిస్తుంది. అయితే వినటంలో కూడ తనవారి అపజయాలను వినక తప్పలేదు. శోకంతో దురపిల్లకనూ తప్పలేదు.

సందర్శించటానికి భయంకరంగా ఉన్న అంశం వినేందుకు అభ్యంతరం లేదనటం ఆ రాజు చిత్తవృత్తిలోని విచిత్రం.

యుద్ధంవల్ల కులనాశనంతో పాటు ప్రజానాశనం అవుతుంది కనుక ఉపేక్షించకుండ పాండవులకు రాజ్యంఇచ్చి లోకశాంతి సమకూర్చటం మేలని వ్యాసుడు హితవు గరపుతాడు. అందుకు ధృతరాష్ట్రుడు హితము, ధర్మము తలపోసి అందరతో పాటు తానుకూడ సుయోధనునకు చెప్పే ప్రయత్నంచేసి విఫలుణ్ణి అయ్యాననీ, ఇంక కుమారులకు చెప్పటం తనకు సాధ్యంకాదని, కాని

"...... నాదెసఁ దప్పులేమి మీ
మతిఁదలపోసి యీ పలుకు మానుడు పౌకముదప్పె కార్యముల్"

(భీష్మ. 1-13)

అని తనవల్ల లోపంలేదనే విషయాన్ని వారు అంగీకరిస్తే చాలు అన్నట్లు పలికాడు. ఇంతవరకు ఆ మహారాజు అశక్తత కుమారులను ఒత్తి చెప్పలేనితనం కనిపిస్తుంది. తనయందు ఏ విధమైన తప్పు లేదని పెద్దలనుంచి సానుభూతి పొందాలనే తపన కనిపిస్తుంది. అంతవరకు బాగానే ఉంది. కాని వెంటనే వ్యాసమహర్షిని 'కయ్యంబున గెలుపు దెలుపు నిమిత్తంబులను' గూర్చి అడగటమే అతడి ప్రవర్తనలోని విచిత్రం. వ్యాసుణ్ణి ఈ ప్రశ్న అడగటంలో కుమారుల విజయంపట్ల కుతూహలం ద్యోతకం అవుతుంది. ఆ మహారాజు అసలు మనసు చివర వెల్లడించిన మాటల్లోనే స్పష్టం అవుతుంది. అంతకు పూర్వం పలికినవి కేవలం సానుభూతి పొందేందుకు మాత్రమే.

లోకంలో కొందరు తమలోఉన్న లోపాలను, తప్పులను కప్పిపుచ్చి, తాముచేసింది దోషంకాదని సమర్థించుకొనే సామర్థ్యం కోల్పోయి ప్రతి పక్షులను తమతో సమానంగా చేసేందుకు ప్రయత్నిస్తారు. అట్లాచేయటంవల్ల తమపైఉన్న విమర్శలు తగ్గుతాయని కొంత ఆత్మసంతృప్తి పొందేందుకు చూస్తారు. ధృతరాష్ట్రుడు కూడ కొన్ని సందర్భాల్లో ఈ పరిస్థితికి లోనైనట్లు కనిపిస్తుంది. యుద్ధం ప్రారంభంలో సంజయుడు భూమి పరిమాణాన్ని విశదపరచిన సమయంలో ధృతరాష్ట్రుడు

"భారత వర్షమునకుఁగాఁ
గౌరవులును బాండవులును గాఢంగడుఁ బె
ల్లై రాసి యొండొరులతోఁ
బోరం దెగి రట్టి లుబ్ధబుద్ధులు గలరే" (భీష్మ. 1-28)

అని రాజ్యకాంక్షతో లుబ్ధబుద్ధులై కురుపాండవు లిరువురూ యుద్ధానికి సిద్ధపడ్డారని అంటాడు. పెద్దలు, లోకులు ధృతరాష్ట్రుణ్ణి అతడి కుమారులను లుబ్ధబుద్ధులని నింది స్తున్నారు. అతడేమో తన కుమారులతోపాటు పాండవులుకూడ రాజ్యలుబ్ధులే అని ఇరుపక్షాల వారిని సమానం చేస్తున్నాడు. ఈ విధంగా చేయటం తనవారి పైనే ఉన్న నిందాభారాన్ని కొంత తగ్గించుకొని, శత్రువులుకూడ అలాంటి వారే అనే ఆత్మ తృప్తిని పొందటానికేనని చెప్పవచ్చు. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుని చిత్తవృత్తి లోకంలో చాలామంది ప్రవర్తననే పోలిఉన్నది.

యుద్ధంలో భీష్ముని మరణవార్తను విని అతని పరాక్రమాన్ని, సాధించిన విజయాలను తలచుకొని ఆ రాజు ఎంతగానో దుఃఖిస్తాడు. కుమారునిగా ధృతరాష్ట్రుని పరివేదనం లోకసహజంగా ఉండి సహజసంగా కనిపిస్తుంది. కాని పెదతండ్రి కోసం శోకిస్తూనే "భీష్మ పెద్ద నమ్మితిమిగదే" (భీష్మ. 2-56) అని అంటాడు. కుమారులకు తన బలపరాక్రమాలతో భీష్ముడు విజయం సాధించి పెడతాడని ఆ మహారాజు ఎంతో ఆశతో ఉన్నాడు. అతడి మరణంవల్ల ఆ ఆశ కాస్తా వ్యర్థమై నట్లయింది. భీష్ముడంతటివాడే పాండవుల ధాటికి ఓర్వలేక పోతే తక్కినవారు విజయం ఎట్లా సాధించి పెట్టగలరనే సందేహంతో కూడిన దుఃఖోద్వేగం పొంగి పొరలింది. ఆ దుఃఖోద్వేగంలో నుంచే ఈ మాటవచ్చి ఉంటుంది. సాధారణంగా లోకంలోకూడ ఫలితం ఎడ సంపూర్ణ విశ్వాసంతో ఉన్నప్పుడు విరుద్ధమైన ఫలితం సంభవిస్తే ఇట్లానే అనుకోవటం చూస్తుంటాము. ఈ సందర్భంలో పెదతండ్రి కోసం విలపించటం ధృతరాష్ట్రుని అనుబంధాన్ని ప్రదర్శిస్తుంటే, 'భీష్మ పెద్ద నమ్మితిమిగదే' అనే మాట అతడి వ్యక్తిత్వంలోని వ్యత్యస్తానికి అద్దంపడుతుంది.

మానవుడు ఒక ఫలితం ఆశించి కార్యం ప్రారంభిస్తే ప్రయత్నంలో కొన్ని అడ్డంకులు ఏర్పడితే తాత్కాలికంగా నిరుత్సాహం నిర్వేదమూ కలిగినా కార్య సాధనలో పట్టుదల పెరుగుతుంది. అట్లా పట్టుదల పెరగటం ఉత్తమ వ్యక్తిత్వాన్ని

సూచిస్తుంది. కొందరికి ఈ పట్టుదల చెడ్డది అని అందరూ విమర్శించే కార్యాన్ని సాధించటంలో కూడ ఉంటుంది. ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలో ఈ అంశం ఒక విశేషంగా కనిపిస్తుంది. కురుక్షేత్ర సంగ్రామంలో విజయం సాధించే సూచనలు సన్నగిల్లుతున్నప్పటికీ చివరివరకు యుద్ధ విజయం ఎడ ఉత్కంఠను ప్రదర్శిస్తూనే ఉండేవాడు. యుద్ధంలో భీముని విజృంభణకు తట్టుకోలేక కురుసైన్యం చిందర వందర అయిన విషయం ధృతరాష్ట్రుణ్ణి నిర్వేదంలో ముంచింది. తాను, గాంధారి ఎంత చెప్పినా వినని ఫలితాన్ని ఇప్పుడనుభవిస్తున్నాడని శోకసంప్తుడవుతాడు. కాని వెంటనే వగచటంవల్ల ప్రయోజనం లేదనే నిశ్చయంతో "అమ్మాటలాడుట గతజల సేతు బంధనంబు దానిం జాలింపు మట్లు కురుకుమారుల చావుగనుంగొని గాంగేయ కుంభ సంభవులు పదంపడి యేమిసేసిరి" (భీష. 3-84) అని భవిష్యత్కార్య గమనం తెలుసుకోవటంలో ఉత్కంఠ ప్రదర్శించాడు.

సంజయునివల్ల ద్రోణవధను విన్న ధృతరాష్ట్రుడు సర్వం నాశనమైనంతగా దుఃఖించాడు. భీష్మ ద్రోణుల మరణం యుద్ధ విజయంపై ఆ మహారాజు ఆశను సన్నగిల్ల చేసింది. ద్రోణుడు మరణించిన వార్త విని కూడ

"వేయి పఱియలై పోవదు ఱాయిగాగ
నోపు నా గుండె యేమని యుమ్మలింతు" (ద్రోణ. 1-80)

అని విపరీతమైన దుఃఖోద్వేగానికి లోనవుతాడు. ద్రోణుడు మరణించినపుడే తన సైన్యం అంతా నశించినట్లేనని వాపోతాడు. ఆ శోకోద్వేగంలో మూర్ఛపోతాడు. అంతవరకు ధృతరాష్ట్రుని విషాదాన్ని సానుభూతితో అర్థం చేసుకోవచ్చు. కాని అంతటి విషాదంలో కూడ గుండెదిటవు పరచుకొని "ద్రోణు సంగర పరిపాటి యెల్ల వినగా వలతున్ వివరించి చెప్పుమా" (ద్రోణ. 1-102) అని యుద్ధ విశేషాలను విస్తరంగా వినాలనే కోరికను వెలిబుచ్చుతాడు. అట్లాగే అభిమన్యుడు కౌరవ వీరులను విపరీతంగా కష్టపెట్టాడనే వార్త విన్నప్పుడు

"మనమున ఖేదము మోదముఁ
బెనగొనియెడు మచ్చలంబుఁ బీడించెడు నా
మనుమడని వినికి" (ద్రోణ. 2-40)

అని ఖేదము, మోదము కలుగుతుందని అంటాడు. ఒకే అంశాన్ని గూర్చి ఒక వ్యక్తి మనసులో ఒకే సమయంలో రెండు భావాలు కలగటం విశేషమే. తనసైన్యం అంతా బాలుని ఎదిరించలేక చిందరవందర అవుతున్నందుకు ఖేదము కలిగింది. ఇట్లా కలగటం సహజ పరిణామం. మనుమని వీరవిక్రమ ప్రదర్శన మోదం కలిగించటం కూడ సహజమే. అయినప్పటికీ ఈ సందర్భంలో ఖేదం కలగటం ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంగాను, మోదం కలిగించని చెప్పటం ప్రదర్శనగాను భావించవచ్చు. అయితే ఈ రెండు భావాల్లో ఏ భావం అతడి వ్యక్తిత్వమో ఎదుటి వారికి తెలియకుండ ప్రవర్తించటమే విచిత్రం.

సైంధవుడు పద్మవ్యూహంలో ప్రవేశించే పాండవులను ఎదిరించి నిలువరించ కలిగాడని విన్నప్పుడు ఆ రాజుకు ఎంతో ఆనందం కలిగింది. అంతకుముందు కొన్ని సన్నివేశాల్లో బహిరంగంగా, తన మనోగత భావాలు తెలియనీయకుండ పాండవుల ఎడ సామరస్యాన్ని ప్రదర్శించాడు. ఈ సందర్భంలో

"...... పాండు నం
దనులు రయంబుమై నడరఁ దానొకరుండ భుజాబలంబు నే
పునఁ గుదియించెనే యతఁడహో కురుసేనకు మేటి"

(ద్రోణ. 2-65)

అని సైంధవుని పరాక్రమాన్ని శ్లాఘించాడు. ఇట్లా బహిరంగంగా శ్లాఘించటం ఎల్లప్పుడూ తన భావాలను గుప్తంగా ఉంచుకొనే ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలో విశేషంగా కనిపిస్తుంది. సైంధవుడు తనకు అల్లుడు కావటం, ఎన్నో అపజయాల అనంతరం పాండవులను నిలువరించగల వీరుడు తన సైన్యంలో లభించటం ఆ మహారాజు ఆనందోద్వేగాన్ని బహిర్గతం చేయటానికి తక్షణ కారణాలు కావచ్చు. ఈ సమయంలో ఇంత ఆనందాన్ని వ్యక్తం చేసిన ధృతరాష్ట్రుడు సైంధవుణ్ణి సంహరించే ప్రయత్నంలో అర్జునుడు కౌరవసైన్యాన్ని చీల్చుకొని ప్రవేశించాడంటే

"గురునిఁ గడచి నరుడు కురుసేన నొచ్చిన
యప్పుడ తెగియెఁ గార్య మదియుగాక
కలసిరట్టి బల్లిదులు భీమసాత్యకు
లకట సైంధవుడు హతుఁడకాడె" (ద్రోణ. 4-251)

అని ఎంతో విచారాన్ని వ్యక్తం చేస్తాడు. సైంధవుని పరాక్రమానికి ఆనందించిన ధృతరాష్ట్రుడే సైంధవునకు మరణం ఆసన్నమైందని విచారిస్తున్నాడు. అట్లా విచారిస్తూకూడ 'సమర విశేషంబు తెలంగెలింగింపు'మని సంజయుణ్ణి కోరటం ఆ మహారాజు వ్యక్తిత్వంలోని విశేషం.

సైంధవుడు మరణించిన తరువాత కొద్దిసేపటికి ధర్మరాజు కోదండంతో సుయోధనుని మూర్ఛిల్ల చేయటంతో సైన్యంలో అతడు మరణించాడనే హాహాకారాలు చెలరేగాయి. ఈ విషయం విన్న ధృతరాష్ట్రుడు శోకంతో కుప్పకూలి పోవలసింది. కాని ఏ విధమైన భావవ్యక్తీకరణ లేకుండ మౌనంగా ఉన్నాడు. ఆ వార్తకు అతడు విశ్చేష్టుడై చైతన్యం కోల్పోవటమే కారణం కావచ్చు. అట్లా కావటం సహజమే. ఆ తర్వాత ద్రోణాదుల ప్రోత్సాహంతో సుయోధనుడు ఆటోపంతో యుధిష్ఠిరుణ్ణి ఎదుర్కొన్నాడని విని, కుమారుడు విజయం సాధించినట్లే భావించి, అప్పుడే నిద్ర మేలుకొన్న వానిలాగా "ఆచార్యుండెవ్విధంబున అరివధంబు సేసె నిందలి చేయంగల సైనికోత్తము లెత్తెఱంగునం బెనంగిరి" (ద్రోణ. 5-57) అని ఆత్రుతను ప్రదర్శిస్తాడు. కుమారుని మూర్ఛ విని స్తబ్దుగా ఉండిపోవటం సహజ పరిమాణయే ఐనా, మరుక్షణంలోనే కుమారుని విజృంభణకు జయాకాంక్ష కలగటం ఆ మహారాజు వ్యక్తిత్వ విశేషంగా తలంచవచ్చు.

ఏదైనా నేరారోపణ జరిగితే దానిని వేరొకనిపై త్రోసి తప్పించుకో చూడటం సాధారణ మానవుని ప్రవృత్తి. ఆదర్శవంతులైన వారు కొందరు చేసిన పొరపాట్లను అంగీకరించి, వాటిని సరిదిద్దుకొని పునరావృతం కాకుండ చూడటం కద్దు. సామాన్యులు మాత్రం తాను తప్పించుకొనే ప్రయత్నంలో, ఎంత సన్నిహితులైన వారైనాసరే, ప్రక్కనున్న వారిపై ఆ దోషారోపణనెట్టి స్వచ్ఛంగా బయట పడే ప్రయత్నం చేస్తారు. పదిహేడవ రోజు యుద్ధంలో కురుసైన్యం నీరసపడి కర్ణుడు, దుశ్శాసనాది వీరులు మరణిస్తారు. కర్ణుడు మరణించటంవల్ల తన కుమారుడు దిక్కులేని వాడయ్యాడని విలపిస్తాడు. అంతవరకు ధృతరాష్ట్రుని పరివేదనకు సానుభూతే కలుగుతుంది. అంతటి విషాదంలో కూడ కురుపాండవ యుద్ధానికి తాను కారణభూతుణ్ణి కానని, సుయోధనుని మూర్ఖత్వమే ఇంతటి అనర్థానికి కారణం అంటూ

"మనలోఁ గయ్యం బేటికి
నని ధర్మసుతుడు సెప్పె నది మీపతి గై
కొనఁడయ్యె..." (కర్ణ. 1-33)

అని ప్రత్యర్థి వివేకాన్ని కొనియాడుతూ నింద కుమారునిపై వేయటంలో ఆ మహారాజు వ్యక్తిత్వం ప్రశ్నార్థకం అవుతుంది. పాండవులతో సంధిచేసి రాజ్యం ఇవ్వాలనుకుంటే తానే ఏ క్షణంలోనైనా చేయవచ్చు. ఎవరూ అడ్డగించరు. అట్లాంటిది యుద్ధంలో అన్నీ కోల్పోయిన ఈ దశలో కుమారునిపై నింద మోపటం విచిత్రంగా ఉంది. ఈ సంఘటనవల్ల ఏదైనా నింద తనమీద నుంచి తప్పించు కొనేందుకు, కుమారుడైనాసరే, ప్రక్కవాడిపై నెట్టటం ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలో ఒక భాగమని తలంచవచ్చు.

సామాన్య మానవుడు రాగద్వేషాలకు అతీతుడు కాలేడు. పగ ప్రతీకారం మొదలైన లక్షణాలు అతణ్ణి ఆశ్రయించే ఉంటాయి. కొన్ని సందర్భాల్లో ప్రత్యర్థి బలవంతుడై తానేమీ సాధించలేక నిస్సహాయస్థితిలో ఉన్నప్పటికీ, మనసులో నిక్షిప్తమైన అభిమానం, పగ, ప్రతీకారం హృదయాన్ని దహిస్తూనే ఉంటాయి. అవకాశం కోసం చూస్తుంటాడు. అవకాశం లభించకపోతే తనలో తానే కుమిలి పోతాడు. ధృతరాష్ట్రుని జీవితంలో కూడ అతడి వ్యక్తిత్వం ఒకటి రెండు సందర్భాల్లో ఈ పరిస్థితులకు లోనుకావటం కనిపిస్తుంది.

సుయోధనుని మరణంతో కురుపాండవ వివాదానికి తెరపడింది. పుత్రులను బంధువులను, కోల్పోయిన ధృతరాష్ట్రుడు రెక్కలు తెగిన విహంగంలాగా ఏకాకిగా మిగిలాడు. అతడు పుత్ర మరణ జనిత శోకంతో మూర్ఛిల్లుతాడు. ధృతరాష్ట్రుని దయనీయ స్థితి మానవ సహజంగానే ఉండి సానుభూతికి పాత్రమవుతుంది. కొంత సేపటికి సేదతీరి అంతటి విషాదంలో కూడ "కుంభ నిక్షిప్త భుజంగంబు చందంబున నిశ్వాసంబు" (శల్య. 1-10) విడవటం ఆ మహారాజు నిస్సహాయ తతో కూడిన పగకు ప్రతీకగా ఉంది. కుంభ నిక్షిప్తమైన పాముబుసలాగా ధృతరాష్ట్రుని నిశ్వాసం ఉన్నదని వివరించి తిక్కన ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలోని అంతరతత్వాన్ని ప్రదర్శించాడు. ఆ మహారాజు నిగూఢ వ్యక్తిత్వానికి ఈ పోలిక అద్దం పట్టినట్లుంది.

ధృతరాష్ట్రుని 'కుంభ నిక్షిప్తమైన భుజంగాన్ని' పోలిన వ్యక్తిత్వాన్ని ఋజువు చేసేందుకు స్త్రీ పర్వంలోని ఒక అంశం ఉదాహరణగా నిలుస్తుంది. యుద్ధంలో మృతులైన కుమారులను, బంధుమిత్రులను చూసేందుకు భార్యాసహితుడై యుద్ధభూమికి వచ్చిన పెదతండ్రిని ఓదార్చే ఉద్దేశంతో ధర్మరాజాదులు భయంతోనే ఆ మహారాజు సమీపానికి వస్తారు. ఆ సమయంలో భీముడనే మాటవిన్న ధృతరాష్ట్రునకు నిద్రాణమై ఉన్న పగ ఒక్కసారిగా విజృంభించింది. అయితే శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని పగలోని తీవ్రతను గమనించినవాడై, భీమునకు ప్రమాదం సంభవిస్తుందనే ఆలోచనతో ఉక్కుతో చేసిన భీముని విగ్రహాన్ని అతని ముందు నిలుపుతాడు. ధృతరాష్ట్రుడు అప్పటివరకు నిస్సహాయంగా హృదయంలోనే దాచుకొన్న

"కోపంబుత్కటమై
రూపము నిరుగేలఁబట్టి క్రూరత ఘోరా
టోపం బెసక మెసఁగ నా
భూపతి వెసఁ గౌగిలించి పొలుపఱవిఱిచి" (స్త్రీ. 1-30)

తన కసి తీరేటట్లు ప్రవర్తించాడు. ఈ విధంగా పగ తీర్చుకోవటం పుత్ర మరణ శోకంతో క్రుగ్గిపోయే ఆ మహారాజు ప్రవర్తన సహజ పరిణామంగానే కనిపించినా, అతడి అనంతర వర్తనం విచిత్రంగా ఉండి అందరను ఆశ్చర్యంలో ముంచుతుంది. భీముణ్ణి సంహరించానని "పెంపున నెడఁద నుప్పొంగ హర్షంబు నొందియు మెరమెచ్చు వాడై భీమునిం బేర్కొని హాహారవంబు లెసఁగ రోదనంబు" (స్త్రీ. 1-132) చేశాడు. భీముణ్ణి చంపాననే ఆనందం మనసులో దాచుకొని, తమ్ముని కుమారుని మరణానికి విలపించినట్లు నటించటం అతడి నిగూఢ వ్యక్తిత్వానికి ప్రతీక.

అయితే శ్రీకృష్ణుడు భీమునకు ప్రతిరూపంగా ఉక్కు విగ్రహాన్ని అక్కడికక్కడ ఏర్పాటుచేయటం అసంగతంగా ఉండి కృష్ణుని అతిమానుష శక్తిని వెల్లడిస్తుంది. ధృతరాష్ట్రుని ఆంతర్యం ముందుగానే పసికట్టి శ్రీకృష్ణుడు క్షణాల్లో ఉక్కు భీముణ్ణి సృష్టించ కలిగినప్పటికీ, అంధరాజు జీవమున్న మానవ శరీరానికి, ఉక్కు విగ్రహానికి తేడా తెలుసుకోలేనంత అసమర్థుడు కాడు. కుమారులనందరను చంపాడనేఆవేశంతో విచక్షణా జ్ఞానం కోల్పోయాడని సమర్థింప చూసినా ఉక్కు

విగ్రహాన్ని ఆ రాజు ముందు నిలిపేటప్పుడే విదురాది అంతరంగికు లెవరైనా అభ్యంతర పెట్టటం కాని, లేదా ఆ విషయం ముందుగానే ధృతరాష్ట్రునకు తెలియ పరచటంగాని జరుగుతుంది. వారంతా కృష్ణప్రేరితులై మౌనం వహించారనుకుంటే ధృతరాష్ట్రుని పరంగా అది వారి ద్రోహమే అవుతుంది. అందువల్ల ఉక్కుభీముని వృత్తాంతం అంతా అసంగతంగా కనిపిస్తుంది. ధృతరాష్ట్రుని పగను, ఆవేశాన్ని, నిక్షిప్తమైన ప్రతీకార వాంఛను, గుర్తించి పాఠకులు తెలుసుకోవటం కోసమూ, శ్రీకృష్ణుని అతిమానుష విశేషాలను విస్తరింప చేసేందుకు అనంతరకాలంలో ఈ అంశాన్నంతా పాండవ పక్షీయులైన పండితులెవరన్నా చేర్చి ఉండవచ్చునని తలంచ వచ్చు. ఈ సందర్భం అంతా ఎంతో చోద్యంగా ఉందంటూ మాస్తి వెంకటేశ అయ్యంగార్ కూడ "The story is fantastic. Dhritarashtra makes the request in a place where a metal image is ready at hand. What was the place ? What was the image doing there ? The story is obviously all concocted, merely to make out that Krishna by devine foresight guarded his devo.ee" [1] అని కృష్ణ భక్తులెవరో ఈ అంశాన్ని తరువాత కల్పించారనే అభిప్రాయానికి వచ్చారు. వీరి అభిప్రాయం సమంజసంగా ఉంది. సాధారణ దృష్టికి ఈ వృత్తాంతం అసంగతంగా ఉన్నప్పటికీ ధృతరాష్ట్రుని కుంభ నిక్షిప్త భుజంగ తత్వానికి ప్రతీకగా భారతకర్త స్వీకరించి కావ్యతత్వానికి అనుగుణంగా తీర్చిదిద్దారని భావించటం సమంజసంగా ఉంటుంది.

ఈ విధంగా ఆంధ్రమహాభారతంలో కనిపించే ధృతరాష్ట్ర మహారాజు అతి నిగూఢమైన వ్యక్తిత్వం కలవాడని తెలుస్తుంది. కార్యనిర్ణయంలో స్పష్టంగా వ్యవహరించక పోవటం బలహీనతగా గోచరం అవుతున్నప్పటికీ, అట్లా నిర్ణయం తానుగా చేయకుండ పరిణామాలు తన అభిప్రాయానికి అనుకూలంగా మారేంతవరకు వేచి ఉండి, అభీష్టం నెరవేర్చుకోవటం ధృతరాష్ట్రుని వ్యక్తిత్వంలో విశేషాంశంగా కనిపిస్తుంది. అయితే ఆ మహారాజు అనిశ్చయ మనస్తత్వమే (wavering Mentality) జీవితంలో కొన్ని ప్రయోజనాలను సాధించినప్పటికీ, మొత్తంమీద అతడి జీవితానికి విషాదాన్నే మిగిల్చింది.

**అధస్సూచిక :**

1. Masti Venkatesaiyyangar, The Mahabharata; P. 8.

# 1.10 జీవితపరిమాణం

జాతిపురోగమనానికి, దేశాభ్యున్నతికి జీవితాన్ని అంకితంచేసిన వ్యక్తిని యోగ్యుడనీ, ధర్మాత్ముడనీ సంభావించటం లోకసహజం. అలాంటివారి జీవిత చరిత్రలే పదికాలాలపాటు నిలిచి ఉంటాయి. కొందరు చరిత్రలో గణనకెక్కితే, మరికొందరి జీవితాలను గ్రంథాల్లో నిక్షిప్తం చేస్తారు. చరిత్ర పుస్తకాల్లోకాని, కావ్యాల్లోకాని వారి జననాదికాలు, జీవితంలో వారు సాధించిన ఘనకార్యాలు కథలుగా కూర్చబడతాయి. ఆయా గ్రంథాల్లోని పాత్రల జననం, జీవించినకాలం, కథకు వారి వల్లకలిగే ప్రయోజనాన్నికొందరు కథాకథనంలో కూర్చితే మరికొందరు కవులు వ్యంగ్య మర్యాదను పాటిస్తారు. ఆసందర్భాల్లో సన్నివేశ కల్పనారీతులను, కథా కథనంలోని పూర్వాపర సంబంధాన్ని అనుసరించి ఆయా పాత్రలు జీవించిన కాల పరిమాణాన్ని ఊహించటం జరుగుతుంది. చరిత్ర ప్రసిద్ధిచెందిన వ్యక్తులే కథా నాయకులైతే చరిత్రాంశాలకు కావ్యగతాంశాలు భిన్నంకాకుండ ఉండేటట్లుచూస్తే సరిపోతుంది.

సంస్కృతాంధ్ర భారతాలు రెండింటిలోను ఆయాపాత్రల ప్రాధాన్యాన్ని కథలో గుర్తించే సమయంలో వారి జీవిత పరిమాణానికి సంబంధించిన అంశాలు విస్తృతంగా గోచరంకావు. కురు సామ్రాజ్యాధిపతి ధృతరాష్ట్రుని జీవితపరిమాణం విషయంలోకూడ నిర్దిష్టమైన సూచనలేవీ లభించటంలేదు. ధృతరాష్ట్రుడు జన్మించే నాటికి విచిత్రవీర్యుని వయసు ఎంతఉంటుంది? సుయోధనాదులు జన్మించే సమయానికి ధృతరాష్ట్రుని వయసెంత ? అట్లాగే భారతంలో కొన్ని ప్రధాన ఘట్టాలు ధృత రాష్ట్రుని ఏయే వయసులలో జరిగాయి ? చివరకు ఆశ్రమవాసంలో మరణించేనాటికి అతడి వయసెంత ఉంటుంది ? మొదలైన అంశాలకు సాధికారిక, సప్రమాణికమైన సమాధానాలు మృగ్యం. అయితే ఆంధ్రమహాభారతంలో మాత్రం కొన్నిచోట్ల సన్ని వేశ ప్రాధాన్యాన్ని అనుసరించి కొన్నిసంవత్సరాలు పేర్కొనటం జరిగింది. శత శృంగంలో పాండురాజు మరణించేనాటికి ధర్మరాజాదులు ఏవయసులో ఉన్నారు, వారణావతం పోవటానికి ముందు హస్తినాపురంలో వారు ఎంతకాలం నివసించారు, ఇంద్రప్రస్థంలో అభిషిక్తుడైన ధర్మరాజు, ద్యూతవిజితుడై అరణ్యవాసానికి పోయే ముందు, ఎన్ని సంవత్సరాలు పరిపాలించాడు, భారతయుద్ధానంతరం కృష్ణ నిర్యాణం

వరకు ఎన్ని సంవత్సరాలు గడిచాయి మొదలైనవి ప్రధానంగా కనిపిస్తున్నాయి. కవిత్రయం భారతం తెనిగించేనాటికి వారికి లభించిన ప్రతుల్లో ఈ అంశాలు ఉండి ఉండాలి లేదా వారే కథానిర్మాణంలో సందర్భోచితంగా ఆయా సంవత్సరాలను పేర్కొనటం జరిగి ఉండాలి.

చారిత్రక పరిశోధకులు, సాహిత్య పరిశీలకులు కొందరు మహాభారతం లోని ప్రధానపాత్రల జీవిత పరిమాణాన్ని లెక్కించి చెప్పేందుకు ప్రయత్నించారు. ఆ ప్రయత్నంకూడ ధర్మరాజాదుల వయసులను పరిశీలించి ఒక అవగాహనతో కూడిన ఊహచేయటం వరకే పరిమితమైంది. కాని ధృతరాష్ట్రుని జీవిత పరిమాణం స్థూలంగానైనా నిర్దేశించేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. ఇరావతీ కార్వే కురు వృద్ధుడైన భీష్ముని వయసు నిర్ధారించే ప్రయత్నంలో కురువీరులలో మరికొందరి జీవిత పరిమాణాలను చెప్పారు. కురుక్షేత్ర యుద్ధంనాటికి భీష్ముని వయసు తొంభై నూరు సంవత్సరాల మధ్య ఉంటుందని భావించి, దాని ఆధారంతో మిగిలిన వారి వయసులను లెక్కించే ప్రయత్నం చేశారు.[1] ఇరావతీ కార్వేగారి అభిప్రాయానికి ఆధారం సంస్కృత భారతంలో కన్పించటం లేదు. కురుక్షేత్ర యుద్ధం నాటికి భీష్మునకు తొంభై నూరు సంవత్సరాల మధ్య ఉంటాయనేది ఆమె ఊహ అయినా అయి ఉండాలి, లేదా వేరే ఆధారాలు ఎక్కడైనా లభ్యమయ్యాయేమో అనే అంశం పరిశీలించాలి. ములుకుట్ల నరసింహావధాని పాకనాటి, మరుపూరు కోదండరామిరెడ్డి వంటి పండితులు కూడ కురువీరులలో కొందరి జీవిత పరిమాణాన్ని నిర్ధారించేందుకు ప్రయత్నించారు. ధృతరాష్ట్రుని జీవిత పరిమాణం నిర్ణయించేటప్పుడు ఈ పండితుల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోవటం జరుగుతుంది. సంస్కృతాంధ్ర భారతాల్లో లభించిన కొద్దిపాటి ఆధారాలను సూచనామాత్రంగా స్వీకరించి వాటిని క్రోడీకరించి ధృతరాష్ట్రుని జీవిత పరిమాణం ఎంతో తెలుసుకోవటం ప్రస్తుతాంశం.

**భీష్ముని యౌవరాజ్యాభిషేకం :** కురుక్షేత్ర యుద్ధం నాటికి ధృతరాష్ట్రుని పూర్వీకులలో అతి వరిష్టుడు భీష్ముడు. గంగాదేవి కుమారుణ్ణి శంతనునకు అప్పగించేనాటికి భీష్ముని వయసుకు సంబంధించిన సూచన ఒకటి కనిపిస్తుంది. ఆ సూచన ఆధారంగా ప్రాచీనమైన సంస్కృతాంధ్ర భారతాల్లోని ఇట్లాంటి సూచనల ఆధారంతో ధృతరాష్ట్రుని జీవిత పరిమాణాన్ని స్థూలంగా నిర్దేశించే ప్రయత్నం

చేయవచ్చు. ఆ ప్రయత్నంవల్ల కురుపితామహుడు భీష్ముని జీవిత పరిమాణంతో పాటు మరికొందరి జీవితకాలాన్ని కూడ గుర్తించవచ్చు.

వివాహ సమయంలో చేసిన బాసను అతిక్రమించిన కారణంగా అష్టమ పుత్రుడైన భీష్ముణ్ణి తనతో తీసుకొని గంగాదేవి శంతనుణ్ణి విడిచి వెళ్తుంది. గంగాదేవి మునుల సాంగత్యంలో కుమారుణ్ణి వేద విద్యల్లోను, అస్త్ర విద్యల్లోను ఆత్మవిజ్ఞానంలోను నిష్ణాతుణ్ణి చేస్తుంది. ఈ విద్యలన్నీ పూర్తిచేసేటప్పటికి అతడు ఎన్ని సంవత్సరాలవాడో ఆంధ్రమహాభారతంలో లేదు. కాని ఇన్ని విద్యలు నేర్చిన భీష్ముడు యువకుడై ఉండాలి. సంస్కృత భారతంలో

"సమాః షోడశాష్టౌచ చతస్రోఽష్టౌ తథా పరాః
రతిమప్రాప్నువన్ స్త్రీషు బభూవ వనగోచరః" [2]

అని ఉన్నదాన్నిబట్టి దేవవ్రతుడు అప్పటికి ఇరవైనాలుగు సంవత్సరాల ప్రాయం వాడని తెలుస్తుంది. కనుక గంగాదేవి కుమారుణ్ణి శంతనున కప్పగించేనాటికి దేవ వ్రతుని వయసు ఇరవైనాలుగు సంవత్సరాలని తలంచవచ్చు. అనంతరం శంతనుడు "గాంగేయునకు యౌవరాజ్యాభిషేకంబుసేసి కొడుకుతోడి వినోదంబుల దగిలి నాలుగు వత్సరంబు లనన్య వ్యాపారుండై" (ఆది 4-170) ఉండి మృగయా వినోదార్థం యమునా తీరానికి వెళ్లాడు. దీన్నిబట్టి యౌవరాజ్యాభిషేకం నాటికి దేవవ్రతునకు ఇరవైనాలుగేండ్లని, శంతనుడు వేటకై అరణ్యానికి పోయేనాటికి ఇరవై ఎనిమిదేండ్లని తెలుస్తుంది. ఆ వయసులోనే దేవవ్రతుడు దాశరాజుతో భీషణ ప్రతిజ్ఞచేసి సత్యవతీ శంతనుల వివాహానికి మార్గం సుగమం చేశాడు.

**శంతనుని మరణం :** సత్యవతి వల్ల శంతనునకు చిత్రాంగద విచిత్ర వీర్యులనే పుత్రులు కలిగారు. వివాహానంతరం వ్యవధానం లేకుండానే వీరు జన్మించారనుకుంటే, శంతనుని వివాహం తరువాత రెండు సంవత్సరాలకు విచిత్ర వీర్యుడు జన్మించి ఉంటాడు. అప్పటికి భీష్ముని వయసు ముప్పై సంవత్సరాలుగా భావించవచ్చు. శంతనుడు కుమారులు ప్రాప్తయౌవనులు కాకుండానే మరణించినట్లు "వారు సంప్రాప్త యౌవనులు కాకుండ బరలోక గతుండైన" (ఆది. 4-193) అనే నన్నయగారి మాటలవల్ల తెలుస్తుంది. ప్రాప్తయౌవనం అంటే పదహారు సంవత్సరాలని శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి నిర్ణయాన్ని అంగీకరించవచ్చు.[3]

సంప్రాప్త యౌవనులు కాకుండ అని చెప్పటంచేత బాల్యావస్థ దాటి యౌవన ప్రాంగణంలో అడుగు పెట్టేందుకు సిద్ధంగా ఉన్న వయసు కావచ్చు. అది సుమారు పధ్నాలుగు, పదిహేను సంవత్సరాల మధ్య అని తలంచవచ్చు. పదిహేను సంవత్సరాలని భావించినట్లయితే శంతనుడు మరణించే నాటికి చిత్రాంగదునకు పదిహేను సంవత్సరాలు, విచిత్రవీర్యునకు పధ్నాలుగు సంవత్సరాలుంటాయి. అప్పటికి భీష్మునకు నలభై నాలుగు సంవత్సరాలు ఉండవచ్చు.

**విచిత్రవీర్యుని మరణం :** శంతనుని మరణం తరువాత కొద్ది కాలానికే చిత్రాంగదుడు మరణిస్తాడు. చిత్రాంగదుని అనంతరం భీష్ముడు రాజ్య రక్షకుడుగా విచిత్రవీర్యుడు కురు సామ్రాజ్యాధిపతి ఆయ్యాడు ఆరూఢ యౌవనుడైన విచిత్రవీర్యునకు భీష్ముడు కాశీరాజు కుమార్తెలతో వివాహం చేస్తాడు. వివాహ సమయానికి విచిత్రవీర్యుడు 'ఆరూఢ యౌవనుడు' అయ్యాడని తెలుస్తుంది. ఆరూఢ పదానికి మోనియర్ మోనియర్ విలియమ్స్ తన సంస్కృతాంగ్ల కోశంలో Mounted, Ascended, Bestriden, Raised up, Elivated on high అనే అర్థాలు ఇచ్చాడు.[4] బ్రౌను పండితుడు తన ఆంగ్లాంధ్ర కోశంలో ఈ పదాలకు ఎక్కుట, ఆరోహణము, ఉన్నతమైన అనే అర్థాలు ఇచ్చాడు. శబ్దరత్నాకరంకూడ ఈ పదానికి విశేషణార్థంలో 'ఎక్కినది' అని అర్థం చెప్పింది. ఈ సమాచారాన్ని బట్టి 'ఆరూఢ యౌవనము' అనగా ప్రజల యౌవనమని తెలుస్తుంది. అది యౌవన ప్రారంభ దశ కాక యౌవనం ఉచ్చదశగా భావించవచ్చు. అది నిండు లేక పరిపూర్ణ యౌవనం అవుతుంది. నిండు యౌవనాన్ని గూర్చి పండితులు చెప్పిన కొన్ని అంశాల్ని పరిశీలిస్తే విచిత్రవీర్యుడు ఆరూఢ యౌవనం ఎంత వయసువాడో తెలుసుకోవచ్చు.

నిండు యౌవనం అనే పదాన్ని శ్రీనాథుడు ప్రయోగించాడు. "సంతరించితి నిండు జవ్వనంబున యందు హర్షనైషధ కావ్యమాంధ్ర భాష"[5] అని తన నిండు లేక పరిపూర్ణ యౌవన దశలో శృంగార నైషధం రచించినట్లు వ్రాశాడు. కందుకూరి వీరేశలింగంగారు నిండు జవ్వనాన్ని ముప్పై సంవత్సరాల వయసుగా తేల్చి చెప్పారు.[6] చాగంటి శేషయ్యగారు నిండు జవ్వనం ఇరవై పదు ముప్పై ఐదు సంవత్సరాల మధ్య అని తీర్మానించారు.[7] కొర్లపాటి శ్రీరామమూర్తిగారు 'నిండు జవ్వనమన ముప్పది ఐదు సంవత్సరములకంటె నధికము కాదు'[8] అని

భావించారు. ఈ పండితుల అభిప్రాయాన్ని పరిశీలిస్తే రెండు యౌవనం ముప్పై సంవత్సరాలని భావించటం సమంజసం. అందువల్ల ఆరూఢ యౌవనుడైన విచిత్ర వీర్యుడు వివాహ సమయానికి ముప్పై సంవత్సరాల వయసువాడని చెప్పవచ్చు. అప్పటికి భీష్ముని వయసు అరవై సంవత్సరాలని నిర్ధారించవచ్చు.

వివాహానంతరం విచిత్రవీర్యుడు భార్యలతో సహజీవనం సాగించిన కాలాన్ని గూర్చి నన్నయ భారతంలో సమాచారం లభించటం లేదు. సంస్కృత భారతంలో ఇతడు భార్యలతో ఏడు సంవత్సరాలు యథేచ్ఛగా స్వర్గసుఖాలు అనుభవించి రాజయక్ష్మకు లోనై మరణించినట్లు

"తాభ్యాం సహసమాః సప్త విహరన్ పృథివీ పతిః
విచిత్రవీర్య స్తరుణో యక్ష్మణా సమగృహ్యత॥
సుహృదాం యతమానానా మాప్తైః సహచికిత్సకైః
జగమాఽ స్తమి వాదిత్యః కౌరవ్యో యమ సాదనం" [9]

అని ఉంది. విచిత్ర వీర్యుడు భార్యలతో సంసారం సాగించిన ఏడు సంవత్సరాలలో అంబికాంబాలికల వల్ల ధృతరాష్ట్రి పాండురాజులను, అంబిక దాసివలన విదురుని పుత్రులుగా పొంది ఉంటాడని, ధృతరాష్ట్రిని జననాన్ని పరిశీలించేటప్పుడు భావించటం జరిగింది. వివాహం అయిన తరువాత వెంటనే సంతానోత్పత్తి జరిగి ఉంటుందని భావిస్తే, విచిత్రవీర్యుడు మరణించేనాటికి ధృతరాష్ట్రిడు ఐదు లేక ఆరు సంవత్సరాలు, పాండు విదురులు ఒక్కొక్క సంవత్సరం చిన్నవాడుగా ఉండవచ్చు. అప్పటికి విచిత్రవీర్యుడు ముప్పైఏడు సంవత్సరాల వాడనుకుంటే, భీష్ముని వయసు అరవైఏడు సంవత్సరాలనటం సమర్థనీయం.

**ధృతరాష్ట్రిని వివాహం :** విచిత్ర వీర్యుడు మరణించిన తరువాత భీష్ముడు రాజ్యరక్షకుడుగా ఉండి ధృతరాష్ట్రిణ్ణి రాజ్యాభిషిక్తుని చేశాడు. గాంగేయ భుజాబలంతో ఏకచ్ఛత్ర విరోధి సమాజుడై ధృతరాష్ట్రిడు ఆ రూఢ యౌవనుడయ్యాడు. అంటే ముప్పై సంవత్సరాల వయసువాడు అయ్యాడు. భీష్ముడు గాంధారరాజు సుబలుని కుమార్తె గాంధారి తగినదని భావించి ఆమెతో ధృతరాష్ట్రిని వివాహం జరిపిస్తాడు. ఆ రూఢ యౌవనుడైన ధృతరాష్ట్రిడప్పటికి ముప్పైఏండ్ల

వాడని, భీష్ముని వయసు తొంభై రెండు సంవత్సరాలై ఉండవచ్చు ననటం సమంజసం.

**పాండురాజు దిగ్విజయం :** ధృతరాష్ట్రుని కన్న ఒక్క సంవత్సరం చిన్నవాడైన పాండురాజు స్వయంవరంలో కుంతిని వివాహం చేసుకొనేటప్పటికి ఇరవై తొమ్మిది సంవత్సరాల వయసువాడని గుర్తించవచ్చు. వీరుడు యువకుడునైన పాండురాజు భీష్ముని కనుసన్నలలో మెలగుతూ అగ్రజుడైన ధృతరాష్ట్రునకు అండగా నిలిచి, దిగ్విజయం చేసి సమస్త రాజన్య లోకాన్ని జయించి తెచ్చిన కానుకలను సోదరుని అనుమతితో భీష్మాది పెద్దలకు సమర్పించి ప్రశంసలు పొందాడు. అప్పటికే కురు సామ్రాజ్యం భీష్ముని రక్షణలో సర్వసమృద్ధమే కాని క్షీణదశలో లేదు. గాంధారి ధృతరాష్ట్రుని భార్య కావటం, కుంతీమాద్రులు పాండురాజు భార్యలు కావటంలో కురుసామ్రాజ్యౌన్నత్యం, ప్రాబల్యం వెల్లివిరుస్తుంది. పాండురాజు దిగ్విజయం మరొకసారి సాటి రాజన్యలోకంలో కురువుల ఆధిపత్యాన్ని స్థిరీకరించేందుకు మాత్రమేకాని, శత్రువుల వల్ల ప్రమాదాలు ఏర్పడ్డ స్థితిలో వాటిని త్రిప్పికొట్టటానికి చేసిన ప్రయత్నంగా కనిపించదు. అందువల్ల పాండురాజు దిగ్విజయయాత్రకు రెండు సంవత్సరాలకన్న పట్టి ఉండదని తలంచటం సమంజసం. కురుసామ్రాజ్యాధికారం సుప్రతిష్ఠితంగా ఉన్న ఈ సమయంలో పాండురాజు భార్యలిద్దరితో కలిసి మృగయా వినోదార్థం అరణ్యానికి ప్రయాణం అయ్యాడు. అతడు అరణ్యానికి వెళ్లేనాటికి ముప్పైఒక్క సంవత్సరాల వయసులో ఉన్నాడు. అప్పటికి ధృతరాష్ట్రునకు ముప్పైరెండు సంవత్సరాలు, భీష్మునకు తొంభైనాలుగు సంవత్సరాలుంటాయి.

**పాండురాజు మరణం :** పాండురాజు అరణ్యానికి వినోదార్థమే వెళ్లాడు కాని అక్కడే స్థిరంగా ఉండిపోయే ఉద్దేశంతో కాదు. వినోదార్థమే కనుక చాలా ఎక్కువ రోజులు ఉన్నాడనుకొన్నా అవి కొన్ని మాసాలే అవుతాయి కాని, సంవత్సరాలు గడిచి ఉండవు. ఇంతలో దురదృష్టం తరుముకొచ్చి కిందముని శాపానికి గురిఅయ్యాడు. పాండురాజు అరణ్య ప్రవేశం తరువాత శాపగ్రస్తుడయ్యే నాటికి లెక్కించదగినన్ని రోజులు గడిచి ఉండవు. ముని శాపానికి గురి అయిన పాండురాజు మునివృత్తి ఉచితమైందిగా తలచి ఐహిక సంబంధాలకు విముఖుడై తపోదీక్ష వహించాడు. వానప్రస్థాన్ని అనుష్ఠించిన పాండురాజు శతశృంగ మునులకు గౌరవ

పాత్రుడయ్యాడు. అతడు పూర్వాశ్రమంలో ప్రసిద్ధి చెందిన క్షత్రియ వంశానికి చెందినవాడు కావటంవల్ల, క్షత్రియోచితమైన పట్టుదల, శిక్షకలవాడవటంచేత అచ్చటి మునుల మన్ననలు పొందేందుకు సుదీర్ఘ కాలం పట్టిఉండదు. అట్లా ఆ మునులకు ఆదర్శప్రాయుడు అయ్యేందుకు రెండు సంవత్సరాలు పట్టి ఉంటుంది. ఆ సమయంలో పాండురాజు అనపత్య దోషం నుంచి రక్షణ పొందేందుకై ఒక్కొక్కరికి సంవత్సరం వ్యత్యాసంతో కుంతీదేవివల్ల ధర్మజ భీమార్జునులను, మాద్రివల్ల నకుల సహదేవులను పొందాడు. ధర్మరాజు జన్మించే నాటికి పాండురాజు వయసు ముప్పై నాలుగు సంవత్సరాలై ఉంటుందని తలంచవచ్చు. శతశృంగంలో భీముడు జన్మించిన సమయంలోనే గాంధారీ గర్భాన సుయోధనుడు జన్మించాడు కనుక పుత్రోదయంనాటికి ధృతరాష్ట్రుని వయసు ముప్పైఆరు సంవత్సరాలని తెలుసుకోవచ్చు. ధర్మరాజు జననం నాటికి ధృతరాష్ట్రునకు ముప్పైఐదు సంవత్సరాలు, భీష్మునకు తొంభై ఏడు సంవత్సరాలని భావించవచ్చు.

ధర్మరాజు జన్మించిన తర్వాత పాండురాజు పదహారు సంవత్సరాలు జీవించినట్లు నన్నయ భారతంలోని అంశాలు విశదపరుస్తున్నాయి. ఒకరోజు వసంతఋతు శోభలో మనసు అధీనం తప్పిన పాండురాజు క్షణికావేశంలో కామాసక్తుడై మాద్రిని కలిసి మరణిస్తాడు. మాద్రి సహగమనం చేస్తుంది. తండ్రిని కోల్పోయిన బిడ్డలను, కుంతీదేవిని తోడ్కొని మునులు మాద్రి పాండురాజుల అవశేషాలతో హస్తినాపురం వస్తారు. అప్పటికి ధర్మరాజాదులు ఏ వయసులో ఉన్నారో సంస్కృత భారతంలో లేదు. నన్నయ "యుధిష్ఠిర భీమార్జునయములుం గ్రమంబున "దొల్లిషోడశ, పంచదశ, చతుర్దశ, త్రయోదశ వర్షజాతులయి శతశృంగంబుననుండి హాస్తిపురంబునకువచ్చి" (ఆది. 6-142) అని అప్పటికి ధర్మరాజు పదహారు సంవత్సరాల ప్రాయంవాడని కొంత సమాచారం ఇచ్చారు. అందువల్ల మరణించే నాటికి పాండురాజు వయసు ఏభై సంవత్సరాలని నిర్ధారించవచ్చు. అప్పటికి ధృతరాష్ట్రుని వయసు ఏభై ఒక్క సంవత్సరాలు, భీష్ముని వయసు నూటపదమూడు సంవత్సరాలవుతుంది.

**కుమారాస్త్రవిద్యా ప్రదర్శనం :** ధర్మరాజాదులు శతశృంగం నుండి వచ్చిన తర్వాత కుమారాస్త్రవిద్యా ప్రదర్శన ఎన్ని సంవత్సరాలకు జరిగిందనే అంశం పరిశీలనార్హం. శతశృంగం నుంచి వచ్చినప్పటి నుంచి ధార్తరాష్ట్రులతో కలిసి పాండవులు హస్తినాపురంలో ద్రోణాచార్యుని గురుత్వంలో అస్త్ర విద్యాభ్యాసం

చేశారు. ఈ అస్త్ర విద్యాభ్యాసం అక్షరాభ్యాసం నుండి ప్రారంభించారని తలంచ టానికి అవకాశంలేదు. సుయోధనాదులు బాల్యంనుంచి వేదవిద్యలతోపాటు కృపా చార్యుని శిష్యరికంలో విలువిద్య నేర్చుకొన్నారు. పాండవులుకూడ హస్తినాపురం చేరింతరువాత కృపాచార్యుని శిష్యులై ధనుర్వేద విశారదులయ్యారు. ఇంకా అంతకుముందే శతశృంగంలో కశ్యపునివల్ల వేదాది ధార్మికవిద్యలు, శర్యాతివంశీయు డైన శుకమహారాజువద్ద అస్త్రశస్త్రాది విద్యలు నేర్చారు. దీనిని బట్టి పాండవ ధార్తరాష్ట్రులు ద్రోణుని శిష్యరికంలో అస్త్రవిద్యలోని మెలకువలను, నైపుణ్యాన్ని నేర్చిఉంటారేకాని ప్రారంభంనుంచి కాదని స్పష్టంఅవుతుంది. ద్రోణుడు కురు కుమారులకు

> "... ద్వంద్వ సంకీర్ణ యుద్ధముల తెఱగు
> రథ మహీ వాజి వారణములపైనుండి దృఢచిత్ర సౌష్ఠవ స్థితులనేయ
> బహువిధ వ్యూహ భేదనోపాయములను
> సంప్రయోగ రహస్యాతి శయముగాఁగ" (ఆది. 5-230)

నేర్పాడు. ఇదంతా యుద్ధవిద్యలో ప్రత్యేక శిక్షణే కాని ప్రాథమిక శిక్షణకాదు. అప్పటికే శస్త్రాస్త్ర విద్యా ప్రౌఢులైన కురుకుమారులకు ఈ ప్రత్యేకశిక్షణ పొందేందుకు సుదీర్ఘ కాలం పట్టిఉంటది. కుమారాస్త్రవిద్యా ప్రదర్శనం నాటికి కురుపాండవులు ప్రౌఢులు కారని చెప్పలేమని తెలుస్తుంది. అంతఃపురకాంతలు ప్రౌఢులైన మహా వీరుల యుద్ధోన్ముఖ ధీరత్వమైన పరాక్రమాన్ని చూసే ఉద్దేశంతోకాక కుమారుల అస్త్ర విద్యాక్రీడా కౌశల్యాన్ని ముచ్చటగా దర్శించి ఆనందించే ఉద్దేశంతో వచ్చారు.

శతశృంగంలో పాండురాజు మరణానంతరం హస్తినాపురానికి వచ్చిన పాండ వులు వారణావతానికి పంపబడేందుకు ముందు పదమూడు సంవత్సరాలు రాజధానిలో ఉన్నట్లు నన్నయ చెప్పాన్నారు. కాటు "శతశృంగంబుననుండి హస్తిపురంబునకు వచ్చి యందు గౌరవులం గలిసి యస్త్రవిద్యలం గఱచుచుం బదమూడేండ్లుండి యపుడు ధృతరాష్ట్రు నియోగంబున వారణావతంబునకు జననీ సహితంబుగా" (ఆది. 6-142) వెళ్లారు. ఈ పదమూడేండ్ల కాలంలోనే కుమారాస్త్ర విద్యాప్రదర్శనం, ద్రుపదు పరాభవం, ధర్మజుని యౌవరాజ్యాభిషేకం, సుయోధనుని మానసికవేదన మొదలైన అంశాలు జరిగాయి.

భారతంలో కథ ఇట్లా ఉంటే శ్రీ ములుకుట్ల నరసింహావధానీ పాకయాజి 'మహాభారత సారోద్ధారము' అనే గ్రంథంలో కుమారాస్త్ర ప్రదర్శనం, ద్రుపదు పరాభవం, ధర్మరాజు యౌవరాజ్యాభిషేకం పాండవులు పదమూడేండ్లు హస్తినా పురంలో నివసించిన అనంతరమే జరిగినట్లు చెప్పారు. యౌవ రాజ్యాభిషేకం తర్వాత ఐదు సంవత్సరాలు హస్తినాపురంలో ఉండి వారణావతానికి వెళ్ళినట్లు చెప్పారు. అప్పటికి ధర్మరాజు వయసు ముప్పైఏడు సంవత్సరాలని భావించారు.[10] శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు పాండవులు వారణావతం నుంచి హస్తినాపురం వచ్చి ఐదు సంవత్సరాలున్నారని, అప్పటికి అభిమన్యుడు పన్నెండేళ్ల వాడయ్యాడని చెప్పారు.[11] అయితే సుభద్రను వివాహం చేసుకొనేటప్పటికి అర్జునుని వయసెంత ఉంటుంది అనే అంశం వారు ప్రస్తావించలేదు. ఆంధ్రమహాభారతంలో పాండవులు ద్రౌపదీ వివాహం తరువాత హస్తినాపురంవచ్చి ఐదేండ్లు ఉన్నట్లు చెప్పబడింది కాని వారణావతం నుంచి హస్తినాపురానికి వచ్చినట్లు లేదు. కనుక కోదండరామిరెడ్డిగారు ఈ అభిప్రాయానికి రావటానికి ఆధారమేమిటో తెలియదు. అట్లాగే నరసింహావధానీ పాకయాజిగారి అభిప్రాయం కూడా భారతంలోని క్రమంతో సరిపోలటంలేదు.

అందువల్ల ఆంధ్రమహాభారతంలో నన్నయ పేర్కొన్న క్రమాన్ని అనుసరించటం ఉత్తమం. కుమారాస్త్ర ప్రదర్శనం రాజకుమారుల వినోద ప్రదర్శనమేననీ, అప్పటికి కుమారులు యువకులేనని స్పష్టం అవుతుంది. కౌరవ పాండవులు ధనుర్విద్యలో ప్రత్యేక శిక్షణ పొందేందుకు సుమారు నాలుగు సంవత్సరాలకన్నా ఎక్కువ పట్టి ఉండదని భావించినట్లయితే, కుమారాస్త్రవిద్యా ప్రదర్శనం నాటికి ధర్మరాజు వయసు ఇరవై సంవత్సరాలుంటుంది. అప్పుడది కుమారుల విద్యా ప్రదర్శనే అవుతుంది. అప్పటికి ధృతరాష్ట్రునకు ఏభై ఐదు సంవత్సరాలు, భీష్మునకు నూటపదిహేడు సంవత్సరాలుంటాయని భావించవచ్చు.

ఈ పరిగణన యౌవరాజ్యాభిషిక్తుడైన ధర్మరాజు ప్రజల్లో ప్రాబల్యం పొందేందుకు అవసరమైన సమయం, ఆ ప్రాబల్యం సుయోధనునకు అసూయా కారణమై తండ్రి అనుమతితో వారిని వారణావతం పంపే ఏర్పాట్లు చేయటానికి అవసరమైన సమయానికి సరిపోతుందేమో పరిశీలించటం అవసరం. సంఘటిల్లిన అంశాలకు అవసరమైన సమయం, పాండవులు హస్తినాపురంలో ఉన్న పదమూడు

సంవత్సరాల పరిమితికి హేతుబద్ధంగా సరిపోలి నట్లయితే ఆ భావన సమంజస మైందిగా తలంచవచ్చు.

**ధర్మరాజు యౌవరాజ్యాభిషేకం :** కుమారాస్త్ర విద్యా ప్రదర్శనం తరువాత ద్రోణుని ప్రతిష్ఠ పెరిగి ఉంటుంది. చిరకాలంగా మనసులో రగులుతున్న పగను సాధించాలనే తలంపుతో, గురుదక్షిణగా ద్రుపదుణ్ణి బంధించితెమ్మని శిష్యులను ఆజ్ఞాపిస్తాడు. గురువు[illegible] నెరవేర్చే సందర్భంలో సుయోధనాదులు అశక్తులై వెను తిరిగి నప్పుడు ధర్మరాజు ఆజ్ఞానుసారం అర్జునుడు పాంచాలురను ఓడించి ద్రుపదుణ్ణి బంధించి గురువుకు అప్పగిస్తాడు. ఆనాటి రాజలోకంలో కురుసామ్రాజ్యంతో సమాన ప్రాభవాన్ని కలిగి వర్ధిల్లే రాజవంశాల లో పాంచాలం ప్రధానమైంది. గురు దక్షిణ తీర్చే ప్రయత్నంలో యువకులైన పాండవులు సాధించిన ఘనకార్యానికి బహుమానంగా ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకంచేసి సత్కరిస్తాడు. ఆ యౌవరాజ్యాభిషేకంకూడ ద్రుపదుని పరాభవం జరిగిన వెంటనే కాకుండ సంవ త్సరం తర్వాత జరిగినట్లు

> "తత స్సంవత్సరస్యాంతే యౌవరాజ్యాయ పార్థివ
> స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః" [12]

అని సంస్కృత భారతంలో ఉంది. నన్నయ ఈ సంవత్సరకాలం పేర్కొనలేదు. ఈ సంవత్సరం కాలంలో ప్రజాభిప్రాయంకూడ ధర్మరాజు శక్తి సామర్థ్యాలపై స్థిరీభూతమైనట్లు తలంచవచ్చు. యౌవరాజ్యాభిషేకం జరిగే నాటికి ధర్మరాజు వయసు ఇరవై ఒక్క సంవత్సరాలు, ధృతరాష్ట్రునకు ఏభై ఆరు సంవత్సరాలు, భీష్మునకు నూట వద్దెనిమిది సంవత్సరాలని తెలుస్తుంది.

**వారణావత నివాసం :** పాండవులు శతశృంగం నుంచి వచ్చిన తరువాత ఐదు సంవత్సరాలకు ధర్మరాజు యువరాజుగా పట్టాభిషిక్తుడైనట్లు పైన చేసిన పరిశీలనవల్ల తెలిసింది. యౌవరాజ్యాభిషేకం తరువాత వారణావతం పోవ టానికి ముందు పాండవులు ఎనిమిది సంవత్సరాలు రాజధానిలోనే ఉన్నారన్నమాట. ధర్మరాజు "యౌవరాజ్యమున [illegible] ప్రఖ్యాతుండై" (ఆది. 6-93) వర్ధిల్లాడు. [illegible]

సుయోధనునకు కంటకప్రాయం అయ్యాయి. ఈర్ష్యాసూయలు అతణ్ణి దహించి వేశాయి. కుమారుని వ్యథ ధృతరాష్ట్రుని హృదయాన్ని ఛేదించింది. కొంతకాలం పాండవులను హస్తినాపురానికి దూరంగా ఉంచాలనే కుమారుని ఆలోచన ఆ రాజుకు సమంజసంగా తోచింది.

ఆ ప్రయత్నంలో పాండవులకు వారణావతం చూడాలనే ఆసక్తి కలిగే టట్లు ఆ పట్టణ సౌందర్యాన్ని వివిధ రీతుల పొగడటానికు నేర్పరులైన వారిని నియమించాడు. అతడు ఆశించిన విధంగా ధర్మరాజుకు వారణావతం చూడాలనే మక్కువ కలిగింది. సమయం కనిపెట్టి ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతానికి ప్రయాణం కావించాడు. ఈ కార్యాలన్నీ అల్పకాలంలో జరిగేవి కావు. అదీగాక పాండవులు పరాక్రమాతిశయంతో, విద్యావినయ సంపదలతో, సద్గుణాధిక్యతతో ప్రజలకు ఆత్మీయులు కావటంకూడ ఒకటి రెండు సంవత్సరాల్లో జరిగేవని కాదు. అందువల్ల ధర్మరాజుకు యౌవరాజ్య పట్టాభిషేకం జరిగిన తరువాత ఈ పరిణామా లన్నీ మిగిలిన ఎనిమిది సంవత్సరాల కాలంలో జరిగి ఉంటాయని భావించవచ్చు. అట్లా భావిస్తే పాండవులు అరణ్యంనుంచి వచ్చినప్పటి నుంచి వారణావతం వెళ్లే నాటికి హస్తినాపురంలో నివసించిన పదమూడు సంవత్సరాల కాలం సరిపోతుంది. కనుక ధర్మరాజు వారణావతం పోయేనాటికి ఇరవైతొమ్మిదేండ్ల వాడని, ధృతరా ష్ట్రుడు అరవైనాలుగేండ్ల వయసులో ఉన్నాడని, భీష్మునకు నూట ఇరవైఆరు సంవ త్సరాలు ఉంటాయనటం దావ్యంగా ఉంటుంది.

పాండవులు వారణావతంలో ఆరుమాసాలున్నట్లు "తత్పురమున షణ్మా సములు భరతముఖ్యుల కరిగెన్" (ఆది. 6-159) అని నన్నయ పేర్కొన్నాడు. కాని సంస్కృత భారతంలో వారు ఒక సంవత్సరకాలం గడిపారు

"తాంస్తుదృష్ట్వా సుమనసః పరిసంవత్సరోషితాన్
విశ్వస్తానివ సంలక్ష్య హర్షం చక్రే పురోచనః"[13]

అని ఉంది. పాండవులు వారణావతంలో నివసించిన కాలం విషయంలో సంస్కృ తాంధ్ర భారతాలు కొంత భేదించినప్పటికీ, వ్యత్యాసం ఎక్కువ లేదు కనుక ఆకాలాన్ని ఒక్క సంవత్సరంగా స్వీకరించవచ్చు. అప్పటికి ధర్మరాజు వయసు ముప్పై సంవత్సరాలు, ధృతరాష్ట్రునకు అరవైఐదు సంవత్సరాలు, భీష్మునకు నూటఇరవై ఏడు సంవత్సరాలు ఉంటాయి.

**ద్రౌపది జననం :** లాక్షా గృహంనుంచి బిలమార్గాన తప్పించుకొన్న పాండవులు ద్రౌపదీ స్వయంవరానికి వెళ్లేంత వరకు ఆశ్రమాల్లోను, జనపదాల్లోను ప్రచ్ఛన్న రూపాలతో సంచరించారు. ఆయా ప్రదేశాల్లో ఎక్కడెక్కడ ఎన్నెన్ని దినాలు గడిపారనే విషయం స్పష్టంగా లేదు. నన్నయ ఒక్కొక్క ప్రదేశంలో ఉన్న సమయాన్ని 'కతిపయ దినంబులు', 'కొన్ని దినంబులు' అని పేర్కొన్నాడే కాని ఎన్ని రోజులో నిర్దిష్టంగా చెప్పలేదు.

ఈ అంశంలో శ్రీ ములుకుట్ల నరసింహావధాని పాకయాజి పాండవులు 'కతిపయ', 'కొన్ని', దినాలు నివసించారని నన్నయ పేర్కొన్న ప్రదేశాలలో ఆరేసి మాసాలు లెక్కించి లాక్షా గృహంనుంచి బయటపడిన తరువాత రెండు సంవత్సరాలకు పాంచాల నగరం చేరినట్లు చెప్పారు.[14] శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి కూడ లాక్షా గృహంనుంచి తప్పించుకొన్న పాండవులు అరణ్యాలలో తలదాచుకొని రమారమి మూడేండ్లకు ద్రౌపదీ స్వయంవరం కాలానికి ద్రుపదపురం చేరినట్లు చెప్పారు.[15]

ఈ పండితులు అభిప్రాయాలనైతే చెప్పారు కాని వాటిని సమన్వయం చేస్తూ ఆధారాలు చూపించలేదు. ఈ మధ్య కాలాన్ని గూర్చి భారతంలో స్పష్టంగా లేదు కనుక, ఆ కాలం ఎన్ని సంవత్సరాలై ఉంటుందనే అంశం ఎవరైనా ఊహ చేయవలసిందే. అయితే ఆ ఊహ కార్యకారణ సమన్వితమైతే సమంజసంగా ఉంటుంది. అట్లా కార్యకారణ సంబంధం చూపేందుకు కూడ వారణావత నిర్గమనం తరువాత జరిగిన కథలో ఆధారాలు మృగ్యం. అలాంటప్పుడు గ్రంథస్థమైన వేరే ఆధారాన్ని స్వీకరించి అవి లాక్షా గృహంనుంచి తప్పించుకొన్న పాండవులు అరణ్యాలలో గడిపి ఉన్నారని ఊహించే కాలానికి సంబాధితం కానప్పుడు స్వీకరించటంలో తప్పులేదు.

లాక్షాగృహంనుంచి సురక్షితంగా బయటపడ్డ పాండవులు ద్రౌపదీ వివాహ సమయానికి ద్రుపదపురం చేరారన్న విషయం స్పష్టం. అలాంటప్పుడు ద్రౌపదీజనన సమయాన్ని గుర్తించి, అప్పటికి ధర్మరాజు వయసు లెక్కించి, వివాహ సమయానికి ద్రౌపది వయసు గుర్తించినట్లయితే, ఆమె స్వయంవరానికి ముందు వారు అరణ్యాల్లోకాని, జనపదాల్లోకాని ఎంతకాలం ఉన్నారో భావించేందుకు సానుకూల్యం ఏర్పడుతుంది.

ద్రోణుని చెంత అవమానానికి గురిఅయిన ద్రుపదుడు అవమానతప్తుడై, ప్రతీకార వాంఛతో రణరంగంలో ద్రోణుని వధించగల కుమారుణ్ణి, అర్జునునకు భార్య కాగల పుత్రికను పొందాలని ప్రయత్నించాడు. మనోభీష్టం నెరవేరేందుకు బ్రాహ్మణో పాస్తి చేస్తూ యాజోపయాజులను ఆశ్రయించాడు. వారిలో ఉపయాజుణ్ణి స్థిరసంకల్పంతో ఒక సంవత్సరం ఆరాధించాడు. ఉపయాజుడు ద్రుపదుడు ఇస్తానన్న ధనానికి ఆశపడక తన అన్నయాజుని వద్దకు వెళ్లవలసిందని సలహా చెప్తాడు. యాజుడు ద్రుపదుని ఆశయం నెరవేర్చేందుకు సిద్ధపడి ఉపయాజుని సహాయంతో ద్రుపదునిచేత పుత్రకామేష్టి చేయిస్తాడు. ఈ పుత్ర కామేష్టి ద్రుపదుడు పరాభవం చెందిన సంవత్సరం తర్వాత జరిపినట్లు తెలుస్తుంది. మంత్రాహుతులవల్ల తృప్తుడైన అగ్నిదేవునివల్ల యజ్ఞ వేదికనుంచి ఒక కుమారుడు, కుమార్తె ఉదయించారు. వీరిద్దరు దైవదత్తమైన బిడ్డలైనట్లు నన్నయ కథనంవల్ల తెలుస్తుంది.

శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రివంటి పండితులు ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జననంలోని ఆధిదైవిక సంబంధాన్ని ఖండించారు. వీరు నిజంగా యజ్ఞ వేదిక నుండి ఉద్భవిల్లలేదని, ద్రుపదుడు దత్తత స్వీకరించాడని పెండ్యాలవారు అభిప్రాయపడ్డారు.[16] శ్రీ శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారు కూడ "ఇతడు ద్రోణ వధార్థము దత్తతగా స్వీకరింపబడిన వాడనియు, ఇతని యుత్పత్తికి సంబంధించిన దివ్యగాథ యాధిదైవికత్వానుకూలముగా వ్రాయబడు గ్రంథ స్వభావము"[17] అని తలచారు. ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జననంలో ఆధిదైవికాంశకు ప్రాధాన్యం ఉన్నదనటంలో విప్రతిపత్తి లేదు. కాని వారు దత్త సంతానం అనేందుకు గ్రంథస్థాధారాలు మృగ్యం. ధృష్టద్యుమ్నుడు జన్మించిన కారణాన్ని, కుమారుని పరంగా ద్రుపదు డేర్పరచుకొన్న ఆశలను, ఆతని మనస్సంకల్పాన్నీ పరిశీలిస్తే వీరు దత్తత సంతానం కానేమోననే అభిప్రాయం కలుగుతుంది.

ప్రతి వ్యక్తి తన రక్తం పంచుకుపుట్టే వంశోద్ధారకునికోసమే తాపత్రయ పడతాడు. గత్యంతరం లేని పరిస్థితుల్లో మాత్రమే దత్తపుత్రుని కోసం ప్రయత్నిస్తారు. ద్రుపదుడు పరాభవాగ్నితో కూడిన కసీ, పగతో దహించుకు పోతున్నాడు. రక్తం పంచుకుపుట్టిన బిడ్డ అయితే ఆనువంశిక పరంపరగా వచ్చే క్షాత్రతేజాన్ని నింపుకొని ఉగ్గుపాలనాటినుంచి కనుసన్నలలో తనకు నచ్చిన విధంగా పెంచుకొనేందుకు అవకాశం ఉంటుంది. శత్రు సంహారానికి తగినవాణ్ణిగా తయారు

చేయటానికి వీలుంటుంది. అదే యుక్తవయస్కుడైన వీరుణ్ణి దత్తపుత్రునిగా స్వీకరిస్తే, దత్తత తండ్రివద్దకు వచ్చే సమయానికే లోకజ్ఞానం తెలిసినవాడు కావటంచేత జనక తండ్రితో ఉన్న సంబంధాన్ని పూర్తిగా వదులుకోవటం కుదరదు. శారీరకంగా విద్యుక్త ధర్మంగా మాత్రమే దత్తత తండ్రికి సేవచేసే వీలుంటుంది. కాని జనక తండ్రితో ఉన్న ఆత్మీయత, మానసికానుబంధం వీడదు. ధృష్టద్యుమ్నుని జీవిత గమనాన్ని పరిశీలిస్తే తండ్రి మనోరథాన్ని సంపూర్ణంగా నెరవేర్చినవాడుగా కనిపిస్తాడు.

భారతకథలో చెప్పిన ఆధిదైవిక విధానం కల్పితం అని భావించేటప్పుడు, దానిని త్రోసిపుచ్చి హేతుబద్ధంకాని మరొక కల్పన ఊహించటంకన్న కార్యకారణ బద్ధమైన ఊహచేయటం సమంజసంగా ఉంటుంది. ద్రౌపదీ ధృష్టద్యుమ్నుల జననం ప్రకృతి ధర్మాన్ని అనుసరించి సహజంగానే జరిగి ఉండవచ్చు. ద్రోణునిచే అవమానానికి గురి అయిన ద్రుపదుడు ఉత్తమ సంతానాన్ని ఆశించాడు. అతని ఆశకు అనుగుణంగా భార్య గర్భం ధరించింది. పరాభవ దుఃఖం ఉపశమించేందుకు, గర్భవతి ఐన భార్యకు మానసికాహ్లాదం కలిగేందుకు పుణ్యప్రాంతాలు సందర్శిస్తూ మున్యాశ్రమాలు కూడ దర్శించి ఉంటాడు. ప్రసవ సమయం రాగానే ద్రుపదుని భార్య కవలలను ప్రసవించి ఉంటుంది. వారే ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు, ద్రుపదుడు, తనను పరాభవించిన ద్రోణుణ్ణి వధించగల మేటి వీరునిగా కుమారుణ్ణి తీర్చిదిద్దాడు. ధృష్టద్యుమ్నుడుకూడ తండ్రి ఆశలకు అనుగుణంగా పాండవ సైన్యాధ్యక్షుడై ద్రోణవధకు కారకుడయ్యాడు. ఇదంతా హేతుబద్ధమైన ఊహమాత్రమే. ఆధిదైవికత్వాన్ని అంగీకరించనప్పుడు, దత్తతగా స్వీకరించారనటానికి ఆధారాలు లేనప్పుడు మాత్రమే, ప్రకృతి సిద్ధంగా అందరి శిశువుల్లాగే వీరు కూడ జన్మించి ఉంటారనుకోవటం సమంజసంగా ఉంటుంది.

అయితే సంస్కృతాంధ్ర భారతాలలో యజ్ఞ వేదికనుంచి జన్మించినట్లు చెప్పబడింది కదా! అనే సందేహానికి సమాధానం లేదు. విశ్వాసమే ప్రధానంగా నిలుస్తుంది. సాక్ష్యాలు, ఆధారాలు లేని విశ్వాసాన్ని నమ్మటంకన్నా ప్రకృతి సహజమైన పద్ధతిని అంగీకరించటం సముచితమని భావించటం మంచిది. ఏమైనా ద్రౌపదీ ధృష్టద్యుమ్నులు యౌవనవంతులుగా జన్మించి ఉండలేదనే అంశం అంగీకరించదగి ఉంది. వారిద్దరు యౌవనవంతులుగా జన్మించారని భారతంలో ఉన్న

విషయం అధిదైవిక భావాన్ని సమకూర్చేందుకు చేసిన కల్పనగా తలంచటం సమంజసం. కనుక ద్రుపదుని పరాభవానంతరం ఒక్క సంవత్సరానికి ద్రౌపది జన్మించినట్లు తలంచవచ్చు. అప్పటికి ధర్మరాజు వయసు ఇరవై ఒక్క సంవత్సరాలు అని గ్రహించవచ్చు.

**ద్రౌపదీ స్వయంవరం :** ద్రుపదుడు లబ్ధ సంతానుడై తన అభీష్టానికి అనుగుణంగా ధృష్టద్యుమ్నుణ్ణి ధనుర్వేదపారగుణ్ణి చేశాడు. ద్రౌపది వివాహ వయస్కురాలైంది. కాని అప్పటికి ఆమె వయసు ఎన్ని సంవత్సరాలో సంస్కృతాంధ్ర భారతాల్లో లేదు. అది తెలుసుకోవటానికి వేరే మార్గాలు అన్వేషించటం అవసరం. స్త్రీ పురుషుల వివాహ వయసులను గూర్చి వ్రాసిన శాస్త్రగ్రంథాలు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నాయి. వ్రాసిన శాస్త్రగ్రంథాలలోని అభిప్రాయాల మాట ఎట్లావున్నా, ద్రౌపది వివాహం మాత్రం రజస్వలానంతరమే జరిగినట్లు అంతరంగిక సాక్ష్యాలు సూచిస్తున్నాయి. పెళ్లి ముందుగా నిర్ణయించిన వరుణ్ణికాక ద్రౌపది సమస్త రాజన్యులు కూడిన సభలో స్వతంత్రంగా ఎన్నుకొన్నది. స్వయంవరంలో ఆమె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేక మత్స్యయంత్రాన్ని భేదించిన వీరుణ్ణే వివాహమాడవలసిన నిబంధన ఉన్నా ఆ సమయానికి ద్రౌపది బాలిక కాదనే అంశం మాత్రం స్పష్టం. ద్రౌపది విచక్షణాజ్ఞానంతో వరాన్వేషణలో అన్వితానన్వితాలు ఎఱిగిన యువతిగా కనిపిస్తుంది నన్నయ కర్ణుడు మత్స్యయంత్రాన్ని కొట్టే ప్రయత్నంలో వెంట్రుక వాసిలో గురి తప్పినట్లు చెప్పారు. కాని సంస్కృత భారతంలో కర్ణుడు వీరుడైనప్పటికి సూతకుమారుడవటంచేత మత్స్యయంత్రాన్ని భేదించినప్పటికీ వివాహమాడను—

> "దృష్ట్వాతు తం ద్రౌపదీ వాక్య ముచ్చైర్జగాద నాహం వరయామి సూతమ్" [18]

అని పలికిన ద్రౌపది బాలిక కాదని తెలుస్తుంది ఇంకా స్వయంవరం నాటికి ద్రౌపది సభావేదికను అలంకరించిన యువకుల హృదయాల్ని పరవశింపచేసే సౌందర్య కాంతులతో ప్రకాశిస్తుంది. స్వయంవర రంగం మధ్యకు ధవళ విభూషణ దామాను లేపన అమలినాంగియై ద్రౌపది "పుష్పసాయక కుసుమశరంబైన సౌందర్యజనక" (ఆది. 7-168) జనుల మనసులో కోరిక పుట్టుండగా ప్రవేశించింది. ఆమె ఇంతటి సౌందర్యరాశి కనుకనే స్వయంవర ప్రకటన విన్న రాజులు వారివారి

సామర్థ్యాలనుకూడ గణించక ద్రౌపదిని చేపడదామనే సరంభంతో వచ్చారు. ఈ అంశాలన్నింటినిబట్టి ద్రౌపది యౌవన ప్రాగల్భ్యంతో వర్ధిల్లి ఉన్నట్లు తెలుస్తుంది.

ద్రుపదుడు వివాహప్రాప్త వయసువచ్చిన వెంటనే ద్రౌపది స్వయంవరం ప్రకటించలేదని కూడ భావించవచ్చు. ద్రుపదునకు కుమార్తెను పాండవ మధ్యమున కిచ్చి వివాహం చేయాలనేది చిరకాలం నుంచి ఉన్న సంకల్పం. పాండవులు వారణావతంలోని లాక్షాగృహంలో దగ్ధమయ్యారని విని 'ఆతత శోక మహానల జ్వలనాత్మనను' డయ్యాడు. పరాక్రమోపేతుడైన పాండవ మధ్యమునకు తన కుమార్తెనీయ సంకల్పించగా "విధాతృనకు నిట్లు పాడియె విఘ్నమాపాదింప" (ఆది. 7-24) అని విచారించాడు. అంతటి మహావీరునకు ఇవ్వదలచిన కన్యను ఎట్టు లొరులకు నీనేర్తు' అని దుఃఖపరవశుడయ్యాడు. ద్రుపదుని ఆందోళనను, పరిశీలిస్తే అర్జుననకుకాక ఇతరులకు ఇవ్వరాదనే స్థిర సంకల్పంతో ఉన్నట్లు తెలుస్తుంది. ఆ సంకల్పంతోనే అర్జునాదులు బ్రతికి ఉన్నారేమోననే ఆశతో రెండు మూడు సంవత్సరాలు వేచి ఉండవచ్చు. అనంతరం పురోహితుడు పాండవులు మరణించలేదు, వారు తప్పక స్వయంవరానికి వస్తారని ధైర్యం చెప్పగా కుదుట వడి ద్రౌపదీ స్వయంవరం ప్రకటించి ఉంటాడు. ఇక్కడ మత్స్యయంత్రం భేదించినవాడే ద్రౌపది భర్త అనే పరీక్ష ఉన్నది కదా! ఒకవేళ అర్జునుడు బ్రతికి ఉన్నా మత్స్యయంత్రం భేదిస్తాడనే నమ్మకం ద్రుపదునకు ఎట్లా కలిగింది అనే అనుమానం వేస్తుంది. ఇంతకుముందే అర్జునుని పరాక్రమాన్ని స్వయంగా చవి చూసినవాడు కనుక అతని పరాక్రమంపై అంతులేని విశ్వాసమేనని సమాధానం చెప్పవచ్చు.

స్వయంవరం ప్రకటించబడి అందులో కన్య వరుని ఎన్నుకొనేందుకు రజస్వలానంతరం కనీసం మూడు సంవత్సరాలు వేచి ఉండాలి—

"త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీ సతీ
ఊర్ధ్వంతు కాలాదే తస్మాద్విన్దేత సదృశాంపతిమ్"[19]

అని మనుస్మృతి. అనగా వివాహ వయసు వచ్చిన తరువాత మూడు సంవత్సరాలలో వివాహం కాకపోయినట్లయితే వరుని కోసం స్వయంవరం ప్రకటించవచ్చు అని అర్థమవుతుంది. యువతి పన్నెండు సంవత్సరాల వయసులో రజస్వల అయి

సంతానం పొందేందుకు అన్నాశ సంపాదిస్తుంది. ద్రుపదుడు అర్జునునకే తన కుమార్తెనిచ్చి వివాహం చేయాలనే స్థిర సంకల్పంతో వేచి ఉన్నాడు. ఆ సంకల్పంతోనే మూడు [illegible] సంవత్సరాలు [illegible] అనంతరమే ద్రౌపదికి స్వయంవరం ప్రకటించి ఉండవచ్చు. ద్రుపదుని ఈ [illegible] మనుస్మృతిలో ఉన్న అభిప్రాయంతో కూడ సంవదిస్తుంది. అప్పటికి ద్రౌపదికి కనీసం పద్దెనిమిది సంవత్సరాలుండేందుకు అవకాశం ఉంది. ధర్మరాజు వయసు ముప్పై తొమ్మిది సంవత్సరాలవుతుంది.

వివాహ సమయానికి ద్రౌపదీ ధర్మరాజుల మధ్య ఇరవై ఒక్క సంవత్సరాల వ్యత్యాసం ఉన్నట్లు ద్యోతకమవుతుంది. భార్యాభర్తల మధ్య ఈ వ్యత్యాసం ఈ కాలాన్నిబట్టి చాలా ఎక్కువగా ఉన్నట్లే. కాని ధర్మరాజాదుల వారణావతంలో ప్రాణగండం నుంచి తప్పించుకొని ప్రచ్ఛన్న వేషాల్లో సంచరించిన విధానాన్ని, ఆనాటి కొన్ని సంప్రదాయాలను పరిగణనలోకి తీసుకుంటే ఈ వ్యత్యాసం సమంజసమేనని బోధపడుతుంది. భార్యాభర్తల వయోభేదాన్ని గూర్చి మనుస్మృతి

"త్రింశద్వర్షోద్వహేత్కన్యాం హృద్యాం ద్వాదశ వార్షికీమ్
త్ర్యష్టవర్షోఽష్టవర్షం వా ధర్మే సీదతి సత్వరః" [20]

అని ఉట్టంకిస్తుంది. దీన్నిబట్టి భార్యాభర్తల మధ్య పద్దెనిమిది లేక పదహారు సంవత్సరాల వయోభేదం ఉండవచ్చని, ఇరవై నాలుగు సంవత్సరాలు యువకునకు వివాహానికి తక్కువ వయసేననే రెండు అంశాలు తెలుస్తున్నాయి. మనుస్మృతిని ప్రమాణంగా తీసుకొని విష్ణుపురాణంకూడ వివాహ సమయానికి స్త్రీపురుషుల వయోభేదం ఒకటి మూడు నిష్పత్తిలో ఉండాలి అని తెలుపుతుంది.[21] మహాభారతంలో కూడ యువతీ యువకుల వివాహ వయసులు క్రమంగా పది ముప్పై సంవత్సరాలుగాని ఏడు ఇరవై ఒక్క సంవత్సరాలు గాని ఉండాలనే సూచన ఉంది. ఆను శాసనిక పర్వంలో

"త్రింశద్వర్షో దశవర్షాం భార్యాం విన్దేత నగ్నికామ్
ఏకవింశతి వర్షో వా సప్తవర్షామవాప్నుయాత్" [22]

అని ఉంది. మనుస్మృతి, మహాభారతంలో కూడ స్త్రీపురుష వయోభేదం ఇరవై సంవత్సరాలుగా అంగీకరించబడింది. కనుక ద్రౌపదీ ధర్మరాజుల మధ్య ఉన్న వయోభేదం ప్రశ్నార్థకం కాక సంప్రదాయబద్ధంగానే ఉన్నట్లు భావించవచ్చు.

పై పరిశీలనలో పురుషుని వివాహానికి గరిష్ఠ వయసు ముప్పై సంవత్సరాలని తేలింది. అయితే ద్రౌపదీ వివాహం నాటికి ధర్మరాజుకు ముప్పై తొమ్మిది సంవత్సరాలకు స్థూలమైన పిన్నయానికి రావటం జరిగింది. అప్పటి ప్రమాణాలలో కూడ ఆ వయసు అధికమైందిగానే కనిపిస్తుంది. పాండవులు లాక్షాగృహ ప్రమాదంనుంచి తప్పించుకొన్నప్పుడు ధర్మరాజు వయసు ముప్పై సంవత్సరాలు. అంటే వారణావతం నుంచి బయటపడ్డప్పటి నుంచి, ద్రౌపదీ వివాహ సమయానికి మధ్య తొమ్మిది సంవత్సరాలు జరిగాయన్నమాట. వారు ఈ తొమ్మిది సంవత్సరాలు ప్రచ్ఛన్న వేషాల్లో సంచరించారు.

పాండవులు అంతకాలం ప్రచ్ఛన్నంగా ఉండేందుకు బలవత్తరమైన కారణాలేమైనా ఉన్నాయేమో పరిశీలిస్తే, ధర్మరాజు వివాహం విషయంలో జరిగిన ఆలస్యానికి సమన్వయం కుదరవచ్చు. లాక్షాగృహం నుంచి బయటపడ్డ పాండవులు సుయోధనునివల్ల భయోత్పాతంతో భీతావహులై అరణ్యమార్గాన అతివేగంగా ప్రయాణం సాగించినట్లు తెలుస్తుంది. ఆసమయంలో నిద్రమత్తులో నడవలేక తొట్రుపడుతున్న తల్లిని, సోదరులను ఎత్తుకొని

"......... అక్కజముగ
నరిగెడు రయమునఁ దరులు సొల్పడి మ్రొగ్గ
బద ఘట్టనంబులఁ జడిసి ధాలు
నులుసుగాఁగ నిట్లు నెఱియంగ సత్త్వంబు
మెఱసి రాతిరెల్లను నుఱక పవన
తనయు డరిగెఁ బవలు సనినట్లు చీకటి
యనక ముండ్లు గండ్లు ననక తెరలి" (ఆది. 6-161)

పయనించిన భీముని వేగం, ఆత్రుత శత్రువుపల్ల భయాన్ని వ్యక్తం చేస్తుంది. సంస్కృత భారతంలో కూడ ధర్మజార్జునులు సుయోధనునివల్ల వచ్చే ప్రమాదం గూర్చి భయపడ్డట్లు ఉంది.[23]

పాండవులు సుయోధనుని బారినుంచి తప్పించుకొని అల్పకాలం తలదాచుకొనే ఉద్దేశ్యమే అయితే సమీపారణ్యాలలోనే తలదాచుకొనేవారు. కాని భీముడు తల్లిని, సోదరులను ఎత్తుకొని మరునటి రోజు ప్రొద్దు క్రుంకే వరకు మారుత మార్తాండ మరీచి గోచరం కాని అరణ్యంలో వాయువేగంతో ప్రయాణం సాగించాడు. అరణ్య మధ్యంలో వటవృక్షం నీడ వారంతా సొమ్మసిల్లి నిద్రిస్తుంటే, చింతాక్రాంతుడైన భీమునకు కొంతదూరంలో మానవ సంచార ధ్వని వినిపించగా "నిబిడాంధకార రంధ్రంబులయిన దిశలు సూచియున్నంత జనపథసంబు దవ్వుల వీతెంచిన మందటంబు రంబు గలుగవలయు నిచ్చోట నెపుడి యునికి యుచితంబుగాదు" (ఆది. 6-184) అని ఆందోళన పడ్డాడు.

పాండవులు లోకోత్తర వీరులు కదా అంతటి బలపరాక్రమోపేతులైనవారు సుయోధనుని గూర్చి భయపడటం ఏమిటి? అనే అనుమానం కలగవచ్చు. పాండవులున్న పరిస్థితుల్లో ఎంతటి మహావీరులైనా వారి లాగానే ప్రవర్తించక తప్పదు. సుయోధనుడు ఏ విధంగానైనా తమను మట్టుపెట్టాలనే పట్టుదలతో ఉన్నట్లు వారు నిర్ణయించుకొన్నారు. అర్థబలం, అంగబలం, అధికారబలం ఉన్న శత్రువుపరంగా విక్రమిస్తే లాభం కలగకపోగా నష్టం అమితంగా వాటిల్లుతుంది. కొంతకాలహరణం జరిగితే పట్టుదలలు పంతాలు కొంత సడలవచ్చు. ఈ లోపున ప్రత్యామ్నాయమైన ఆలోచన చేసేందుకు సావకాశం లభిస్తుంది. ఇన్ని విధాలుగా ఆలోచించే పాండవులు ప్రచ్ఛన్న వేషాల్లో జీవితం సాగించేందుకు నిర్ణయం తీసుకొని ఉండవచ్చు. వ్యాసుని వంటి శ్రేయోభిలాషులు కూడ వీరికీవిధంగానే సలహా ఇచ్చారు. ధృతరాష్ట్ర సుయోధనులను నిందిస్తూ వ్యాసుడు "ఒరులెఱుంగకుండఁ గార్యార్థులరై కతిపయ దినంబులుండి యేకచక్రపురంబునకేగి యందు బ్రాహ్మణ భావంబున బ్రాహ్మణ గోష్ఠినుండి నారాక ప్రతీక్షించి యుండునది" (ఆది. 6-231) అని హితవు చెప్తాడు. పాండవులకు రహస్య గోపనం ఎంత ప్రధానమో వ్యాసుని మాటలు ఋజువు చేస్తున్నాయి.

వ్యాసుని హితవు ననుసరించి పాండవులు శాలిహోత్రుని ఆశ్రమంలో ప్రశాంత వాతావరణంలో కొంతకాలం గడిపి మత్స్య, త్రిగర్త కీచక రాజ్యాలలో తలదాచుకొంటూ చివరకు పాంచాలం వెంట ఏకచక్రపురం చేరారు. ద్రౌపదీ స్వయం వరానికి పోయేనాటికి అక్కడ కూడ దీర్ఘకాలమే ఉన్నట్లు

"కడుఁ బెద్దకాలముండితి
మొడఁబడి యుండెంత కాలమున్నను మనక
య్యెడు లాభమేమి మఱియె
ప్పుడు నుచితమె యొరుల యిండ్ల పొత్తుననుండన్"

(ఆది. 7-29)

అన్న కుంతి మాటలు తెలియజేస్తున్నాయి. సుదీర్ఘకాలం జనపదంలో ఉన్నా వారి రహస్యం బయటకు పొక్కలేదు. అందువల్ల ఇంక ఎంతకాలం వారియాపాల్లో ఉన్నా ప్రయోజనం సిద్ధించదని, సుయోధనాదులు తమ ఉనికిని పసిగట్టి ఉంటారని, ఆలోచించి పాండవులు ద్రౌపదీ స్వయంవరానికి ప్రయాణమయ్యారు. స్వయం వరానంతరం పాండవులను గుర్తించిన సుయోధనాదులు వారు జీవించి ఉన్నందుకు ఆశ్చర్యచకితులయ్యారు. వారు మరణించి ఉంటారని విశ్వసించటమే ఈ ఆశ్చ ర్యానికి కారణం. సుయోధనాదుల ప్రవర్తన కూడ దీర్ఘకాలం గూఢవృత్తితో సంచరించాలని నిర్ణయించిన పాండవుల ఆలోచనను బలపరుస్తుంది.

ఈ అంశాలన్నింటిని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే వారణావతంలో గండం గడిచి బయటపడ్డ పాండవులు ద్రౌపదీ వివాహానికి ముందు సుమారు తొమ్మిది సంవత్సరాలు అరణ్యాలలో, జనపదాల్లో అజ్ఞాతంగా జీవించారనటం సముచితంగా ఉంటుంది. ఈ మధ్యకాలంలో వారు ఎక్కడెక్కడ ఎన్నెన్నిరోజు లున్నారో భారతంలో లేకపోవటంవల్ల ఇంత వివరణ అవసరమైంది. ఈ సమ న్వయం కొంతవరకు కార్యకారణ సంబంధం కలిగి ఉన్నది. కనుక ద్రౌపదీ వివాహ సమయానికి ధర్మరాజు ముప్పై తొమ్మిది సంవత్సరాల వయసువాడని భావించేందుకు ప్రతిబంధకాలు తొలగినట్లే. అప్పటికి ధృతరాష్ట్రునకు డెబ్బైనాలుగు సంవత్సరాలు, భీష్మునకు నూటముప్పైఆరు సంవత్సరాలుంటాయి.

**ధర్మరాజు పట్టాభిషేకం :** ద్రౌపదీ వివాహానంతరం పాండవులు ద్రుపదుపురంలో "అఖిలరాజ్య విభవ సమన్వితులయి యొక్క సంవత్సరం" (ఆది. 8-9) ఉన్నారు. వారి వైభవానికి సంతోషించిన భీష్మద్రోణాదులు పాండవులను సగౌరవంగా హస్తినాపురానికి పిలిపించి తగిన విధంగా సంభావించ మని ధృతరాష్ట్రునకు సలహా ఇచ్చారు. ధృతరాష్ట్రుడు పెద్దల మనోభీష్టాన్ని

శిరసావహించి పాండవులను వెంటబెట్టుకొని వచ్చేందుకు విదురుణ్ణి పంపాడు. విదురప్రేరితులై పాండవులు కుంతిని ద్రౌపదిని తోడుకొని హస్తినాపురం వస్తారు. అక్కడవారు పెద్దలను కొలుస్తూ, సమస్తజనుల అనురాగానికి పాత్రులై "దుర్యోధనాదులతోఁ గలసి యెప్పటియట్ల రాజ్య వినోదంబుల నేను సంవత్సరంబులు" (ఆది. 8-64) గడిపారు. అనంతరం ధృతరాష్ట్రుడు భీష్మ, విదుర, ద్రోణ సుయోధనాదుల సమక్షంలో ధర్మరాజును ఇంద్రప్రస్థం రాజధానిగా కురుసామ్రాజ్యార్ధ భాగానికి అధిపతిని చేసి అభిషేకించాడు. ఇంద్రప్రస్థంలో స్వతంత్ర రాజ్యాధిపతి అయ్యేనాటికి ధర్మరాజు వయసు నలభై ఐదు సంవత్సరాలని గ్రహించవచ్చు. అప్పటికి ధృతరాష్ట్రునకు ఎనభై సంవత్సరాలు, భీష్మునకు నూటనలభై రెండు సంవత్సరాలుంటాయి.

ఇంద్రప్రస్థంలో సుస్థిర ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి, దిగ్విజయంచేసి రాజసూయ యాగాన్ని నిర్విఘ్నంగా నిర్వహించి ధర్మరాజు ఇరవై మూడు సంవత్సరాలు ప్రజానురంజకంగా రాజ్యపాలన చేశాడు. ఈ విషయాన్ని నన్నయ "ఇట్లింద్రప్రస్థపురంబున నిరువది మూఁడేఁడుల రాజ్యంబు సేసి పాండవులు పావద్యూత పరాజితులయి" (సభా. 2-311) అరణ్యవాసానికి పోయినట్లు చెప్పాడు. కనుక అరణ్యవాస ప్రారంభంనాటికి ధర్మరాజు వయసు అరవై ఎనిమిది సంవత్సరాలు, ధృతరాష్ట్రునకు నూటమూడు సంవత్సరాలు. భీష్మునకు నూటఅరవై ఐదు సంవత్సరాలని తెలుస్తుంది.

**కురుక్షేత్ర సంగ్రామం :** ద్యూత సమయానుగుణంగా పాండవులు అరణ్య అజ్ఞాతవాసాలు పదమూడేండ్లు పూర్తి చేస్తారు. రాజ్యభాగం విషయంలో సంధి కుదరక కురుక్షేత్ర సంగ్రామం అనివార్యమైంది. అజ్ఞాతవాసం పూర్తయ్యే సమయంలో ఉత్తరాభిమన్యుల వివాహం జరిగింది. యుద్ధ ప్రారంభంనాటికి ఉత్తర గర్భవతి అని తెలుస్తుంది. అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రంతో పాండవేయరాగ పాత్ర గర్భాలకు హాని కావిస్తానని ప్రతిజ్ఞ చేసినప్పుడు కృష్ణుడు ఉత్తర గర్భాన్ని కాపాడతానని శపథం చేస్తాడు. అయితే ఉత్తర ఎన్నిమాసాల గర్భవతో ఆ సందర్భంలో చెప్పలేదు. ఖచ్చితంగా తెలుసుకోవటానికి స్త్రీ పర్వంలోనే మరొక ఆధారం ఉంది. పొలికలనిలో అభిమన్యుని కళేబరాన్ని చూసి ఉత్తర తమ సాంగత్యాన్ని స్మరిస్తూ

"నిన్నొందగాంచి, యాఱునెలలువోయెనంతయు, యింతియు
కాని లేదె తొంటిమేనఁజేసి, నట్టిమేలు..." (స్త్రీ. 2-82)

అని విలపించింది. అంటే అభిమన్యుని మరణం నాటికి వారి వివాహమై, అజ్ఞాత వాసం పూర్తియై ఆరుమాసాలు పైనే అయినట్లు తెలుస్తుంది. అందువల్ల భారత యుద్ధంనాటికి ధర్మరాజుకు ఎనభై రెండు సంవత్సరాలుంటాయని తలంచవచ్చు. ధృత రాష్ట్రునకు నూటపదిహేడు సంవత్సరాలని లెక్కించవచ్చు. కురుక్షేత్రంలో యుద్ధం పరిసమాప్తమైన కొద్ది కాలానికే భీష్ముడు మరణించాడు. మరణించే సమయానికి భీష్మునకు నూటడెబ్భై తొమ్మిది సంవత్సరాలుంటాయని భావించవచ్చు. తన జీవితకాలంలో కురువంశంలోని ఐదుతరాల కురువీరుల పరాక్రమాన్ని కళ్లారా చూసిన వ్యక్తి కావటంచేత కురువృద్ధుడైన భీష్ముడు నూటడెబ్భై తొమ్మిది సంవత్స రాలు జీవించటం అతిశయోక్తిగా భావించవలసినవం లేదు.

**ధృతరాష్ట్రుని మరణం :** కురుక్షేత్రంలో విజయం సాధించిన ధర్మరాజు హస్తినాపురంలో పట్టాభిషిక్తుడయ్యాడు. పుత్రులనందరను కోల్పోయిన ధృతరాష్ట్రుడు ధర్మరాజు ఆశ్రయంలో జీవితం గడపసాగాడు. కాలం ఇట్లా జరుగుతుండగా ధర్మరాజు పాలనలో 'పంచదశవత్సరంబులు' గడిచాయి. పుత్ర శోక దుఃఖంతో కృగ్గుతూఉన్న ధృతరాష్ట్రునకు భీముని మాటలు పుండుమీద కారం చల్లినట్లుగా జీవితాశను నశింపచేశాయి. ఐహిక జీవితంపై విరక్తిచెంది తపస్సుచేసు కొనేందుకు అరణ్యానికి పోవ నిశ్చయించాడు. అప్పటికి ధృతరాష్ట్రుని వయసు నూటముప్పైరెండు సంవత్సరాలని తెలుస్తుంది.

తపోవనానికి బయలుదేరిన ధృతరాష్ట్రుడు శతయూపుని ఆశ్రమంలో గాంధారీ సహితుడై ప్రశాంతమయ జీవితం గడపసాగాడు. ఆ సమయంలో మునుల సమూహంతో నారదుడు ఆ తపోవనానికి వచ్చిన సందర్భంలో శతయూపుడు కురురాజైన ధృతరాష్ట్రుడు ఎప్పుడు సుగతిని పొందుతాడని ప్రశ్నిస్తాడు. అందుకు సమాధానంగా నారదుడు ఇంద్రసభలో జరిగిన విషయాన్ని ప్రస్తావిస్తూ

తపము మూఁడేడు లోనరించి తాను సతియు
దేహముల్విడ్చి చని ధనాధీశు చెలిమి, నతిశయిల్లు"

(ఆశ్రమ. 2-9)

అని ఉట్టంకిస్తాడు. దీన్నిబట్టి ఆశ్రమ ప్రవేశం తరువాత మూడు సంవత్సరాలకు ధృతరాష్ట్రుడు దేహత్యాగం చేసినట్లు తెలుసుకోవచ్చు. జీవన్ముక్తుడయ్యేనాటికి ధృతరాష్ట్రునకు నూటముప్పై ఐదు సంవత్సరాలని భావించటం సముచితంగా ఉంటుంది.

సంస్కృతాంధ్ర భారతాల్లో సూచించిన కొన్ని అంతరంగిక సాక్ష్యాలనను సరించి ధృతరాష్ట్రుని జీవిత పరిమాణం నూటముప్పైఐదు సంవత్సరాలుగా భావించ టం జరిగింది. భారతకథలో కొన్ని ప్రధానఘట్టాలు జరిగే సమయానికి ధృత రాష్ట్రుని వయసు వివరాలు ఇట్లా క్రోడీకరించవచ్చు.

సుయోధనుడు జన్మించేనాటికి ధృతరాష్ట్రుని వయసు ముప్పైఆరు సంవత్సరాలు.

ధర్మరాజాదులు శతశృంగం నుంచి హస్తినాపురం వచ్చేనాటికి యాభై ఒక్క సంవత్సరాలు.

పాండవులు వారణావతం పోయేనాటికి అరవై నాలుగు సంవత్సరాలు. ద్రౌపదీ వివాహసమయానికి డెబ్బైనాలుగు సంవత్సరాలు. ధర్మరాజు ఇంద్రప్రస్థంలో పట్టాభిషిక్తుడయ్యేనాటికి ఎనభై సంవత్సరాలు.

ద్యూతంలో ఓడి ధర్మరాజు అరణ్యవాసం పోయేనాటికి నూటమూడు సంవత్సరాలు.

కురుక్షేత్ర యుద్ధం సమాప్తమయ్యేనాటికి నూటపదిహేడు సంవత్సరాలు. ధృతరాష్ట్రుడు తపోవనానికి ప్రయాణమయ్యే నాటికి నూటముప్పైరెండు సంవత్సరాలు.

ప్రాయోపవేశంనాటికి ధృతరాష్ట్రుని వయసు నూటముప్పైఐదు సంవత్స రాలు.

ఒక వ్యక్తి జీవిత పరిమాణం నూటముప్పైఐదు సంవత్సరాలు ఉండటం సంభావ్యమా ? అనే అనుమానం ఉదయించవచ్చు. ఆధునిక వయఃపరిమాణాన్ని పరిశీలించి చూసినా పాశ్చాత్యదేశాల్లోను, మనదేశంలోకూడ నూటఇరవై సంవత్స రాలు పైబడ్డవారు కనిపిస్తున్నారు. అటువంటప్పుడు ధృతరాష్ట్రుడు నూటముప్పై ఐదు సంవత్సరాలు జీవించి ఉండటం అతిశయోక్తి, అసంభవమూ, అసాధ్యమూ

కాదని విశ్వసించవచ్చు. సంస్కృతాంధ్ర గ్రంథాలలో ధృతరాష్ట్రుని వయః పరిమాణం స్పష్టంగా వివరించలేదు కనుక లభించిన ఆధారాలకు కార్యకారణ సంబంధం సమకూర్చి పూర్వాపర విరుద్ధం కాకుండ ఊహించేందుకు ఇది ఒక ప్రయత్నం మాత్రమే. ఇతర ఆధారాలేమైనా లభించి ధృతరాష్ట్రుని వయఃపరిమాణం విషయంలో వేరే అభిప్రాయాలేమైనా ఏర్పడేవరకు, అతడి వయసు విషయంలో ఈ సమన్వయమే సమంజసమైందిగా స్వీకరించవచ్చు.

**అథస్సూచికలు :**

1. ఇరావతీకార్వే, యుగాంత; పు. 17, 18.
2. సం. మ. భా, ఆది. సంభవ. వ: 100 అ - 20 శ్లో.
3. కొర్లపాటి శ్రీరామమూర్తి, శ్రీనాథుడు: పు. 77, 78.
4. Moniar Moniar Williams, Sanskrit English Dictionary; P. 151.
5. శ్రీనాధుడు, కాశీఖండం: 1 - 7.
6. కందుకూరు వీరేశలింగం, ఆంధ్రకవుల చరిత్రము: ప్ర. భా. పు. 443.
7. చాగంటి శేషయ్య, ఆంధ్రకవి తరంగిణి: 5వ సం. పు. 14.
8. పైది, మూడు: పు. 104.
9. పైది, రెండు: 102 అ - 70, 71 శ్లో.
10. ములుకుట్ల నరసింహావధాని పాకయాజి, మహాభారత సారోద్ధారము, పు. 221, 223, 253, 269, 287.
11. మనవూరు కోదండరామిరెడ్డి, సప్తపర్వము (సాహిత్య ఎకాడమీ) పీఠిక: పు. 20 - 22.
12. పైది, రెండు: 139 అ - 1 శ్లో.
13. పైది, రెండు: ఆది. సంభ. వ: 135 అ - 1 శ్లో.
14. పైది, పది: పుటలు. 297 - 303.
15. పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, మహాభారత చరిత్రము: పు. 109.

16. పైది: పుటలు. 213, 214.

17. శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి, మహాభారత రహస్యము: పు. 580.

18. పైది, రెండు, ద్రౌపదీ స్వయంవరపర్వం: 178 అ - 23.

19. మనుస్మృతి IX - 90.

20. పైది: X - 94.

21. విష్ణు పురాణం, III. 10 - 16.

22. పైది, రెండు: అను. 44 అ - 13.

23. పైది, రెండు, జతుగృహ. ప: 154 అ - 35 శ్లో.

# 2.0 ధృతరాష్ట్రుని రాజకీయ జీవితం

## 2.1 రాజ్యాధిపత్యం

పూర్వప్రకరణంలో ధృతరాష్ట్రుని వ్యక్తిగత జీవితానికి సంబంధించిన కొన్ని అంశాలు పరిశీలించటం జరిగింది. ఈ ప్రకరణంలో ఆ మహారాజు రాజకీయ జీవిత పరిశీలనలో కురుసామ్రాజ్యాధిపత్య నిర్ణయానికి సంబంధించిన సమీక్ష ప్రాధాన్యం వహిస్తుంది. మహాభారతంలో ధృతరాష్ట్రుని జీవితంలోని మిగతా అంశాలకన్నా రాజ్యాధికార విషయమే పెక్కుమంది పండిత విమర్శకుల దృష్టిని ఆకర్షించింది. ఈ అంశం ఎంతో వివాదగ్రస్తమై అనేక వాదోపవాదాలకు తావల మైంది.

కురుసామ్రాజ్యాధికార విషయం వివాదగ్రస్తం కావటానికి, ఈ విషయం సంస్కృతాంధ్ర భారతాలలో వేరువేరుగా కన్పించటమే ప్రధాన కారణం కావచ్చు. సంస్కృత భారతం పాండురాజు రాజ్యాధికారాన్ని స్థాపిస్తుంటే, నన్నయ ధృత రాష్ట్రుణ్ణి కురుసామ్రాజ్యాధిపతిగా పేర్కొన్నారు. ఈ భిన్నత్వాన్ని దృష్టిలో ఉంచుకొని ఈ అంశంలో పండితులు మూడు వర్గాలై తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు. వీరిలో కొందరు సంస్కృత భారతాన్ని అనుసరించి పాండురాజు అధి కారాన్ని ప్రతిష్ఠాపించే ప్రయత్నం చేశారు. మరికొందరు ఆంధ్రమహాభారతాన్ని, సంస్కృత భారతంలోని ఇతర అంశాలను దృష్టిలో ఉంచుకొని ధృతరాష్ట్రుని ఆధి పత్యాన్ని సమర్థించారు. ఇంకా కొందరు మధ్యేమార్గీయులు పాండురాజు మర ణించేవరకు ఉమ్మడి అధికారమే సాగి, అనంతరం ధృతరాష్ట్రుని అధికారం స్థిర పడిందని అభిప్రాయపడ్డారు. ఈ మూడువర్గాల పండితుల అభిప్రాయాలను దృష్టిలో ఉంచుకొని, గ్రంథస్థాధారాలను సమీకరించి కురుసామ్రాజ్యాధిపత్యాన్ని సమీక్షించటం ప్రస్తుతాంశం.

వనప్పాకం అనంతాచార్యులు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి మొదలైన పండితులు పాండురాజు అధికారాన్ని సమర్థించగా, కాశీభట్ల బ్రహ్మయ్య. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, వి. ఎస్. రాఘవన్, దివాకర్ల వెంకటావధాని వంటి పండితులు ధృతరాష్ట్రుని

అధికారాన్ని ప్రతిష్ఠాపించారు. పార్నంది రామశాస్త్రి వంటి ఒకరిద్దరు మధ్యే మార్గాన్ని అనుసరించి ధృతరాష్ట్రి పాండురాజుల ఉమ్మడి అధికారాన్ని సమర్థించే ప్రయత్నం చేశారు. ఈ పండితులంతా తమ వాదాలకు ఉపబలకంగా, ఆధారంగా తీసుకొన్న అంశాలు ఒకటే అయినప్పటికీ వాటిని స్వీయ దృక్పధంతో పరిశీలనచేసి తమకు అనుకూలమైన అభిప్రాయాన్ని వ్యక్తీకరించేందుకు ఉపయోగించుకొన్నారు. ఈ అంశంలో ఎవరు పరిశీలనచేసినా లభించే ప్రత్యక్షాధారం సంస్కృతాంధ్రభారతాలేననే విషయం విస్మరించరాదు.

ఈ పండితుల అభిప్రాయాలను క్రోడీకరించే ముందు అసలు మహాభారతంలో ఏముందో తెలుసుకోవటం అవసరం. ఆంధ్రమహాభారతంలో నన్నయ "ఇట్లు బ్రహ్మోత్తరంబుగా బ్రజావృద్ధియు సస్యసమృద్ధియు నగుచుండ నాంబికేయు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుంజేసి భీష్ముండు"(ఆది.5-5) అని స్పష్టంగా ధృతరాష్ట్రుని అధికారాన్ని వివరించారు. కాని నన్నయగారే కొన్నిచోట్ల పాండురాజును 'కురుప్రభుడు', 'కౌరవ్య వంశప్రభు', మొదలైన విశేషణాలతో సంభావించి పాండురాజే రాజ్యాధిపతి అయ్యాడనే అనుమానానికి అవకాశం కల్పించారు. సంస్కృత భారతంలో పాండురాజు రాజయ్యాడనే అంశం

"ధృతరాష్ట్రిస్త్వ చక్షుష్ట్వాత్ రాజ్యం న ప్రత్యపద్యత
పారసవత్వాద్విదురో రాజ పాండుర్బభూవ"[1]

అని స్పష్టంగా ఉంది. ఇందులో కూడ ధృతరాష్ట్రిని గూర్చి 'మహీపతి' మొదలైన విశేషణాలు ప్రయోగించబడి పాండురాజు అధికారాన్నికూడ సందిగ్ధంలో పడవేశాయి. ఈ విధంగా సంస్కృతాంధ్ర భారతాలు రెండుకూడ కురురాజ్యాధిపత్య నిర్ణయంలో నిర్దిష్ట ప్రతిపాదనలు చేసినప్పటికీ, స్థలాంతరంలోని కొన్ని అంశాలు పరిశీలకులను అనుమానానికి గురి చేశాయి. అందువల్లే ఈ విషయంలో ఇందరు పండితులు సమగ్ర పరిశోధనలు జరిపినప్పటికీ ఏకాభిప్రాయసాధన సాధ్యం కాలేదు.

ముందుగా ఈ పరిశోధకుల అభిప్రాయాలు పరిశీలిస్తూ: అనంతరం కురు రాజ్యాధిపత్యం విషయంలో ఒక నిర్ణయం చేయటం సముచితంగా ఉంటుంది. వనప్పాకం అనంతాచార్యులు వైజయంతి పత్రికలో పాండురాజు రాజ్యాధికారాన్ని సాపించేందుకు ప్రయత్నించారు. వీరి వ్యాసంలోని అంశాలను పూర్వపక్షంచేస్తూ

ధృతరాష్ట్రుని రాజ్యాధికారాన్ని స్థాపిస్తూ కాశీభట్ల బ్రహ్మయ్య 'కురుపాండవ దాయ భాగ నిర్ణయము' అనే గ్రంథం రచించి అందులో అనంతాచార్యులవారి వ్యాసంలోని అంశాలను పేర్కొన్నారు. అంతేకాని ఆ వ్యాసం లభ్యం కాలేదు. బ్రహ్మయ్యగారి అభిప్రాయాన్ని ఖండిస్తూ అనంతాచార్యుల వారిని సమర్థిస్తూ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 'కురుపాండవ దాయభాగ విమర్శనము' అనే గ్రంథం రచించారు. మొత్తంమీద కురుసామ్రాజ్యాధిపత్యం నిర్ణయం విషయంలో మొట్టమొదట చర్చను లేవనెత్తినవారు అనంతాచార్యుల వారేనని అనిపిస్తుంది. అయితే ఈ ముగ్గురు పండితులు ధృతరాష్ట్ర పాండురాజుల జననం ప్రధానంగా చేసుకొని నియోగ ధర్మాన్ని ఆచరించిన విషయాన్ని సునిశ్చితంగా చర్చించి రాజ్యాధికారం నిర్ణయించే ప్రయత్నం చేశారు. కాని ధృతరాష్ట్ర పాండురాజులు నియోగధర్మాన్ని అనుసరించి కాక విచిత్రవీర్యునకు ఔరస పుత్రులుగానే జన్మించి ఉంటారని పూర్వప్రకరణంలో భావించటం జరిగింది కనుక రాజ్యాధికార నిర్ణయం విషయంలో ఈ ముగ్గురి అభిప్రాయాలు పరిమితంగానే ఉపయోగిస్తాయి.

వీరి వాదనలు ప్రధానంగా ధృతరాష్ట్ర పాండురాజులకు జన్మతః సంభవిల్లిన శారీరక లోపాలను ఆధారం చేసుకొని సాగాయి. ధృతరాష్ట్రుడు జాత్యంధుడని, పాండురాజు పాండువర్ణంతో జన్మించాడని మహాభారతంలో చెప్పబడింది రాజ్యాధికారానికి అనర్హతలను ఉట్టంకిస్తూ యాజ్ఞవల్క్యుడు

"క్లీబోంధ పతిత స్తజ్జః పంగురున్మత్తకో జడః
అంధోఽచికిత్స్య రోగాద్యా భర్తవ్యాస్తేర్నిరంశకాః"[2]

అని నపుంసకులు, పతితులు, అంధులు మొదలైనవారు రాజ్యానర్హులని నుడివాడు. ధృతరాష్ట్ర పాండురాజులలో ధృతరాష్ట్రుడు అగ్రజుడైకూడ జాత్యంధుడు కావటంతో రాజ్యార్హత కోల్పోయాడని అనంతాచార్యులు అభిప్రాయపడ్డారు. ఆంధ్ర మహాభారతంలో నన్నయ ధృతరాష్ట్రుణ్ణి రాజని చెప్పి తిక్కన ఎఱ్ఱనలను కూడ తప్పుత్రోవ పట్టించారని విమర్శించారు. అనంతాచార్యుల వారి అభిప్రాయాన్ని పూర్వం పక్షంచేస్తూ కాశీభట్ల బ్రహ్మయ్య అంధత్వం కారణంగా ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి కాకపోయినట్లయితే, పాండుత్వంవల్ల పాండురాజుకూడ అర్హుడుకాడని అభిప్రాయపడ్డారు. పాండురాజు పాండుత్వాన్ని బ్రహ్మయ్య కుష్ఠుగా భావించారు.

అయితే శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి పాండువర్ణం పాండురోగం కాదని 'హరిణః పాండురః పాండుః" అని అమరాన్ని ఉదాహరణగా చూపి "తెలుపుపచ్చ కలిసిన వర్ణము పాండువందురు. ఈ వర్ణము తరచుగా పారశీక దేశస్థుల శరీరములం జూడ నగును. ఇట్టి రంగు మేనికి చక్కదనము తెచ్చును. ఇది కుష్ఠు కాదు" [4] అని చెప్పి అనంతాచార్యుల వారి అభిప్రాయాన్ని బలపరచారు. శిష్టా సూర్యనారాయణ శాస్త్రి జాత్యంధునిలాగే వివర్ణుడు కూడ రాజ్యార్హుడు కాడ. కాని అభావములో ఉత్తముడగుటవల్ల పాండురాజు రాజ్యాభిషేకానికి అర్హుడయ్యాడనే అభిప్రాయం వెలిబుచ్చారు. [5] వీరి అభిప్రాయంలో పాండురాజుకు రాజ్యార్హత లేదంటూనే అభిషేకం చేశారని చెప్పినట్లయింది. అభావంలో ఉత్తమము, అధమము అననేమో పరిశీలించవలసిన అంశం. అర్హతలేనప్పుడు అభిషేకించటం ఎట్లా సాధ్యమో ఆలోచించవలసిన విషయం.

వంశంలో జ్యేష్ఠ కుమారునకున్న ప్రాధాన్యాన్ని మనుస్మృతి వక్కాణిస్తూ

"జ్యేష్ఠః కులం వర్ధయతి వినాశయతివా పునః
జ్యేష్ఠః పూజ్యతమో లోకే జ్యేష్ఠః సద్భిర గర్హితః" [6]

అని వంశం వర్ధిల్లటానికి గాని, వినాశనానికి గాని అతడే ప్రధాన బాధ్యత వహిస్తాడని వివరించింది. దీన్నిబట్టి వంశ క్రమానుగతంగా ధృతరాష్ట్రుడే కురుసామ్రాజ్యాధిపతి కావటం సహజ పరిణామం. మహాభారతంలో కొన్ని సందర్భాల్లో ధృతరాష్ట్ర సుయోధనుల మాటలు, కురు సామ్రాజ్యంలో పాండురాజు ప్రాధాన్యం ధర్మరాజు యౌవరాజ్యాభిషేకం అర్ధరాజ్య ప్రదానం మున్నగు అంశాలు సమస్యను జటిలం చేసినట్లు కనిపిస్తుంది. మహాభారతంలో మొత్తం మీద అగ్రనందనులే రాజ్యాధిపత్యం వహించినప్పటికీ, కొన్ని సందర్భాల్లో చిన్నవారు రాజుకావటం కనిపిస్తుంది. అట్లాంటి వాటిని సమర్థించటానికు అవాంతరగాథలు కల్పించుకోవలసి వచ్చింది.

యయాతి మహారాజు అగ్రనందనుడైన యదువుకు పట్టాభిషేకం చేయకుండ చిన్నవాడైన పూరునకు రాజ్యం కట్టబెట్టే ప్రయత్నం చేసినప్పుడు అందులోని సామంజస్యాన్ని ప్రజలు ప్రశ్నించారు. వారు అట్లా ప్రశ్నించటం వారసత్వాధికార విషయంలో అగ్రనందనుని ప్రాధాన్యాన్ని వివరిస్తుంది. ఈ కార్యాన్ని సమర్థించేం

దుకు శుక్రుని శాపం మొదలైన కథంతా కల్పించవలసి వచ్చింది. ఈ అంశాన్ని రొమిల్లా థాపర్ "Puru inherits the MadhyaDesa from his father and this is contrary to primogeniture, a Myth is invented to explain how this happened"[7] అని వివరించి రాజ్యాధికారంలో జ్యేష్ఠుని ప్రాధాన్యాన్ని వ్యక్తీకరించారు.

అట్లానే ప్రతీప మహారాజుకు దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అనే ముగ్గురు కుమారులుండగా, అగ్రజుడైన దేవాపి బాల్యంలోనే తపోవనానికి పోయి రాజ్యంమీద స్వామ్యం వదలుకొన్న తరువాతకాని శంతనుడు రాజుకాలేకపోయాడు. దాశరాజు శంతనునకు సత్యవతిని వివాహం చేసే సందర్భంలో ఈ అధికారంపైనే ఒత్తిడి చేశాడు. వంశక్రమానుగతంగా జ్యేష్ఠునకు రాజ్యం రావటం సహజ పరిణామం కనుకనే, భీష్ముడు అధికారం వదలుకొన్నప్పటికీ దాశరాజు తృప్తి చెందలేదు. తండ్రిఎడ గౌరవంతో భీష్ముడు అధికారాన్ని త్యాగం చేసినా, అనంతరం అతడి కుమారులు అధికారంకోసం పట్టుపడతారేమోనని సందేహం వెలిబుచ్చటం రాజ్యాధికారం అగ్రనందనుని వంశంలోనే సుస్థాపితమైన అంశాన్ని తెలియచేస్తుంది. చివరకు భీష్ముడు వివాహమే పరిత్యజించి జీవితాన్ని తండ్రికోసం త్యాగం చేసిం తరువాతనే సత్యవతీ శంతనుల వివాహానికి దాశరాజు అంగీకరించాడు. భీష్ముడు త్యాగం చేయటంవల్లనే శంతనుని తర్వాత చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు కురు సామ్రాజ్యాన్ని అధిష్ఠించగలిగారు. ఈ అంశాలు మహాభారతంలో కురువంశంలో వారసత్వాధికారం జ్యేష్ఠునకు సహజ పరిణామంగానే సంక్రమిస్తుందని తెలియచేస్తున్నాయి. వీటిని పరిశీలించిన ఇరావతీకార్వే "In the Mahabharata It is shown Unmistakebly that succession to Kingship and inheritance of the ancestral kingdom were always the Privileges of the eldest son"[8] అని మహాభారత కాలంలో వారసత్వాధికారం జేష్ఠునకు సహజమైన హక్కు అని భావించారు.

శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య సంస్కృత భారతంలో ధృతరాష్ట్ర పాండు విదురులను సంభావించిన శ్లోకాలను ఉట్టంకించి ధృతరాష్ట్రుని రాజ్యాధికారాన్ని బలపరచారు. ధృతరాష్ట్ర పాండురాజుల వర్ణనాన్ని వివరిస్తూ

**"పాండుర్ధనుషి విక్రాంతో నరేష్వభ్యధికోఽభవత్**
**అన్యేభ్యో బలవానాశీద్ధృతరాష్ట్రో మహీపతిః"** [9]

అని ధృతరాష్ట్రుడు మహీపతిగా పేర్కొనబడ్డాడు. భండార్కర్ ప్రతిలో 'మహీపతి'కి, 'మహామతి' అనే పాఠాంతరం కనిపిస్తుంది. మహీపతి, నరాధిప, రాజసత్తమ, కౌరవోరాజా, మహారాజ, మొదలైన విశేషణాలు పాండురాజు ఎడ కూడ ప్రయోగించిన అంశాలను శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి చూపారు. నన్నయ కూడ పాండురాజు పరంగా కురుప్రభుడు, కౌరవ్యవంశప్రభువు, అనే విశేషణాలు ప్రయోగించాడు. అంతేకాక భీష్మ దుశ్శాసనాది కురునాయకులను కూడ ఇట్లాంటి విశేషణాలతో సంభావించిన తీరు కనిపిస్తుంది. అందువల్ల కురురాజ్యాధిపత్యం స్థాపించే అంశంలో ఈ విశేషణాలు ప్రధాన ఆధారంగా స్వీకరించటం వీలుకాదు.

ధృతరాష్ట్రునకు గాంధారితో అయిన వివాహం ఆ మహారాజు రాజ్యాధికారాన్ని ప్రతిపాదించేదిగా ఉంది. గాంధారీధృతరాష్ట్రుల వివాహం చేయాలనే సంకల్పంతో భీష్ముడు వర్తమానం పంపినప్పుడు సుబలుడు ధృతరాష్ట్రుని యోగ్యతను ప్రశంసిస్తూ "కురుకుల విస్తారకుండయిన ధృతరాష్ట్రుండు యిక్కన్యకకు నర్హుండు గావున నారాజునకు గాంధారి నిచ్చితి" (ఆది. 5-10) అని వివాహానికి అంగీకారం తెలిపాడు సంస్కృత భారతంలో కురుకుల విస్తారకుడనే పదం ప్రయోగించలేదుకాని, ధృతరాష్ట్రుని కులము, ఖ్యాతి, బుద్ధి దృష్టిలో ఎంచుకొని కుమార్తె నిచ్చేందుకు అంగీకరించినట్లు కనిపిస్తుంది. వంశ ప్రతిష్ఠను దృష్టిలో ఉంచుకొని అంధునకు కుమార్తె నిచ్చేందుకు ప్రయత్నించాడంటే ఆ మహారాజువల్ల కురువంశఖ్యాతి విస్తరిల్లుతుందని అతడి అభిప్రాయం కావచ్చు. ఈ అభిప్రాయాన్నే స్వీకరించి నన్నయ 'కురుకుల విస్తారకుడు' అని సంభావించి ధృతరాష్ట్రునివల్ల వంశ ప్రతిష్ఠాపకులైన కుమారులు ఉద్భవిస్తారని వ్రాక్కుచ్చాడు. అంటే వారసత్వాధికారం ధృతరాష్ట్రుని సంతానానిదేననే అభిప్రాయం సుబలునకు ఉండి ఉండవచ్చు. అట్లా కాకున్నట్లయితే రాజ్యాధికారం లేని జాత్యంధునకు, గాంధారరాజు తన కుమార్తె నిచ్చేందుకు అంగీకరించడు. అంధుడని కొంత తటపటాయించినా కురుసామ్రాజ్యాధిపతి కనుక అతడి బుద్ధిశీలాలతో సరిపెట్టుకొని గాంధారి నిచ్చేందుకు అంగీకారం తెలిపాడు.

ధృతరాష్ట్రుడే రాజై పాండురాజు సోదరుని పక్షాన పరిపాలన చేస్తూ దిగ్విజయం చేసి సాధించిన ధనాన్ని ధృతరాష్ట్రుని ఇష్టానుసారం వెచ్చించినట్లు తెలుగు భారతంలో ఉంది. సంస్కృత భారతంలో కూడ

"ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతః స్వబాహు విజితం ధనం
భీష్మాయ సత్యవత్యైచ మాత్రే చోపజహారసః ॥
విదురాయచవై పాండుః ప్రేషయామాస తద్ధనమ్
సహృదశ్చాపి ధర్మాత్మాధనేన సమతర్పయత్"॥ [10]

అని పాండురాజు ధృతరాష్ట్రుని ఆజ్ఞపైనే వ్యవహరించినట్లు ఉంది. పాండురాజే రాజైనట్లయితే తాను తెచ్చిన ధనాన్ని ధృతరాష్ట్రుని ఆధీనంలో ఉంచవలసిన అవసరం లేదనీ, ఒకవేళ పెద్దవాడనే కారణంతో అనుజ్ఞ తీసుకొన్నట్లయితే భీష్మాదులంతకన్నా పెద్దవారు, విశేషించి పెంచి పెద్దచేసినవారు, కనుక పాండు రాజు ధృతరాష్ట్రుని అనుజ్ఞ తీసుకునే తాను తెచ్చిన ధనన్ని పెద్దలకు పరిజనానికి బహూకరించటం రాజు ధృతరాష్ట్రుడు కావటం వల్లనేనని బ్రహ్మయ్యగారు తలచారు. [11] శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి పాండురాజు అగ్రజుని అనుజ్ఞపై వర్తించటం కేవలం గౌరవంవల్ల మాత్రమే కాని, అట్లా చేయుటంవల్ల ధృతరాష్ట్రుని రాజ్యాధికారం స్థాపించబడదని చెప్పారు. [12] వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి కూడ పాండురాజుకు పెద్దలఎడ గౌరవమే అతనిచే ధృతరాష్ట్రుని అనుజ్ఞ వేడేటట్లు చేసిందని చెప్పారు [13] ఒకవేళ పాండురాజు పెద్దల ఎడ గౌరవంలోనే అట్లా చేస్తే ముందుగా సత్యవతీ భీష్ముల అనుజ్ఞ తీసుకోవలసి ఉంటుంది. అట్లాకాక ధృతరాష్ట్రుని అనుజ్ఞపైనే కానుకలు వారికి సమర్పించాడు కనుక ఆ చర్య ధృతరాష్ట్రుని రాజ్యాధికారాన్ని స్థాపిస్తుంది.

పాండురాజు దిగ్విజయంచేసి సామంతరాజులనుంచి ధనరాసులు పోగుచేసి సోదరునకు సమర్పించగా ధృతరాష్ట్రుడు విజయచిహ్నంగా శతాశ్వమేధ యాగాలు చేశాడు. మూలభారతంలో కూడా

"తస్యవీరస్య విక్రాన్తైః సహస్రశత దక్షిణైః
అశ్వమేధ శతైరీజే ధృతరాష్ట్రో మహామఖైః" [14]

అని ధృతరాష్ట్రుడు అశ్వమేధాలు చేసిన విషయం చెప్పబడింది. బ్రహ్మయ్యగారు "అశ్వమేధము చేయువాడు రాజు కావలెను గదా! కావున నిచట ధృతరాష్ట్రుడశ్వమేధముల నొనర్చినట్లు చెప్పుట వేత నాతడే రాజైనట్లు స్పష్టమగుచున్నది"[15] అని ధృతరాష్ట్రుని అధికారాన్ని అంగీకరించారు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

"ఇవి నిజముగా అశ్వమేధములా తన్నామమున చెప్పబడిన యజ్ఞములా"[16] అని సందేహం వెలిబుచ్చి అవి అశ్వమేధయజ్ఞాలు కావని అభిప్రాయపడ్డారు. వారణాసి వారు నీలకంఠీయ వ్యాఖ్యానాన్ని ఆధారంచేసుకొని ధృతరాష్ట్రుడు చేసినవి అశ్వమేధ తుల్యములైన పంచమహాయజ్ఞాలని భావించి, రాజుకానివాడుకూడ పంచమహాయజ్ఞాలు చేయటానికి అర్హుడని వ్రాసుచ్చి ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి కాడని తేల్చారు.[17] అట్లానే శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి కూడ "అశ్వమేధము సామ్రాజ్యాధిపతియైన వాడె చేయవలయునని లేదు. రాజ్యాధిపత్యములేని వసుదేవాదులు కూడ నశ్వమేధము లాచరించిరి. అట్లే ధృతరాష్ట్రునిచే పాండురాజు చేయించెను"[18] అని అశ్వమేధయాగం ధృతరాష్ట్రుడు చేయటం కాకుండ పాండురాజు చేయించాడని సెలవిచ్చారు. భారతంలో 'ధృతరాష్ట్రుడు సేసెనశ్వమేధముల్' అని స్పష్టంగా ఉంటే పాండురాజు చేయించాడని భావించటం ఉచితంగా లేదు.

నీలకంఠుడు తన వ్యాఖ్యానంలో శతాశ్వమేధాలకు వివరణ ఇస్తూ "అశ్వమేధ శతైః తత్తుల్యైః పంచమహాయజ్ఞైః, గర్భాంధస్య శ్రౌతయజ్ఞేష్వనధికారాత్"[19] అని జాత్యంధుడు శ్రౌతయజ్ఞం చేసేందుకు అర్హుడుకాడని వ్రాశాడు. కాని ధృతరాష్ట్రుడు అశ్వమేధ యజ్ఞాలను పారమార్థిక దృష్టితోనే కాకుండ విజయ చిహ్నంగా, పరాక్రమ ప్రదర్శనగా, సమ్రాట్టుగా స్థాపించుకొనేందుకు చేసి ఉంటాడు. ధర్మరాజు అశ్వమేధం కూడ సామ్రాజ్యాధిపత్యం స్థాపించటానికే జరిగినట్లు భారత కధను పరిశీలిస్తే తెలుస్తుంది. రాజులు విజయ చిహ్నంగానే యజ్ఞాలు నిర్వహించి చక్రవర్తిత్వాన్ని స్థాపించుకొంటారంటూ "It is significant that a King's glory was reflected by the particular sacrifice that he performed rather than anything else. It was the sacrifice that was held to establish his special Majesty"[20] అని ఐ. డబ్ల్యు. మాబెట్ అభిప్రాయపడ్డారు. వీరి అభిప్రాయం ధృతరాష్ట్రుడు అశ్వమేధయాగాలు చేసిన సమయం లోని పరిస్థితితో సరిపోలుతుంది. ధృతరాష్ట్రుడు పాండురాజు దిగ్విజయానంతరమే అశ్వమేధాలు నిర్వర్తించిన విషయం మనకు విదితమే. అందువల్ల ధృతరాష్ట్రుడు చేసిన అశ్వమేధాలు ప్రాభవ ప్రదర్శనగానే జరిగినట్లు భావిస్తే నీలకంఠుని అభిప్రాయం ఈ మహారాజుకు వర్తించకుండా ఉంటుంది. కనుక అశ్వమేధయాగ నిర్వహణం ధృతరాష్ట్రుని సామ్రాజ్యాన్ని స్థాపిస్తున్నదనటంలో సం

హం లేదు. ఈ అంశంలో పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు "నన్నయ భట్టు కాలపు భారతప్రతిలో ధృతరాష్ట్రుడే రాజయినట్లును పాండురాజు సేనాధిపతియై పరరాజ్యముల జయించి యాధనమును ధృతరాష్ట్రునకు సమర్పించగా నాతడశ్వమేధ యాగము చేసినటులును గలదు. అందువలన నన్నయ ధృతరాష్ట్రుడు రాజని వ్రాసియున్నాడు"[21] అని వెలిబుచ్చిన అభిప్రాయం వాస్తవ దూరం కాదు.

మృగయా వినోదార్థం అరణ్యానికి పోయిన పాండురాజు "ధృతరాష్ట్రుం డిష్టాన్నపాన మాల్యానులేపన భూషణాదులు నిత్యంబునుంబుత్తెంచి" (ఆది. 5 ఆ. 48) నట్లు నన్నయ వ్రాశారు. ధృతరాష్ట్రునకు రాజ్యాధికారమే లేనట్లయితే పాండురాజు మంచిచెడ్డలు అతడి పేరు మీదగానే జరగవలసిన అవసరం లేదని, వంశవృద్ధులైన భీష్మాదులే పరామర్శించి ఉండేవారని బ్రహ్మయ్యగారు అభిప్రాయపడ్డారు.[22] శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి "ధృతరాష్ట్రుడు తాను ప్రభువౌటచే నిట్లు విధియనిగాక, తమ్ముడను ప్రేమచేతననీ కాని పాండురాజు క్షేమ మారయు చుండినవాడు కాదు. గ్రుడ్డివాడై, రాజ్యానర్హుడై యొక మూల కూరుచుండ తగిన తన్ను గౌరవించి పాండుడు తన రాజ్యభారమంతయు నివేదించి యతని యిష్టము ననుసరించి యున్నవాడు. ఇట్టి పాండునిపై తన కిష్టములేకపోయినను పైకతని యందు మైత్రి చూపుచు నిట్టి సమయముల క్షేమమారయుచుండును. అట్లుండనిచో పౌరపుట్టి యెప్పుడు తన్ను నిరాకరించి త్రోసి రాజగునో యని భయపడతని చిత్తంబున హత్తుకొని యుండెనని యువ్వాటికి చెప్పి యొప్పించుట సులభ సాధ్యము"[23] అనే అభిప్రాయం వ్యక్తం చేశారు. ఒకవేళ శాస్త్రిగారు భావించినట్లు భయముంటున్నా అది ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి ఐనప్పుడే సంభావ్యంకాని, పాండురాజు రాజైనప్పుడు అట్లాంటి భయానికి అసలు అవకాశం లేదు. ధృతరాష్ట్రునిపై పౌరపుట్టిన పాండురాజు సోదరుణ్ణి పదవీభ్రష్టుణ్ణి చేస్తాడేమోనని శాస్త్రిగారి అనుమానం. రాజ్యార్హతే లేదంటున్న ధృతరాష్ట్రునకు పదవి ఏ విధంగా లభిస్తుందో అర్థంకాని అంశం. లేని పదవి నుంచి ధృతరాష్ట్రుణ్ణి తొలగించటం కూడ ఆలోచించ తగిన విషయమే. కనుక ఈ సందర్భంలో శాస్త్రిగారి అభిప్రాయాలు భారతంలో చెప్పబడకపోయి నప్పటికీ, ఆ సోదరుల మధ్య వైరుధ్యం కల్పించి, పాండురాజు రాజ్యాధికారాన్ని స్థాపించే ప్రయత్నంగా కనిపిస్తున్నాయి.

ఈ అంశంలో వాదనాసివారు 'పాండురాజు అరణ్యానికి పోయిన తర్వాతే ధృతరాష్ట్రుడు రాజయ్యాడు, కాని అప్పటివరకు పాండురాజే రాజని అభిప్రాయ

వచ్చారు.[24] పుట్టపర్తి నారాయణాచార్యులు కూడ ఇదే అభిప్రాయం కలిగి ఉన్నారు.[25] పాండురాజుకు కురుసామ్రాజ్యానికి పట్టాభిషేకమే జరిగి ఉన్నట్లయితే, అతడు అరణ్యానికి పోయినంతమాత్రాన, ధృతరాష్ట్రుడు రాజ్య రక్షకుడే అవుతాడు కాని, మూర్ధాభిషిక్తుడు అయ్యేందుకు అవకాశం లేదు. అదీగాక పాండురాజు మృగయా వినోదార్థమే వెళ్లాడుకాని, పూర్తిగా రాజ్యత్యాగం చేసే పరిస్థితి వేటకు ప్రయాణమయ్యే సమయంలో ఏర్పడలేదు. కనుక పాండురాజు అరణ్యగమనమే ధృతరాష్ట్రునకు రాజ్యాధికార ప్రాప్తి కలిగించిందన్న వీరి అభిప్రాయం వాస్తవ దూరంగా ఉంది.

వాస్తవానికి కార్యం ఎవరు నిర్వహించినా ఫలితం యజమానికే చెందుతుంది. అరణ్యంలో పాండురాజుకు వసతులు వ్యక్తిగతంగా ధృతరాష్ట్రుడు కల్పించకపోయినా, భీష్మవిదురాదులెవరైనా ఆ కార్యక్రమం నిర్వర్తించినప్పటికీ అది ధృతరాష్ట్రుని పేరు మీదే జరుగుతుంది. ఆ విషయం దృష్టిలో ఉంచుకొనే నన్నయ అరణ్యంలో ఉన్న పాండురాజుకు పరిజనం చేత సంభారాలు ధృతరాష్ట్రుడే సమకూర్చాడు అని చెప్పి ఆ మహారాజు రాజ్యాధిపత్యాన్ని ప్రతిష్ఠాపించారు.

అరణ్యంలో కిందముని శాపానికి గురి అయిన పాండురాజు ముని వృత్తి స్వీకరించ తలచి కుంతీమాద్రులను "మీరలిందుండి నవయక హస్తిపురంబునకుం జని నా తపోవృత్తినునికి రాజునకు సత్యవతీదేవికి భీష్మునకు విదురునకుం గౌసల్యకు వృద్ధ పురోహిత బ్రాహ్మణులకుం జెప్పి యందుండుడు" (ఆది. 5-61) అని హస్తినాపురం పోవలసిందిగా కోరాడు. ఇక్కడ నన్నయ పేర్కొన్న 'రాజు' ధృతరాష్ట్రుడు కాక మరొకరు కాదు. సంస్కృత భారతంలో కూడ పాండురాజు కుంతీమాద్రులతో ఈ విధంగానే చెప్పినట్లు ఉంది[26] ఈ అంశాన్ని పరిశీలించిన బ్రహ్మయ్యగారు "ఇందు రాజెవరు ? ధృతరాష్ట్రుడే కదా ! పాండువు తానే రాజయినయెడల నింటికడనున్న రాజుతో చెప్పవలసినదని వార్తయెట్లు పంపును ? కావున పాండువే ధృతరాష్ట్రుడు రాజని యంగీకరించి యతని యాజ్ఞానువర్తియై నడచుకొనుచుండినట్లు స్పష్టమగుచున్నది"[27] అని ధృతరాష్ట్రుని రాజ్యాధికారాన్ని బలపరచారు.

పాండురాజే కనుక మూర్ధాభిషిక్తుడై ఉండి, మృగయా వినోదార్థం వేటకు వెళ్లి కారణాంతరాలవల్ల సన్యసించిన విషయం హస్తినాపురంలో తెలిసినప్పుడు

అంతఃపురంలోను ప్రజలలో కూడ దుఃఖంతో కూడిన ఆందోళన ఉండేది. మహా పరాక్రమవంతుడై, బాహుబల సంపదతో కురు సామ్రాజ్యాన్నత్యాన్ని సాటి రాజన్యలోకంలో ప్రకాశింపచేసిన మహారాజు అరణ్య మధ్యంలో అట్లాంటి దుస్థితికి లోనుకావటం ప్రజలకు అశనిపాతమే ఔతుంది. ఉత్తముడైన రాజుకు దూర మైన ప్రజలు తండ్రికి దూరమైన సంతానంలాగా విలవిల్లాడి పోవలసిన సమయం అది. ముదిమి సమీపించకుండానే వయసుకు అస్వాభావికమైన వృత్తిని స్వీకరించ టం ఎంతో ఆందోళన కలిగించే విషయం. కాని పాండురాజు నిర్ణయం తెలిసిన అనంతరం అంతఃపురంలోకాని, ప్రజలలో కాని ఏ విధమైన సంచలనం కలగకుండ, పౌర జీవనానికి ఏవిధమైన భంగం లేకుండ ప్రశాంతంగా ఉంది. కనుక పాండురాజు రాజ్యాధికారం సంశయాస్పదంగా ఉండి, ధృతరాష్ట్రుడే సార్వభౌముడు కావటంవల్ల పాండురాజు సన్యసించటం దైనందిన రాజకీయ యంత్రాంగానికి, ప్రజాజీవితానికి అవరోధం కలిగించలేదని భావించటం సముచితంగా ఉంటుంది.

సంస్కృత భారతంలో వంశక్రమాన్ని స్థూలంగా వివరించే సందర్భంలో ధృతరాష్ట్ర పాండు విదురుల జననాన్ని వివరిస్తూ

"సతధేత్యుక్త్వా త్రీన్పుత్రా నుత్పాదయామాస
ధృతరాష్ట్రం పాండుం విదురం చేతి॥
తత్ర ధృతరాష్ట్రస్య రాజ్ఞః
పుత్రశతం బభూవ గాంధార్యాం వరదానాత్
ద్వైపాయనస్య॥"[28]

అని చెప్పి వారిలో ధృతరాష్ట్రుడు రాజైనట్లు వివరంగా ఉంది. ఈ సందర్భంలో పాండురాజును గూర్చి చెప్పిన అంశం సాధారణంగానే ఉంది. ధృతరాష్ట్రుని గురించి 'రాజ్ఞః' అని వంశానుక్రమంలో వివరించి ఉంది కనుక ధృతరాష్ట్రుని రాజ్యాధికారామే స్థాపితం అవుతుంది.

కర్ణునకు అంగరాజ్యాభిషేకం చేసిన అంశం కూడ ధృతరాష్ట్రుని అధి పత్యాన్నే స్థాపిస్తోంది. కుమారాస్త్ర ప్రదర్శన సమయంలో సుయోధనుడు "భీష్మ ధృతరాష్ట్రులకుంజెప్పి వారి యనుమతంబున.... యంగ రాజ్యంబునకు వీడర్హుండ

య్యేడు మను బ్రాహ్మణ వచనంబు వడసి కర్ణుని కాంచన పీఠంబుననునిచి" (ఆది. 6-49) అంగరాజ్యాభిషేకం చేశాడు. సంస్కృత భారతంలో ధృత రాష్ట్రిడుల అనుమతికూడ తీసుకోకుండానే స్వేచ్ఛగా సుయోధనుడు కర్ణునకు అంగ రాజ్యాభిషేకం చేసినట్లు ఉంది. పాండురాజేకనక కురుసామ్రాజ్యాధిపతి అయినట్ల యితే అతడి మరణానంతరం ధృతరాష్ట్రుడు రాజ్యరక్షకుడే అవుతాడు కాని సామ్రాజ్యాధిపతి కాలేడు. రక్షకుడైన వానికి రాజ్యాన్ని రక్షించి వారసులకు అప్ప గించటమే కాని, రాజ్యాన్ని కాని రాజ్యభాగాన్నికాని దానం చేయగల స్వామ్యాధి కారం ఉండదు. కుమారాస్త్రప్రదర్శన సమయానికి ధర్మరాజాదులు యుక్త వయసువారు కూడ అయ్యారు. అలాంటి సమయంలో ధృతరాష్ట్రునకే రాజ్యదానం చేసేందుకు అర్హతలేనప్పుడు, అతడు సుయోధనునకు అనుజ్ఞ ఇవ్వటంకాని, అందుకు భీష్మాదులు అంగీకరించటం కాని సంభావ్యం కాదు. అందులోను పాండవాగ్రజుడు ధర్మరాజు అక్కడ ఉండగానే అంగరాజ్యాభిషేకం జరిగింది. అందువల్ల కర్ణుని అంగరాజ్యాభిషేక కార్యక్రమం ధృతరాష్ట్రుని అధికారాన్ని స్థిరపరుస్తుంది

ధృతరాష్ట్రుని రాజ్యాధికారం విషయంలో ధర్మరాజు యౌవరాజ్యాభి షేకం ఒక అడ్డంకిగా నిలిచి వివాదాస్పదంగా ఉంది. ధృతరాష్ట్రుడు "యుధిష్ఠిరు రాజ్యభార దురంధరుంగా నెఱింగి భీష్మ విదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుని" (ఆది. 6-92) చేశాడు. సంస్కృత భారతంలో

> ''తతః సంవత్సరస్యాన్తే యౌవరాజ్యాయ పార్థివ
> స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః॥
> ధృతి స్థైర్య సహిష్ణుత్వాదానృశంస్యాత్తథార్జవాత్
> భృత్యానామను కంపార్థం తథైవ స్థిరసౌహృదాత్॥''[29]

అని ధర్మరాజు యౌవరాజ్యాభిషేక ప్రసక్తి కనిపిస్తుంది. తెలుగు భారతంలో ధర్మ రాజు రాజ్యభార దురంధరుడు కావటం చేతనే యువరాజుగా చేసినట్లు ఉంది. యువ రాజైనవాడు ఉత్తరాధికారి కావటం సంప్రదాయం.

కాశీభట్ల బ్రహ్మయ్య ధర్మరాజునందు ప్రజలకున్న అనుకంపాన్ని దృష్టిలో ఉంచుకొని, అతడి శక్తి యుక్తులను గమనించి, సోదరుని బట్టి పాండవుల ఎడ

"స్థిరసౌహార్దము కారణమున ఆంబికేయుడు ధర్మజుని యువరాజుగా నొనర్చినాడు. అట్లుగాక దాయాద్యమును బట్టి యే యౌవరాజ్యమిచ్చిన యెడల భారతమట్లె తెలిపి యుండును. అట్లు తెలుపలేదు కనుక దాయాద్యము కారణమని తెలుపుట నిర్మూలము"[30] అని చెప్పి కేవలము సౌహార్దమువల్ల మాత్రమే యౌవరాజ్యాభిషేకం జరిపినట్లు భావించారు. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి ధృతరాష్ట్రుని స్థిరసౌహార్దంకాక, ధర్మరాజు రాజ్యభారధురంధరుడవటం వల్లను, యుధిష్ఠిరుని యువరాజును చేయటం ప్రజలకు ఇష్టం కావటం వల్లను జరిగిందని భావించారు. ఇంకా దాయాద్యమును బట్టియే ధర్మరాజు యౌవరాజ్యార్హతను పొందాడని అభిప్రాయ పడ్డారు.[31] శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి "దుర్మార్గుడు ధృతరాష్ట్రుడు పాండురాజు రాజ్యము హరించి వాని పుత్రుని యువరాజుగా చేయ లేదని లోకములో నపఖ్యాతి బడలేక లోపల నిష్టములేని వాడయ్యు యుధిష్ఠిరునకు యౌవరాజ్య మిచ్చియు వాని యౌన్నత్యము నోర్వలేక కణికునితో దురాలోచనము చేసి దుర్యోధనుని మూలమున వారణావతమున జతుగృహము నిర్మించి పాండవుల నట బంపి లక్కయింటికి చిచ్చు పెట్టించెను"[32] అని చెప్పి కేవలం ప్రజలను మభ్యపరచటానికే యౌవరాజ్యాభిషేకం చేసినట్లు అభిప్రాయ పడ్డారు. వాని కథాగమనాన్ని పరిశీలిస్తే ధర్మరాజును యువరాజుగా చేసేసమయానికి పాండవులపై ధృతరాష్ట్రునకు ద్వేషం నెలకొని ఉన్నట్లు గమనించలేము.

శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి కూడ "ధృతరాష్ట్రునకు ధర్మజుని యందు స్థిరసౌహార్ద మెంత మాత్రమును లేదు. మరియు దాయభాగముచేత ధర్మజునకు యౌవరాజ్య పట్టము కట్టలేదు. యావత్సామ్రాజ్యము పాండురాజుది అగుటచే నతనికి విధిగా సామ్రాజ్యాధిపత్యమే ఇవ్వవలసి యుండియు కుటిల బుద్ధిచే తాత్కాలికముగ ప్రజాశాంతికై యువరాజును చేసెను"[33] అని తలచారు. ఈ అభిప్రాయం శాస్త్రిగారి ఊహగానే ఉంది సంస్కృతభారతంలో స్థిరసౌహార్దము, ఆంధ్రమహాభారతంలో రాజ్యభారధురంధరత్వమే యౌవరాజ్యాభిషేకానికి కారణాలని స్పష్టంగా ఉంది.

శ్రీ వాడపల్లి కృష్ణమాచార్యులు "ధృతరాష్ట్రుడు రాజై యుండగా దుర్యోధనాదులు పుట్టక పూర్వము నుండియు పాండురాజే యువరాజుగా నున్నాడు గాన యువరాజ్య పదవి పాండవ జ్యేష్ఠుడగు యుధిష్ఠిరునకు ఇచ్చినాడని చెప్పవచ్చు"[34]

అని చెప్తూ, సంస్కృతాంధ్ర భారతాలలో లేని పాండురాజు యౌవరాజ్య పదవిని అలంకరించిన విషయం చెప్పి సమస్యను ఇంకా జటిలం చేయ ప్రయత్నించారు. చక్రవర్తి ధృతరాష్ట్రుడు కనుక యౌవరాజ్యపదవి సుయోధనునకే దక్కాలి కాని, పాండురాజు కుమారునకు లభించే అవకాశం లేదు.

ఈ పండితుల అభిప్రాయాలను క్రోడీకరిస్తూ భారత గ్రంథాన్ని పరిశీలిస్తే ధర్మరాజును యౌవరాజ్యాభిషేకం చేయటంలో దాయాద్యాధికారం కాకుండ బలవంతుడైన శత్రువును జయించి వంశ ప్రతిష్ఠ ఇనుమడింప చేసినందుకు సంతోష సూచకంగా సౌహార్ద ప్రదర్శన మాత్రమే గోచరిస్తుంది. ధృతరాష్ట్రుడు తన సంతోషాన్ని వ్యక్తం చేయటమే కాకుండ ప్రజలకు భృత్యులకు సంతసం కలిగించాడు. ఆ సమయానికి పాండవుల ఎడ ధృతరాష్ట్రునకు వైమనస్యం ఉన్నట్లు లేదు. కనుక ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం చేయటంలో రాజ్యాధికారపు హక్కు-రన్న, ప్రేమాస్పదమైన సుహృద్భావ పూర్వకమైన ప్రశంస ద్యోతకం అవుతుందని తలంచటమే సమంజసం. యువరాజైన వాడే ఉత్తరాధికారి కావాలనే నియమం ఉన్నప్పటికీ, అనంతర పరిణామాలు అందుకు దోహదం చేయలేదు.

సుహృద్భావ సూచనగా ధర్మరాజును యువరాజుగా చేసినప్పటికీ, అతడు తమ్ముల సాయంతో ప్రజాహృదయాలలో సుస్థిరస్థానాన్ని పొందాడు. ప్రజాహృదయాల్లో పాండవానుకూలంగా ఉన్న స్థితి సుయోధనునకు అసూయాకారణం అయింది. ఆ అసూయతోనే పాండవులను వారణావతం పంపవలసిందని ఒత్తిడిచేసి అంగీకరింపచేస్తాడు. యువరాజైన వాడు భావి సమ్రాట్టు కావాలనే నిబంధన ఉన్నప్పటికీ, ధృతరాష్ట్రుని ప్రయత్నాన్ని భీష్మాదులు గట్టిగా అడ్డగించ లేక పోయారు. పౌరులు కూడ ధృతరాష్ట్ర సుయోధనుల దుష్టత్వాన్ని మనసులలో నిరసించారేకాని, బహిరంగంగా ధర్మరాజుకు అనుకూలంగా వారిని ప్రతిఘటించలేదు. ధర్మరాజు యౌవరాజ్యాభిషేకంలో భావిరాజ్యాధికార ప్రశంసే ప్రాధాన్యం వహించినట్లయితే కురువృద్ధులైన భీష్మాదులుకాని, పౌరులుకాని తప్పకుండ ధృతరాష్ట్రుని ప్రయత్నాన్ని అడ్డగించేవారు. పూరుని పట్టాభిషేక సమయంలో ప్రజలు యయాతిని ప్రశ్నించి అంశం మనకు తెలుసు. రాజ్యాధికారం తనకు న్యాయ సమ్మతంగా సంక్రమిస్తుందని విశ్వసించినట్లయితే ధర్మరాజుకూడ పెదతండ్రి ప్రయత్నాన్ని ప్రశ్నించేవాడు. అట్లా ప్రశ్నించలేదంటే కురుసామ్రాజ్యంపై తనకు అధికారం లేదనే భావంతోనే

కావచ్చు. ప్రజలు ధృతరాష్ట్రుని ప్రయత్నాన్ని గట్టిగా ప్రశ్నించకుండ ఉదాసీనంగా ఉండటం కూడ ఈ అభిప్రాయాన్ని బలపరుస్తుంది. కనుక ధర్మరాజు వారణావత ప్రయాణం, యౌవరాజ్యాభిషేకంలో కురు సామ్రాజ్యాధికార ప్రశంస లేదని స్పష్టం చేస్తూ ధృతరాష్ట్రుని అధికారాన్ని స్థాపిస్తుంది.

ఈ విషయంలో దివాకర్ల వెంకటావధాని ధృతరాష్ట్రుని పుత్ర వ్యామోహాన్ని గుర్తిస్తూనే, అతడి రాజ్యాధికారాన్ని గూర్చి "విచిత్రవీర్యు ననంతరము పాండురాజు పట్టాభిషిక్తుడగుటయు, తన్మరణానంతరము ధర్మరాజు యౌవరాజ్యాభిషిక్తుడగుటయు జరిగి యుండెనేని దుర్యోధనుడు రాజ్యసంపాదనము నకై యత్నించుటకే అవకాశము లేకపోయి యుండును. అప్పుడు రాజ్యాధికారము ధర్మరాజు దగుటలో సందియము లేదు. దుర్యోధనుడు పాండవ సంహారణమునకును, వారిని పుర బహిష్కృతుల నొనరించుటకును యత్నించుట అసాధ్య కార్యమై యుండును. అతనిజేతలన్నియు జూచుచు నుపేక్ష వహింపక భీష్మాదులు దృఢముగా విరోధించియే యుందురు. ధృతరాష్ట్రుడు పట్టాభిషిక్తుడై యుండుట చేతనే పాండవులకు రాజ్యమిప్పించు విషయమున వారెప్పుడును నయ మార్గమునే యవలంబించుచుండిరి. దుర్యోధనునకదియే బలము చేకూర్చినది. ఆ యూత చూచుకొనియే యాతడు తన కుట్రలన్నియు సాగింపజాలెను. అందుచేతనే నన్నయ ధృతరాష్ట్రి పట్టాభిషేకమును బల పరచినట్లు తోచు చున్నది" [35] అని చేసిన సమీక్ష పైఅభిప్రాయానికి ఉపబలకంగా ఉండి, యౌవరాజ్యాభిషేకం ధృతరాష్ట్రుని అధికారానికి ప్రతి బంధకం కాదని రూఢి పరుస్తున్నది

కాశీభట్ల బ్రహ్మయ్య వంటివారు కురుసామ్రాజ్యం రెండు భాగాలుగా విభాజ్యమై పాండురాజు భాగానికి ధర్మరాజు, ధృతరాష్ట్రుని భాగానికి సుయోధనుడు యువరాజులుగా చేయ బడ్డారని అభిప్రాయ పడ్డారు. ఈ అంశంలో బ్రహ్మయ్య గారు "తనకు ప్రతినిధిగా నుండి పాండురాజు జయించిన రాజ్యమును ధృతరాష్ట్రుడు పాండురాజునకిచ్చి వేసెను. అయ్యది సగపాలు కలదు. ధర్మజుని యువరాజును చేసినాడన రాజ్యమునకంతకు చేసినాడని భ్రమ పడవలదు. తన తండ్రి పాలగు నర్ధభాగమునకే చేసినాడని గ్రహించుకొన వలయును" [36] అని భారత కథలో యౌవ రాజ్యాభిషేక సమయానికి కనిపించని అర్థ రాజ్యాప్ర ప్రశంస తెచ్చి కొత్త సమస్యను లేవదీశారు. ఇంకా "ఈ భాగమున కనియు నాభాగమున కనియు మూలములో

లేదు కదా పాండుభాగమున కని నీవెట్లు చెప్పుదువు" ? అని వారే ప్రశ్నించుకొని "కథా సందర్భమునుబట్టి యట్టి యర్థము చేయక తప్పదు."[37] అని సమాధాన పడ్డారు. కాని ఆ కథా సందర్భం ఏదో వివరించలేదు.

శిష్టా సూర్యనారాయణశాస్త్రి కూడ ధృతరాష్ట్ర పాండురాజుల మధ్య రాజ్యవిభాగ ప్రశంసచేస్తూ "రాజ్య పరిపాలనమున అంధుడు కేవలము నిరుపయోగి యగుటచే పరిపాలించుటకు ప్రతిబంధకము లేని పాండురాజునకు రాజ్యమిచ్చి యున్నారు. పట్టాభిషిక్తుడైనంత మాత్రమున పాండురాజునకు కూడ రాజ్యార్హత లేదు. ఈ యిరువురిలో ముందెవరికి కుమారుడుద్భవించునో వాడే సామ్రాజ్యాధీశుడగును. కాని యిపుడనర్హులైన యిరువురకు స్వరాష్ట్రమునందు సమానాధికారము కలిగియున్నది. తదధికారరీతి నారాజ్యమును రెండుగా విభజించుకొని కురుసామ్రాజ్యము క్రింద నిరువురు తమ తమ భాగములను పరిపాలించుకొనుటకు హక్కేర్పడి యున్నది. కాని యంధుడైన ధృతరాష్ట్రుడెందుకు కూడ తగని హేతువుచే పాండు రాజే రాష్ట్రమును, యావత్సామ్రాజ్యమును పరిపాలించెను. పాండురాజు గతించునంతవరకు రాష్ట్రము విభజింపనే లేదు. ఇరువురకు సంతానము కలిగిన పిమ్మట వారిలో న్యాయ్యతనుబట్టి యెవడు సామ్రాజ్యాధీశుడగునో వాడు తమ తండ్రి భాగమైన స్వంతరాష్ట్రమునకు కూడ రాజగును. రెండవవాడు తమ తండ్రి భాగమైన స్వంత రాష్ట్రమునకు రాజై సామ్రాజ్యాధీశునకు సామంతుడగును. ఈ హేతువు చేతనే మా తండ్రిపాలు మాకీయవలయునని పాండవులడిగియున్నారు. పెద్దలందరట్లే చెప్పియున్నారు"[38] అని కురుసామ్రాజ్యం పాండురాజు మరణానంతరం విభజించబడిందని చెప్పారు.

ద్రౌపదీ వివాహానంతరం రాజకీయ కారణాలవల్ల మాత్రమే, ధర్మరాజుకు ఇంద్రప్రస్థం రాజధానిగా ప్రత్యేక రాజ్యం ఏర్పాటు చేసేంతవరకు భారతకథలో రాజ్యవిభాగ ప్రశంస ఏమాత్రమూ కనిపించదు. ఇంద్రప్రస్థంలోనైనా ధర్మరాజు సర్వతంత్ర స్వతంత్ర సామ్రాట్టుగా పాలించాడే కాని శాస్త్రిగారు భావించినట్లుగా హస్తినాపుర రాజ్యానికి సామంతునిగా వ్యవహరించలేదు. ఇంకా రాజసూయం నిర్వహించి సార్వభౌమునిగా ప్రశస్తి పొంది సుయోధనునకు అసూయా కారకు

డయ్యాడు. రాయబారం సమయంలో 'మా తండ్రిపాలు' అని పాండవులు ధృతరాష్ట్రునకు తెలియిచెప్పటం, అతని నుంచి పొంది తాము తిరిగి ద్యూతంలో ఓడిన సామ్రాజ్యం సమగ్ర కురుసామ్రాజ్య విస్తరణంలో పాండురాజు బాహు బలంతో సంపాదించిందేనని పెదతండ్రికి జ్ఞాపకంచేసే ఉద్దేశంతోనేనని తలంచటం భావ్యంగా ఉంటుంది. అంతేకాని కృష్ణుడు సాక్షిగా ధర్మరాజుకు ఇంద్రప్రస్థ రాజ్యం ప్రసాదించేంతవరకు కురుసామ్రాజ్య విభజన జరగలేదు. అందుచేత పాండురాజు భాగానికి ధర్మరాజు, ధృతరాష్ట్రుని భాగానికి సుయోధనుడు యువ రాజులుగా చేయబడ్డారని తలచేందుకు ఆధారాలు మృగ్యం.

అయితే పాండవుల వైభవానికి ఈర్ష్యా మానసుడైన సుయోధనుడు తండ్రితో తన మనోవ్యధను వ్యక్తం చేస్తూ 'పైతృకమైన రాజ్యాన్ని పాండుభూపతి పాల్చుటవల్ల దానికి అనుగుణంగా ఇప్పుడు యువరాజైన ధర్మరాజు ప్రాభవంతో రాజ్యాన్ని పొందినట్లయితే భవిష్యత్తులో వారి సంతతివారే రాజులవుతారు, తాము కేవలం రాజపురుషులలాగా ఇతరులను కొలిచి జీవితం సాగించవలసి ఉంటుంది, ఆ పరిస్థితి భరించరానిది' (ఆది. 6-128) అని వాపోలాడు. సంస్కృత భారతంలోకూడ ఇట్లానే తండ్రి చెంత బాధను వ్యక్తం చేసినట్లు ఉంది.[39] సుయో ధనుని ఈ ఆందోళనలో పాండురాజు ఆధిపత్యం స్పష్టంగా వెల్లడవుతుంది.

సుయోధనుడు హస్తినాపుర ప్రజలు ధర్మరాజు గుణసంపదలచే ఆకర్షి తులై అతణ్ణి రాజుగా స్వీకరిద్దామని అనుకుంటున్నారనే వార్త తెలిసిన సమయంలో పై మాటలను తండ్రితో పలికాడు. సుయోధనుడు పౌరుల మాటలకు అనుగుణం గానే తండ్రితో తన మనోవ్యధ వ్యక్తం చేశాడుకాని, అతడి మాటలలో రాజ్యాధి కార విషయం ప్రసక్తం కాదని కాశీభట్ల బ్రహ్మయ్య తలచారు.[40] వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రజల మాటలు, సుయోధనుని ఆందోళన పాండురాజు అధి కారాన్ని దానికనుగుణంగా ధర్మరాజు అధికారాన్ని ప్రతిష్ఠాపిస్తున్నట్లు వ్రాశ్రా డు.[41] శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి, పి. రాజగోపాలనాయుడు వంటి వారుకూడ ఇదే అభిప్రాయం కలిగి ఉన్నారు.[42]

ఈ సందర్భంలో సుయోధనుని ఆందోళన, పౌరుల అభిప్రాయాలు పాండురాజు అధికారాన్ని, దాని కనుగుణంగా ధర్మరాజు ఉత్తరాధికారాన్ని స్థాపిస్తు

న్నట్లే స్థూల దృష్టికి కనిపిస్తుంది. ధృతరాష్ట్రుడు కురుసామ్రాజ్యానికి రాజయ్యాడని వ్రాసిన నన్నయ పాండురాజుకు రాజ్యం పైతృకం అని సుయోధనునితో అనిపించటం పూర్వాపర భిన్నంగానే ఉంది. కాని సుయోధనుని ఈ మాటలకు కొంచెం ముందుగా దృష్టమౌతున్న ధృతరాష్ట్రుని మాటలు జాగ్రత్తగా పరిశీలిస్తే అనుమానం తొలగి ధృతరాష్ట్రాధికారమే సంస్థాపితం అవుతుంది. పౌరుల అభిప్రాయానికి ఆందోళన వ్యక్తంచేసిన కుమారునితో, పాండురాజు తనకు సహకరించిన విధానం వివరిస్తూ ధృతరాష్ట్రుడు

> "లోకనుతుండు పాండుడమలుండు మహాగుణ రత్నపూర్ణ ర
> త్నాకరుఁడ త్యుదారమతి నంధుడనైనను నన్ను రాజుఁగాఁ
> జేకొని నాకు భక్తిఁబని సేయుచు సర్వజగజ్జిగీషుడై
> యీ కురువంశ రాజ్యభరమింతయుఁ దాల్చెఁ బరాక్ర
> మంబునన్" (ఆది. 6-125)

అని పాండురాజు తనను రాజుగాచేసి తన కోసం కురుసామ్రాజ్యాన్ని విస్తరించినట్లు చెప్పాడు. ఇంకా పరరాజులను జయించి తెచ్చిన కప్పములు సమర్పించి అనేక యజ్ఞాలు చేసేందుకు ఉపకరించాడని పలికిన ఆ మహారాజు మాటలవల్ల కురు సామ్రాజ్యాధికారం ధృతరాష్ట్రునిదేననీ, పాండురాజు సోదరునికోసం మాత్రమే శ్రమించాడని విశ్వసించవచ్చు.

కురుసామ్రాజ్యాధికార చర్చలో మరొక ప్రధానమైన అంశం ధర్మరాజుకు అర్ధరాజ్య ప్రదానం చేయటం. ద్రౌపదీ వివాహానంతరం పాండవుల ఎడ వర్తించవలసిన విధానాన్ని గూర్చి చర్చించే సందర్భంలో భీష్ముడు "పితృపైతామహంబైన రాజ్యంబునకు నీయట్లవారు నర్హులుగావున వారికి నర్ధరాజ్యంబిచ్చిన నీకును, నీ బాంధవులకును లోకంబులకును బ్రియంబగు నట్లుగాని నాఁడపకీర్తియగు" (ఆది. 8-30) అని ఆత్మీయతతో కూడిన హెచ్చరిక చేస్తాడు. భీష్ముని మాటల్లో వంశ శ్రేయస్సే ప్రధాన స్థానం వహించింది కాని, రాజ్యాధికార ప్రసక్తి ఉన్నట్లు తలంచలేము. పాండవులకు కూడ రాజ్యం పైతృకం అని భీష్ముడు చెప్పటం పాండురాజు జీవించి ఉన్న కాలంలో సోదరుల మధ్య విలసిల్లిన అనుబంధాన్ని గుర్తు చేస్తూ కురుసామ్రాజ్య విస్తరణంలో పాండురాజు ప్రధాన పాత్ర వహించిన

విషయం స్మరణకు తేవటమే ప్రధాన ఉద్దేశం కావచ్చు. భీష్మునితోపాటు ద్రోణుడు కూడ పాండవులకు అర్ధరాజ్యం ఇవ్వటం ఉచితమని సలహా ఇస్తాడు.

అర్ధరాజ్య ప్రదానం విషయంలో కాశీభట్ల బ్రహ్మయ్య వంశపరం పరాగతంగా ధృతరాష్ట్రునకు సంక్రమించిన రాజ్యం ఒక భాగంగాను, పాండురాజు జయించి సంపాదించిన రాజ్యం రెండవభాగంగాను తలచి, ఆ రెండోభాగం పాండవులకు పైతృకమని భీష్ముని ఉద్దేశంగా వ్రాశారు.[43] కాని ధృతరాష్ట్రుని రాజ్యమని, పాండురాజు జయించిన రాజ్యమని వేరుగా ఉండేందుకు వీలులేదని, జయించిన శత్రు రాజ్యాలు ప్రధానరాజ్యంలో సంలీనం అవుతాయని,రెండు రాజ్యభాగాలకు ఇద్దరు యువరాజులుండేందుకు అవకాశంలేదని భావించటం జరిగింది. కనుక బ్రహ్మయ్యగారి అభిప్రాయం యుక్తియుక్తంగా కనిపించదు.

ఈ అంశంలో పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి పాంచాలదేశం నుంచి పాండవులను పిలిపించటంలోని అంతరార్థాన్ని వివరిస్తూ "అప్పటి పరిస్థితులచే పాండవుల కలిపికొనుట తప్ప వేరుపాయము ధృతరాష్ట్రునకు, దుర్యోధనునకు కాన్పింపనందున పాండవులను రప్పించి యర్ధరాజ్యము ధృతరాష్ట్రుడు పాండవుల కిచ్చియున్నాడు"[44] అని చెప్పి అర్ధరాజ్య ప్రదానంలో ధృతరాష్ట్రుని రాజనీతి కౌశల్యాన్ని వివరించారు. అట్లానే శిష్టా సూర్యనారాయణశాస్త్రి కూడ "ప్రకృతము ధృతరాష్ట్రుడీ యర్ధరాజ్య ప్రదానమను తంత్రమవలంబించనిచో పాండవుల వలన తమకు ముప్పు సంభవించుటేగాక రాజ్యమంతయు సునాయాసముగ పాండవులకు చేజిక్కుననియు, తనకు కావలసిన ముఖ్యులు తదితర లోకము తమకు వ్యతిరేకముగా నున్నదనియు నతడెరుగును. కనుక నతడప్పటికి తమ ముప్పును తప్పించుకొనుటకు, పాండవులం బరిమార్చుటకు ననుకూలమైన యొక క్రొత్త తంత్రమవలంబింప వలయునను తలంపుతో భీష్మద్రోణ విదురుల హితోపదేశమును పురస్కరించుకొని పరమాప్తుడు వోలెనటించుచు పాండవులను కరిపురికి తోడ్కొని రమ్మని విదురునకు జెప్పెను"[45] అని తమ అభిప్రాయం వెలిబుచ్చి, పాండవులకు అర్ధరాజ్య ప్రదానంలో ధృతరాష్ట్రుని రాజనీతి కౌశల్యాన్ని ప్రతిష్ఠాపించారు. అందువల్ల అర్ధరాజ్య ప్రదాన కార్యక్రమంలో కురుసామ్రాజ్యాధిపత్య నిర్ణయంకన్న రాజకీయమే ప్రాధాన్యం వహించిందని తలంచటం సమంజసం. అనంతరకాలంలో కురుపాండవ కలహంలో ప్రాధాన్యం వహించింది ధృతరాష్ట్రుడు పాండవులకు ప్రదానం

చేసిన ఈ రాజ్యమేకాని, వంశక్రమానుగతంగా పాండవులకు కురుసామ్రాజ్యంలో భాగంగా సంక్రమించింది కాదని భావించటమే ఉచితంగా ఉంటుంది.

ప్రబంధ కవులలో ప్రసిద్ధి వహించిన ప్రౌఢ కవి పింగళి సూరన రాఘవ పాండవీయంలో నన్నయ మార్గాన్నే అనుసరించి కురుసామ్రాజాధిపతి ధృతరాష్ట్రుడే అనే అభిప్రాయం వెలిబుచ్చాడు. రాఘవ పాండవీయంలో

"ఆ పట్టణమేలెడి పృథి
వీపాలుడు భ్రుకుటిమాత్ర విముఖిత సమదా
టో పారి పంక్తిరదుఁడు
ద్దీపించు నుదారనీతి ధృతరాష్ట్రుండనన్" [46]

అని ధృతరాష్ట్రుణ్ణి పృథివీపాలుడుగా పేర్కొన్నాడు. ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి కాగా పాండురాజు రాజ్యరక్షణ భారం వహించి శత్రువులను జయించిన అంశం

"అని నీడులేని కడిమిం
దనరారు నతిప్రతాపిత దనుజుఁడతడు
ర్వినిగల నృపతులనందఱఁ
దన కరిగాఁపులుగ జేసె దర్పస్ఫురణన్" [46]

అని శ్లాఘించబడింది. ధృతరాష్ట్రుడే కురుసామ్రాజ్యాధిపతి అన్న పింగళి సూరన అభిప్రాయాన్ని విశ్లేషిస్తూ కాశీభట్ల బ్రహ్మయ్య "ఈతడు నన్నపార్యు ననుసరింప నవసరము లేనివాడు. తానొక స్వతంత్ర గ్రంథము వ్రాసినవాడు. ఈతడుకూడ ధృతరాష్ట్రుడే రాజనియు, పాండువాతని ప్రతినిధియనియు వ్రాయుట సామాన్యముగ నెంచదగినది కాదు. కావున ప్రాజ్ఞుల మార్గమున గూడ ధృతరాష్ట్రుడే రాజను ప్రతీతి గలదని దీనివలన తెలియవచ్చుచున్నది"[47] అని వెలిబుచ్చిన అభిప్రాయం యుక్తియుక్తంగా ఉంది. పింగళి సూరన ధృతరాష్ట్రుడే కురుసామ్రాజ్యాధిపతి అని భావించేందుకు ఆయన సంపూర్ణంగా నన్నయను అనుసరించి అయినా ఉండవచ్చు, లేదా సూరనకు లభ్యమైన సంస్కృత భారతప్రతులలో ధృతరాష్ట్రుడే

రాజని ఉండటం కాని, లేదా సమకాలంలో ప్రజాబాహుళ్యంలో ప్రచారంలోనైనా ఉండటంకాని కారణం కావచ్చు.

పింగళి సూరన దక్షిణాంధ్రదేశంలో నివసించిన వ్యక్తి. తమిళదేశంలో వెలసిన భారతాల్లో ధృతరాష్ట్రుడే రాజై ఉన్నట్లు స్పష్టంగా ఉంది. నల్లపిళ్ల అనే ద్రావిడ కవి ధృతరాష్ట్రుడే రాజని వ్రాక్రుచ్చినట్లు కాశీభట్ల బ్రహ్మయ్య ఆధారం చూపారు.[48] అట్లానే వి. ఎస్. రాఘవన్ కూడ విల్లి భారతంలో ధృతరాష్ట్రుణ్ణి రాజుగా, పాండురాజును సేనాపతిగా వర్ణించినట్లు ఆధారాలతో స్పష్టీకరించారు.[49] దీనిని బట్టి దక్షిణ భారతదేశంలో ధృతరాష్ట్రుడే కురుసామ్రాజ్యాధిపతి అనే భావం వ్యాప్తిలో ఉన్నట్లు తెలుసుకోవచ్చు. సూరన కూడ ఈ భాషా సాహిత్యాలతోను, పండిత కవులతోను సంబంధం కలిగి ఉండేందుకు అవకాశం ఉంది. అందువల్ల వీరి అభిప్రాయాలను శిరోధార్యంగా స్వీకరిస్తే కురుసామ్రాజ్యాధిపతి ధృతరాష్ట్రుడే నని తలచటం భావ్యంగా ఉంటుంది.

ఈ శతాబ్దపు కవులలో కొత్తపల్లి సూర్యారావు 'దుర్యోధన విజయము' అనే నాటకం ప్రస్తావనలో ధృతరాష్ట్రుణ్ణి రాజుగా సంభావించటం కనిపిస్తుంది. ప్రస్తావనలో

"జనపతి యాంబికేయునకు సౌబల పెండ్లి యొనర్తుమేని వ
ర్ధనమగు వంశమంచును బృథాసతి బాండుని గూర్తుమేని వె
ల్గును గులమంచయత్నముగ గొల్వునఁ బల్కెను నాఁడు
గోలె నా
కనవరతంబుఁ జిత్తమున నందు స్ఫురించు నమంగళార్థముల్"[50]

అని సూర్యారావుగారు జనపతి అంబికేయునివల్ల వంశం వర్ధనమవుతుందని, పాండునివల్ల వెలుగుతుందని చెప్పారు. 'వంశవర్ధనం' వారసత్వాధికారానికి సూచన అయితే, 'వెలుగు' పరాక్రమంతో పరరాజులను జయించి ప్రకాశించటాన్ని ద్యోతకం చేస్తుంది. అట్లాగే 'కురుక్షేత్ర సంగ్రామము' నాటకంలో త్రిపురనేని రామస్వామి కూడ ధృతరాష్ట్రుని రాజ్యాధికారాన్ని హేతుబద్ధంగా స్థిరీకరించారు.

పై పరిశీలనవల్ల కురుసామ్రాజ్యాధికారం విషయంలో, ఒక అభిప్రాయానికి రావచ్చు. నన్నయ ధృతరాష్ట్రుడే రాజని పేర్కొని కొన్నిచోట్ల పాండురాజు అధికారాన్ని కూడ చెప్పినప్పటికీ, కథా నిర్మాణాన్ని పరిశీలిస్తే ధృతరాష్ట్రుడే కురు సామ్రాజ్యాధిపతి అయినట్లు తెలుస్తుంది. అయితే పాండురాజు అరణ్యానికి పోయేంతవరకు, అభిషిక్తుడైన రాజు ధృతరాష్ట్రుడైనప్పటికీ, ఆ సోదరుల అనుబంధంవల్ల సామాన్య ప్రజలకు ఆ వ్యత్యాసం గుర్తింపలేకుండా ఉంది. ధర్మరాజుకు జరిగిన యౌవరాజ్యాభిషేకం పాండురాజుపై ఉన్న సౌహార్దంతోను, పాండవులు సాధించిన విజయాలకు అనుగుణంగానే జరిగింది కా: అంతమాత్రంచేత ధర్మరాజు అధికారం స్థిరపడదు. అర్ధరాజ్య ప్రదానం కూడ రాజకీయ కారణాలతోనే జరిగిందికాని, రాజ్యాధికార ప్రశంస అందులో కూడ లేదు. ఇంకా పింగళి సూరన వంటి ప్రాచీన కవులు, ఇతర ప్రాంతీయ భాషా భారతాలలో కూడ ధృతరాష్ట్రుని అధికారమే స్థాపించినట్లు కనిపిస్తుంది. మొత్తం మీద సంస్కృతాంధ్ర భారతాలు రెండింటిలో కూడ రాజ్యాధికార విషయం కొన్నిచోట్ల పరస్పరం పూర్వాపర వ్యత్యస్తంగా కనిపిస్తున్నప్పటికీ కథాగమనంలో కొన్ని బలవత్తరమైన సాక్ష్యాలు ధృతరాష్ట్రుని రాజ్యాధిపత్యాన్నే స్థాపిస్తున్నాయి.

**అధస్సూచికలు :**

1. సం.మ.భా, ఆది. సంభవ ప; 109 అ-25 శ్లో.
2. యాజ్ఞవల్క్యస్మృతి: 8-140.
3. కాశీభట్ల బ్రహ్మయ్య, కురుపాండవ దాయభాగ నిర్ణయము; పు. 3.
4. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, కురుపాండవ దాయభాగ విమర్శనము: పు. 6.
5. శిష్టా సూర్యనారాయణశాస్త్రి, కురుసామ్రాజ్యాధిపత్య నిర్ణయము; పు. 10
6. మనుస్మృతి; 9 - 109.
7. **Romilla Thaper, Ancient Indian Social History some Interpretations; P. 340.**

8. Iravathi Karve, Kinship organisation in India; P. 39.
9. పైది, ఒకటి: 109 అ - 21 శ్లో.
10. పైది, ఒకటి: 114 అ - 1,2 శ్లో.
11. పైది, మూడు: పు-7.
12. పైది, నాలుగు: పు-11.
13. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, మహాభారత తత్త్వ కథనము: నాల్గవ భాగం: పు-726.
14. పైది, ఒకటి: 114 అ - 5 శ్లో.
15. పైది, మూడు: పు. 7.
16. పైది, నాలుగు: పు. 11.
17. పైది, పదమూడు: పు. 733.
18. శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి, మహాభారత రహస్యము: పు. 48.
19. పైది, పద్నాలుగు: నీలకంఠీయ వ్యాఖ్య - అధోజ్ఞాపిక.
20. I. W. Mabbet, Truth, Myth and politics in Ancient India; P. 6.
21. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, మహాభారత చరిత్రము: పు. 99.
22. పైది, మూడు: పు. 7.
23. పైది, నాలుగు: పు. 13
24. పైది, పదమూడు: పు. 730.
25. పుట్టపర్తి నారాయణాచార్యులు, మహాభారత విమర్శనము: పు. 365.
26. పైది, ఒకటి: 121 అ - 24, 25 శ్లో.
27. పైది, మూడు: పు. 8.
28. పైది, ఒకటి: 95 అ - 55, 56 శ్లో.
29. పైది, ఒకటి: 139 అ - 1, 2 శ్లో.
30. పైది, మూడు: పు. 14.

31. పైది, పదమూడు; పు. 738, 739.

32. పైది, నాలుగు; పు. 17.

33. పైది, పద్దెనిమిది; పు. 65.

34. వాడపల్లి కృష్ణమాచార్యులు, కురుపాండవీయము; పు. 10.

35. దివాకర్ల వెంకటావధాని, ఆంధ్రవాఙ్మయారంభ దశ; పు. 614.

36. పైది, మూడు; పు. 17.

37. పైది; పు. 18.

38. పైది, ఐదు; పు. 95.

39. పైది, ఒకటి; 141 అ - 34 నుంచి 36 శ్లో.

40. పైది, మూడు; పు. 16.

41. పైది, పదమూడు; పు. 750 నుంచి 761 వరకు.

42. పైది, పద్దెనిమిది; పు. 150. మరియు.
పి. రాజగోపాలనాయుడు, కురుక్షేత్రే; పు. 92.

43. పైది, మూడు; పు. 20.

44. పైది, ఇరవై ఒకటి; పు. 110.

45. పైది, పద్దెనిమిది; పు. 173.

46. పింగళి సూరన, రాఘవ పాండవీయము; 1 ఆ - 2, 5.

47. పైది, మూడు; పు. 10.

48. పైది, మూడు; పు. 11.

49. వి. ఎస్. రాఘవన్, తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము; పు. 93;

50. కొత్తపల్లి సూర్యారావు, దుర్యోధన విజయము; పు. 2.

# 2.2 రాజనీతి

ప్రజా సంక్షేమానికి రాజు అనుసరించే ధర్మమే రాజధర్మం అవుతుంది. ప్రజలు వారి ధర్మాలను అతిక్రమించకుండ సక్రమంగా నిర్వర్తించేటట్లు చూడటం ప్రభువైనవాని ప్రథమ కర్తవ్యమని, అలాంటి రాజు ఇహపర సుఖాలను అనుభవిస్తాడని కౌటిల్యుని అభిప్రాయం.[1] రాజైనవాడు అరిషడ్వర్గాలను జయించి ఇంద్రియలోలుడు కాకుండ ఉండాలి. ప్రజ్ఞావంతుడై చారుల ద్వారా సమస్త రాజ్యాంగ వ్యవహారాన్ని చూడగలవాడు కావాలి. రాజు తన ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తించటంవల్ల ఆదర్శప్రాయుడై ప్రజలు వారి వారి ప్రత్యేక ధర్మాలను నిర్వహించేటట్లు చేయకలగాలి. సమస్త విద్యలను అభ్యసించి వినయవంతుడై అర్ధవంతాలైన కార్యాలను నెరవేర్చి ప్రజలకు అభిమాన పాత్రుడై ఉండాలి. ప్రజల హితం సాధించటంలో ఋజువర్తనుడుగా వ్యవహరించటం అవసరం. రాజైనవాడు పరస్త్రీ, పరద్రవ్యములను అపహరించటం మొదలైన దుష్కార్యాలను త్యజించి ప్రజాహితానికి అనర్థాలైన వ్యవహారాలను అన్నింటిని వదలి ప్రజలకు ఆదర్శప్రాయంగా వ్యవహరిస్తే సమాజం ఎడ తన బాధ్యతను నెరవేర్చిన వాడవుతాడు. సమాజం సక్రమమైన మార్గంలో పురోగమనం సాగించేందుకు రాజులు తమ బాధ్యతలు శ్రద్ధాసక్తులతో నిర్వర్తించటమే ప్రధానం అంటూ "The fulfilment of their duties and responsibilities by rulers was paramount importance to the stability and orderly devolopement of society and to the happiness of individuals in the state and therefore one often finds that Rajadharma is said to be the root or the quintessence of all Dharmas"[2] అని రాజధర్మమే సకల ధర్మాలకు మూలమని పి. వి. కాణె అభిప్రాయపడ్డాడు.

రాజు ప్రజాహితంగా తన ధర్మాన్ని నిర్వహించేందుకు రాజోద్యోగుల సహకారం ఎంతో అవసరం. అందువల్ల విశ్వాసపాత్రులైన ఉద్యోగులను ఎన్నుకోవటంలో రాజు ఎంతో మెలకువతో వ్యవహరించవలసి ఉంటుంది. ఎల్లప్పుడు ఆపదలపాలు కాకుండ నివారించ సామర్థ్యం కలవారిని, రహస్య ప్రవర్తనలందు కూడ నీడవలె వెన్నంటి ప్రమాదాల నుంచి రక్షించగల అమాత్యులను, ఆచార్యులను

రాజు నియమించుకోవాలి. వీరిలో వీలైనంతవరకు తండ్రి తాతలకాలం నుంచి వంశ పారంపర్యంగా సేవించే వారినే స్వీకరించటం రాజుకు ఎంతో మేలు చేస్తుంది. రాజోద్యోగులలో పురోహితుడు, మంత్రి, అమాత్యుడు, సేనాపతి మొదలైనవారు ప్రధాన పాత్ర నిర్వహిస్తారు. వీరి తోడ్పాటుతో రాజు ప్రత్యక్షమూ, పరోక్షమూ, అనుమేయమూ అనే మూడు మార్గాలలో తన ధర్మాన్ని నిర్వర్తించవలసి ఉంటుందని అర్థశాస్త్రంలో ఉట్టంకించి ఉంది.[3] ఈ రాజోద్యోగుల ఎడ అంధ విశ్వాసంతో ప్రవర్తించక, వారి ప్రవర్తన విధేయతలను ఎప్పటికప్పుడు తెలుసుకొనేందుకు ప్రత్యక్షంగా తన అధీనంలో ఉండే గూఢచారి వ్యవస్థను ఏర్పరచి పదవీ భద్రతకు, ప్రజాశ్రేయస్సుకు కృషిచేయటం ఎంతైనా అవసరం. ప్రజల సుఖమే రాజుకు సుఖము, ప్రజల హితమే రాజుకు హితము కనుక రాజధర్మ నిర్వహణంలో ప్రభువైనవాడు ప్రజాహితంగా మెలగాలి. ప్రజాక్షేమం ఎడ దృష్టిసారించక స్వార్థలాభదూషితులైన ప్రభువులెందరో కాలగర్భంలో కలిసిపోయిన ఘట్టాలు చరిత్ర పుటలలో మనకెన్నో దర్శనం ఇస్తాయి.

**రాజనీతి, దేశీయము — వైదేశికము :-** ప్రజాక్షేమం కోసం రాజు అనుసరించే రాజనీతి సాధారణంగా దేశీయము, వైదేశికము అని రెండు శాఖలుగా సాగుతుంది. రాష్ట్రంలో వర్ణాశ్రమ ధర్మాలు సక్రమంగా నిర్వహించబడేటట్లు చూడటం ప్రజలలో న్యాయవ్యవస్థ పరంగాను, రాజ్యాంగ వ్యవస్థ పరంగాను అనుమానాలకు, భయసందేహాలకు అవకాశం లేకుండ, భద్రత, రక్షణ భావం కలిగించి దేశసౌభాగ్య పురోగమనంలో వారు స్వచ్ఛందంగా పాల్గొనేటట్లు చూడటం రాజధర్మ నిర్వహణంలో దేశీయ విధానం కర్తవ్యం అవుతుంది. దేశీయ ప్రజలలో ఈ విధమైన సమిష్టిభావాన్ని, సమైక్యతా భావాన్ని కలిగించేందుకు దండనీతిని ఉత్తమ సాధనంగా ప్రాచీన రాజనీతి శాస్త్రవేత్తలు పేర్కొన్నారు. ఏదేశమైనా అంతరంగిక సుఖశాంతులను పెంపొందించుకోవాలి, ప్రజలంతా రాజ్యసౌభాగ్యాన్ని సాధించాలనే చైతన్యంతో ఉత్తేజం పొందినప్పుడు ఆ రాజ్యం అన్ని రంగాల్లోను పురోగమనం సాధిస్తుంది. రాష్ట్రం శాంతి సౌభాగ్యాలతో సుస్థిరంగా ఉన్నప్పటికీ పొరుగు రాజ్యాలతో ఉన్న సంబంధ బాంధవ్యాలు దేశ పురోభివృద్ధిపై ఎంతో ప్రభావం చూపిస్తాయి. పొరుగురాజ్యాలతో సన్నిహిత భావంతో మైత్రీ బంధం పెనవేసుకుంటే రెండురాజ్యాలు సుభిక్షంగా ఉంటాయి.

అట్లాకాక శత్రుభావం నెలకొని యుద్ధ వాతావరణంలో బ్రతుకు సాగించవలసి వస్తే అది రెండు రాజ్యాల సౌభాగ్యానికి గొడ్డలి పెట్టు అవుతుంది. అందువల్ల ఇరుగు పొరుగు రాజ్యాలతో సంబంధ బాంధవ్యాలు వృద్ధిచేసుకొనేందుకు రాజు ఉత్తమ స్థాయిలో వైదేశికరాజనీతిని ప్రదర్శించ వలసి ఉంటుంది.

ఉత్తమ రాజనీతిజ్ఞుడైన రాజు మిత్ర సముదాయాన్ని పెంచుకొని, శత్రు రాజుల సంఖ్యను తగ్గించుకొనేందుకు ప్రయత్నిస్తాడు. రాజైనవాడు మిత్రులను సమకూర్చుకోవటం భూమి, బంగారం సంపాదించుకొన్న దానికన్నా అధికమైందంటూ యాజ్ఞవల్క్యుడు "హిరణ్యభూమి లాభేభ్యో మిత్రలబ్ధిర్వరాయతః"[4] అని మిత్రా వరణంవల్ల రాజులకు కలిగే ఉపయోగాన్ని వ్రాశాడు. సాధారణంగా అనేక రాజ్యాలకు పొరుగురాజ్యాలతో సఖ్యభావం లేకుండ ఏదో ఒక విధమైన సమస్యలు తలెత్తుతూ పరస్పరం వైమనస్యాలుంటుంటాయి. ఇట్లాంటి సందర్భాలలో మిత్ర రాజ్యాలతో ఉన్న స్నేహం చెడకుండ, శత్రురాజ్యాలతో ఉన్న వైరుధ్యం పెరగ కుండ చూచుకోవటం రాజనీతిజ్ఞుడైన రాజు ప్రధానకర్తవ్యం. వారిలో మిత్ర భావంతో ఉండే వానిని సామదానములచేత, శత్రుభావం కలవానిని భేద దండముల చేత వశపరచుకోవాలని అర్థశాస్త్రంలో పొందుపరచబడి ఉంది.[5] అది సాధించేందుకు ఆ రాజులు ఎంతో విజ్ఞత ప్రదర్శించవలసి ఉంటుంది. రాజనీతి ప్రయోజకత్వం పైనే లాభనష్టాలు ఆధార పడి ఉంటాయి ప్రతి పక్షులు కూడ ఇదే విధమైన రాజ నీతి నేర్పరులై ఉంటారు కనుక, రాజనీతి ప్రదర్శనలో రాజులు స్వార్థ ప్రయోజ నాలకన్నా ప్రజాప్రయోజనాన్ని, దేశక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొంటే సత్ఫలితాలు పొందవచ్చు. అట్లాకాక రాజనీతి ప్రయోగంలో శత్రువులదే పైచేయి అయితే అధి కార పీఠం కదలిపోవటమేకాక ప్రజాక్షయం, దేశ సంక్షోభం కలిగేందుకు అవకాశం హెచ్చుగా ఉంది. అందువల్ల వైదేశిక రాజనీతి ప్రదర్శించటంలో రాజులు ఎంతో జాగరూకతతో మెలగ వలసి ఉంటుంది.

ప్రాచీన కాలంనుంచి భారతీయ సమాజంలో పేరెన్నికగన్న రాజనీతి కోవిదులు, రాజనీతి శాస్త్రవేత్తలు ఎందరో ప్రసిద్ధిచెందారు. గ్రంథాల్లోకూడ రాజకీయ దురంధరత్వం ప్రదర్శించి సామాజిక హృదయాల్లో స్థిరంగా నిలిచి పోయిన పాత్రలెన్నో దర్శనమిస్తాయి. ఆధునిక యుగంలో ప్రపంచ శాంతికోసం జీవితాలర్పించిన రాజనీతివేత్త లెందరో ఉన్నారు. అట్లానే విధ్వంసక రాజనీతిని

ప్రదర్శించి జీవితంలో భ్రష్టులు కావటమే కాకుండ మానవాళి నాశనానికి కారణ భూతులైనవారు కూడ కొందరున్నారు.

మహాభారతం పరిశీలిస్తే ఉత్తమ రాజనీతి కోవిదులైన రాజులు, కేవల రాజనీతి శాస్త్రవేత్తలైన సచివులు కనిపిస్తారు. కింట్లో ప్రధానంగా కురు, పాంచాల, యాదవ, మాత్స్య, గాంధార, మద్ర, సింధు రాజవంశాలు నిర్మాణిన బడ్డాయి. వీరితోపాటు ఎన్నో వంశాలు కురుక్షేత్ర సంగ్రామంలో సమిసలైనా, ఈ రాజ వంశాలు భారత కథలోని ప్రధాన ప్రత్యర్థులతో సంబంధ బాంధవ్యాలు కలిగిన పెద్ద వంశాలై వర్తిల్లాయి. మహాభారతంలో ధృతరాష్ట్రుడు, ధర్మరాజు, శ్రీకృష్ణుడు, సుయోధనుడు, శకుని, ద్రుపదుడు, మొదలైనవారు రాజనీతి కోవిదులుగాను, విదురుడు, సంజయుడు, కణికుడు, భీష్ముడు మొన్నగువారు రాజనీతి శాస్త్రవేత్తలు గాను కనిపిస్తారు. వీరిలో భీష్ముదులు బోధించిన రాజనీతి, శ్రీకృష్ణుడు అనుస రించిన రాజనీతి, కణికుడు బోధించిన రాజనీతి ముడు భిన్న మార్గాలలో నడచినట్లు పరిశీలనవల్ల తెలుస్తుంది. అధర్మపరులైన శత్రువుల ఎడ కూడ ధర్మాన్ని పాటించ టం భీష్ముని రాజనీతి అయితే, ధర్మవర్తనులైన శత్రువుల పరంగా ధర్మాన్ని పాటించి, అధర్మ వర్తనులైన శత్రువులఎడ అధర్మాన్ని పాటించటం కృష్ణుని మార్గం కాగా, శత్రువు ఎట్లాంటివాడైనా అధర్మాన్నే అనుసరించటం కణికుని రాజనీతి విశేషంగా అనిపిస్తుంది. వీరందరిలోను ప్రధాన ప్రత్యర్థులైన ధృతరాష్ట్రుడు, ధర్మరాజు ఎవరికి వారు రాజకీయంగా లబ్ధి పొందేందుకు ప్రదర్శించిన రాజనీతి భారతకథలో విశిష్టంగా నిలుస్తుంది. ఇరుపక్షాలలోను శకుని, కర్ణుడు శ్రీకృష్ణుడు మున్నగువారి తోడ్పాటు వీరికి లభించింది.

ప్రస్తుతం లభ్యమయ్యే స్వరూపంలో ఉన్న భారత కథ పాండవాను కూలంగా ఉండటం వల్ల ధృతరాష్ట్రుని రాజనీతి లోప భూయిష్ఠంగా ఉన్నట్లు ఏక పక్ష నిర్ణయంగా కనిపిస్తుంది. కొంత విశ్లేషణా దృష్టితో పరిశీలిస్తే రెండు పక్షాల లోను పరస్పరం సాధించుకోవాలనే ధోరణి కనిపిస్తుంది. ఇరుపక్షాల లోను మంచి చెడులు కలిసి కట్టుగా ఉన్నట్లు తెలుస్తుంది. అయితే యుద్ధంలో విజయం సాధించిన పక్షం పాండవులది కనుకను, శ్రీకృష్ణుడు వారికి అండగా ఉండటంచేత వారిది ధర్మ పక్షంగా ముద్రపడటం వల్లను, పాఠకుల సానుభూతి పాండవాను కూలంగా ఆయత్తం చేయబడింది కనుకను ధృతరాష్ట్రాదులు నిర్వర్తించిన కార్యక్రమాలే

అధర్మంగాను, అన్యాయంగాను ఉన్నట్లు వివరించటం జరిగింది. నిష్పక్షపాత దృష్టితో ఇరువర్గాలలోని రాజుల ప్రవర్తనను సమీక్షించినట్లయితే ఏ ఒక్కరి యందో మాత్రమే లోపం ఉందని చెప్పలేము. రెండు పక్షాలు ఎత్తుకు పై ఎత్తు వేసుకోవటం, ఒకరినొకరు బలసమీకరణంతో సాధించేందుకు ప్రయత్నించటం గోచరం అవుతుంది. తాను, తన పక్షం నొవ్వకుండ శత్రువును సాధించి ప్రజా క్షయం కాకుండ చూడటమే ఇరువైపుల ప్రదర్శించిన రాజనీతికి మూలంగా ఉంది. అయితే సామదాన భేదోపాయాలతో ఒకరినొకరు సాధించుకోవటం సాధ్యం కాలేదు కనుక యుద్ధం అనివార్యం అయింది. జయాపజయాల మాట ఎలా వున్నా, యుద్ధానికి మూలకారణం ఇరువైపుల సంయమనం, సదవగాహన లేకపోవటమే నని భావించవలసి ఉంటుంది. కొన్ని సమయాల్లో పాండవుల ఎడ ధృతరాష్ట్రుని ప్రవర్తన ప్రశ్నార్థకంగా కనిపించినప్పటికీ, నేరం అంతా ఆ మహారాజు నెత్తిన రుద్దటం మాత్రం సాహసమే అవుతుంది. ఈ నేపథ్యంలో మహాభారతంలో కురు సామ్రాజ్యాధిపతిగా ధృతరాష్ట్రుని ప్రదర్శించిన రాజనీతి, అతడు ఆశించిన ఫలితాలు, పొందిన అనుభవాలను విశ్లేషించటం ప్రస్తుతాంశం.

విచిత్రవీర్యుడు మరణించిన తరువాత బాల్యంలో ఉన్న ధృతరాష్ట్రుణ్ణి కురు సామ్రాజ్యాధిపతిగా చేసి భీష్ముడు రాజ్య రక్షణ భారం వహించాడు. కొంత కాలానికి పాండురాజు పెద్దవాడు కావటంతో భీష్ముని కనుసన్నలలో మెలగుతూ శత్రురాజ్యాలను జయించి అగ్రజుడైన ధృతరాష్ట్రునకు సాయంగా మెలగాడు. ఈ కాలంలో ధృతరాష్ట్రుడు రాజ్యాంగపరంగా విశిష్టమైన నిర్ణయాలేమీ తీసుకోవలసిన అవసరం కలగలేదు. దేశీయంగా

"ధర్మాభి సంరక్షితంబైన భూప్రజ,
కెంతయు నభివృద్ధి యెసగు చుండె
వలసిన యప్పుడు వానలు గురియుట,
సస్య సమృద్ధి ప్రశస్తమయ్యెఁ
బాడిసేపె బుష్ప ఫల భరితంబులై
తరువనంబు లొప్పె ధర్మకర్మ
నిరతిఁ జేసి కరము నెమ్మితో నన్యోన్య
హితముఁ జేయు చుండి రెల్ల జనులు" (ఆది. 5-3).

అట్లా జీవిస్తూ రాజ్యసంవృద్ధికి కారణభూతులయ్యారు. పాండురాజు విజయాలు వైదేశిక నీతిలో కురుసామ్రాజ్యానికి అగ్రాసనాధిపత్యం చేకూర్చాయి. అందునా అప్పటికి ధృతరాష్ట్రుడు స్వయం నిర్ణయాలు చేసే స్థితిలో లేడు.

కుమారాస్త్ర ప్రదర్శన సమయంలో కర్ణునకు అంగరాజ్యాభిషేకానికి అంగీకరించటం కుమారుని ఇచ్ఛను తీర్చేందుకే కాని, ధృతరాష్ట్రుడు తానుగా ప్రత్యేకరాజకీయ కారణాలను మనసులో పెట్టుకొని, చేశాడని తలంచలేము. ఆ సమయానికి కుమారుల మధ్య వైషమ్యాలు ఉన్నట్లు తెలుస్తుంది కాని పాండవాధిక్యతను గూర్చిన ఆందోళన ధృతరాష్ట్రుని మనసులో ఉన్నట్లు భావించటం సమంజసం కాదు.

**యౌవరాజ్యాభిషేకం :** ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం జరిగేంత వరకు రాజాంతఃపురంలోకాని, రాజ్యంలోకాని రాజకీయంగా ఆందోళన కలిగించే విశేషాలకు తావులేకుండ సవ్యంగానే ఉంది. గురు దక్షిణ తీర్చే ప్రయత్నంలో అర్జునుడు ద్రుపదుణ్ణి బంధిస్తాడు. ఆ ఘనకార్యం సాధించి నందుకు సంతోష సూచకంగా ధృతరాష్ట్రుడు కురు పాండవులందరకూ అగ్రజుడైన ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం చేసి మనః ప్రీతిని కలిగిస్తాడు. యౌవరాజ్యాభిషేకం చేయటంలో రాజకీయ కారణాలు లేకపోయినప్పటికీ, అర్జునుడు సాధించిన ఘన కార్యానికి సంతోషించటంలో మాత్రం కొంత రాజకీయం ఇమిడి ఉన్నట్లు తలచవచ్చు. ఆనాటి రాజవంశాల్లో [illegible] ప్రముఖమైంది. అప్పటికి కురు పాంచాలుర మధ్య శత్రుత్వం లేకపోయినా బలవంతమైన సామ్రాజ్యాన్ని గూర్చి ఎల్లప్పుడూ హృదయంలో జంకు ఉంటూనే ఉంటుంది. అదీగాక తనపై ప్రతీకార వాంఛతో ఉన్న ద్రోణునకు ఆశ్రయం ఇవ్వటం ద్రుపదునకు కంటక కారణం అయ్యేందుకు అవకాశం ఉంది. ఆ సమయంతో ఏదో ఒక కారణం పేరిట ద్రుపదుడు [illegible] సిద్ధం కావచ్చు. కనుక ద్రోణునకు ఆశ్రయం ఇవ్వటంవల్ల కురు పాంచాలురకు పూర్తిగా శత్రుత్వం [illegible] మైత్రి మాత్రం లేదని రూఢిగా చెప్పవచ్చు. ఇట్లాంటి పరిస్థితుల్లో ద్రుపదుడు బంధింపబడటం వల్ల ద్రోణుని దయాదాక్షిణ్యాలపై ఆధారపడటమే కాక అర్ధరాజ్యాన్ని పోగొట్టుకోవలసి వచ్చింది. ఈ విధంగా మానసికంగాను రాజకీయంగాను ద్రుపదుని ప్రాబల్యం తగ్గుతుంది. సమ[illegible]ైన రాజు ప్రాబల్యం తగ్గటం వైదేశిక రాజ

నీతిలో కురుసామ్రాజ్యానికి లాభదాయకం అవుతుంది. ఆ సంతోషం ఫలితమే ధర్మరాజు యౌవరాజ్యాభిషేకం అని తలంచవచ్చు.

యౌవరాజ్యాభిషేకం కురువంశ జీవనంలోను, కురువృద్ధుల హృదయాలలోను, అంతఃపురంలోను అనేక విపరిణామాలకు పునాది అయింది. బాల్యంనుంచి సుయోధనాదులకు పాండవులతో చిన్న చిన్న తగవులున్నా, పెద్దల హృదయాల్లో కూ సామరస్యం లోపించటానికి ఆరంభం ఇక్కడే జరిగినట్లు భావించవచ్చు. ధర్మరాజు తమ్ముల శక్తిసామర్థ్యాలవల్ల "యౌవరాజ్య యుతుడయ్యును బెంపున సార్వభౌముడై" (ఆది. 6-93) ప్రకాశించాడు. దీనికి తోడు ద్రోణాచార్యుడు అర్జునునిపై ప్రత్యేక శ్రద్ధతో బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రసాదించాడు.

**వారణావత ప్రయాణం :** పాండవుల ఔన్నత్యం సహజంగానే సుయోధనునకు సహించరానిది, భరించరానిదై తరుణోపాయం కోసం కణికుణ్ణి ఆశ్రయిస్తాడు. కణికుడు శత్రువును కడతేర్చేందుకు దుర్మంత్రాలను మాత్రమే విశ్వసించిన రాజనీతిశాస్త్రవేత్త. తాను నమ్మిన రాజనీతినే సుయోధనునకు బోధిస్తూ

**"తఱియగు నంతకు రిపుఁ దన**
**యఱకఁ బెట్టికొని యుండునది దఱియగుడుం**
**జెఱచునది ఘాతిమీదను**
**వఱలగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్"** (ఆది 6-115)

అని హితవు చెప్తాడు. తనకు అపకారి అయినవాడు అల్పుడనే భావంతో ఉదాసీనంగా ఉండటం మంచిదికాదని, శత్రువని అనుకొన్న వానిని "యెట్టులుం, గడుకొని ... జెఱుపవలయుట కాదు మ. రాజనీతిమైన్: కావున సర్వ ప్రకారంబుల నపకారకారిణులైన వారిం బరిభవించున నుపేక్షింపక యాత్మరక్షా పరుండవయి దూరంబుచేసి మాపింపవలయునది" (ఆది. 5-119,126) అని కర్తవ్యం ఉపదేశిస్తాడు.

కణికుని ఉపదేశాన్ని కార్యరూపంలో పెట్టే నిమిత్తం సుయోధనుడు తండ్రిని చేరి పాండవుల ఔన్నత్యం, వారిని పౌరులు కొనియాడటం, అందునా ధర్మరాజును యువరాజును చేయటం తనకు అభద్రతతో కూడిన ఆందోళన కలిగి

స్తున్నదని వాపోతాడు. ధర్మరాజు రాజైతే వారి సంతతివారే రాజులవుతారని, తాము తమ సంతతి హీనస్థులుగా సేవావృత్తిలో జీవితం సాగించవలసి ఉంటుందని, అందుకే పాండవులను కొంతకాలం వారణావతం పంపిస్తే, హస్తినాపుర ప్రజలకు సకల సౌకర్యాలు సమకూర్చటం ద్వారా సంతోషం కలిగింపచేస్తామని, ఆ తర్వాత పాండవులు వచ్చినా ప్రజల మనోభీష్టం వారియందు లగ్నం కాకుండ ఉంటుంది అని విన్నవిస్తాడు.

కుమారుని ఆలోచనను అంగీకరించిన ధృతరాష్ట్రుడు, అతణ్ణి సంతోష పెట్టేందుకై, పాండవులను పిలిచి కుంతీ సహితులై వారణావతం పోయి కొంత కాలం నానా రాజ్యశ్రీలతో గడపవలసిందని ఆజ్ఞాపిస్తాడు. ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతం పంపే విషయం పరిశీలిస్తే పాండవైశ్వర్యానికి విచారించిన వాడు సుయోధనుడేనని, అతని మనోవ్యథను తీర్చేందుకు మాత్రమే రాజ్యాధికంగా పాండవులను వారణావతం పంపినట్లు తెలియడం అవుతుంది.

సంస్కృత భారతాన్ని పరిశీలిస్తే ఈ ఘట్టం ఇందుకు భిన్నంగా ఉంది. పాండవైశ్వర్యానికి అసూయాగ్రస్తుడై మార్గాంతరం అన్వేషించేందుకు ధృతరాష్ట్రుడే కణికుణ్ణి ఆశ్రయించినట్లు

> "శ్రుత్వాపాండు సుతాన్ వీరాన్ బలోద్రిక్తాన్ మహౌజసః
> ధృతరాష్ట్రో మహీపాలశ్చింతా మగమ దాతురః ॥
> తతస్సక్తాః పాండవానిత్యం తేభ్యోఽ సూయేద్విజోత్తమ
> తత్రమే నిశ్చితతమం సంధి విగ్రహ కారణం ॥
> కణికత్వం మమా 'చక్ష్వకరిష్యే వచనం తవ'',[6]

అని ఉంది. కణికుడు తెలుగు భారతంలో సుయోధనునకు బోధించిన రాజనీతి సంతతిని ధృతరాష్ట్రునకు బోధిస్తాడు. పాండవ ప్రాభవం ధృతరాష్ట్రుణ్ణి ఎంతగా కలచివేసిందో కణికుడు గృహోన్ముఖుడైన తరువాతకూడ "ధృతరాష్ట్రో వాపి కౌరవ్య శోకార్తః సమపద్యత" [7] అన్న శ్లోకంవల్ల తెలుస్తుంది. ఇంతటి ఆందోళనతో ఉన్న ధృతరాష్ట్రుని వద్దకు సుయోధనుడు వచ్చి తెలుగుభారతంలో చెప్ప

బోసుకొన్న విధంగానే బాధనంతటిని వ్యక్తం చేస్తాడు. ధృతరాష్ట్రుని సమాధానం కూడ తెలుగు భారతంలో లాగానే ఉంది. పాండవ ప్రాభవానికి అసూయాగ్రస్తుడై ధృతరాష్ట్రుడే కణికుణ్ణి ఆశ్రయించిన సమయంలో అదే ఆలోచనతో కుమారుడు రావటమే అనవసరమైతే, అతడు వచ్చినప్పుడు పాండవులను వారణావతం పంపేందుకు పెద్దలు అంగీకరించరేమో అని ధృతరాష్ట్రుడు అనటం అసంగతంగా ఉంది. అనంతరం సుయోధనుడు ఆలోచించిన విధంగానే తాను ఆలోచిస్తున్నానని చెప్పటం మరీ విచిత్రంగా ఉంది. ఈ అంశాలలో కణికునితో ధృతరాష్ట్రుని ఆలోచనకాని, సుయోధనుడు తన మనోవేదనను తండ్రికి వెల్లడించటం కాని, ఏదో ఒకటి అనంతర కల్పనమై ఉంటుందని భావించవచ్చు.

నన్నయగారు ఈ సందర్భంలో సుయోధనునకే ప్రాధాన్యం ఇవ్వతలచి, కణికునితో ఆలోచించినవాడు సుయోధనుడే అని మార్చి ఉండవచ్చు. అయినా ఈ ఏర్పాటుకూడ ధృతరాష్ట్రుడు తాత్కాలికం అనే ఉద్దేశంతోనే చేశాడు కాని, లాక్షాగృహ దహనవిషయం కూడ అతడికి ముందుగానే తెలుసు ననేందుకు ఆధారాలు వ్యర్థం. అదంతా సుయోధనుని పథకానికి అనుగుణంగా జరిగింది. అయితే పాండవుల ఔన్నత్యం, ప్రాభవం సుయోధనుని ఔన్నత్యానికి భంగకరం అవుతుందనే ఆందోళన మాత్రం ధృతరాష్ట్రుని మనసులో పాదుకొన్నట్లు అంగీకరించవలసి ఉంది. అందువల్లే చక్రవర్తిగా, కుటుంబ జ్యేష్ఠునిగా, కుటుంబంలోనే ఉంటూ తనకుమారులకు అసూయా కారకులైన వారిని కొంతకాలం దూరంగా ఉంచటం అనే నీతిని ప్రయోగించాడు. అయితే పథకాన్ని నిర్వహించటంలో లోపం వల్ల ధృతరాష్ట్రుడు ప్రదర్శించిన రాజనీతి విమర్శకు గురి అయింది. పరిస్థితులు ధర్మరాజుకు అనుకూలించి సుయోధనుని ఎత్తుకు పై ఎత్తు వేయటంతో ఆ పథకం కూడ విఫలమై పాండవులు లాక్షాగృహ దహనం నుంచి తమను తాము రక్షించుకొన్నారు.

**అర్ధరాజ్య ప్రదానం :** ధర్మరాజుకు అర్ధరాజ్య ప్రదానం ధృతరాష్ట్రుని రాజనీతి ప్రదర్శనలో ఒక ప్రముఖ సన్నివేశం. వారణావత సంఘటనలు ధృతరాష్ట్ర సుయోధనులకు అపకీర్తినే తెచ్చిపెట్టాయి. పాండవులలో శత్రుభావాన్ని పెంచాయి. ద్రుపదుని పరాభవం కూడ కురుపాంచాలుర మధ్య వైరభావాన్ని పెంపొందింప చేసింది. ద్రుపదుడు తనను బంధించిన అర్జునునిపై కన్నా,

తన అవమానానికి కారకుడైన ద్రోణునకు ఆశ్రయమిచ్చిన కురుసామ్రాజ్యంపై పగను పెంచుకొన్నట్లు తెలుస్తుంది. ఈ విధంగా ధృతరాష్ట్రుడు అటు పాండవులకు, ఇటు ద్రుపదునకు ప్రధాన శత్రువు అయ్యాడు. ఒక వ్యక్తికి సమాన శత్రువులైన ఇద్దరు వ్యక్తులు మిత్రులుగా దగ్గరై శత్రువును సాధించేందుకు ఉమ్మడి వ్యూహంతో ప్రయత్నించటం కద్దు. ద్రౌపదీ వివాహంలో పాండవ పాంచాల బాంధవ్యం గాఢంగా పెనవేసుకొన్నది. లాక్షాగృహంలో పాండవులు మరణించి ఉంటారనే సంతృప్తితో ఉన్న ధృతరాష్ట్ర సుయోధనులకు ఈ పరిణామం సహజంగానే ఆందోళనను, భయాన్ని కలిగించి ఉంటుంది.

ఆ భయంతోనే ఎట్లా అయినా ద్రుపదునితో పాండవులకు భేదం కల్పించి వారిని కడతేర్చే ఉపాయంకోసం సుయోధనుడు సన్నిహితులతో సమాలోచన సాగించాడు. ఈ ఆలోచనలో భాగంగా సుయోధనుడు "ఎడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింతమొండె, నలను గలవారలంబంచి కౌంతేయ మాద్రేయులను దమలో విరక్తులగునట్లుగాఁ జేయింతమొండె, నతిలలిత ప్రమదా జనంబుల ప్రత్యేకంబ యేవురకుం బ్రయోగించి ద్రౌపది వలన విరక్తిఁ బుట్టింతమొండె, నేవురకు నొక్కతియ యాలగుట కష్టంబని ద్రౌపదిఁ బాండవుల వలన విగతస్నేహఁ గావింతమొండె, నుపాంశు ప్రయోగంబుల భీము వధియించి తక్కిన వారల బలహీనులం జేయుదము" (ఆది. 8-22) అని అనేక ప్రతిపాదనలు చేస్తాడు. కర్ణుడు ఈ ప్రతిపాదనలు ఏవీ సమగ్రంగా నిర్వర్తించ వీలుకానివని కొట్టివేస్తూ "యుద్ధంబునం బాంచాలు భంజించి పాండవుల నొండుగడ నుండనీక తోడ్కొనివత్తము" (ఆది. 8-28) అని ద్రుపదునిపై దండోపాయం ప్రయోగించి పాండవులను చేరదీయటం ఉచితం అని సలహా ఇస్తాడు. అయితే పాంచాలంపై విక్రమిస్తే ద్రుపదునితో బంధుత్వం పెనవేసుకొన్న పాండవులు అతనిని ఏకాకిగా వదలి వేయరు అనే ఆలోచన కర్ణునకుగాని, సుయోధనునకుగాని రాకపోవటం శోచనీయంగా ఉంది.

ఈ విషయంలో భీష్మద్రోణులు పాండవులను స్నేహభావంతోనే చేరదీసి రాజ్యభాగం ఇచ్చి మన్నించటం ఉచితమని సలహా ఇస్తారు. పాండవులకు ఇవ్వమన్న అర్ధరాజ్యం వారికి పైతృకం అని వీరి అభిప్రాయం. కురుపాండవులిరువురూ తమకు సమానమేనని, వంశవర్ధనమే తమ ఆశయం అని, సామరస్య ధోరణితో

వ్యవహరించ వలసిందని సలహా ఇస్తారు. విదురుడు కూడ ధృష్టద్యుమ్నాదులతో కూడిన పాంచాల బంధుత్వం స్వయం ప్రకాశమైన పాండవ బలాన్ని ద్విగుణీకృతం చేసిందని, వారికి మానుషబలంతో పాటు దైవబలం కూడ తోడైందని, సుయోధ నాదులకన్నా ధృతరాష్ట్రుని భక్తిపరులై కొలుస్తారని చెప్పి, పాండవులు కూడ అతనికి పుత్రులే అనే విషయాన్ని విశదపరుస్తాడు. అంతటితో ఆగక పాండవుల బలపరాక్రమాలు దృష్టపూర్వాలేనని, అలాంటి వారితో విగ్రహం తలపెట్టటం దుర్బుద్ధితో కూడిందేనని అంటూ "నీ పుణ్యమ్మున నమ్మహాత్ములు జననీ సహితంబు లక్కయింట బ్రతికిరి నీయందు బురోచన దిగ్ధంబైన దయశః పంకంబుఁ బాండ వానుగ్రహ జలంబులంజేసి కడిగికొనుము" (ఆది. 8-49) అని వారణావత సంఘటనలవల్ల పొందిన అప్రతిష్ఠను పోగొట్టుకొనవలసిందని అర్థిస్తాడు.

ధృతరాష్ట్రుని సలహా దారులలో ఒక వర్గంవారు భేదదండోపాయాలు శ్రేయస్కరమని సూచిస్తే, రెండోవర్గం సామదానోపాయాలతోకూడిన సామరస్యం, సాన్నిహిత్యం, ఆత్మీయత, బంధుత్వం పెంపొందే అంశాలను గూర్చి వివరించారు. ఇరుపక్షాల వారి అభిప్రాయాలు విన్న ధృతరాష్ట్రుడు సామరస్య మార్గాన్ని అనుస రించేందుకు నిర్ణయించాడు. విదురుడు విశదీకరించిన పాండవ, పాంచాల యాదవ సమ్మేళనం ఆ మహారాజు హృదయంలో విక్రమిస్తే పరాభవం పొందవలసి వస్తుందే మోననే అనుమానానికి బీజంవేసి ఉంటుంది. ఒకవేళ పరాక్రమ ప్రదర్శనంవల్ల పాండవులను కడతేర్చే ప్రయత్నం విఫలమైతే శత్రు విజృంభణకు సంపూర్ణంగా రాజ్యాన్నే కోల్పోవలసి రావచ్చు. అంతేగాక వారణావత సంఘటనల దుష్టజ్ఞాప కాలు ప్రజాహృదయంలో సానుభూతిని కూడ దూరం చేస్తాయి. పథకం ఫలిస్తే శత్రు నిరాసనంతోపాటు రాజ్యం నిష్కంటకం అవుతుంది. పరిస్థితులు వ్యతిరేకిస్తే ప్రాణమానాలను పోగొట్టుకోవటమే కాక అప్రతిష్ఠపాలు కావలసి ఉంటుంది. ఈ పరిస్థితుల్లో విక్రమించటంలో ఎంతో సాహసం ఇమిడి ఉంది. అట్లాకాక సామ రస్య ధోరణి అవలంబించి తాత్కాలికంగా సాన్నిహిత్యం ఏర్పరచుకొంటే, తదనంతరం అదను తెలుసుకొని కార్యవ్యవహారం కొనసాగించవచ్చు. భట్టవర్తి నారాయణాచార్యులుగారు కూడ ఇట్లానే భావించారు.[8] సామరస్యం అవలంబించ టంవల్ల బలవంతుడైన శత్రువు ప్రతిఘటన నుంచి తప్పించుకోవచ్చు. వృద్ధుల హితవాక్యాలు విన్నందుకు వారికి సంతృప్తి కలుగుతుంది. లాక్షాగృహ దహన

పరిణామాలవల్ల పొందిన అప్రతిష్ఠ తొలగి పెదతండ్రిగా తన ప్రతిష్ఠ ఇనుమడి స్తుంది. అందువల్ల ప్రస్తుతం నెలకొన్న పరిస్థితుల్లో ధృతరాష్ట్రునకు సామదానో పాయలను అనుసరించటమే శ్రేయస్కరంగా కనిపించి ఉంటుంది. ఇరావతి కార్వే కూడ "ఈ పరిస్థితులలో రాజ్యంలో ఒక భాగం వారికి ఇవ్వటం ధృతరాష్ట్రునకు తప్పని సరి అయ్యింది"[9] అనే అభిప్రాయం వెలిబుచ్చాడు.

శత్రువుకు భయపడి సామమార్గాన్ని ఎన్నుకొన్నారంటే ఇతరుల దృష్టిలో పలచన అయ్యేందుకు అవకాశం ఉంది. కనుక తన మనోగత ఆలోచనలను బహి ర్గతం కానివ్వకుండ, పెద్దల సలహాను, వంశశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని దొడ్డ మనసుతో వ్యవహరించినట్లు ప్రవర్తించ బూనుకొన్నాడు. భీష్మద్రోణ విదు రులంటే తనకెంతో గౌరవమనీ, వారి ఆజ్ఞ శిరోధార్యమంటూ 'మీవంచిన విధంబున నప్పాండవుల కర్ధరాజ్యం బిచ్చెద" (ఆది. 8-51) అని సగామంభంగా తన నిశ్చయాన్ని ప్రకటించాడు. ఆ విషయంపై ఏ విధమైన చర్చకు అవకాశం ఇవ్వ కుండ వెంటనే పాండవులను తోడ్కొని వచ్చేందుకు విదురుణ్ణి పాంచాలనగరం పంపించాడు. పరిస్థితులు ప్రతికూలంగా ఉన్నప్పుడు సమయోచితంగా ప్రవర్తించి ధృతరాష్ట్రుడు తన రాజనీతి కౌశల్యాన్ని ప్రదర్శించాడు.

ధృతరాష్ట్రుని నేర్పరితనం పాండవులకు సర్వస్వం అయిన కృష్ణుని సాక్షిగా చేసుకొని ఇంద్రప్రస్థరాజ్య ప్రదానం చేయటంలో ద్విగుణీకృతం అయింది. పాంచాల నగరం నుంచి వచ్చిన పాండవులు హస్తినాపురంలో ఐదు సంవత్సరా లున్న తరువాత ఒక శుభ ముహూర్తంలో

"సర్వలోక కర్మ సాక్షి యీ కృష్ణుండు
సాక్షిగాగ మీకు సకల వృద్ధ
రాజులొద్ద నర్థరాజ్య మిచ్చితిఁ బాండు
రాజ విభవమెల్ల రమణఁగొనుడు" (ఆది. 8-65)

అని ధర్మరాజుకు ఇంద్రప్రస్థం రాజధానిగా అర్ధరాజ్య ప్రదానం చేస్తాడు. కృష్ణుణ్ణి సాక్షిగా చేసుకోవటం అతడి సానుభూతి పొందేందుకు, ఈ కార్యక్రమ నిర్వహ

ఐంలో తన చిత్తశుద్ధి వ్యక్తీకరించేందుకేనని తలంచటం భావ్యంగా ఉంటుంది. అంతరంగికమైన ఈ సమస్య పరిష్కారంలో ధృతరాష్ట్రుడు ప్రదర్శించిన రాజనీతి శ్లాఘనీయంగా ఉంది.

**ద్యూతము :** ద్యూత పరాజితుడైన ధర్మరాజును రాజ్యంలో పునః ప్రతిష్ఠితుణ్ణి చేయటం ధృతరాష్ట్రుని రాజనీతి ప్రదర్శనకొక ప్రబల ఉదాహరణంగా నిలుస్తుంది. సాటి రాజన్యుని వైభవాన్ని సహించలేని అసూయాగ్ని రగిలే హృదయంలో నుంచి జనించిన ప్రతీకార ఫలితమే సుహృద్ద్యూత, అనుద్యూతాలు. ఇంద్రప్రస్థంలో ధర్మరాజు నిర్వహించిన రాజసూయాగ్ని సుయోధనుని హృదయంలో అసూయా ద్వేషాగ్నిగా పరిణమించింది. పరిహాస భాజనమైన తన జీవితాన్ని అంతం చేసుకోవాలనే నిర్వేదం నుంచి, శకుని ప్రియోక్తులకు అనుగుణంగా ద్యూత ప్రయత్నం ప్రారంభమైంది. కణిక రాజనీతిని ఒంటపట్టించుకొన్న సుయోధనునకు రక్తపాత రహితంగా శత్రువును సాధించటంలోనే అధికాసక్తి కలిగింది. ఈ సందర్భంలో "రక్తపాత రహితముగ శత్రువుల నుండి రాజ్యమును సంగ్రహించుటకీ ద్యూతము ముఖ్య సాధనమయినది"[10] అన్న శిష్లా సూర్యనారాయణ శాస్త్రిగారి అభిప్రాయం గమనించదగింది. నందుల గోపాలకృష్ణమూర్తిగారు కూడ ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.[11] కుమారుని ఆసక్తికి అనుగుణంగా ధృతరాష్ట్రుడు ప్రవర్తించక తప్పలేదు. అతని హృదయాంతరంలో సుయోధనునకు అనుకూలభావాలే నెలకొని ఉండటం ఈ అంగీకారానికి కారణం కావచ్చు. భట్టవర్తి నారాయణాచార్యులుగారు "బలవంతులను జయించుటకు మాయోపాయమొక్కటే మందని పైచిత్ర వీర్యుడెరుగును. యుద్ధమున జయము కలుగునో లేదో చెప్పలేము. జూదమున జయము నిక్కము. ఇన్ని యాలోచనలతో గ్రుడ్డిరాజు పాండవులను జూదమునకై పిలిపించినాడు"[12] అని వెలిబుచ్చిన అభిప్రాయం గమనించదగ్గది.

ద్యూత వ్యసనుడైన ధర్మరాజు రాజధర్మం అంటూ సుయోధనుని ఉచ్చులో పడి శకునితో జూదమాడి సమస్తం కోల్పోతాడు. అసలు ఈ ద్యూతప్రక్రియయే శాస్త్ర సమ్మతంకాదని వి. ఎస్. రాఘవన్ "చక్రవర్తియై రాజసూయ మొనర్చిన ధర్మరాజు సామాన్య రాజయిన దుర్యోధనుని ప్రతినిధితో జూదమాడుట

ఉచితము కాదు. ధర్మ విరుద్ధము. అతడు తన ప్రతినిధిని శకునితో జూద మాడుట కేర్పాటు చేయవలెను. అట్లు జరుగలేదు. అందువలన ఈ ద్యూత ప్రక్రియ శాస్త్ర సమ్మతమైనదికాదు"[13] అని అభిప్రాయపడ్డారు. ద్యూతం శాస్త్ర సమ్మతమైనా కాకపోయినా, ఆ సమయంలో సభలో అవాంఛనీయ సంఘటనలనేకం జరిగాయి. అందులో ప్రధానమైంది ద్రౌపదీ మానభంగ ప్రయత్నం. ద్రౌపదీ మానభంగము, సంరక్షణము కూడ ద్యూత సభలో జరిగి ఉండవనీ కృష్ణునకు దైవాంశను కల్పించేందుకు తదనంతరకాలంలో కృష్ణభక్తులైన వారెవరో కల్పించిన ఘట్టం అని కొందరు పండితులు అభిప్రాయపడ్డప్పటికీ[14] సుహృత్ ద్యూతం పరి సమాప్తం అయ్యేటప్పటికి కౌరవ సభలో సంక్షోభం ఎక్కువ ఉండివచ్చు.

ధృతరాష్ట్రుడు ఆ సహాసంక్షోభానికి బెదిరిపోయాడు. ఆ మహారాజుకు సన్నిహితుడైన విదురుడు కూడ సుయోధనుని ప్రయత్నాన్ని నిరసించి "ఒక్కని కారణంబున కులంబున కెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబని శుక్రుండు చెప్పె" (సభా. 2-179) అని శుక్రనీతిని ఉట్టంకించి యదువృష్ణి వీరులు కృష్ణుని సాయంతో కంసుని అంతం చేసినట్లు పాండవుల సాయంతో దుష్ట సుయోధనుని విసర్జించి ధర్మరాజును ఆదరించవలసిందని హితవు చెబుతాడు. విదురుని హితోక్తులు ధృతరాష్ట్రుణ్ణి ఆలోచనలో పడవేశాయి. భీష్మద్రోణాదులు కూడ విజృంభించి పాండవ పక్షం వహిస్తే, రక్తపాత రహితంగా శత్రువును సాధించాలనుకున్న ప్రయత్నం వ్యర్థం కావటమేకాక మొదటికే మోసం వస్తుంది. అనివార్య పరిస్థితుల్లో విపత్తు సంభవిల్లినప్పుడు సమయానుకూలంగా వ్యవహరించ టం రాజనీతిలో భాగమే. ధృతరాష్ట్రుడు వెంటనే సుయోధనుణ్ణి పిలిచి సభలో ద్రౌపదిని దుర్భాషలాడినందుకు

"...... బాల్యము నాదిగ దుష్ట భావనం
పెరిగితి నీ నిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్"

(సభా. 2-255)

అని నిందిస్తాడు ధృతరాష్ట్రుని ఈ నిందావాక్యాలు సభలోని ఉద్రేకంపై చన్నీళ్ల ప్రాయంగా పనిచేసి ఉంటుంది. ఆ సమయంతో సభలో ఏర్పడ్డ వ్యతిరేక వాతా వరణాన్ని అనుకూలంగా మార్చుకోవటం కోసం, ద్రౌపదికి వరాలిచ్చే నెపంతో

ధర్మరాజుకు ద్యూతవిజిత రాజ్యం తిరిగి ఇచ్చి సంప్రీతుణ్ణి చేయ ప్రయత్నిస్తాడు. రాజ్యదానంతో కూడ పాండవులకు కోపోపశమనం కాదేమోననే భావంతో, కుమారునకు మారుగా తనను క్షమించమనే వేడుకోలుతో "సర్వశాస్త్ర విదుండయిన విదురుండు మంత్రిగా సర్వధర్మ విదుండవైన నీవు రక్షకుండవుగా నిక్కురు కులంబునకు లగ్గగు" (సభా. 2-267) అని కురువంశ క్షేమానికి ధర్మరాజే మూలమని సంభావించాడు. ఈ విధంగా చేయటంవల్ల ధర్మరాజు సంప్రీత మనస్కుడైనా కాకపోయినా, సభలోని ఉద్రిక్త వాతావరణం నుంచి బయటపడ కలిగాడు.

ధృతరాష్ట్రుడు ఈ సమయంలో ప్రదర్శించిన నీతి తాత్కాలికంగా విశిష్ట ప్రతిఫలాన్నే ఇచ్చిందని చెప్పవలసి ఉంటుంది. ధర్మరాజుకు రాజ్యదానం చేయటం రాజకీయ ప్రయోజనం కోసమే కాని, నిజమైన సుహృద్భావంతో కాదని అనంతర పరిణామాలు విశదపరుస్తాయి. రాజ్యదానం అనంతరం మైత్రినే ప్రదర్శిస్తే పెద తండ్రిగా తమ్ముని కొడుకులను ఆదరించినట్లే అయి ఉండేది. అట్లాకాక అనుద్యూతానికి అనుమతి నివ్వటంవల్ల అంతకు ముందు ప్రదర్శించిన పశ్చాత్తాపము, ప్రేమాభిమానాలు కృత్రిమాలేనని వెల్లడయింది. శత్రువును సాధించటంలో ఒక పథకం ఫలితాన్నీయనప్పుడు, మరొక వ్యూహం పన్నేందుకు సావకాశం కల్పించుకోవటానికి కొంత సమయం తప్పకుండ అవసరం అవుతుంది. ఆ సావకాశం కోసమే రాజ్యదానం, పరాళియటం జరిగింది. పాండవులను అనుద్యూతానికి ఆహ్వానించటం శత్రువును సాధించటంలో కొత్త ఎత్తు. సుహృద్ద్యూతంలో జూదం ఎక్కువ సమయం జరిగి గెలిచినవారి ఆర్భాటాలతో, ఓడినవారి ప్రతిజ్ఞలతో సభ ఉద్రిక్తతకు లోనయింది. అందుకే అనుద్యూతంలో అలాంటివి పునరావృతం కాకుండ ఉండటం కోసం పందెం పద్ధతే మార్చారు. జూదం దీర్ఘకాలం సాగకుండ ఒకే పందెంతో గెలుపు ఓటములు తేలిపోయేటట్లు పథకం తయారు చేయటంలోనే రాజనీతి విశేషంగా ప్రదర్శితం అవుతుంది. ఈ సందర్భంలో అదను ఎరిగి శత్రువు బలహీనతను దెబ్బకొట్టి జయించే ఆలోచనగల రాజనీతి ప్రత్యక్షం అవుతుంది. ఈ అభిప్రాయానికి "అనుద్యూతములో నియమించిన పణము నందజ్ఞాత వత్సరము చివరి సూచనలో ధృతరాష్ట్రుని ప్రజ్ఞాప్రాభవము మిగుల శోభించుచున్నది"[15] అన్న శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారి అభిప్రాయం ప్రోద్బలకంగా ఉంది. సుహృద్ద్యూతంలో మోసం జరిగిందని భావించిన ధర్మరాజు అనుద్యూతా

నికి అంగీకరించి, అదే వ్యక్తితో విలక్షణమైన పణానికి అనుమతించటం విచిత్రం గానే ఉంది. జూదానికి ఆహ్వానించటం, జూదం ఆడటం రాజలక్షణమే అయినా, విచక్షణా జ్ఞానం కోల్పోయి ఒక మహారాజు వ్యసన లోలుడుగా మారటం సమర్థించ తగిందిగా లేదు. ధర్మరాజు ద్యూత వ్యసనంపై "ద్యూత పరుడయిన ధర్మరాజు ధర్మిష్ఠుడెట్లామెనో బోధపడుట లేదు"[16] అన్న రాఘవన్‌గారి అభిప్రాయం కొంత కటువుగా ఉన్నప్పటికీ సత్యదూరం కాదు.

ఈ ఘట్టంలో ధృతరాష్ట్రుడు రాజనీతి చాతుర్యంతో ఇంకొక ప్రయోజ నాన్ని కూడ సాధించాడు. రాజ్యదానం మిషతో సభలో ఉద్రిక్తత తగ్గి, క్రొత్త పథకం వేసుకొనేందుకు సమయం లభ్యంకావటమే కాకుండ, పాండవులు ఒక స్త్రీ కారణంగా రాజ్యాన్ని దానంగా పొందారనే లోకాపవాదానికి లోనవటానికి కూడ అవ కాశం ఏర్పడింది. లోకులు అనుకోవటమే కాదు భీమసేనుడే

"రాజ్య, సంప్రాప్తి పాండవ సత్తములకు
సతికారణంబున ధృతమయ్యెనను నింత
కంటెను గష్టంబు గలదెయొండు" (సభా. 2-269)

అని అవమాన భారంతో ఆడిన ఆక్రోశానికి లోనయ్యాడు. ఉద్రేకపడే సోద రుణ్ణి ధర్మరాజు వారించవలసి వచ్చింది. స్త్రీ దయాభిక్షపై రాజ్యాన్ని పొందారనే మిషతో శత్రువును హీనపరచటం ఏ రాజుకైనా ప్రత్యర్థిపై అది నైతిక విజయమే అవుతుంది. ఇదంతా ధర్మరాజు ద్యూతవ్యసనం తోడుకాగా, ధృతరాష్ట్రుడు సమ యజ్ఞత, రాజనీతి కౌశలంతో సాధించాడని ప్రత్యేకంగా తలచవచ్చు. అతడు సాధిం చిన ఈ నైతిక విజయం శాశ్వతంగా నిలవకపోయినప్పటికీ, ఆ తరువాత పదమూడు సంవత్సరాలు నిష్కంటకంగా కురుసామ్రాజ్యాన్ని పరిపాలించేందుకు దోహద పడింది.

**రాయబారాలు :** ఉద్యోగ పర్వంలో రెండు పక్షాలలోని వారు తమ తమ రాజనీతి నైపుణ్యాన్ని ప్రదర్శించారు. ఉద్యోగ పర్వంలో మొత్తం

నాలుగు రాయబారాలు జరిగినప్పటికీ, వీటిలో ఏ ఒక్కటి కూడ యుద్ధాన్ని ఆపుచేసే ప్రయత్నంతో చిత్తశుద్ధిగా జరుగలేదు. రాజ్యం పొందే ప్రయత్నం పాండవులు, ఎట్లాగైనా రాజ్యం ఇవ్వకుండ నమ్రతతో మెలగాలనే ప్రయత్నం ధృతరాష్ట్రుడు చేసినట్లు స్పష్టం అవుతుంది. సంధి ప్రయత్నం కన్న ముందే యుద్ధ సన్నాహాలు ఇరుపక్షాలవారు చేయటం జరిగింది. వీటిలో మొదటి రాయబారం పాండవ పక్షాన ద్రుపద పురోహితుడు నిర్వర్తించింది.

ఉత్తరాభిమన్యుల వివాహానంతరం జరిగిన సభలో పాండవ పక్షంగా వారి క్షేమంకోసం చేయవలసిన పనిని గూర్చి ఆలోచించవలసిందని కృష్ణుడు సభలోని వారిని కోరటంతో ఉద్యోగం ప్రారంభం అవుతుంది. ఈ సందర్భంలో కృష్ణుని ఉపన్యాసం ఉద్యోగపర్వ నిధానానికి బీజప్రాయంగా ఉందని చెప్పవచ్చు. ఆ సభలో కృష్ణుడు తన ప్రారంభోపన్యాసంలో సభలోని వారు ఆలోచించవలసిన అంశాలను సూచిస్తూ ధార్తరాష్ట్రులు పరాభవించినప్పటికి ఉద్రేకించని ధర్మరాజు మంచితనాన్ని, రాజ్యం ఈ రెండు పక్షాలవారు కలిసి పంచుకోవాలనే విషయాన్ని మనసులో ఉంచుకొని జాగ్రత్తగా ఆలోచించవలసిందని కోరాడు. తన అభిప్రాయం చెబుతూ కౌరవులు సామరస్యంతో పాండవుల భాగం ఇస్తే మంచిదే, లేకుంటే అక్కడి పరిస్థితి తెలుసుకొనేందుకు వీలవుతుందనీ, ఈ లోపున పాండవ మిత్ర పక్షమంతా బలసమీకరణం చేయటం మంచిదని సూచిస్తాడు. కృష్ణుడు తన ఉపన్యాసంలో యుద్ధమే ప్రధాన విషయంగాచెప్పి. శాంతిమార్గాన సంధి ఒనగూడేందుకు రెండో ప్రాధాన్యం ఇచ్చాడు. అంటే పాండవులు రాజ్యం సాధించేందుకు దండ నీతినే రాజనీతిగా ఎన్నుకొన్నట్లు తెలుస్తుంది.

కృష్ణుని అనంతరం తమ్ముని మాటలను బలపరుస్తూనే బలరాముడు ధర్మరాజు ద్యూతవ్యసనంవల్లనే మోసపోయి చిక్కుపడి పోయాడని అంటాడు. బలరాముని మాటలలో పాండవులు జూదంలో ఓడిపోవటానికి దుర్యోధనుని ది మాత్రమే తప్పుకాదనీ, ధర్మరాజు బలహీనతే ప్రధాన కారణం అనే భావం వెల్లడవుతుంది. ఈ అభిప్రాయం ధృతరాష్ట్రుని ఆలోచనా సరణికి బలం చేకూర్చేదిగా ఉంది. శ్రీకృష్ణుడు నేరమంతా కౌరవులపైనే పెట్టి ఏకపక్షంగా మాట్లాడగా, బలరాముని మాటల్లో నిష్పక్షపాత వైఖరి స్పష్టం అవుతుంది. కృష్ణుని మాటల్లో ద్యోతకమయ్యే విక్రమదృష్టి అగ్రజుని మాటల్లో కనిపించదు.

సాధారణంగా ఎవరైనా తాము చేసే పనే సమంజసమూ, ధర్మబద్ధమూ, ప్రతిపక్షం వారి ప్రవర్తన దోష భూయిష్టమని నిరూపించి స్వకార్య ప్రయోజనం సాధించేందుకు ప్రయత్నించటం సహజం. ప్రతిపక్షం వారిని దోషాన్వితులని నిరూపించగలిగినప్పుడే స్వపక్ష సానుభూతిపరులను, అనుయాయులను సంపాదించు కోవటం సులభం అవుతుంది. అందువల్లే బలరాముడు పక్షపాత రహితంగా ఇరు పక్షాలను సమానంగా సంభావించటం సాత్యకి వంటి పాండవ పక్షపాతులకు కంటక ప్రాయంగా తోచింది. బలరాముని ఆలోచనలను గూర్చి పరిశీలించే అవకాశం సభాసదులకు ఇచ్చినట్లయితే పాండవకార్యం విఫలం అవుతుందనే దృష్టితో, కౌరవ సభ్యుల అభిప్రాయాలను ప్రతిబింబిస్తున్న వ్యక్తిగా, బలరాముని అభిప్రాయాన్ని తీక్ష్ణంగా విమర్శించి, యుద్ధం చేయటమే కర్తవ్యమనీ, అట్లాకాక ఈ లోపల సంధి ప్రయత్నం చేయవలసి వస్తే ఉత్తమునొకణ్ణి పంపటం ఉచితమనీ, సంధి వచనాలు కౌరవులు వినకపోతే ఆ దుష్ఫలితాన్ని వారే అనుభవిస్తారని నిశ్చయంగా పలుకుతాడు.

కృష్ణుడు కూడ అన్నను వ్యతిరేకిస్తూ మాట్లాడిన సాత్యకిని వారించలేదు. అందువల్ల బలదేవుని అభిప్రాయం కృష్ణునకు కూడ ఆమోద యోగ్యంకాదని తెలు స్తుంది. ద్రుపదుడు కూడ సాత్యకి అభిప్రాయాన్ని బలపరుస్తూ సుయోధనుడు వినయోక్తులకు, ప్రియ వచనాలకు రాజ్యభాగం ఇవ్వడు, యుద్ధంలోకాని కార్యం చక్కబడదని చెబుతాడు. మొత్తం మీద పాండవ పక్షంవారు యుద్ధోద్యమంలోనే ప్రధానంగా మనసుకలవారై, కౌరవులతో సంధి ప్రయత్నం ప్రారంభించినట్లు తెలు స్తుంది. ఉద్యోగ పర్వంలోని రాయబారాలకు ముందు జరిగిన ఈ భూమిక, సంధి ప్రయత్నం వైఫల్యం చెందటానికి ఉభయ పక్షాల్లోనివారు ముందుగానే ఏర్పరచు కొన్న స్థిరమైన నిర్ణయాలే కారణం అయ్యాయని తెలుసుకొనేందుకు ఉపకరిస్తుంది.

కృష్ణుని మనోభీష్టానికి అనుగుణంగా, సభలోని వారి అభిప్రాయాన్ని అనుసరించి ద్రుపదుడు తన పురోహితుణ్ణి పాండవ కార్యార్థమై ధృతరాష్ట్రుని వద్దకు పంపుతూ, అతడు సాధించవలసిన ప్రయోజనాలు రెండింటిని నిర్దేశిస్తాడు, ఒకటి కౌరవ పక్షంలోని వారి మనసులు పాండవ పక్షం వైపు మళ్లేటట్లు చూడటం, రెండోది ప్రతిపక్షంలోని వారి చిత్తవృత్తులను తెలుసుకోవటం. ద్రుపదుని అభి మతానుగుణంగానే అతడి పురోహితుడు హస్తినాపురంలో ముందుగా కురువంశ

పెద్దలందరనూ వారి వారి ఇండ్లలో దర్శిస్తాడు. అనంతరం సభలో ధృతరాష్ట్రి పాండురాజుల సహోదరత్వాన్ని వివరించి వారి కుమారులవటంచేత కౌరవ పాండవులు రాజ్యాన్ని సమంగా పంచుకొని అనుభవించటం ఉత్తమమని చెపుతాడు. అంతటితో ఆపితే హుందాగానే ఉండేది. కాని పాండవుల ఎడ ధృతరాష్ట్రిని ఉదాసీనతను ఎత్తిచూపుతూ, సుయోధనాదులు వారికి చేసిన అపకారాలను, వారు సహించిన విధానం వివరించి, అది వారి బలహీనతగా భావిస్తే ప్రమాదం వాటిల్లుతుందని హెచ్చరికగా పలుకుతాడు. పాండవులకు గల కృష్ణ సహాయాన్ని గుర్తు చేసి ఇరుపక్షాల హితవుకోరిన పెద్దలు యుద్ధం వారించి సహాయం మించిపోకముందే మహాత్ములైన పాండవులను స్నేహభావంతో పిలిపించి న్యాయంగా వారి భాగం ఇచ్చి కలిసి ఉండటం శ్రేయస్కరం అంటాడు.

ద్రుపద పురోహితుని మాటలు వినయ పూర్వకంగాను, లౌక్యంతోను కూడి ఉండక నిష్ప్రయోజనమై పరుషంగా ఉన్నాయి. ఆ మాటే భీష్ముడు కూడ అన్నాడు. స్నేహంతో ఎవరికైనా సంధి పొసగ వచ్చునేమోకాని, బెదరింపులతోను, హెచ్చరికలతోను ప్రత్యర్థిని లొంగదీసి సంధి సమకూర్చటం సాధ్యం అయ్యేదని కాదు. అందువల్లే ద్రుపద పురోహితుని రాయబారం సఫలం కాలేదు. అయితే రాయబారిని పంపేటప్పుడు శ్రీకృష్ణుడు ఆశించిన రెండో ప్రయోజనం సమకూరింది. కౌరవ నాయకులలో నెలకొన్న అనైక్య పరిస్థితి తెలుసుకొనేందుకు ఎంతో ఉపయోగపడి పాండవ పక్షంగా పరిమిత ప్రయోజనాన్ని సాధించింది.

ద్రుపద పురోహితుని సమక్షంలోనే పాండవులతో సంధి చేసుకొనే విషయంలో భీష్మ కర్ణులు వాగ్వివాదానికి దిగి పరస్పరం దూషించుకొంటారు. తమ నాయకులలోని వైరుధ్యాన్ని ప్రతిపక్షులు బలహీనతగా భావిస్తారు. అది తనకు, కుమారునకు, దేశానికి కూడ ఎంతో నష్టాన్ని కలిగిస్తుంది. వంశ ప్రతిష్ఠ మంట కలుస్తుంది. అందువల్ల ప్రజ్ఞాచక్షువైన ధృతరాష్ట్రుడు రాయబారిని శీఘ్రంగా సభ నుంచి హితోక్తులతో పంపివేస్తే తమలోని బలహీనతలన్నీ శత్రుపక్షానికి తెలియకుండా ఉంటాయని ఆలోచించి భీష్ముణ్ణి, కర్ణుణ్ణి శాంతపరచి, అందరతో ఆలోచించి భూప్రజకు ప్రీతి కలిగే విధంగా సౌమ్యుడైన వ్యక్తిని రాయబారిగా పంపిస్తానని ద్రుపద పురోహితునితో అంటాడు. కౌరవ జాతికి కురుపాండవులు కలిసి ఉండి సహజీవనం సాగించటమే ఉత్తమోత్తమమని తన మనసులో మాటగా చెప్తాడు.

ఇక్కడ ధృతరాష్ట్రుని మాటలు సంధి ప్రయత్నానికి అడ్డంకి లేకుండ నిరంతరంగా సాగేందుకు దోహదం చేస్తున్నాయి. ద్రుపద పురోహితుని రాయబారం ఆశించిన పలితం పూర్తిగా సాధించక పోయినా, సంధి ప్రయత్నం కొనసాగేందుకు మాత్రం దోహదం చేసింది. ఈ సందర్భంలో స్వపక్షం బలహీనత బయట పడకుండ ధృతరాష్ట్రుడు ప్రదర్శించిన రాజనీతి విశిష్టమై ఒప్పి ఉంది చక్రవర్తిగా అతడి ఆలోచన, ముందుచూపు ప్రదర్శితం అయ్యాయి.

యుద్ధంలో కృష్ణుని సహాయం అర్థించటం కోసం సుయోధనుడు ద్వారకకు పోవటంలో తండ్రీ కొడుకుల రాజనీతి విజ్ఞత శ్లాఘనీయంగా ఉంది. సుయోధనుడు కృష్ణుని సహాయం కోసం పోయేముందు తండ్రి ఆజ్ఞ తీసుకొన్నట్లు భారతంలో కనిపించక పోయినా, తండ్రికి తెలియకుండ అతడు ద్వారకకు పోయాడని తలంచ లేము. పాండవ పక్షం వాడని సంపూర్ణంగా తెలిసీ కృష్ణుని సహాయం అర్థించటానికి పోవటంవల్ల సుయోధనుడు రెండు ప్రయోజనాలు ఆశించి ఉంటాడు. అందులో మొదటి ప్రయోజనం ముందుగా అర్థించాడనే భావంతో తనకు సహాయం చేస్తే సర్వం సానుకూలం అవుతుంది. సహాయం చేయడనే భావంతో అర్థించకుండా ఉంటే బహిరంగంగా శత్రుత్వాన్ని ప్రకటించినట్లు ఉంటుంది. ఆ స్థితి కృష్ణునితో పాటు యాదవులకు కూడ కోపకారణం అయితే యాదవ సహాయం సంపూర్ణంగా పొందలేని పరిస్థితి ఏర్పడుతుంది. కృష్ణుణ్ణి అర్థించి కాదనిపించుకొంటే నేరం, శత్రు భావం కృష్ణునిపైనే ఉండి, సాటిరాజులలో సుయోధనుని ఎడ సానుభూతి సంపాదించుకోవచ్చు ఈ ఆలోచనలతో ద్వారకకు వెళ్లిన సుయోధనుడు కృష్ణుని సహాయం పొందలేక పోయినా, నారాయణాఖ్య గోపాలురు పదివేల మందిని సంపాదించ గలిగాడు. బలరాముడు తన పక్షాన రాలేకపోయినా కృష్ణునితో పాటు పాండవులకు అండగా పోకుండ నిలువరించ కలిగాడు. ఇంకా ఒక అక్షౌహిణీ సైన్యంతో కృతవర్మను తనపక్షం తిప్పుకోగలిగాడు. కృష్ణుడు పాండవ పక్షం వాడే అని సుయోధనుడు ద్వారకకు పోక పోయినట్లయితే ఈ ప్రయోజనాలు సాధించలేకపోగా, వారందరు శత్రుపక్షంలో చేరటం వల్ల తన బలం తగ్గిపోయి ఉండేది. సుయోధనుని ఈ ప్రయాణంలో రాజనీతితోపాటు ఉత్తముడైన రాజన్యుని యుద్ధనీతికూడ విశదమవుతుంది.

ఉద్యోగ పర్వంలో జరిగిన రెండో రాయబారం సంజయునిది. ద్రుపద పురోహితుని రాయబారంలో పాండవుల తండ్రిపాలు ఇవ్వటం అనేది సంధి సంబంధమైన ప్రధాన ప్రతిపాదనగా ఉంది. సంజయుని రాయబారంలో ఏవిధమైన సంధి ప్రతిపాదన కనపడదు. శుష్క ప్రియములు శూన్యహస్తములనే చందంగా ఉంది. పాణ్నంది రామశాస్త్రిగారు సంజయరాయబారాన్ని గూర్చి "ధర్మరాజు తమ భాగమిచ్చివేసినచో శాంతి నొందు నభిప్రాయము కలవాడును, సంజయుడు ఒట్టి మాటల నేర్పు చేతనే శాంతి నొందించు నభిప్రాయము కలవాడును అయి యున్నవారు"[17] అని చేసిన సమీక్ష సత్యదూరం కాదు. అంతరంగిక సచివుడు, సన్నిహితుడైన సంజయుణ్ణి పంపింపటంలోనే ఆ మహారాజు రాజనీతి వైశిష్ట్యం వెల్లడవుతుంది. శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారు కూడ "పాండవుల కడకు సంజయుని బంపుటలో ధృతరాష్ట్రుని రాజ్య తంత్ర ప్రావీణ్య మపారమై యొప్పుచున్నది" [18] అని అభిప్రాయ పడ్డారు. సంజయుడైతేనే తన ఆలోచనలకు అనుగుణంగా ప్రవర్తిస్తాడని ఆ మహారాజు విశ్వాసం.

సంజయుణ్ణి ఉపప్లావ్యం పంపే ముందు కొలువుతీర్చి సభలోని వారి మెప్పుకై పాండవ వీరుల బలపరాక్రమాలను విశిష్టంగా కొనియాడి కౌరవ పాండవులు క్షీరోదక వృత్తితో కలిసి బ్రతికటం శ్రేయస్కరమని అంటాడు. ముందుగా ధర్మరాజుతో తండ్రిగా వారి క్షేమంలో ఎంతో ఆత్రుతను ప్రకటించి, వారి యోగక్షేమాలను విచారించ వలసిందిగా కోరతాడు. వారంతా క్షేమంగా ఉన్నందుకు తాను ముదితాత్ముణ్ణి అయ్యానని చెప్ప మంటాడు. ఈ సంభావన లన్నీ బంధుత్వంలో కుశల ప్రశ్నలకు పనికివస్తాయేకాని రాజ్యభాగం విషయంలో సంధి ప్రయత్నం చేయటంలో ఏ విధంగాను ఉపయోగపడవు. సంధి ప్రయత్నం నిర్విఘ్నంగా విజయవంతం కావాలనే ఆకాంక్ష ఉన్నట్లయితే అందుకు సంబంధించి నిర్దిష్టమైన ప్రతిపాదన చేయాలి. ధృతరాష్ట్రుడు పాండవుల ప్రతిపాదనకు సమాధానంగా తన ప్రతిపాదన ఏదో వెల్లడించకుండ, ఇరువర్గాలు కలిసి శాంతియుత జీవనం సాగించటమే ఉత్తమ మైంది అని అంటాడు. ధర్మరాజు నిండు పేరోలగంలో ఉన్న సమయం చూసి అతడు యుద్ధం అనే ఆలోచనను వదలి విరోధ భావాన్ని త్యజించే టట్లుగా స్నేహం పాటించి తియ్యగా పలకవలసిందని సంజయునకు చెబుతాడు. ధర్మరాజు యుద్ధం అనే ఆలోచన మానేందుకు ప్రత్యామ్నాయంగా ఏమి చేయ దలచు

కొన్నదీ వెల్లడించలేదు. తన మనోరథం తీర్చుకొనేందుకు ఆ రాజు సంజయుని వాక్చాతుర్యం పైనే ఆధారపడ్డట్లు భావించవచ్చు. ఎక్కడైనా మంత్రాలకు చింత కాయలు రాలవు కదా! ఇరు పక్షాలు సైన్య సమీకరణం పూర్తి చేసిన ఈ దశలో తియ్యని మాటలతో ధర్మరాజుకు రాజ్యభాగాన్ని ఇవ్వకుండ శాంతిని సాధించాలనే ప్రయత్నం వ్యర్థంగానే కన్పిస్తుంది. ఈ అంశంలో బొట్లూరి నారాయణదాసు "పురోహితుని రాయబారం వల్ల రాజ్యభాగం లేకుండ పాండవులు సంధి కంగీక రించరనే విషయం విస్పష్టంగా తేలింది. రాజ్యభాగం సంగతి లేకుండానే సంధి చేసుకురమ్మని సంజయుని పంపు తున్నాడు ధృతరాష్ట్రుడు. ఇది ఎంత అసాధ్య కార్యమో అర్థమవుతూనే ఉంది. ఇట్టి అసాధ్య కార్యాన్ని సాధించుకొని రమ్మని ఆదేశించటంలో ధృతరాష్ట్రునిలోని కాపట్యం ఎటువంటిదో స్పష్టమవుతూనే ఉంది"[19] అని వెలిబుచ్చిన అభిప్రాయంలో సంధి పరంగా ధృతరాష్ట్రునకు చిత్త శుద్ధి లేదనే అంశం విశదమవుతుంది.

ధృతరాష్ట్రుడు ఇలా ప్రవర్తించటానికి తన సైన్యం మీద, కుమారుని శక్తి యుక్తులమీద అపారమైన విశ్వాసం ఉండటమే కారణంగా గోచరిస్తుంది. పుట్టపర్తివారుకూడ "తనవైపు గల యోధులపై నాతనికి నమ్మకము కూడ నుండి నది"[20] అని ధృతరాష్ట్రుని విశ్వాసాన్ని వివరించారు. ఆ విశ్వాసంతోనే పాండవులకు రాజ్యభాగం ఇచ్చే అంశాన్ని మరుగు పరచటానికి ప్రయత్నించాడు. ప్రధాన అంశం మరుగు పరచి క్షీరోదర వృత్తితో కురు పాండవులు కలసి శాంతి యుత జీవనం సాగించాలని చెప్పటం నేతి బీరకాయలో నేయిలాగానే ఉంది.

సంధి ప్రతిపాదనకు సంబంధించి సభలోని పెద్దలతో చర్చించి వారి అభి ప్రాయాలను సమీకరించే ప్రయత్నం చేయలేదు. అలాంటి ప్రయత్నంచేస్తే తన నాయకులలోనే భిన్నాభిప్రాయాలు వ్యక్తమై, పాండవులకు రాజ్యం ఇవ్వకూడదనే ఆలోచన రసాభాస అవుతుందని ఆ మహారాజు తలచి ఉండవచ్చు. ద్రుపద పురో హితుని రాయబార సమయంలో జరిగిన సంఘటనలు ఆ రాజు ఆలోచన సమంజస మైందనే అభిప్రాయాన్ని బలపరుస్తాయి. అట్లు విదురుని వంటి పెద్దల అభిప్రాయాను సారంగానే నడచేటట్లు కనిపించే ధృతరాష్ట్రుడు రాజకీయంగా అత్యంత ప్రధానమైన ఈ సందర్భంలో ఎవరినీ సంప్రతించక పోవటం చక్రవర్తి అలవడి స్వేచ్ఛా ప్రియ

త్వాన్ని చాటటంతో పాటు, స్వపక్షంలోని అనైక్యత బహిర్గతం కాకుండ చూడా లనే రాజనీతిజ్ఞత వ్యక్తం అవుతుంది.

సంజయుడు సంధి ప్రతిపాదనంటూ ప్రత్యేకంగా ఏమీ లేకుండ రాయ బారం జరిపే కార్య క్రమాన్ని ప్రభువు మనోభీష్టానికి అనుగుణంగా నిర్వర్తించ టంలో చాలవరకు కృతకృత్యుడయ్యాడనే చెప్పవలసి ఉంటుంది. అతడు నిర్వర్తించ వలసిన కార్య భారం చాలా బృహత్తరమైంది. కేవలం తన వాక్చాతుర్యం తోను, వ్యక్తిత్వంతోను, ఉత్తమ రాజనీతి చతురులుగా ప్రసిద్ధి వహించిన శ్రీకృష్ణ ధర్మజుల సమక్షంలో ప్రభుకార్యం సాధించే ప్రయత్నం చేయటం సాహ సమే అయినా, ఆ ప్రయత్నం అతడి ప్రభుభక్తికి నిదర్శనంగా నిలుస్తుంది.

సంజయుడు ధర్మరాజు సభలో ధృతరాష్ట్రుని మనోభిప్రాయాన్ని వాచ్యం చేయకుండ వ్యంగ్య మర్యాదతో దోషాన్ని ప్రతి పక్షం వారిపై పెట్టేందుకు ఎంతో నేర్పుతో ప్రయత్నిస్తాడు. సంజయుని మాటల్లో రాజ్యభాగం విషయంలో ధృత రాష్ట్రుని అంతర్యాన్ని పసిగట్టిన ధర్మరాజు, అదే వ్యంగ్యమర్యాదతో రాజ్యం సాధించే విషయంలో స్థిర సంకల్పాన్ని వ్యక్తం చేస్తాడు. హెచ్చరికతో కూడిన యుద్ధ సన్నద్ధత ధర్మరాజు మాటల్లో ద్యోతకం అవుతుంది. అతడి మాటల్లో పెద తండ్రితోడి సహజీవనంపై ఆసక్తికన్నా, ఆ మహారాజు ఉపేక్షా భావంపై నిరసనే వ్యక్తం అవుతుంది. సంజయుని రాజనీతిజ్ఞత, పరేంగితజ్ఞత, వాక్చాతుర్యమూ అన్నీ ధర్మరాజు రాజకీయ చాతుర్యం ముందు వ్యర్థమయ్యాయి. ఆ విధంగా ధృత రాష్ట్రుని ఆలోచనకూడ భగ్నమౌతున్నట్లే గోచరిస్తుంది. శ్రీకృష్ణుడుకూడ

"పాండవాగ్రజన్ము పలుకుల చందంబు
సూడ సంధి లేని చొప్పుదోచె" (ఉద్యోగ. 1-338)

అని ధర్మరాజు మనసును స్పష్ట పరుస్తాడు. ఇంకా ద్యూత సమయంలో జరిగిన ద్రౌపదీ పరాభవాన్ని ప్రస్తావించి సుయోధనాదుల దుష్టత్వాన్ని, ధృతరాష్ట్రుని ఉదాసీనతను నిశితంగా ఎత్తి చూపుతాడు. ఇలాంటి పరిస్థితుల్లో "ఈ సంధి కార్యంబత్యంత దుర్ఘటం బైన ఘటియింపం జేయుట యశక్యంబని తలంచెద" (ఉద్యోగ. 1-352) అని స్పష్టంగా సంధికి విరుద్ధంగా మాట్లాడాడు. అట్లా అంటూనే

"ఏనీపనికై వచ్చెద
దానొప్పఁ దలంచెనొండెఁదప్పందలఁచెన్
దానన నెగడెద మేమ
మ్మానవనాథునకుఁ జెప్పు మామతమెల్లన్"(ఉద్యోగ.1-360)

అని భారమంతా ధృతరాష్ట్రునిపై ఉంచాడు. శ్రీకృష్ణుని మాటలు సంధికి ప్రోత్సాహకరంగా లేకపోగా కౌరవులపై తీవ్రమైన నిందారోపణ చేయటం జరిగింది. అంతే కాక పాండవులతో సంధిచేసుకొన్నట్లయితే ధృతరాష్ట్రునకు శత్రుభయం లేకుండ ఉంటుంది అని చెప్పటం సుయోధనాదులను చిన్న బుచ్చటమే అవుతుంది. పరాక్రమాన్ని చూపి బెదిరింపుద్వారా రాజకీయమైన సంధి సమకూర్చటం సాధ్యం కాదు.

కృష్ణ ధర్మరాజుల సంధి వ్యతిరేక ప్రసంగంతో తాను పూనుకొన్న కార్యం విఘ్నమైనట్లేనని నిస్పృహకు లోనైన సంజయునకు, శ్రీకృష్ణుడు పాండవ పక్షాన తానే ధృతరాష్ట్రుని వద్దకు వస్తానని స్వచ్ఛందంగా ప్రకటించటం కొత్త ఊపిరి పోసినట్లయింది. ప్రభువు అభిమతానికి అనుగుణంగా సంధి సానుకూల్యం చేయలేక పోయినా, సంధి ప్రయత్నం కొనసాగేటట్లు చూడటంలో సంజయుడు కృతకృత్యుడయ్యాడు. అందుకే "దేవా నావచ్చిన కార్యంబు సఫలంబయ్యె బని వినిచెద" (ఉద్యోగ. 1-361) అని సెలవు తీసుకొన్నాడు. సంజయ రాయబారాన్ని కూలంకషంగా పరిశీలిస్తే ధృతరాష్ట్రుడు ఏ విధంగా శుష్కప్రియ భాషణాలతో ధర్మరాజును సాధించ తలచాడో, ధర్మరాజుకూడ ఆ విషయాన్నంతా పసికట్టి, ప్రతిగా తన రాజనీతి వైశద్యాన్నంతటినీ ప్రదర్శించినట్లు గోచరం అవుతుంది. ఈ పెద తండ్రి కొడుకుల రాజకీయ చదరంగంలో సహృదయుడు ప్రభుభక్తి పరాయణుడు, కార్యవ్యగ్రతకల సంజయుడు నిర్విణ్ణుడై నిస్సహాయంగా మౌనం దాల్చటం తప్ప చేయగలిగిందిలేక, కార్యం తనవల్ల సంపూర్ణంగా సానుకూల్యం చేయటంలో కృతకృత్యుడు కాలేకపోయాడు. రాజనీతిచాతుర్యంలోను, ఎత్తుకు పై ఎత్తు వేయుటంలోను వీరిద్దరు అసామాన్యులుగా దర్శన మిస్తారు. వీరిరువురిలో కూడ ప్రజ్ఞ భీష్ముని తనకు అనుకూలంగా ఆకర్షించు కోవటంలో ధర్మరాజే తండ్రికన్నా రెండాకులు ఎక్కువ చదివినట్లు అనిపిస్తుంది.

ప్రభుకార్య వ్యగ్రుడైన సంజయుని ప్రతిభ కృష్ణ ధర్మరాజుల వాక్చాతుర్యం ముందు వీగి పోయింది. వారిని ప్రభావితం చేయలేకపోగా వారి మాటలకు తానే ప్రభావితుడైనట్లు కనిపిస్తుంది. పాండవుల నిశ్చితాభిప్రాయాలు తెలుసుకొన్నాడు కనుక కురువంశం నాశనం అవుతుందనే ఆందోళన కలిగి ఉంటుంది. ధృతరాష్ట్రుడు రాజ్యంలో కొంతభాగం తమ్ముని కుమారులకు పంచి ఇచ్చి అయినా, వంశనాశనాన్ని అరికట్టి రక్షించటం భావ్యం అని తలచాడు. ప్రభుహితాన్ని, ప్రజాహితాన్ని కోరి నిష్కల్మష హృదయంతో ధృతరాష్ట్రునకు కర్తవ్యం విన్నవించే ప్రయత్నం చేశాడు.

ఉపప్లావ్యం నుంచి వచ్చిన సంజయుడు హస్తినాపురం చేరుతూనే నేరుగా అంతఃపురానికి పోవటం సంధికార్య విషయంలో అత్యయిక స్థితిని వ్యక్తం చేస్తుంది. నిండు సభలో అయితే అధికారికమైన సమాచారాన్ని మాత్రమే ఇవ్వవలసి ఉంటుంది. ఏకాంతంలో కేవలం ఉద్యోగ ధర్మంగానే కాకుండ సన్నిహితునిగా, సచివునిగా, శ్రేయోభిలాషిగా అభిప్రాయాన్ని నిష్కర్షగా చెప్పి వంశనాశనం కాకుండ తన ప్రయత్నం చేయవచ్చు. సంజయుడు చేసే ఈ ప్రయత్నంలో ఇరు పక్షాలవారి ధర్మాధర్మాలు, అర్హతానర్హతలకన్న వంశం విచ్ఛేదం కాకుండ చూడాలనే తాపత్రయమే కనిపిస్తుంది. ధృతరాష్ట్రుడు కూడ విషయం తెలుసుకోవాలనే ఆత్రుతతోనే ఉండి ఉంటాడు.

ధృతరాష్ట్రుణ్ణి చేరిన సంజయుడు పాండవ సభలో జరిగిన విశేషాలన్నింటిని విశదీకరించకుండ, యోగక్షేమాలను తెలియచేసే నెపంతో నర్మగర్భంగా ధర్మరాజు ఆంతర్యం వెల్లడించి భవిష్యత్కర్తవ్యం ఎడ ధృతరాష్ట్రుని మనసులో ఆలోచనను కలిగించేందుకు ప్రయత్నిస్తాడు. ధర్మరాజుతో కూడిన పాండవులు కుశలమేనా అని ప్రశ్నించిన ధృతరాష్ట్రునకు

"వారెల్లను భవదీయ
స్వారబలము గారణముగ సౌఖ్యంబున ను
న్నారమని పలుకుదురు నిజ
మారయగా నట్లకాదె యది జననాథా" (ఉద్యోగ. 2-6)

అని భావస్ఫోరకంగా సమాధానం ఇస్తాడు. వంశానికి పెద్ద ధృతరాష్ట్రుడు కనుక కులాన్ని రక్షించ వలసిన బాధ్యత ఆ ప్రభువుదే. అందువల్లే ఆ మహారాజు స్ఫార బలం కారణంగానే పాండవులు సౌఖ్యంగా ఉన్నారని చెప్పాడు. నిజం కూడ అంతేనని చెప్పటం వల్ల వారు ధృతరాష్ట్రుని యందుంచిన విశ్వాసాన్ని వ్యర్థం చేయవద్దనే హితవు ద్యోతకం అవుతుంది. ఆ తర్వాత ధర్మరాజు మనో ధర్మాన్ని వివరించి, అతడి ఓర్పును వెరపుగా భావించినట్లయితే "కీ కొనగం దగరే కొండంగని యోటమి వెట్టినట్లు" ఉంటుందంటూ "....సాదురేగెనేని, న్వాను తలపొలమునన కాని నిలువదు సుమ్మీ" (ఉద్యోగ. 2-13) అని ధర్మ రాజు 'మెత్తని పులి' ధర్మాన్ని వివరిస్తాడు. మాత్సర్యలోలురైన శకుని దుశ్శా సనులు ఆడించినట్లుగానే ధృతరాష్ట్ర సుయోధనులు ప్రవర్తించటమే కాని పాండవుల క్షేమాన్ని గమనించటం లేదని నిరూపిస్తాడు. జూదసమయంలో కురు వంశానికి సంభవిల్లిన అనర్థానికి ఆ మహారాజు ఉపేక్షే కారణం అని ఆక్షేపించి వశీకృత చిత్తుడైన ధర్మరాజు లోకమంతా నింద పెదతండ్రిపై వేసేంత వరకు వదలడని, అప్పైన దానిని మరల్చటం ఎవరికీ సాధ్యం కాదని ధృతరాష్ట్రుని హృదయంలో గాఢంగా నాటుకొనేటట్లు పలికాడు.

సంజయుని మాటల్లో సంధిసంబంధమైన అంశాలు వాచ్యం కాకపోయినా, ఆ మాటల్లోని ధ్వని ధృతరాష్ట్రుని హృదయంలో అశనిపాతమై కలవరం రేపింది. ఆశించిందంతా అడియాస అయి పాండవుల ఎడ తాను అవలంబించిన రాజనీతి అంతా బూడిదలో పోసిన పన్నీరులాగా వ్యర్థం అవుతుందేమో అనే ఆందోళన కలిగింది. సంధి పరంగా ధర్మరాజు హృదయం అవగతం చేసుకోలేక పోతున్నందుకు ఆ ఆందోళన ఇంకా అధికమైంది. ఆ విషయమే విదురునితో చెప్పి "ఓ సుధీవు, తెలియజెప్పి నాయలమట పలుగఁజేయ" (ఉద్యోగ. 2-23) అని వేడుకొన్నాడు. ధృతరాష్ట్రుని వేడుకోలులో రాజకీయం అంతా విఫలమైందనే బాధతో పాటు దిక్కుతోచని తనం కనిపిస్తుంది. ప్రయత్నంతో ఒక పథకం ప్రకారం కార్యం సాధించాలనే పూనికతో ఉన్నవారికి, ఆ కార్యం విరుద్ధ ఫలితాల నిచ్చే సూచన గోచరిస్తే ఎవరైనా ధృతరాష్ట్రుని లాగానే ఆందోళనకు గురి అవుతారు అయిన వారనుకున్న వారందరిని సలహాల నిమిత్తం అర్థించటం జరుగుతుంది.

విదురుడు, సంజయుడు సూచించిన వాటిని వాచ్యం చేస్తూ, ధర్మరాజుకు రాజ్యభాగం ఇచ్చి సంధి చేసుకోవటం కురువంశ ప్రతిష్ఠను కూడ పెంపొందిస్తుందని, పెదతండ్రిగా ధృతరాష్ట్రుని ప్రతిష్ఠను కూడ పెంచుతుందని అతడి హృదయంలో గాఢంగా నాటుకొనేటట్లు చెప్పే ప్రయత్నం చేశాడు. తండ్రీ కొడుకుల దుష్ట చింతనను బయలు పరుస్తూ పాండవులకు భాగం ఇవ్వకుండా ఉండటం "మీనులోలతన్ గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన" విధంగా ఉంటుందంటూ, నీవు "ఉక్కివుడైన నీ కొడుకు నుల్లము నున్నటు లాడగూడునే" (ఉద్యోగ. 2-52) అని ఆ మహారాజు హృదయంలోని గుట్టంతా బట్టబయలు అయ్యేటట్లు పలికాడు. విదురుని మాటలకు ధృతరాష్ట్రుడు నిరుత్తరుడై మ్రాన్పడి, అనేకమైన ఆలోచనలు పెనగొనగా నిద్రాహానిని పొందాడు. ఆ మహారాజు ఈ స్థితి విషయ తీవ్రతను, దాని కనుగుణంగా అతడి ఆందోళనను వ్యక్తంచేస్తుంది. ఆ స్థితిలో విదురుడు పాండవుల ఔదార్య సహిత సద్గుణాలను వివరించి "నీవపుల మతిం గన్నకొడుకులట్లరయదగున్" (ఉద్యోగ. 2-74) అని చెప్పి వారిని దగ్గరకు చేర్చవలసిందని హితవు గరపుతాడు. అందుకు ధృతరాష్ట్రుడు ప్రతిస్పందించినట్లుగా ప్రవర్తించి ధర్మరాజాదులను "నెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపునట్టిది యెయ్యది దాని నెఱింగింపుము" (ఉద్యోగ. 2-83) అని విదురుణ్ణి అర్థిస్తాడు.

ధృతరాష్ట్రుని ఈ ప్రవర్తనలో చిత్తశుద్ధి ఉన్నట్లు కనపడదు. మానవుడు తన ఆలోచనలకు కాని, చేసే పనులకు కాని విపరీత ప్రతిబంధకాలేర్పడి నప్పుడు, ఆ ప్రతి బంధకాలను తప్పించుకొని క్రొత్త ఆలోచన చేయటానికి విరామం కోసం తాత్కాలికంగా ఆ ప్రతిబంధకాలకు తల ఒగ్గినట్లు ప్రవర్తిస్తాడు. అప్పుడు కార్య పురోగమనంలో కొంత స్తబ్ధత ఏర్పడుతుంది. తన మార్గంలో సుగమంగా ముందుకు పోయేందుకు ఆలోచన తట్టిన వెంటనే ప్రతి బంధకాలను త్రోసి రాజనటానికి ప్రయత్నిస్తాడు. ఈ సందర్భంలో సంజయుని మాటలతోనే ఆందోళనకు లోనయి ఉన్న ధృతరాష్ట్రుణ్ణి విదురుని బోధలు ఊపిరి సలప నీయక ఉక్కిరి బిక్కిరి చేసి ఉంటాయి. అందుకే తాత్కాలికంగా విదురుని ఉపదేశం ధాటినుంచి రక్షించుకొని తనకార్య సాఫల్యం కోసం ప్రత్యామ్నాయం ఆలోచించేంత వరకు, అతడి మార్గాన్ని విశ్వసించినట్లు ప్రవర్తించటం కిన్న వేరు కర్తవ్యం గోచరం కాలేదు. అందువల్లే పాండవులను రిత్త ఉపచారాలతో ఉడికించావని, వారి వగలన్నీ తొలగేడుపాయం చెప్పమని అర్థిస్తాడు. ధృతరాష్ట్రునిలోని మార్పు విదురునిలో

క్రొత్త ఆశలు చిగురింప చేసి, ధర్మరాజును చేరదీయటంలో నైతిక ధర్మాన్ని వివరిస్తాడు. ధృతరాష్ట్రుడు విదురుని మాటలు ధర్మబద్ధమూ, నీతిబద్ధమైన వంటూ

"... నీదు పలుకుల
గలకదేటి బుద్ధి దెలిపినాండె
నిట్లు చేయువాడ నిదియ కర్జము ధర్మ
మును యశంబు లాభమును దలంప" ( ద్యోగ. 2-96)

అని తమ్ముని ఆలోచనకు సమ్మతిస్తాడు.

అయితే విదురునితో పలికిన విధంగా అనంతరం నిర్దుష్టంగా, నిరంతరంగా అనుసరించలేక పోయాడు. ఈ సందర్భంలోని ధృతరాష్ట్రుని మాటలకు, తరువాత అతడి ప్రవర్తనకు సరిపోయినట్లు లేదు. అందువల్ల విదురునకు మనః ప్రీతికరంగా పశ్చాత్తాప హృదయంతో పలికినవిగా కన్పించే మాటలు భావి కార్యక్రమాన్ని ఆలోచించేందుకు విరామం కోసం మాత్రమే ధృతరాష్ట్రుడు ఉపయోగించు కొన్నాడనటంలో దోషం కనిపించదు. సకల ధర్మ విదుడైన విదురుణ్ణి కూడ నమ్మించే విధంగా నిగూఢమైన రాజనీతిని ప్రదర్శించిన ఈ ఘట్టం ధృతరాష్ట్రుని రాజనీతి వైశారద్యంలో ప్రకాశవంతమై ఒప్పుతుందనటంలో సందేహం లేదు.

సంజయుడు తెచ్చిన సమాచారం వల్ల కేవలం ప్రేమను, అభిమానాన్ని వెల్లడించే తేనె లొలికే తియ్యని మాటలతో పాండవులను సాధించటం సాధ్యం కాదనే నిర్ణయానికి ధృతరాష్ట్రుడు వచ్చాడు. విదురుని నీతి వాక్యాలు కూడ అతని హృదయంలో ఆందోళనను పెంచాయే కాని చిత్తస్వాస్థ్యం చేకూర్చలేదు. వారి హితవును అనుసరించినట్లయితే పాండవులకు తప్పకుండ రాజ్యభాగం ఇవ్వవలసి ఉంటుంది. అట్లా చేయటం ఆరాజుకు ఏ కోశానా అంగీకార్యం కాదు. న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాల మాట ఎలా వున్నా అనేక సంవత్సరాలు తన భుక్తంలో ఉన్న సామ్రాజ్య భాగాన్ని, సదవగాహన లేకుండ శత్రు భావంతో ఉన్న దాయాదులకు ఇచ్చి ప్రాణకంటకం తెచ్చుకొనేందుకు ఏ రాజకీయవేత్తా అంగీకరించడు. అట్లా చేయటంవల్ల తన కుమారులకు ప్రాణభయం అయినప్పు డ అనువర్తించేందుకు

మనసు అసలు అంగీకరించదు. అట్లాంటప్పుడు తన మనోరథం ఏమిటో ఇతరులు పసికట్టకుండా పుత్రులకు క్షేమాన్ని, లాభాన్ని సమకూర్చే కార్యం సాధించాలి. కాని ధర్మరాజుకు అర్ధరాజ్యం ఇవ్వటం సమంజసం అనే విషయం ఏకాంతంలో విదురుని వద్ద అంగీకరించాడు. కనుక సభలో రాజ్యభాగ ప్రసక్తి లేకుండ సంధి కార్యం నెరవేర్చాలని ప్రయత్నిస్తే తమ్ముని దృష్టిలో మాట తప్పిన వాడవటమేకాక, తన లోభితనాన్ని పెద్దలు నిరసించి కృద్ధులై విసర్జించినా విసర్జించ వచ్చు. అట్లా జరిగితే కుమారులకు లాభం సమకూర్చబోయి సంపూర్ణంగా నష్ట పోవలసి ఉంటుంది.

అందుకే ధృతరాష్ట్రుడు ఈ సన్నివేశంలో అద్భుతమైన ప్రజ్ఞను ప్రదర్శించాడు. విదురుడు చెప్పినట్లుగా అనువర్తించటం శ్రేయస్కరమని ఏకాంతంలో అంగీకరించిన ధృదరాష్ట్రుడు, సభలో ఆ అంశాన్ని గూర్చిన చర్చకు అంగీకరించి కుమారుడు విజృంభించటానికి అవకాశం కల్పించి, తాను ఉదాసీనంతో పుత్ర మమకారం ముసుగులో దాగుకొని సభలోని వారి సానుభూతిని పొందేందుకు ప్రయత్నించాడు. ద్రుపద పురోహితుడు వచ్చిన సందర్భంలో భీష్మ కర్ణుల సంవాదాన్ని మధ్యలో ఆపివేయగల మహారాజు, సంజయుణ్ణి పాండవ సభకు పంపేటప్పుడు సభలో ఏ విధమైన అభిప్రాయ సేకరణకు తావీయకుండ సంధి మాటలేవో తానే చెప్పి పంపిన ధృతరాష్ట్రుడు, సంజయ రాయబార ఫలితాన్ని తెలుసుకొనేటప్పుడు మాత్రం ఏ విధంగాను స్వతంత్రత ప్రకటించ లేక, స్వపక్షవీరులు ఎవరికి తోచి నట్లు వారు మాట్లాడినా, కుమారుని పక్షీయులు విజృంభించినా, మహారాజుగా సభను అదుపుచేసే ప్రయత్నం చేయక పోవటం అతడి నిస్సహాయత అనేకన్నా మనోరథ ఫల సిద్ధి కొరకే అట్లా ప్రవర్తించాడని తలంచటం భావ్యంగా ఉంటుంది.

సంజయుడు ఉపప్లావ్యం నుంచి వచ్చిన నాటి రాత్రి విదురుడు, సనత్కుమారుల ఉపదేశం వల్ల ధృతరాష్ట్రుడు స్వస్థత చెందాడో లేదోకాని, మరునాడు సభకు మాత్రం నిర్వికార చిత్తంతోనే వచ్చాడు. సభలో తాను అనుసరించవలసిన భావి కర్తవ్యాన్ని నిర్ణయించుకొనే ప్రవేశించినట్లు ఆ రాజు అనంతర ప్రవర్తన వల్ల బోధపడుతుంది. క్రితంరాత్రి వ్యంగ్యోక్తులతో సూచనామాత్రంగా చెప్పిన మాటలకు ధృతరాష్ట్రునిలో స్పందన వచ్చిందని ఆశించిన సంజయుడు ఆ మహారాజు నిర్వికారతకు ఒక్క క్షణం ఆశ్చర్యపోయి ఉంటాడు.

అయినా తన రాయబార సారాంశాన్ని అధికారికంగా తెలియచేయాలి కనుక, యోగక్షేమాల ప్రస్తావనతో సంజయుడు ఉపన్యాసం ప్రారంభిస్తాడు. ధృతరాష్ట్రుడు సహజ ధోరణిలోనే కురు పాండవ సంధిపరంగా కృష్ణుని, అర్జునుని అభిప్రాయాలను వివరించ వలసిందని కోరతాడు. సంజయుడు "కురుపాండవ సంధి విషయంలో తెలివిగా ప్రవర్తించి ఆప్తులను ప్రీతిగా దగ్గరకు చేర్చడం మంచి దని, అట్లాకాని పక్షంలో అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని యుద్ధరంగానికి నడవం డని" కృష్ణుడు చెప్పిన మాటలన్నింటిని ఉగ్గడిస్తాడు. అంతటితో ఆగక పాండ వుల విజృంభణ తనకు భయం కలిగించిందని చెప్పి, సుయోధనుని పట్టుదలను, ధృతరాష్ట్రుని ఆభిజాత్యాన్ని నిరసిస్తాడు. శ్రీకృష్ణుని హెచ్చరికకు ధృతరాష్ట్రునిలో ఏవిధమైన చలనం కలగలేదు. అనంతరం సంజయుడు "మాకవశ్యంబును సంగ రంబు సంభవించు పాశుపతాది దివ్య శరంబులం గురుపక్ష ప్రజాక్షయంబు వేసి శాంతింబొందెదము" (ఉద్యోగ. 2-146) అని అర్జునుడు నిశ్చితంగా పలికిన మాటలను వివరిస్తాడు. చాలా తీక్షణంగా ఉన్న అర్జునుని విజృంభణకూడ ధృత రాష్ట్రునిలో చలనం కలిగింపలేదు. బహుశా ఆ మహారాజు హృదయం పాండవుల బెదిరింపులకు కాఠిన్యంపొంది, రాజ్యభాగం ఇవ్వకూడదనే అభిప్రాయంతో దృఢ తరమై ఉంటుంది. అయితే ఈ అభిప్రాయం అతడెక్కడా వాచ్యం చేయలేదు. అతడి ప్రవర్తన అట్లా ఊహించేందుకు దోహదం చేసేదిగా ఉంది.

సంజయుడు చెప్పిన కృష్ణార్జునుల అభిప్రాయాలకు అనుగుణంగా భీష్ముడు యుద్ధమనే ఆలోచనమాని సంధిచేసుకొని రాజ్యభాగం అనుభవించ వలసిందని, అట్లాకాని పక్షంలో

**"హితములగు నాదువచనంబు లిపుడు వినని**
**వాడ వైతేని నప్పుడు వారు వడిరి**
**వీరు వడిరను పలుకులు వినదుగాక" (ఉద్యోగ. 2-155)**

అని హెచ్చరిస్తాడు. ఇంకా దుష్టచతుష్టయంలో ముఖ్యులైన శకుని కర్ణ దుశ్శాసనులనే కాక, తమ సలహాలను వినడని సుయోధనుని ఎడ నిరసనతో కూడిన బాధను వ్యక్తం చేస్తాడు. తనను తూలనాడినందుకు మనసు నొచ్చుకొన్న కర్ణుడు సభలోనే భీష్మునితో వాక్కలహానికి ఉద్యమిస్తాడు. ద్రోణాచార్యుడు కూడ భీష్ముని అభి

ప్రాయాన్నే సమర్థిస్తూ అర్జునుణ్ణి గెలువగలవారు మనసైన్యంలోనే కాదు, లోకంలో ఎక్కడా లేరని, అందువేత పరాక్రమ ప్రదర్శనం కన్న శాంతిమార్గాన సంధి చేసు కోవటం ఉచితమని హితవు చెప్తాడు.

కురువీరుల మధ్య వాగ్వివాదం ధృతరాష్ట్రుని సమక్షంలోనే జరిగింది. కర్ణుడు తన పెదతండ్రిని తూలనాడి తృణీకరించటం గమనించి కూడ ధృతరాష్ట్రుడు అతణ్ణి అదుపుచేసే ప్రయత్నం చేయలేదు. కర్ణుణ్ణి అదుపు చేయకపోగా, పాండవులతో శాంతియుతంగా జీవనం సాగించమని హితవు చెప్పిన "భీష్మద్రోణుల వలుకు లాదరింపక వారికి సదుత్తరంబు లీక వారలతోడం తదను రూపంబుగా సంభాషింపక" (ఉద్యోగ. 2-157) ఉదాసీన భావంతో మౌనం వహించాడు. ఆ మహారాజు ఉదాసీనత కురుపాండవ సఖ్యానికు అనుకూలురైన కురుపక్ష వీరులందరకు ప్రాణాలపై ఆశ సన్నగిల్లచేసింది. ధృతరాష్ట్రుడు మౌనం వహించినవాడు అట్లా ఉండకుండ, పాండవుల ఆలోచనలు తెలుసుకొందామనే ఉద్దేశంతో

"ధర్మపుత్రుపన కిక్కడి తలఁపు భంగి
యెట్టులుండు నీ సైన్యంబులెల్లఁ గూడి
యునికి గనియెనే యెవ్వరిగోని యతండు
కౌరవుల మీద నెత్తిరాగలుగువాడు" (ఉద్యోగ. 2-168)

అని సంజయుణ్ణి ప్రశ్నిస్తాడు. తనకున్న మానుష శక్తి బలాధిక్యతపై ధృతరాష్ట్రునకున్న విశ్వాసం ఎంత గాఢంగా ఉన్నట్లు తెలుస్తుంది. అంతేగాక శాంతిమార్గాన ధర్మరాజుకు రాజ్యం ఇచ్చేవిషయంలో ఆరాజు అనాసక్తి, బల ప్రదర్శన విషయంలో అతడి పట్టుదల సూచ్యమవుతున్నాయి. కాని తన నిశ్చితాభిప్రాయం మాత్రం వాచ్యం చేయడు.

మౌనంతో కూడిన ఉదాసీనత ధృతరాష్ట్రుడు తన రాజనీతిలో ఎన్ను కొన్న నూత్న మార్గం. రాజనీతిలో క్రొత్తమార్గం అవలంబించిన ధృతరాష్ట్రుడు సంజయాదుల అభిప్రాయంలో ఔచిత్యం ఉన్నట్లు ప్రవర్తిస్తూ, కుమారుని మదోద్ధతను నిరసిస్తూనే, తన నిశ్చితాభిప్రాయం వ్యక్తం చేస్తూ, భీష్మద్రోణాదులు కురుపక్షం వీడకుండా ఉండే ఏర్పాటు ఎంతో నేర్పుతో సాధించాడు. ధర్మరాజు ఎవరి శక్తిని

ఊతంగా స్వీకరించి యుద్ధానికి సన్నద్ధం అవుతున్నాడన్న ధృతరాష్ట్రుని ప్రశ్నకు సంజయుడు పాండవ పక్షంవారి బలపరాక్రమాలను విశదీకరించి, శ్రీకృష్ణుడు వారి పక్షాన ఉన్న విషయం ప్రత్యేకంగా విన్నవిస్తాడు. పాండవుల శక్తిసామర్థ్యాలను అంచనా వేయటంలో సంజయునితో ఏకీభవిస్తూనే, ధృతరాష్ట్రుడు ప్రస్తుత విషమ స్థితికి బాధ్యత పాండవులదే అన్నట్లు ప్రవర్తిస్తాడు. భీముడు చిన్ననాటి నుంచీ తన శిక్షణను అంగీకరించక సుయోధనాదులను కష్టపెట్టేవాడని "అదియకాదె యీ భేదమునకెల్లఁ గారణంబు" (ఉద్యోగ. 2-186) అని బాల్యంలో భీముడు సుయోధనాదులను పీడించటమే కురుపాండవ కలహానికి కారణం అని తీర్మానించాడు. ఎదుటివారి అభిప్రాయాలను అంగీకరించినట్లు ప్రవర్తిస్తూనే విషయాన్ని తనకు అనుకూలంగా మార్చుకొనే ఆ మహారాజు రాజనీతి శ్లాఘనీయంగా ఉంది. కురు పాండవులిరువురు భీష్మద్రోణులకు సమానం అయినప్పటికీ 'మనకడనున్న తప్పు నకు మన మందట నిలువవలయు' అని కురు వృద్ధులెవరూ తనను విసర్జించి పాండవ పక్షం చేరకుండ ముందలి కాళ్లకు బంధం వేశాడు. అంతటితో ఊరు కోకుండ "నేను దైవాధీనత కతంబున నొత్తి చెప్పను నియమింపనుంజాల" (ఉద్యోగ. 2-198) అని నిస్సహాయతను వ్యక్తంచేసి, "మందబుద్ధియు, లోభోప హతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁడింత సేసె గాల పర్యాయంబున గౌరవులకు గడవరాని యవస్థ వచ్చె" అని పలికి, "సంజయా నేనేమి సేయుదు నెందు జొత్తు నెద్ది దెరువెవ్వరు శరణంబు" (ఉద్యోగ. 2-198) అని వాపోయి వారి సానుభూతిని సంపాదించే ప్రయత్నం చేశాడు. భీష్మవిదురాదులకు ఏది ప్రియమో అది చేయతగిందని అంటూ "పాండవులతోడి ఖండనంబున గుల క్షయంబగుట దప్పదు శాంతిఁ బొందుటయమేలు మన వారల కది ప్రియంబగునేని దానికిఁ దగిన యత్నంబు సేసెద" (ఉద్యోగ. 2-201) అని పలికాడు.

విషయం తనను, పాండు కుమారులను సంబంధించింది. కుటుంబ సంబంధమైన వివాదంలో పెదతండ్రి, మహారాజైన తాను చొరవ తీసుకొని స్వతంత్రంగా నిర్ణయం తీసుకోవటం శ్రేయస్కరం. కొన్ని విషయాల్లో అట్లా స్వతంత్రంగా వర్తించిన సందర్భాలు గతంలో ఉన్నాయి. కాని ఇప్పుడు సమస్య తనది కానట్లు, భీష్మవిదురాదుల సమస్యను వారికి ప్రియమైన రీతిలో పరిష్కరించేందుకు

ప్రయత్నిస్తానని మూడో వ్యక్తిగా మాట్లాడుతున్నట్లు కనిపిస్తుంది. తన సమస్యను ఇతరుల సమస్యగా భావింపచేసే ధృతరాష్ట్రుని ప్రవర్తన అతడి రాజనీతిలోనేకాక వ్యక్తిత్వంలో కూడ విశిష్టంగా నిలుస్తుంది.

సంజయుడు, భీష్మద్రోణ విదురాదులు పాండవుల బలశౌర్యాలను, వారికి అండగా ఉన్న దైవబలాన్ని వివరిస్తుంటే, తండ్రి వారి మాటలకు లొంగి పాండవులకు రాజ్యభాగం ఇస్తాడేమోననే ఆందోళనతో సుయోధనుడు స్వపక్షంలోని వీరుల శక్తి సామర్థ్యాలను వివరించి, సంఖ్యలోకూడ స్వపక్షమే బలవంతమైందని తండ్రిని నమ్మించ పూనుకొన్నాడు. పాండవులకు భయపడి రాజ్యభాగం ఇచ్చినట్లయితే ప్రజా సమూహం ఎగతాళి పట్టినట్లవుతుందని చెప్తూ

"నీవు బతిమాలి కొడుకుల
చావునకును జేటునకును జాలక యిమ్మై
వావిడిచి యఱచినం గడు
నేవపడరె జనులు నిన్ను..." (ఉద్యోగ. 2-216)

అని తండ్రిని సంధి కార్యం నుంచి విముఖుణ్ణి చేసే ప్రయత్నం చేస్తాడు. ధృతరాష్ట్రుడు తన రాజనీతిలో క్రొత్త మార్గాన్ని, కుమారునకు కూడ అనుమానం కలిగించేంత ప్రతిభావంతంగా నిర్వహిస్తున్నాడని తెలుసుకోవచ్చు.

ధృతరాష్ట్రుడు కుమారుని అభయంతో కూడిన పలుకులలో విశ్వాసం కలిగిన వానిలాగా, 'మన పక్షంలోని వారు నిజంగానే అసాధ్యులు, వీరిని సాధించటానికి ప్రతిగా ప్రతిపక్షం వారు ఎవరిని ఎన్నుకొన్నారు?' అని సంజయుణ్ణి ప్రశ్నిస్తాడు. ఈ ప్రశ్న ధృతరాష్ట్రుని రాజనీతిలో రెండు భిన్నముఖాలకు ప్రతీకగా నిలుస్తుంది ఒకవైపు కుమారుని మాటలలో విశ్వాసం ఏర్పడిందని అతణ్ణి సంతోష పరచటం, అదే సమయంలో పాండవబలం నిజంగా శక్తివంతమైనదనే విషయాన్ని దుష్టదుర్యోధనుడు అంగీకరించటం లేదు, వారు కురువీరులను ఎవరు ఎవరిని సంహరించగల సమర్థులో చెప్తేనైనా యుద్ధ ప్రయత్నం మానతాడేమో అనే అభిప్రాయం మనసులో ఉంచటం రెండో ముఖంగా కనిపిస్తుంది.

సభలోని పెద్దలందరి అభిమతం పాండవానుకూలంగా ఉందని గుర్తించిన ధృతరాష్ట్రుడు పాండవులతోడి సంధికి సుయోధనుణ్ణి ఒప్పించేందుకు తన వంతు ప్రయత్నం చేయటానికి పూనుకొంటాడు. అయితే అందులో పట్టుదల ఉన్నదని తలంచలేము. పాండవులతో యుద్ధం పెద్దలకెవరికీ ఇష్టంకాదని, ధర్మరాజుతో కలిసి సహజీవనం సాగించటం

"పరిజనులకు నీకును ని
ద్ధరలోన సగంబుసాలుఁ దక్కటి సగముం
గర ముచితంబుగఁ బాండవ
వరుడగు ధర్మజున కిచ్చిఁ బ్రదుకుము నెమ్మిన్"

(ఉద్యోగ. 2-245)

అని హితవు గరపుతాడు. తండ్రి మాటలకు ఏమాత్రమూ అంగీకరించని సుయోధనుడు 'కర్ణ దుశ్శాసనాదుల తోడ్పాటుతో యుద్ధమే చేస్తానుకాని, వాడి సూదిమొన మోపజాలిన భూభాగం కూడ ఇవ్వనని' నిష్కర్షగా పలుకుతాడు. రాజ్యం ధృతరాష్ట్రి సార్వభౌమునిది. పాండవులకు రాజ్యభాగం ఇవ్వటం ఇవ్వకపోవటం అతడి అధీనం. పాండవులకు రాజ్యం ఇచ్చే సంకల్పంలో చిత్తశుద్ధి కనుక ఉన్నట్లయితే పెద్దల హితవులాలకించి కుమారుణ్ణి శాసించి అయినా ఆ కార్యం నిర్వహించవచ్చు. అడ్డగించేవారు కాని, ఎదురు మాట్లాడేవారు కాని ఎవరూ ఉండరు. కాని పాండవులకు రాజ్యంలో భాగం కల్పిస్తే కుమారులు సంపూర్ణంగా రాజ్యం నష్టపోవలసి వస్తుందేమోననే భయం ఆ మహారాజు హృదయపు అంతరాంతరాల్లో నెలకొని ఉండవచ్చు. అందుకే కుమారుణ్ణి శాసించే ప్రయత్నం చేయకుండ బ్రతిమిలాడే ధోరణిని అవలంబించాడు. రాజ్యంలో సూదిమొన మోపేనంత కూడ ఇవ్వనని నిశ్చితంగా పలికిన సుయోధనునితో

"నీకునంత వగవ నీపోవు తెరువునఁ
బోవువారిగాగఁ బూనియున్న
వారికెల్ల నేను వగచెదఁ గయ్యంబు
వలవ దుడుగుమయ్య చలముగొనక" (ఉద్యోగ. 2-253)

అని నెమ్మదిగా యుద్ధ విముఖుణ్ణిచేసే ప్రయత్నం చేస్తాడు. సుయోధనుని నుంచి అనుకూల సమాధానం లేకపోవటంతో రెండు పక్షాల బలాబలాలను లెక్కించి గోగ్రహణ సమయంలో జరిగిన యుద్ధాన్ని గుర్తుచేసి, కర్ణునివల్ల కార్యం నెరవేర దేమోననే అనుమానం వ్యక్తం చేస్తాడు. అంతేకాని సుయోధనుణ్ణి గట్టిగా మంద లించి సంధికి సుముఖుణ్ణి చేయలేకపోయాడు.

అదే సమయంలో కురువీరుల మధ్య నెలకొన్న వైరుధ్యాలు స్పష్టంగా బహిర్గతం అయ్యాయి. ఫలితంగా భీష్ముడు యుద్ధ విరమణ చేసేంత వరకు యుద్ధరంగ ప్రవేశంచేయనని కర్ణుడుశపథం చేశాడు. ఈ పరిణామం ధృతరాష్ట్రుణ్ణి విపరీతంగా కలచివేసింది. విషాదం ముప్పిరిగొనగా కుమారుణ్ణి ఏమీ అనలేక

"మృత్యుపాశోపహతుడయ్యె మీఁదులేక
సూతనందనుతోఁ గూడి నా తనూజుఁ
డకట నాశంబుఁ బొందువాడయ్యె మనకు
నింక జేయంగనగు పని యెద్ది చెపుమ" (ఉద్యోగ. 2-297)

అని విదురునితో వాపోయి కర్తవ్యం ఉపదేశించమని అర్థిస్తాడు. విదురుడు ఎప్పటి మాదిరిగానే "ఈ వెంగలి మాటలు విడిచి పాండవులం బిలువంబనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయందగు పని వేఱొండు" (ఉద్యోగ. 2-298) లేదని సలహా ఇస్తాడు. పాండవులకు రాజ్యభాగం ఇచ్చే విషయంలో నిజంగా ధృతరాష్ట్రునకు చిత్తశుద్ధే ఉన్నట్లయితే ఈ దశలోనైనా విదురాదుల హితవు ప్రకా రం, కుమారుణ్ణి ఒప్పించి నడచి ఉండేవాడు. అట్లా చేయకపోగా విదురుని మాట లకు ప్రతి సమాధానం ఇవ్వకుండ పాండవ సభలో జరిగిన మిగిలిన విశేషాలు చెప్ప వలసిందని సంజయుని పై కుతూహలం ప్రదర్శిస్తాడు.

ధృతరాష్ట్రుని ప్రవర్తన సభలోని వారందరను నిశ్చేష్టులను చేసింది. సంధి విషయంగా నిరాశ, నిస్పృహలకు లోనై సభలోని వారంతా తండ్రీకొడుకు లను సభలో ఏకాంతంగా వదలి నిష్క్రమిస్తారు. చివరకు సంజయుని రాయ బారం ఫలితంగా పాండవులతో ప్రవర్తించవలసిన విధానం గూర్చి నిర్ణయం తీసు కోకుండానే సభ అర్థంతరంగా ముగిసింది. ఇదంతా ధృతరాష్ట్రుని రాజనీతి

విశేషంవల్లనే సాధించబడిందని స్పష్టమౌతుంది. అందరూ నిష్క్రమించిన అనంతరం ధృతరాష్ట్రుడు "తన సుతుడు మర్దింపగ నోపునొ యవిఁ బాండుతనూజుల" (ఉద్యోగ 3-303) అనే దురాశతో సంజయుణ్ణి అడిగాడు. సభలో ఒకరిద్దరు తప్ప సన్నిహితులు, హితులు, బంధువులంతా కూడ తన ఉద్యమాన్ని వ్యతిరేకించే ఈ సమయంలో కూడ ధృతరాష్ట్రుడు ఇట్లా ప్రవర్తించటం సంధి విషయంగా అతడి అంతర్యాన్ని వెల్లడిస్తుంది.

కౌరవ పాండవోద్యోగంలో శ్రీకృష్ణుని రాయబారం మూడవది. ఉద్యోగం తప్పకుండ విఫలం అవుతుంది అనే అభిప్రాయంతో ప్రారంభమైన రాయబారమిది. తమ పక్షాన ధృతరాష్ట్రుని వద్దకు పోయి శాంతిమార్గాన రాజ్యభాగం సంపాదించే ప్రయత్నం చేయవలసిందని ధర్మరాజు అర్థించిన సందర్భంలో శ్రీకృష్ణుడు

"ఆ సుయోధనుడు ముక్కున నావిగలుగఁ
బడమి నీ కీడుఁ గావునఁ బోర కలుగు
నేను కయ్యపు శకునంబు లెన్నియేనిఁ
గంటి నీవనుత్సాహివిగాగ వలదు

చతురంగ బలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పుకొనుచు నాలస్యంబులేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండవలయు" (ఉద్యోగ. 3-41, 42) అని యుద్ధ సన్నాహం చేయవలసిందని సలహా ఇస్తాడు. శ్రీకృష్ణుని రాయబారంలో ధర్మరాజు రెండు ప్రయోజనాలు ఆశించాడు. కౌరవ సభకు వెళ్లినప్పుడు సంధి సుముఖమైతే రాజ్యప్రాప్తి కలగటం మొదటి ప్రయోజనం. సంధి విఫలమైతే శత్రు సంహారం సమయంలో పాండవ పక్షానికి నిందలు రాకుండ, కురువీరులలో అనుకూల అభిప్రాయం సాధించటం రెండో ప్రయోజనం.

కొన్ని సందర్భాల్లో పదవివల్ల వ్యక్తి ప్రాధాన్యం పెరిగితే, మరికొన్ని సందర్భాల్లో వ్యక్తివల్ల ఆ పదవికి గౌరవం లభిస్తుంది. కౌరవ పాండవ వివాదంలో కృష్ణునకు పూర్వం రాయబారులుగా నియమించిన వ్యక్తులిద్దరూ రాజోద్యోగులే. వ్యక్తిగతంగా వారిరువురు మేధావంతులు, సచ్ఛీలవంతులు, నిష్పక్షపాత

బుద్ధి కలిగిన వారైనప్పటికీ. వారు అలంకరించిన పదవుల వల్లనే గుర్తింపు పొందారు. శ్రీకృష్ణుడు కేవలం ఉద్యోగ ధర్మంగానే కాక స్నేహ ధర్మంగాను, బంధుత్వం దృష్టితోను ఇరుపక్షాలకు కావలసినవాడు. అంతేకాక సమకాలంలో బలవత్తరమైన ఒక రాజవంశానికి తిరుగులేని నాయకుడు. రాయబార పదవి స్వీకరించకముందే రాజన్యలోకంలో కీలకమైన వాడుగా ప్రసిద్ధి వహించిన వ్యక్తి. అందువల్లే "తనంతటివాని కనర్హమైన దౌత్యమున కంగీకరించుటయే ఈయన ఆశ్రితావనత్వమును దెల్పును"[21] అని త్రిపురనేని రామస్వామి వ్యక్తివల్ల పదవికి గౌరవం లభించిందనే అభిప్రాయం వ్యక్తం చేశారు. పాండవ పక్షాన రాయబారిగా శ్రీకృష్ణుణ్ణి నియమించటంతో రాజలోకంలో అప్పటికే ప్రాధాన్యం పొంది ఉన్న కురుపాండవ వివాదం ప్రాముఖ్యం ద్విగుణీకృతమైంది. రాజనీతి కోవిదుడైన శ్రీకృష్ణుని కార్యనిర్వహణ విశేషాన్ని సందర్శించాలనే ఆకాంక్షను నారదాది మహర్షులు వ్యక్తం చేయటం కృష్ణుని వల్లనే ఆ పదవికి ఎంత గౌరవం పెరిగిందో విదితమౌతుంది.

శ్రీకృష్ణుడు పాండవ కార్యార్థమై రాయబారిగా వస్తున్నాడనే వార్త హస్తినాపురంలో కూడ ఉద్వేగాన్ని పెంచింది. అతడు కుశస్థలం చేరాడనే విషయం తెలియగానే ధృతరాష్ట్రుడు ఆంతరంగికులైన వారందరిని సమావేశపరచాడు. పాండవులకు స్నేహితుడు, సచివుడు, ఆత్మబంధువు అయిన శ్రీకృష్ణుణ్ణి సంతృప్తిపరచగలిగితే పాండవులతో సంధి కార్యాన్ని తన మనోరథానికి సానుకూల్యంగా నెరవేర్చుకోవచ్చనే ఆలోచన కలిగింది. అందుకే అతిధి సత్కారం పేరుతో శ్రీకృష్ణునకు తృప్తి కలిగించి, అతని మనసును తనకు అనుకూలంగా మార్చుకొనే ప్రయత్నం చేశాడు. కురు సభకు వచ్చిన ద్రుపద పురోహితునకు ధృతరాష్ట్రుడు కాని, సంజయునకు ధర్మరాజు కాని రాయబారులకు ఉచితమైన రీతిలోనే సత్కారాలందించారు కాని ఇంత ఆర్భాటం చేయలేదు. రాయబారుల మనసును వశీకృతం చేసుకొని కార్యం సాధించే ప్రయత్నం రాజనీతిలో భాగమే అవుతుంది. శ్రీకృష్ణుణ్ణి తన వానిగా చేసుకొనే ప్రయత్నంలో రాయబారుల ఎడ చూపే సాధారణ రాజమర్యాదలను కూడ అతిక్రమించేందుకు ఆ రాజు ఉద్యుక్తుడయ్యాడు. స్వకార్యం నెరవేర్చుకొనేందుకు ధృతరాష్ట్రుడు అవలంబించదలచిన ఈ మార్గం ఆ మహారాజు రాజనీతి వైదగ్ధ్యానికి అద్దం పడుతుంది.

ధృతరాష్ట్రుని ఆలోచనా విధానానికి ఆదిలోనే విదురుడు హంసపాదు వేస్తాడు. వచ్చినవాడు శ్రీకృష్ణుడే అయినా అధికారికంగా రాయబారి మాత్రమే కనుక, అతిథి మర్యాద పేరుతో ఆర్భాటం చేయకుండ

"మనకడకు నేమి కార్యం
బునకై యాతండు వచ్చెఁ బూనికి మెయినా
పని వంచింపక చేయుట
వినుమతనికిఁ బ్రియము దక్కవేయునునేలా"

(ఉద్యోగ. 3-161)

అని హితవు చెప్తాడు. భీష్ముడు కూడ విదురుని అభిప్రాయాన్నే బలపరుస్తూ కృష్ణుడు ధర్మార్థ రూఢంగా పలికిన మాటలకు అనుగుణంగా ప్రవర్తించినట్లయితే సంధి కార్యమంతా గౌరవ ప్రదంగా సానుకూలం అవుతుందని పలుకుతాడు. వీరి అభిప్రాయాలు ప్రలోభపెట్టి దూతను సాధించాలని తలపెట్టిన ధృతరాష్ట్రుని రాజనీతికి ఆఘాతమైనట్లున్నాయి.

శ్రీకృష్ణుడు అతిథి, బంధువు కనక పూజనీయుడే అయినప్పటికీ రాజకీయ కార్యంకోసం వచ్చిన అతడికి కానుకలు ఇచ్చి అల్పత్వం పొందటం మంచిదికాదని సుయోధనుడు అభిప్రాయపడ్డాడు. ఇంకా పాండవులకు ఏడుగడ అయిన కృష్ణుణ్ణి బంధించినట్లయితే "కెక్కలు విఱిగిన పులుఁగులుంబోలె వారు నాకు విధేయులగుదురు. పాంచాల యాదవాదులైన తదీయ బంధుమిత్రులు నా వశంబున వర్తిల్లుదురు. సమస్త దేశంబులు నేనయేలుదు" (ఉద్యోగ. 3-169) అని విక్రమించి పలుకుతాడు. రాయబారిని బంధించ పూనటం ఏ స్థాయిలో పరిశీలించినా రాజనీతి ధర్మానికి విరుద్ధం. అందుకే ధృతరాష్ట్రుడు కుమారుని ఆలోచనకు తల్లడిల్లి తీవ్రంగా ప్రతిస్పందించాడు. దూతను బంధిస్తాననటం రాజకీయ ద్రోహమూ, జగద్ద్రోహమూ అవుతుందని, కృష్ణుని బంధిస్తాననటం ద్రోహం అంటూ "అకందేమి సేసెరా పాపాత్మా" అని అభిశంసించి "ఇటువంటి దురాగ్రహములు మనంబునం దలంచి నప్పుడు చేటుంగల వాడవు గావున నీనం జేటు వచ్చు నుడు పుమయ్య" (ఉద్యోగ. 3-162) అని బ్రతిమిలాడుతూ కుమారుణ్ణి నెమ్మది నపస్తాడు. రాయబారిని బంధించే ప్రయత్నం నుంచి కుమారుణ్ణి మళ్లించే ప్రయత్నం ద్వారా ధృతరాష్ట్రుడు రాజనీతి సంప్రదాయాన్ని పాటించినట్లు స్పష్టం అవుతుంది.

శ్రీకృష్ణుడు పాండవపక్ష రాయబారిగానే వచ్చినా కౌరవ సభలో ప్రాథమికంగా ఉభయ పక్షాల క్షేమాన్ని హితవును కోరిన వ్యక్తిగానే ప్రవర్తించాడు. సభలో శ్రీకృష్ణుని సంబోధనలు, సంభావనలు, మహారాజు ధృతరాష్ట్రుణ్ణి ఉద్దేశించే ఉన్నాయికాని, సుయోధనుణ్ణి ఉద్దేశించినట్లు లేదు. అందువల్ల కురుపాండవ సంధి కార్యంలో కృష్ణుని దృష్టిలో ధృతరాష్ట్రునిదే బాధ్యత అని తేటతెల్లం అవుతుంది. కురువృద్ధులు, గురువులు, హితులు, మునులు కూర్చున్న ఆ సభలో శ్రీకృష్ణుడు ప్రసంగం ప్రారంభిస్తూ, ధృతరాష్ట్రునకు తెలియని అంశాలులేవని, అయినా "పరమ హితంబుం దనవారికిఁ జెప్పనదగు' అనే అభిప్రాయంతో వచ్చానని, ఆ మహారాజుతో అత్యంత సాన్నిహిత్యాన్ని ప్రదర్శిస్తాడు. పాండవ కౌరవులు ధృతరాష్ట్రునకు వేరుకాదని క్షీరోదక గతిని వారిని వర్ధిల్ల చేయవలసిందని అర్థిస్తాడు. శ్రీకృష్ణుడు పాండవ కౌరవులను సంభావించిన విధం, సంజయుణ్ణి రాయబారిగా పంపేటప్పుడు కురుపాండవులు 'క్షీరోదక వృత్తి నెగడునట్లు' కార్యం నడపవలసిందని ధృత··ష్ట్రుడు చేసిన సంభావనకు భిన్నంగా ఉంది. అందువల్ల కురుపాండవ సఖ్యత పరంగా శ్రీకృష్ణ ధృతరాష్ట్రుల ఆలోచనా పద్ధతిలో అపశ్రుతి ధ్వనిస్తుంది.

శ్రీకృష్ణుడు భరత కులౌన్నత్యాన్ని, ధృతరాష్ట్ర పాండురాజుల సోదరానుబంధాన్ని ఉగ్గడించి, ఆ వంశ చరిత్రను భగ్నం చేయటం తగదని అంటాడు. కురువంశం మొత్తానికి కుదురు ధృతరాష్ట్రుడేనని, ఎవరే విధంగా ప్రవర్తించినా మంచి చెడ్డలన్నింటికి బాధ్యత అతనిదే కనుక వంశ క్షేమానికి దోహదంచేసే నిర్ణయం తీసుకోవలసిందని అర్థిస్తాడు. పాండవ పక్షంలో భీమార్జునులు ఉన్నారని, కౌరవ పక్షంలో గురుభీష్మాదులు ఉన్నారనికాక, అందరూ కలిసి 'నీబలాన్ని పెంచితే లోకంలోని రాజులంతా నీచరణ పీఠాన్ని కొలుస్తారు' అని అంటాడు. ధృతరాష్ట్రుడు ఉపేక్షిస్తే

"నరనాథ నీవుపేక్షా
పరుఁడవయినఁ గౌరవుల పాండవులకు కా
దరయగ భూ ప్రజ కెల్లను
దురితం బొనరించినట్లు తుదిఁగీడు సుమీ" (ఉద్యోగ. 3-266)

అని హెచ్చరికగా పలికి కురు పాండవులలో ఎవరికి కీడువాటిల్లినా అది ఆ మహా రాజుకే దుఃఖకారణం అని విన్నవిస్తాడు. బాల్యంలోనే తండ్రిని కోల్పోయిన పాండవులను ఆదిలో రక్షించి, ఈనాడు విసర్జించటం సమంజసం కాదని చెప్పి ఆ మహారాజు హృదయంలో పాండవుల ఎడ ఆత్మీయతను పెంచే ప్రయత్నం చేశాడు. పాండవులు ద్యూత సమయం పూర్తిచేసి తమ రాజ్యభాగం పొందే ఆశతో ఉన్నారు, కనుక ఉభయుల శ్రేయోభిలాషులకు మనఃప్రీతి కలిగేటట్లుగా

**"వారి తండ్రిపాలు వారికిచ్చి నీ**
**పాలు నీవుఁ బుత్ర పౌత్రచయము**
**ననుభవించి సుఖులరై యుండుఁడిది బంధు**
**మిత్ర సుజనకోటి మెచ్చు తెఱగు"** (ఉద్యోగ. 3-277)

అని బంధువుగా రెండుపక్షాల శ్రేయస్సును కోరిన వ్యక్తిగా శ్రీకృష్ణుడు ఆ మహా రాజుకు సలహా ఇస్తాడు.

రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణుడు ఇప్పటివరకు బంధువుగా, శ్రేయోభిలాషిగా ఆత్మీయతనే ప్రదర్శించినప్పటికీ, ఆ ఆత్మీయతా ప్రదర్శనలో కూడ అనేక మారులు అర్ధరాజ్య ప్రసక్తి తెచ్చాడు. శ్రీకృష్ణుడు బంధువుగా ఎంత హుందాగా ప్రవర్తించినప్పటికీ, రాజ్యభాగం ప్రశంస ధృతరాష్ట్రుని అంతరంగ భావంతో ఏకీభవించలేదు. మొదటి నుంచి కూడ సాధించగలిగితే రాజ్యభాగం, లేకపోతే బల ప్రదర్శనేననేది కురుపాండవ వివాదం పరంగా శ్రీకృష్ణుని ప్రతిపాదన. బంధువుగా హితునిగా అతడి సంధి ప్రసంగం హుందాగానే ఉన్నప్పటికీ, అనంతర సంభాషణలో, శాంతియుత సహజీవనం గూర్చిన ప్రస్తావనే ఉన్నా, యుద్ధాన్ని గూర్చిన హెచ్చరికలు నర్మ గర్భంగా ద్యోతకం చేస్తూ శ్రీకృష్ణుడు రాజనీతి ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు వినయ విధేయత్వాన్ని వివరించి, శకుని, సుయోధనాదుల దుష్టచేష్టలను ఎత్తిచూపి, వాటన్నింటికి 'సైరిగంబడితి' అని రాజుగా ధృతరాష్ట్రుని వైఫల్యాన్ని సభవారికి తెలిసే విధంగా విన్నవిస్తాడు. ధర్మసూనుని శాంత గుణము, సత్యవ్రతమును శ్లాఘించి, సుయోధనునితో పోలిక చేస్తూ

"భవ, త్సూనునిమతి యతి లోభము
మానిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా"

(ఉద్యోగ. 3-283)

అని హితవు చెప్తాడు. బోధించిన హితవు సమంజసంగా ఉన్నట్లు గోచరిస్తున్నా నానటితో వెక్కిరించి నట్లుండి శత్రు పక్షంలో సౌమనస్యం పెంచటానికి బదులు వైమనస్యాన్ని అధికం చేసేదిగా ఉంది. అంతటితో ఆగక పాండవుల గుణ గణాలు మరొక్కమారు వివరించి, తన సంధి ప్రవచనాలు వినకపోయినట్లైతే యుద్ధం తథ్యం అని చెప్తూ

"వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నారటుగాక మీకది మనంబున కప్రియమేని నింత కుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండు దెఱంగులందు నీ
కారయ బథ్యమేది యగు నవ్విధమేర్పడ నిశ్చయింపుమా"

(ఉద్యోగ, 3-284)

అని హెచ్చరికతో, పాండవులతో సేవ చేయించుకోవటం, యుద్ధం చేయటం అనే విషయంలో నిర్ణయం ధృతరాష్ట్రునికే విడిచిపెట్టి సంధి ప్రసంగం పూర్తి చేస్తాడు.

రాయబారియైనవాడు సమయోచితంగా వాక్పారుష్యం ప్రదర్శించటం అవసరమే అయినా, శ్రీకృష్ణుని సంధి ప్రవచనం కంఠంపై గొడ్డలిపెట్టి చేస్తావా? చస్తావా? అన్న విధంగా ఉంది. సామరస్య భావంతో ఎంత జటిలమూ, క్లిష్ట తరమూ అయిన విషయాన్నైనా సాధించవచ్చుగాని, హెచ్చరికలతోను, బెదరింపుల తోను సాధించటం సాధ్యం కాదు. బుద్ధిగల మానవులతో వ్యవహరించేటప్పుడు ఎంతో జాగ్రత్త వహించాలి. రెండు పక్షాల మధ్య వైరుధ్యం బీజవ్యాప్తంగా ఉన్నప్పుడు దోషం ఎవరిదో పరిశీలించటం కొంత సాధ్యం అవుతుందేమోకాని, పట్టుదలలు, పంతాలు పెరిగిన తరువాత నేరారోపణ ఏ ఒక్కరిపైనా వేయటం సాధ్యం కాదు. తప్పొప్పులు రెండు వర్గాలలోను కనిపిస్తాయి. ఏ వర్గం శ్రేయోభిలాషులు ఆవర్గం వారనే సమర్థించినేరం ప్రత్యర్థి వర్గంపై వేసేందుకు ప్రయత్నిస్తారు.

అందునా సామరస్యం కుదుర్చుకొనేందుకు ఇరుపక్షాలు చిత్తశుద్ధితో కృషిచేయకుండ, మిత్రపక్షాలతో యుద్ధానికి ఆయత్తమైన సమయంలో, ఉద్రేకాలను రెచ్చగొట్టే చిన్న మాటకూడ కార్చిచ్చులాగా వ్యాపిస్తుంది. ఒకవేళ ఒక వర్గం బలహీనంగా ఉన్నప్పటికీ, ఆ స్థితిలో మరణించటానికే సిద్ధపడతారు కాని శత్రువు దయాభిక్షతో జీవితం సాగించేందుకు ఇష్టపడరు. పరిస్థితి క్లిష్టంగా ఉన్న సమయంలో సామరస్యం సమకూర్చటానికి ప్రయత్నించే వ్యక్తి, దోషాలను ఎత్తిచూపే ప్రయత్నం చేయకుండ, ఓర్పుతో నేర్పుతో పరస్పర సదవగాహన, ఆత్మీయత పెంచేందుకు ప్రయత్నిస్తే తప్ప కార్యం సానుకూల్యం కాదు.

శ్రీకృష్ణుడు సంధి ప్రసంగంలో అట్లాంటి ప్రయత్నం చేసినట్లు లేదు. పాండవుల ఔదార్యాన్ని, సౌశీల్యాన్ని సంభావించి, దోషాలన్నింటిని సుయోధనాదులకు ఆరోపించాడు. అట్లాంటి పరిస్థితుల్లో శ్రీకృష్ణుని హెచ్చరికల మూలంగా సంధికి సిద్ధం అయినట్లైతే సాటి రాజన్యలోకంలో తలవంపులవుతుంది. వంశప్రతిష్ఠ మట్టి పాలవుతుంది. ఇట్లాంటి అనివార్య పరిస్థితుల్లోనే ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని సంధి వచనాలకు అనుకూలంగా వర్తించలేకపోయాడు ఈ సందర్భంలో ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని సంధి వాక్యాలు వినలేకపోయినా, ఆ మహారాజు ఆచరించటానికి వీలుకాని రీతిలో రాయబారి హితబోధ సాగినట్లు తలంచటం భావ్యంగా ఉంటుంది. అయితే శ్రీకృష్ణుని హెచ్చరికలకు వెచ్చిపోయి పాండవులకు రాజ్యభాగం ఇచ్చే విషయంలో తన వ్యతిరేకతను వాచ్యం చేసే వీలులేదు. నిర్ద్వంద్వంగా తిరస్కరిస్తే లోకాపవాదం భరించవలసి ఉంటుంది. శ్రీకృష్ణుని ప్రయత్నం కూడ ధృతరాష్ట్రులను నిందలపాలు చేయటమేనని అతడి మాటలక్రమాన్నిబట్టి ఊహించవచ్చు. అందుకే శ్రీకృష్ణుడు బంధుప్రీతిని వ్యక్తం చేస్తూనే వ్యంగ్యంగా యుద్ధ హెచ్చరికను చేసినట్లే, ధృతరాష్ట్రుడు కూడ రాజనీతిజ్ఞతనంతా ప్రదర్శించి పరిస్థితి తన మనోభీష్టానికి అనుకూలంగా సాధించేందుకు ప్రయత్నం సాగించాడు

ఆ ప్రయత్నంలో ధృతరాష్ట్రుడు సంజయ రాయబార ఫలితాన్ని చర్చించే సమయంలో సభలో ప్రవర్తించిన తీరులోనే ప్రవర్తించేందుకు నిర్ణయించాడు. శ్రీకృష్ణ రాయబార సమయంలో ధృతరాష్ట్రుడు మాట్లాడింది చాల తక్కువ. సభలోని వారు మాట్లాడేది మౌనంగా వినటం మాత్రమే జరిగింది. మాట్లాడిన కొద్ది

మాటలు కూడ సంధికి కుమారుణ్ణి ఒప్పించలేని నిస్సహాయతను వెల్లడించేవే ఎక్కువగా ఉన్నాయి. ఏ దశలోను కురుసామ్రాజ్యాధిపతిగా కుమారుణ్ణి శాసించి కార్యం చక్కబరచే ప్రయత్నం చేయలేదు. కౌరవ సభలో శ్రీకృష్ణుడు మాట్లాడిన తరువాత నారదాది మునులు కూడ ధర్మరాజుతో సఖ్యతగా మెలగవలసిందని సుయోధనునకు బుద్ధి గరపుతారు. అతడు వారి మాటలను స్వీకరించక "నన్ను విధియే మని మునుపుట్టించె నట్టులయ్యేడు" (ఉద్యోగ. 3-325) అని తెగింపును ప్రదర్శించి వారిని ఊరకుండుమని అర్థిస్తాడు. సుయోధనుని ఆభిజాత్య ప్రదర్శనకు మునులు కోపగిస్తారనే ఆందోళనతో వారి సానుభూతిని పొందే ప్రయత్నంలో ధృతరాష్ట్రుడు

"నాముఖంబునఁ గార్యంబు నడవ దేమి
సేయువాడ నొండెద్దియుఁ జెప్పలేదు" (ఉదోగ. 3-327)

అని నిస్సహాయతను వ్యక్తం చేస్తాడు. శ్రీకృష్ణుడు ఇహపరాలు సుఖంగా ఉండే అంశాలు చెప్పినప్పటికీ తనకు "చనదిదియు లేదు దీని సమ్మతి నడపన్" (ఉద్యోగ. 3-328) అని అసమర్థతను వ్యక్తం చేసి, సుయోధనునకు బుద్ధి గరపే బాధ్యత కృష్ణునిపై పెడుతూ

"మందబుద్ధి నాదునందను డీవు పో
రాని చుట్టమవు మహానుభావుఁ
డవు దయార్ద్ర చిత్తుడవు దీనిఁ దేర్పవే
యనునయించి యెట్టులైనఁ గృష్ణ" (ఉద్యోగ. 3-359)

అని వేడుకొంటాడు. ఈ వేడుకోలులో చిత్తశుద్ధికన్నా రాజనీతి ప్రదర్శనమే అధికంగా గోచరిస్తుంది.

ధృతరాష్ట్రుని వేడుకోలుకు అనుగుణంగా శ్రీకృష్ణుడు పాండవులతో సంధి చేసుకొని రాజ్యభాగం ఇచ్చి సఖ్యతగా ఉండవలసిందని సుయోధనునకు చెప్తాడు. కృష్ణుని అభ్యర్థనను బలపరుస్తూ భీష్మద్రోణులు కూడ కురుపాండవ సఖ్యతకై ఎన్ని విధాలుగా చెప్పినా సుయోధనుడు పెడచెవిని పెడతాడు. చివరకు

శ్రీకృష్ణుడు సుయోధనుని వర్జించినట్లయితే కురువంశం విభేదాలు లేకుండ వర్ధిల్లు తుందని సదస్యులకు సూచన చేస్తాడు. దూతగా వచ్చిన శ్రీకృష్ణుడు కుమారుణ్ణి సంహరించేందుకు తన వారినే రెచ్చగొట్టటం ఆ మహారాజుకు అదురుపాటు కలి గించింది. అట్లాంటి విపత్కర స్థితిలో కూడ పాండవులకు రాజ్యభాగం ఇచ్చేం దుకు స్వతంత్రించి నిర్ణయం తీసుకోకుండ కుమారునకు నచ్చ చెప్పేందుకై భార్యను ఆశ్రయిస్తాడు. గాంధారి మాటలు కూడ పెడచెవిని పెట్టి సుయోధనుడు దూతను బంధించే ప్రయత్నం చేయటంతో సభ రసాభాసగా ముగుస్తుంది. ధృతరాష్ట్రుడు పాండవులతో సంధి చేసుకొనే విషయంలో సభలో చర్చకు అనుమతించిన రెండు సందర్భాల్లో కూడ నిర్ణయం తీసుకోకుండానే అర్ధంతరంగా ముగిసింది. ముందటి రాయబారాల్లాగే కృష్ణరాయబారం కూడ కురుపాండవ సఖ్యతను శాంతిమార్గాన సమ కూర్చటంలో సఫలం కాలేదు.

కురుపాండవ సంధి వరంగా ధృతరాష్ట్రుడు ప్రదర్శించిన రాజనీతి కార్యకారి అయినట్లు లేదు. రాజ్యభాగ ప్రసక్తిలేకుండ నేరిమి మాటలతో పాండ వులను తృప్తిపరచేందుకు ప్రయత్నించాడు. సంజయ రాయబారంలో ధృతరాష్ట్రుని ఈ ప్రయత్నం విఫలమైనట్లు స్పష్టంగా వెల్లడైంది. అయితే పాండవులకు రాజ్య భాగం ఇవ్వటం సుయోధనునితో పాటు ఆ మహారాజుకు కూడ అంగీకారం కాదని రాయబారాలలో జరిగిన సంఘటనలు తెలియచేస్తున్నాయి. ధృతరాష్ట్రుడు తన ఆంతర్యంలో ఉన్న ఈ నిర్ణయం బహిర్గతం కాకుండ నెపం కుమారునిపై పెట్టి సంధి కార్యం విషయంలో నిస్సహాయతను ప్రకటించి సానుభూతి పొందేందుకు ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో కూడ విఫలమైనట్లే కనిపిస్తుంది.

సభలో సుయోధనుడు కృష్ణుణ్ణి బంధించ ప్రయత్నించినప్పుడు, సభ రసాభాసగా ముగిసిన అనంతరం యుద్ధానికి సిద్ధం కావలసిందిగా హెచ్చరించి ఉప ప్లావ్యం ప్రయాణం కట్టిన శ్రీకృష్ణునకు వీడ్కోలు చెపుతూ, కురుపాండవులకు సఖ్యతను కూర్చి కురువంశం వర్ధిల్లేటట్లు చేసిన ప్రయత్నంలో

"నీకు శుద్ధుండ నగుటయ నిఖిల బంధు
మిత్ర గురుజన కోటికి ధాత్రికెల్ల
నంబుజాక్ష నిర్దోషుండనగుట గాన
నా తెఱంగు నీవెఱుఁగుట నాకుఁ జాలు" (ఉద్యోగ. 4-5)

అని తన చిత్తశుద్ధికి కృష్ణుడు సంప్రీత చేతస్కుడైతే చాలని దీనంగా అంటాడు. అట్లానే వ్యాసునితో కూడ

"... నాదెస దప్పులేమి మీ
మతి దలపోసి యీ పలుకు మానుడు పాకముదప్పెఁ
గార్యముల్" (భీష్మ. 1-13)

అని అంటాడు. ఇట్లా అనటంలో పాండవులకు సమస్తమూ అయిన కృష్ణుని మనసు ఆకట్టుకోగలిగితే లోకాపవాదం లేకుండా పోతుందని ఆ మహారాజు విశ్వాసం కావచ్చు. ధృతరాష్ట్రుని ఈ ప్రవర్తనలో "ఎదుటి వ్యక్తిని మోమోట పరచి తన యభిప్రాయము నాతనిచే నంగీకరింపచేయు వంచక ప్రవృత్తి యిందభి వ్యక్త మగును"[22] అన్న శలాక రఘునాథ శర్మగారి అభిప్రాయం సమంజసంగా ఉంది. కాని శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని ఆశను వమ్ము చేస్తూ, ఆ రాజు రాజకీయం అంతా బట్టబయలుచేసే నిమిత్తంతో

"ఇప్పుడీ సభఁ బుట్టిన యింతపట్టు
మీకుఁ దెల్లంబుగాదె యీ మేదినీ వి
భుండు దానేమిటికిని ముఖ్యుండగాను
దప్పు దనదెస లేదని చెప్పి విడిచె" (ఉద్యోగ. 4-7)

అని నిష్ఠూరంగా పలికి అక్కడ ఉన్న వారందరికి తన రాయబారం విఫలమై కురు పాండవ యుద్ధం సంభవించటానికి మూలకారణం ఆ మహారాజే అని విశద పరుస్తాడు. చక్రవర్తిగా రాజ్యం శత్రువర్గానికి ఇవ్వకపోవటం సమర్థనీయమే అయినా, మనోగత అభిప్రాయం బయటపడకుండ ప్రయత్నించటంలో ధృతరాష్ట్రుని రాజనీతి విఫలమైందని తలంచటం సమంజసంగా ఉంటుంది. అయినప్పటికీ ఈ రాయబార సన్నివేశాలు "వ్యక్తుల హృదయగత భావావేశములను, స్వభావములను ప్రత్యక్షము చేయుచు పాఠకుల హృదయములకు చైతన్యము కలిగించుచున్నవి"[23] అన్న భూపతి లక్ష్మీనారాయణగారి అభిప్రాయం సద్యః స్ఫూర్తితో ఒప్పుతుంది.

కురుపాండవ యుద్ధం జరగకుండ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై యుద్ధం సన్నద్ధమైన సమయంలో స్వపక్ష సేనానాయలలందరినీ పరస్పర విభేదాలు

మరచి ఒకే త్రాటిపై నడిపించటంలో కూడ ప్రభువుగా ధృతరాష్ట్రుడు సఫలీకృతుడైనట్లు లేదు. సుయోధనుడు తన సైన్యంలోని పదకొండక్షౌహిణులకు సేనానాయకులను నియమించి, సర్వ సైన్యాధిపతిగా వ్యవహరించి కురు సైన్యాన్ని యుద్ధరంగంలో నడపవలసిందని పితామహుణ్ణి అర్థిస్తాడు. భీష్ముడు ఆ పదవిని అంగీకరిస్తూ, కురుపాండవులు తనకు ఒక్కటే కనుక పాండవులను తప్ప మిగిలిన శత్రు సైన్యాన్ని చిన్నాభిన్నం చేస్తానని చెప్తాడు. అదే సందర్భంలో కర్ణునితో అంతకు పూర్వమే ఉన్న వైరుధ్యాన్ని దృష్టిలో ఉంచుకొని

"మున్ను కర్ణుఁడొండె నన్నొండెఁ గయ్యంబు
సేయఁ బనుపు మిట్లు సేయువాఁడ
వైన గాని సకల సేనాధిపత్యంబుఁ
బూన నేరఁజుమ్ము భూపవర్య" (ఉద్యోగ. 4-152)అని

యుద్ధరంగ ప్రవేశానికి ముందుగా తనకుగాని, కర్ణునకుగాని అవకాశం ఇవ్వవలసిందని ఆంక్ష విధిస్తాడు. భీష్ముని ఆంక్షను కర్ణుడు అంగీకరిస్తూ, ఈ అంశం క్రొత్తగా ఉట్టంకించ నవసరం లేదని, భీష్ముడు విరమించేంతవరకు తాను యుద్ధరంగ ప్రవేశం చేయనని నిష్కర్షగా పలుకుతాడు. కురుసైన్యానికి ఆయువు పట్టు అనదగిన ఈ నాయకులిద్దరు వ్యక్తిగత రాగద్వేషాలకు, పంతాలకు లోనుకావటం కురుసామ్రాట్టు ఉద్యమానికి తీవ్ర విఘాతం కలిగించే అంశం. ప్రభువైన ధృతరాష్ట్రుడు కూడ ఈ వీరుల మధ్య సామరస్యాన్ని ఏర్పరచి కార్యసాధనకు సంయుక్తంగా తోడ్పడే ప్రయత్నం చేసినట్లు కనిపించదు.

సేనానాయకుల మధ్య ఈ విధమైన వైరుధ్యం, భగ్నమౌతున్న ధృతరాష్ట్రుని రాజనీతికి నిదర్శనంగా తలంచవచ్చు. శత్రుసంబంధమైన రాయబారులతో శాంతిమార్గాన కార్యం నిర్వహించటంలో నిపుణమైనా, పాండవులకు రాజ్య భాగం ఇవ్వకూడదనే మనోరథమన్నా తీర్చుకోగలిగాడు. కాని భీష్మకర్ణుల మధ్య వైరుధ్యాన్ని పోగొట్టటంలో విఫలం కావటం వల్ల కురుక్షేత్ర సంగ్రామంలో ఆ మహారాజుకు భరించరాని దుష్ఫలితాలు సంభవిల్లాయి. ఇందువల్ల కారణాలేమైనా, మొత్తంమీద ఆంధ్ర మహాభారతంలో ధృతరాష్ట్రుని రాజనీతి ప్రావీణ్యం తాత్కాలిక

ఫలితాలను ఇచ్చినట్లు కనపడినా, పర్యవసానంలో విఫలమైనట్లే తలచటం ఉచితంగా ఉంటుంది. ఈ వైఫల్యమే కురుక్షేత్ర సంగ్రామంలో వంశ వినాశనానికి దారితీసిందనటంలో సంశయంలేదు.

**అథస్సూచికలు :**


1. కౌటిల్యుడు, (అను) మామిడిపూడి వెంకటరంగయ్య, అర్థశాస్త్రము; 1 ప్ర. 3అ. 16 శ్లో. పు. 9.
2 P V Cane, History of Dharma Sastra; Vol. III. P 3
3. పైది, ఒకటి; 5 ప్ర. 9అ. 4శ్లో. పు. 21.
4. యాజ్ఞవల్క్యస్మృతి; 1-352.
5. పైది, ఒకటి; 161 ప్ర. 1అ. 3శ్లో. పు. 530.
6. సం. మ. భా; ఆది. సంభవ. ప; 140 అ-1, 3శ్లో.
7. పైది : 140 అ - 50 శ్లో.
8. పుటపర్తి నారాయణాచార్యులు, మహాభారత విమర్శనము; పు. 150, 151.
9. ఇరావతీకార్వే, బాలచంద్ర ఆప్టే, (తెలుగు అనువాదం) యుగాంతం పు. 133.
10. శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రి, మహాభారతరహస్యము; పు. 46.
11. నందుల గోపాలకృష్ణమూర్తి, ఆంధ్రమహాభారతము - ఔపదేశిక ప్రతిపత్తి; పు. 184.
12. పైది, ఎనిమిది; పు. 153.
13. పి. ఎస్. రాఘవన్; తమిళాంధ్ర భారతముల తులనాత్మక పరిశీలనము; పు. 18.
14. పైది, పది; పు. 354; మరియు, Masti. Venkatesa Iyangar, the Mahabharata ; P 6.

15. పైది, పది; పు. 359.

16. పైది, పదమూడు; పు. 218

17. పార్నంది రామశాస్త్రి, శ్రీ మహాభారత విమర్శనము, ఉద్యోగ పర్వము; పు. 12.

18. పైది, పది; పు. 360.

19. పొట్లూరి నారాయణదాసు, ఆంధ్రసాహిత్యంలో రామాయణములు; పు. 11.

20. పైది, ఎనిమిది; పు. 170.

21. త్రిపురనేని రామస్వామి, కృష్ణనిరాయణారము, ఆంధ్రభారతి; ఫిబ్రవరి. 1912.

22. శలాక రఘునాథశర్మ, భారతధ్వని దర్శనము; పు. 404.

23. భూపతి లక్ష్మీనారాయణ, భారతము-తిక్కన రచన; పు. 66.

# 3.0 ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక జీవితం

## 3.1 పునః పరిణామం

బుద్ధిజీవి అయిన మానవుడు ఆలోచనాశక్తితోను, విచక్షణా జ్ఞానంవల్ల ప్రకృతిలో లభ్యమయ్యే సదుపాయాలను తనకు అనుకూలంగా వినియోగించుకొనే ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రయత్నంలో తెలివి తేటలలోను, ఆలోచనలలోను ఉన్న పరిమితులకు అనుగుణంగా పొందే ప్రయోజనాల్లోకూడ వైవిధ్యం ఉంటుంది. మానవుడు లౌకిక జీవితంలో తనకున్న బుద్ధివైశద్యాన్ని ఆలంబనం చేసుకొని సాటివారి కన్నా వృద్ధిలోకి రావాలని ఆలోచిస్తాడు. ఆ ఆలోచనతోనే వ్యక్తి జీవితంలో పట్టుదల, కార్యసాధన ఎడ ఏకాగ్రత, సంఘర్షణ ప్రారంభం అవుతాయి. అందుకే ఐహికమైన మానవ జీవితం నిత్య సంఘర్షణాయుతమై ఉంటుంది ఆ సంఘర్షణలో కొన్ని విజయాలు లభిస్తాయి. కొన్ని అపజయాలుకూడ పొందటంకద్దు.

మానవుడు లౌకికంగా ఏ ఆలోచన చేసినా, ఏ కార్యం తలపెట్టినా అది సామాజిక రాజకీయ ఆర్థిక పరిస్థితులకు లోబడే ఉంటుంది. పరిసరాల ప్రభావం అతడి ఆలోచనా సరళిపై ఎంతో ప్రాధాన్యం వహిస్తుంది. పరిస్థితులను సమీక్షించి అన్నీ తనకు అనుకూలంగా ఉన్నాయనే భావంతో ఒకకార్యం తలపెడితే, అనుకోని అవాంతరాలవల్ల ఆ కార్యం సానుకూల్యంకాక విపరీత ఫలితం ఇచ్చే అవకాశం ఉంది. ఏ కార్యక్రమాన్నైనా చేపట్టేందుకు ప్రధానంగా ప్రణాళికా రచన. వ్యూహ నిర్మాణాన్ని అమలుచేయటం, సమీక్ష అనే మూడు అంశాలు ప్రాధాన్యం వహిస్తాయి. ప్రణాళికాబద్ధంగా వ్యూహరచన కొనసాగించినప్పటికీ వ్యతిరేక ఫలితం కలిగినప్పుడు ఆ కార్యక్రమాన్నంతటినీ జాగ్రత్తగా సమీక్షించి, అట్లా జరిగినందుకు కారణాలను తెలుసుకొని అనంతర కార్యక్రమంలో ఆ లోపాలు రాకుండ చూసుకోవటం విజ్ఞులు చేసేపని. ముందు చేసినపనిని సమీక్షించటంలో విజ్ఞత లోపించినా అనంతరకార్యం సత్ఫలితాన్నిచ్చే విధంగా తీర్చిదిద్దటం సాధ్యంకాదు. కొన్ని కార్యక్రమాలు వ్యక్తికే ప్రధానం కాకుండ ఒక వ్యవస్థకు సంబంధించి, దాని ఫలితాలు జాతి పురోగమనం మీద, దేశ భవిష్యత్తుపైనా ప్రభావం చూపిస్తాయి. అలాంటి సందర్భాల్లో కార్యాన్ని

రూపుదిద్దేటప్పుడు జాగ్రత్త వహించకుండ పొరపాటుతో వ్యవహరిస్తే జాతికే ప్రమాదం సంభవించే అవకాశం ఉంది.

మానవ జీవితం పరిణామ బద్ధమైంది. ఈ పరిణామం జననంతోనే కాకుండ జీవనగమనంలో కూడ కొనసాగుతుంది. జీవితంలో భిన్న కాలాల్లో, భిన్న పరిస్థితుల్లో మానవుడు తన పరిధికి లోబడి చేసే కార్యంవల్ల అతడి జీవన గమనం కూడ భిన్నకోణాల్లో దర్శించబడుతుంది. యౌవనంలో ఉండే ఉత్సాహం, ఉద్వేగం, అభిరుచులు మధ్య వయసులో కొన్ని మార్పులకు లోనవుతాయి. మధ్య వయసులో ఉండే బాధ్యతలు, ఆలోచనా సరళి, అభిరుచులు కనుగుణంగా చేసే కార్యక్రమాలు ముదిమిలో మరికొన్ని పరిణామాలకు లోనవుతాయి. ముదిమిలో జీవనగమనాన్ని సమీక్షించుకుంటూ, ఆముష్మిక చింతనతో కాలం గడపటం జీవిత పరిణామంగా నిలుస్తుంది. జీవితం ఆరంభంనుంచి ఒడిదుడుకులు లేకుండ కొనసాగినవారి జీవితంలో అంతే ఈ పరిణామంలో విశేషమైన మార్పులు గమనార్హంకావు. యౌవనంలోకాని, మధ్యవయసులోకాని, జీవితానికి సంబంధించి పెంచుకొన్న ఆశలవలయం చిందరవందరై దాని కనుగుణంగా నిర్మించుకొన్న ప్రయోజనం ఏమీలేకుండా పోయినప్పుడు ఆ వ్యక్తి జీవితంలో వచ్చే పరిణామం విశేషంగా సాగుతుంది.

ఏ వ్యక్తిఅయినా, ఏ దశలోనైనా తన ఆలోచనతో మనసుకు నచ్చిన పనేస్తాడు. కొన్ని సమయాల్లో ఆ కార్యం విపరీత ఫలితాలను ఇవ్వవచ్చు. ఆ సమయంలో ఆ వ్యక్తి హృదయంలో ఆ కార్యం పూర్వాపరాలకు సంబంధించి పర్యాలోచన బయలు దేరుతుంది. ఆ పర్యాలోచనలో తాను నిర్వహించిన పద్ధతి దోషభూయిష్టమేమో అనే సందేహం కలిగితే, మార్గం మార్చుకొని అనుకూల ఫలితాన్నిచ్చే ఆలోచనచేస్తాడు. కొందరు అట్లాకాకుండ విపరీత ఫలితం వస్తుందనే ఆలోచన వచ్చినప్పటికీ, పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఆ మార్గంనుంచి తప్పుకొనే అవకాశం ఉండదు. తప్పు చేస్తున్నామని పశ్చాత్తాపాన్ని పొందుతూనే, అనివార్య పరిస్థితుల్లోనే ఆ పని చేయవలసి వచ్చినట్లు ప్రవర్తిస్తారు. వారి మనసులో, ప్రవర్తనవల్ల వచ్చిన పరిణామం ఎలాంటిదైనా, పరిస్థితుల ప్రాబల్యం ఎంతటి బలవత్తరమైనదైనా, చేపట్టిన కార్యస్వరూపం సర్వులకు శ్రేయోదాయకం కానప్పుడు, దానివల్ల వచ్చే ఫలితాలు విపరీతంగానే ఉండి ఆ వ్యక్తి హృదయంలో పశ్చాత్తాపాన్ని

రేకెత్తిస్తుంది. అలాంటివారి పశ్చాత్తాపం కొన్ని సందర్భాల్లో లోకానికి సానుభూతి కారణం అవుతుంది. మరికొన్ని సందర్భాల్లో విమర్శకు స్థానం అవుతుంది.

మహాభారతంలో ధృతరాష్ట్రుడు జీవితంలో ఎక్కువ భాగం కురు సామ్రాజ్యాధికారాన్ని కాపాడుకొని, ప్రధాన ప్రత్యర్థులుగా పరిగణించిన పాండవుల వైభవాన్ని తగ్గించి, అఖండ కురుసామ్రాజ్యానికి సుయోధనుణ్ణి ఉత్తరాధికారిని చేసే ప్రయత్నంలోనే కొనసాగించాడు. ఈ ప్రయత్నంలో ఆ మహరాజు జీవితంలోని పరిణామాలు కొన్ని స్వయం కృతాలైతే, మరికొన్ని పరిస్థితుల ప్రాబల్యం వల్ల అనివార్య పరిస్థితుల్లో జరిగినవిగా కనిపిస్తాయి. ధృతరాష్ట్రుని ప్రవృత్తి సాధారణ దృష్టికి పాండవుల ఎడ అభిమానాన్ని, ప్రేమను వ్యక్తంచేసినట్లు కనిపించినా, అతడి నిగూఢ వ్యక్తిత్వాన్ని పరిశీలిస్తే, ఆచరణలో అదుకు కొంత భిన్నంగా గోచరిస్తుంది. ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం జరిగినప్పటి నుంచీ కురువంశంలో సంభవిల్లిన పరిణామాలు కురుక్షేత్ర సంగ్రామంలో కురు వీరుల మరణంతోకాని ముగియలేదు. ఈ పరిణామాలన్నింటిలోను ధృతరాష్ట్రుని ప్రత్యక్ష, పరోక్ష ప్రమేయం ఉన్న విషయం వాస్తవం అనిపిస్తుంది.

కురువృద్ధులు, హితులు, శ్రేయోభిలాషులు కురువంశ శ్రేయస్సునుకోరి కురుపాండవులు సఖ్యతతో జీవించవలసిన ఆవశ్యకాన్ని వివరించి ఎన్నో హితోక్తులు చెప్పారు. కాని ధృతరాష్ట్రుని రాజ్యదాహం, సుయోధనుని మూర్ఖత్వం, ధర్మరాజు జూదవ్యసనం, కృష్ణుని రాజనీతి, కర్ణుని వంటివారి సలహాలు, ఇంకా ఎన్నో పరిస్థితులు పెద్దల హితోక్తులను బలహీనం చేశాయి. ఇంకా ఆరోపణలు, ప్రత్యారోపణలతో కురు పాండవులమధ్య నెలకొన్న వైరుధ్యం దినదినాభివృద్ధి చెందిందే కాని ఏ దశలోకూడ సామరస్యంకోసం హృదయ పూర్వకంగా రెండు పక్షాలవారు ప్రయత్నించినట్లు లేదు. అందువల్లే సంధికార్యాలన్నీ విఫలం అయ్యాయి. ఫలితంగా అందరికీ శోకమే మిగిలింది. అయితే ఈ వైరంవల్ల ధర్మరాజు బంధు మిత్రాదు లందరనూ కోల్పోయినా చివరకు హస్తినాపుర సామ్రాజ్యాధి పత్యాన్ని అయినా కైవసం చేసుకో గలిగాడు. కాని ధృతరాష్ట్రుడు రాజ్యాధిపత్యాన్ని, కుమారులను కోల్పోయి రెంటికి చెడ్డవాడై రెక్కలు తెగిన విహగం లాగా ధర్మరాజు అధీనంలో బ్రతకవలసిన దుస్థితికి లోనయ్యాడు.

మహాభారత విమర్శకు లనేకులు, భారత పాత్రల్లో పెక్కుమంది ఇంతటి అనర్థానికి ప్రధానంగా ధృతరాష్ట్రుణ్ణే కారణంగా భావించి విమర్శించటం జరిగింది. అతడి రాజ్యదాహాన్ని పుత్రవ్యామోహాన్ని, అనిశ్చితమనస్తత్వాన్ని విదురుని వంటి హితైషులు నిశ్చితంగా ఖండించారు. జీవిత పురోగమనంలో తన ఆశలు, ఆశయాలు, ప్రయత్నాలు తాత్కాలిక ఫలితాలను ఇచ్చినట్లు కనిపించి నప్పటికీ, ధృతరాష్ట్రుని జీవితం ఒక దశకు చేరుకొనేటప్పటికి కురువంశానికి సంభవిల్లగల శాశ్వత పరిష్కారం విషయంలో ఆ మహారాజు హృదయంకూడ నేరం తనదే అనే పరివర్తనకు లోనయినట్లు పరిశీలనవల్ల తెలుస్తుంది.

ఆది సభాపర్వాల్లో ధృతరాష్ట్రుడు కొన్ని సందర్భాల్లో పాండవుల కష్టాలకు సానుభూతి వ్యక్తం చేసినా, వారి కష్టాలకు తానే మూలకారణం అని పశ్చాత్తాపంతో కూడిన భావం వ్యక్తం చేయటం మనకు మొట్టమొదటి సారిగా అరణ్యపర్వంలోనే కనిపిస్తుంది. ద్యూత సమయానుసారం అరణ్యవాసం చేసే పాండవులను ద్వైత వనంలో సందర్శించిన బ్రాహ్మణు డొకడు హస్తినాపురం వచ్చి వారి కష్టాలను ధృతరాష్ట్రునకు విశదీకరిస్తాడు. తమ్ముని కుమారుల కష్టాలకు తానుచేసిన కీడే కారణం అనే అభిప్రాయంతో ధృతరాష్ట్రుడు విషణ్ణ హృదయుడై కన్నీరు తొరగగా డగ్గుత్తికతో కొంత సేపు మాట్లాడలేక పోతాడు. ఆవేదన అధికమైనప్పుడు డగ్గుత్తిక పడటం సహజపరిణామమే. కొంత సేపటికి తేరుకొని తనవల్ల, తన కుమారుని వల్ల పుణ్యాచారులైన పాండవులకు ఎక్కడలేని ఆపదలు కలిగాయని గద్గద కంఠంతో వాపోతాడు. ధర్మరాజును పెద్దకుమారునిగా సంభావిస్తూ ధీరుడు, కౌరవకుల సందీపకుడు, కాపురుష విదూరుడైన అతణ్ణి దయారహితుడైన విధాతృడు కష్టాలపాలు చేశాడని విధివైపరీత్యానికి సంతాపం వ్యక్తంచేస్తాడు. తన ఉపేక్ష, కుమారుని మూర్ఖత్వం ఇంతటి అనర్థానికి కారణం అంటూ

"ఏను వలదన్న జూదము
మాన(డ సుత దుర్ణయంబు మగిడింపక దు
ర్మానమున( గులక్షయ సం
ధానమునకు( దొడ(గితిని విధాతృని చెయిదిన్"

(అరణ్యా. 5-339)

అని విచారిస్తాడు. ఆ పరిణామమంతా కర్మఫలం అని, దైవకృతం దాటటం ఎవ్వరికీ సాధ్యంకాదంటూ "కౌరవ్యులకుం దెగు కాలంబయ్యె వగపు తెరువింకేలా" (అరణ్య. 5-338) అని నిర్వేదానికి లోనయ్యాడు. అదే ధోరణిలో రాత్రిపగలు ఒకదాని తర్వాత ఒకటి వచ్చినట్లుగా

''పరగ సుఖ దుఃఖములు గాల పర్యయమున
నెందు మనుజుల బొందక యేలయుడుగు''(అరణ్య. 5-340)

అని సుఖదుఃఖాలనేవి మానవజీవితంలో సహజ పరిణామాలని వేదాంత ధోరణిలో పలికాడు. ఇంకా మేలు కలిగిందని సంతసించేంతలో ఆపదలు కలుగుతాయి, ఆపదలు తొలగేంతలో సుఖం కలుగుతుంది, మానవునకు కర్మఫలం తప్పదు, ప్రబుద్ధ మనస్కులైనవారు సుఖ దుఃఖాలకు అతీతంగా ఉండి సుఖిస్తారు' అని పలికే ధృతరాష్ట్రుని మాటల్లో అతడి మనసులో నెలకొన్న నిర్వేదమూ, పశ్చాత్తాపమూ ద్యోతక మవుతాయి.

ధృతరాష్ట్రునిలో ఈ పరిణామం పాండవులకు అన్యాయం చేశాననే భావనకన్నా, వారి బలపరాక్రమాలవల్ల కలిగిన భయం వల్లనేనని తలంచవచ్చు. జూదంలో ఓడి అరణ్యానికి పోయే పాండవుల హావభావాలను విదురుడు వివరించినప్పుడు కొంత భయం కలిగినా, ఆ రాజు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వలేదు. అట్లాగే అరణ్యాల్లో పాండవుల కష్టాలను వివరించి, పెదతండ్రిగా సాదరంగా ఆహ్వానించమని హితవు చెప్పినప్పుడు కూడ విదురుని మాటలు చెవికెక్కలేదు. అంతేకాక విదురుణ్ణి అంతఃపురం నుంచి వెళ్ళగొట్టాడు. అట్లాంటిది ఈ సందర్భంలో ధృతరాష్ట్రునిలో వచ్చిన ఈ పరిణామం, అతడి మనసులో జరుగుతున్న సంఘర్షణ, గుర్తించ తగింది. ఈ అంతస్సంఘర్షణలో గ్రీకు రూపకాల్లోని విషాదనాయకుని ఛాయలు ద్యోతకం కావటం గమనించవచ్చు. అరణ్యంలో క్రూరమృగాల బారిపడి మరణిస్తారని విశ్వసించిన పాండవులు, శస్త్రాస్త్రాలు సాధించి బలవంతులు కావటం తన ఉనికికే భంగకరంగా భావించి ఉంటాడు. ఆ ఆలోచన వల్లనే ఆశించిన ప్రయోజనం వ్యతిరేకంగా పరిణమిస్తుందేమో ననే భయంతో ఆ మహారాజు హృదయం నిర్వేదంతో కూడిన పశ్చాత్తాపానికి గురి

అయింది. అయితే అతడి హృదయంలో పెరిగిన ఈ భావం స్థిరంగా నిలవక యథాప్రకారం పాండవ వ్యతిరేక భోరణినే బలపరచటం జరిగింది.

కురు పాండవ సంధి ప్రయత్నంలో రాయబారాలన్నీ విఫలమై యుద్ధం సన్నద్ధమైంది. అనివార్యమైన యుద్ధాన్ని ఆ దశలో తప్పించటం ధృతరాష్ట్రునకు కూడ సాధ్యం కాలేదు. యుద్ధం కీడని తెలిసినా, కుమారుణ్ణి అదలించి మళ్లించ లేని నిస్సహాయతకు చింతిస్తూ, దైవకార్యం తప్పించటం ఎవరికీ సాధ్యం కాదని నిరాశ వ్యక్త పరుస్తాడు. ఆ మహారాజు కుమారుల శక్తి సామర్థ్యాలు, మానుష శక్తిపై విశ్వాసంతో కురుక్షేత్ర యుద్ధంలో విజయం సాధించవచ్చని ఆశ పడ్డాడు. అయితే యుద్ధం కొనసాగే కొలదీ పాండవ పక్షం విజయం సాధిస్తూ, కౌరవ పక్షం తల్లడిల్లటం ధృతరాష్ట్రుణ్ణి ఆశ్చర్యంతో కూడిన ఆవేదనకు లోను చేసింది. ఈ ఆవేదన వ్యత్యస్త ఫలితం సంఘటిల్లినప్పుడు గ్రీకు విషాద రూపకాల్లో నాయకుడు అనుభవించే ఆవేదనను స్ఫురింపు చేస్తుంది. కౌరవ పక్షంలో మహావీరులైన నాయకు లనేకులు ఉండి కూడ పాండవ బలాన్ని గెలవలేక పోవటం 'దైవ ఘటన' అని, ఇది ఎంతో చోద్యంగా ఉందని ఆవేదనతో కూడిన ఆశ్చర్యం వ్యక్తం చేస్తాడు. మానుషశక్తికన్న దైవఘటన వల్ల నాయకుని పతనం సంభవిస్తుందనే భావన గ్రీకు విషాద రూపక కర్తలు చేసినట్టిదే. మానవుడు తన ప్రయత్నంతో ఫలితం సానుకూల్యం కానప్పుడు దైవ ప్రాతికూల్యాన్ని స్మరించుకోవటం సహజ ప్రవృత్తిగానే భాసిస్తుంది. ధృతరాష్ట్రుడు ఇట్లా స్మరించు కోవటంలో కూడ విషాదనాయకుని ఛాయలు ద్యోతకం అవుతున్నాయి. ఆ సమయంలోనే కర్మసిద్ధాంతాన్ని ఆశ్రయించి, కర్మ ఫలితమని సరిపుచ్చుకోవటం జరుగుతుంది. ధృతరాష్ట్రుడు కూడ "మతి కర్మము వెనుక జనక మానునె యెందున్" (భీష్మ. 2-353) అని కర్మ ఫలితాన్ని అనుభవించాల్సిందేనంటూ "విధికృతం బెవ్వరికి నుడుప వచ్చు నెట్లుగా నున్నది యట్ల య్యెడుం గాక" (భీష్మ. 2-354) అని దైవం ప్రతికూలమైనప్పుడు చేయగలిగింది లేదని విచారం వెలి బుచ్చుతాడు.

పాండవ విజయాలు కొన్ని సమయాల్లో ఆ మహారాజుకు మాయగా కని పించేవి. ఏడవరోజు యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు సుయోధనుణ్ణి కలత చెందిం చిన విషయం విన్న ధృతరాష్ట్రునకు కోపమూ, జాలితో కూడిన ఆవేదన హృద

యంలో పొంగింది. ఆ ఆవేదనలో వాస్తవాన్ని భరించలేని అశక్తత, పతనానికి కారణం ఊహించలేని విభ్రాంతి ద్యోతకం అవుతాయి. అట్లానే ఎనిమిదవ రోజు యుద్ధంలో, తనను నిష్ఠూరమాడే సుయోధనునకు భీష్ముడు 'పాండవులను గెలువ సాధ్యం కాదన్న విషయం' పూర్వమే చెప్పినదాన్ని గుర్తు చేస్తాడు. ఆ అంశం, సంజయుని వల్ల విన్న ధృతరాష్ట్రుని హృదయంలో తీవ్ర సంచలనం కలిగించింది. కన్నాకై కురు సైన్యాన్ని రక్షిస్తాడని విశ్వసించిన భీష్ముడే అట్లా మాట్లాడటం ఆ మహారాజుకు ఆశ్చర్యంతో కూడిన విషాదాన్ని రేకెత్తించింది. నిస్సహాయ స్థితికి లోనై, ఇంతటి దురవస్థ దైవకృతం వల్ల సంప్రాప్తించిందని, ఎన్ని చెప్పినా వినిపించుకోని కుమారుణ్ణి నిందిస్తూ, ఆ అంశాలు త్రవ్వుకోవటం గత జల సేతు బంధనం అనే అభిప్రాయం వెలిబుచ్చుతాడు.

కురురాజును రక్షిస్తాడని విశ్వసించిన భీష్ముడు శిఖండికి ఓడటం ధృతరాష్ట్రుని హృదయాన్ని బ్రద్దలుచేసి ఉంటుంది. కుమారులకు గతిలేదని విలపిస్తాడు. భీష్ముని మరణాన్ని ఓర్చిన తన చెవులు ఎంతటి దుర్వార్తనైనా వినటానికి సమర్థమైనవేనని అంటూ

> "... ... దుర్వినీతికిం
> బుట్టిన యిల్లనై వినక పోవఁగవచ్చునె యింక నాకునే
> దిట్టఁడ నైతి నెల్లవియుఁ దెల్లముగా విననేర్తు సంజయా"
>
> (భీష్మ. 1-65)

అని ఆత్మ నిందకు పాల్పడతాడు. ఆశలన్నీ భయంకరంగా విఫలం అయినప్పుడు, ఆ తాకిడికి తట్టుకోలేక ఆత్మనిందకు గురికావటం లోకంలో చూస్తుంటాము. విషాద రూపకాల్లో అయితే కొన్ని సందర్భాల్లో నాయకుడు మరణించటం కూడ సంభవిస్తుంది. ధృతరాష్ట్రునిలో ఈ ఆత్మ నిందాభావం భీష్ముని మరణానికి తానే కారణం అయ్యానేమోననే పశ్చాత్తాప భావం నుంచి జనించిందని తలంచవచ్చు. ఆ భావంతోనే పాండవుల విజయం ఎడ "ధర్మంబుగీడు పఱచి పరగి యధర్మంబు పెరిగినట్లున్నది" (భీష్మ. 1-60) అని ఆరోపణ చేస్తాడు. అరణ్య వాసంలో పాండవులు కష్టాలు పడుతున్నారని, వారి కష్టాలకు తానే కారణం అని పశ్చాత్తాపం

వెల్లడించిన ఆ మహారాజు యుద్ధంలో పాండవుల విజయాలు అధర్మ యుతమైనవని అభిప్రాయ పడటం విశేషంగా ఉంది. ధృతరాష్ట్రునిలోని ఈ వైవిధ్యంలో మొదటి అభిప్రాయం పెదతండ్రిగా సానుభూతి ప్రదర్శనం అని, రెండవో అభిప్రాయం ఆ మహారాజు వ్యక్తిత్వం అని భావించటం సమంజసంగా ఉంటుంది.

భీష్ముని నాయకత్వంలో జరిగిన పదిరోజుల యుద్ధంలోనే కురుసైన్యం వెను కంజ వేసిన సూచనలు పొడకట్టాయి. అనంతరం ద్రోణుని నాయకత్వంలో జరిగిన యుద్ధం ఎంతో భీభత్సంగా ఉంది రెండు పక్షాలలోను ఎందరో మహావీరులు మర ణించారు. ఈ ఐదురోజుల యుద్ధంలోని పరాజయాలు ధృతరాష్ట్రునకు మిక్కుట మైన విషాదాన్ని కలిగించాయి. తన సేనానాయకులపై పెట్టుకొన్న ఆశలన్నీ వ్యర్థమయ్యాయి. ఆ మహారాజును నిరాశ, నిస్పృహ, అసహనం, కోపం ఒక్కుమ్మడిగా ఆవహించాయి. కర్ణుడు ఆశలన్నీ అడియాసలుచేసి చేసిన బాసలు నిలుపుకోలేనందుకు ఆ రాజును శోకక్రోధాలు ఒక్కసారి ఆవహించి వివ శుణ్ణి చేశాయి. యుద్ధ మధ్యంలో కురుసేనానాయకుల మధ్య అభిప్రాయభేదాలు అతణ్ణి నైరాశ్యానికి గొను చేశాయి. ఆ సమయంలో సుయోధనుని దయనీయ స్థితిని తలచుకొని తన కుమారుడు ఓడిపోయే యుద్ధమే చేస్తున్నాడనే నిశ్చయానికి వచ్చాడు. ధృతరాష్ట్రుని హృదయంలో వచ్చిన ఈ విపరీత విషాద పరిణామం కర్ణ సుయోధనులను నిందించి శత్రువులను పొగిడేంతవరకు వెళ్లింది. భీమునకు కర్ణుడు ఓడిన సందర్భంలో "అడిబీరపుఁ దులువ గెలుచునటె పాండవులన్" (ద్రోణ. 4-184) అని కర్ణుణ్ణి నిందించి, పాండవుల పరాక్రమాన్ని కొనియాడ తాడు. అట్లానే కర్ణుని సలహాను విని, ఆతని శక్తిపై విశ్వాసం ఉంచిన సుయోధ నుణ్ణి

**"సూతసుతుఁడు పాండు నృప సూనులఁ బోరజయించు నంచు గ**
**ర్వాతిశయమునన్ జనమదాంధుడు కృష్ణు తృణీకరించి సం**
**ప్రీతిగ సంధి సేయుఁడ యపేత కళంకులు వారు వారికే**
**ఖాతగవే దైవము దలంచు రణంబున జేటు సంజయా"**(ద్రోణ. 4-185)

అని నిందించి, పాండవులకు దైవబలం అండగా ఉందని పలుకుతాడు. ఇంకా కృష్ణార్జునుల కలయికను శ్లాఘిస్తూ, ఆ రెండు వెలుగులతో ప్రకాశించే ధర్మరాజు యుద్ధానికి భయపడడు అని అంటాడు. కుమారులకు, కౌరవ పక్షానికి తనవల్లే ఆపద సంభవిల్లింఎంటూ "నాచే వచ్చెం గౌరవులకు జేటేమందున్" (ద్రోణ. 1-100) అని ఆత్మనిందకు పాల్పడతాడు. ధృతరాష్ట్రుని ఈ ప్రవర్తన నిరాశా నిస్పృహలకు లోనై ఆశల్ని సమూలంగా నాశనమైనప్పుడు మతి భ్రమించిన వ్యక్తి ఉన్మత్త ప్రలాపంగా ఉంది.

యుద్ధంలో ద్రోణవధ ధృతరాష్ట్రుణ్ణి నిశ్చేష్టుణ్ణి చేసింది. ధృష్టద్యుమ్నుడు ద్రోణుణ్ణి సంహరించిన సమయంలో సుయోధనాదులు "కటకటా యనుచు నింత వుట్టునే యనుచు నింక నేమి గలదనుచు నెట్లు సేయంగల వారమనుచు నేది తుది యనుచు" (ద్రోణ. 5-325) చిందరవందర అయిన విషయం విన్న ధృతరాష్ట్రుడు మనసులో విపరీతమైన వ్యధకు, పశ్చాత్తాపానికి లోనయ్యాడు. ద్రోణుని మరణవార్త విని హృదయం చెదరి, వదనం వెల్లనై, నెవ్వెఱపోయి

"...... ద్రోణుని పాటు వినియు
వేయి పఱియలై పోవదు డాయిగాగ
నోపు నాగుండె యేమని యుమ్మలింతు" (ద్రోణ. 1-80)

అని తన హృదయ కాఠిన్యాన్ని నిందించుకొంటాడు. ఆ ఆవేదనలో ద్రోణుని సేవా ధర్మాన్ని కొనియాడుతూ "దుర్మతులగు మత్సుతులకుఁగా మృతుడయ్యెఁ బరోపకార వృత్తి యొప్పగదా" (ద్రోణ. 1-83) అని అస్త్రగురువు పరోపకారంకోసం ఆత్మత్యాగం చేసిన మహాప్రియుడని కృతజ్ఞతాభావం వెలిబుచ్చాడు. ద్రోణుని వధ పామును చీమలు చిక్కుపరచినట్లున్నదని ఆక్రోశంతో "ఏమనగల దింక నూత యెవ్వరు మనకున్" (ద్రోణ. 1-85) అని నిస్సహాయుడై అభద్రతా భావానికి లోనయ్యాడు. ఎన్నో ఆశలు పెంచుకొన్న ఆ గురువు తన ఆశలు అడియాసలు చేయటంవల్ల ధ్యేయం భగ్నమైందనే బాధతో ఆ మహారాజు చిక్కబట్టు కోలేకపోయాడు మనఃస్థైర్యాన్ని కోల్పోయి

"...పనవి వనట నలదురి
నిను నెద్దియునడుగ నాకు నీవేమియుఁ జె
ప్పను వలవదు సంజయ మఱి
వినియెద మది గలఁగె..." (ద్రోణ. 1-93)

అని వివశాత్మకుడై మూర్ఛలో మునిగాడు. పెంచుకొన్న ఆశలు అడియాసలై ఆశయాలు సమూలంగా భగ్నం అవుతుంటే ఏ మానవుని స్థితికూడ ఇంతకన్న భిన్నంగా ఉండదు.

తండ్రీకొడుకులకు ఎంతో విశ్వాసపాత్రుడై తానొక్కడే పాండవ సైన్యాన్ని హతమార్చగలడని విశ్వసించిన కర్ణుడు కూడ విఫలం కావటంతో ధృతరాష్ట్రుని హృదయం భరించలేని గ్లానికి లోనయింది. భీముడు దుశ్శాసనుని రక్తం త్రాగిన విషయం విని "సంజయా నీమాటల్ వినవేరపు వెఱ్ఱులెత్తి మునిగిన చిత్తము" (కర్ణ. 1-14) అని విమూఢాత్ముడవుతాడు. యుద్ధంలో బంధుమిత్రుల మరణం విని తానొక్కడు తప్ప ఇతరులెవరూ ప్రాణాలతో బ్రతకలేరని హృదయ కాఠిన్యాన్ని నిందించుకొంటాడు. కర్ణుని మరణంవల్ల కలిగిన పరాభవం హృదయ శల్యమౌతుంటే ఆ శోక సముద్రం తరించటం తనకు సాధ్యం కావటం లేదంటూ "పౌరుష మేటికి ? దైవంబేరూపునఁ జూడ ఫలద మేమందము" (కర్ణ. 1-28) అని దైవం ప్రతికూలమైనప్పుడు పౌరుషం వ్యర్థమేననే నిర్ణయానికి వస్తాడు. కర్ణుని మరణవార్త విని కూడ హృదయం బ్రద్దలు కాకుండ ఉండటం 'పాపి చిరాయువు' అనే నానుడి తనకు సక్రమంగా సరిపోతుందని నిర్వేదం వ్యక్తం చేస్తాడు. కర్ణుడు మరణించటం కుమారుణ్ణి దిక్కులేనివానిని చేసిందని ఆక్రోశిస్తాడు. ఈ పరిస్థితుల్లో సుయోధనుడు విజయం సాధించటం దుస్సాధ్యమని అంటూ, ధర్మరాజు యుద్ధం వద్దు సఖ్యతతో జీవిద్దామని చెప్పినప్పటికీ "రోగి పథ్యాశనము నకుం జొరని భంగి" (కర్ణ. 1-33) ఆ మాటలు కొడుకు మనసుకెక్కని ఫలితం అనుభవానికి వచ్చిందని ప్రత్యర్థి శాంతి కాముకత్వాన్ని కొనియాడతాడు. ఇంకా తన నిస్సహాయ స్థితిని తలచుకొంటూ

"పడుచు లీకలూడ్చి పట్టి యాడెడునట్టి
పులుగు చందమయ్యెఁ దలప నా య
వస్థ యెందు జొచ్చువాడ, నీ యలమట
దీర్ప నెవ్వరింక దిక్కు గలరు..." (కర్ణ. 1-34)

అని ఆక్రోశించిన ధృతరాష్ట్రుని స్థితి మిక్కిలి దయనీయంగా ఉంది. ఆ మహారాజు అంతర పరితాపం స్పష్టంగా కనిపిస్తుంది. ఆ స్థితిలో కర్ణసుయోధనుల మూర్ఖత్వాన్ని "తప్పు నెఱుంగరేమియు నతండును నాతఁడు నేమిసేయుడున్" (కర్ణ. 1-220) అని నిరసించి, ఇంతటి అనర్థానికి సుయోధనుని చిత్తమాంద్యమే ప్రధాన కారణం అని శోకిస్తాడు. గతంలో జరిగిన సంఘటనల ఫలితమే ఈ యుద్ధ పరాజయం అంటూ

"జూదంబునాడు మొలచిన
యాదుర్దశ పెరిఁగి సంజయా నిర్భర దుః
ఖోదయ పరంపరా సం
పాదినియై మనసు నిట్లు పఱిగొనియెడినే" (కర్ణ. 1-223)

అని ఈ శోకం స్వయంకృతాపరాధ ఫలితమే అనే అభిప్రాయానికి వచ్చినట్లు కనిపిస్తుంది. ఆ స్వయంకృతాపరాధం కూడ "దుర్యోధను చేసిన యపకార్యంబున వచ్చినట్టిది" (కర్ణ. 1-224) అని నేరం కుమారుని యందారోపిస్తాడు.

శల్యుడు, సుయోధనునితో సహా నాయకులందరు మరణించటంతో ఆ రాజు శోక సంతప్తుడై ఒంటరినయిపోయాననే భావానికి లోనయ్యాడు. ఎంతో ఆశపెట్టుకొన్న వీరులు ఏవిధంగాను ఉపయోగపడక మహావీరులనుకొన్నవారు సైతం బలహీనులచే సంహరింపబడి నాశనం అయ్యారని శోకసంతప్తుడయ్యాడు. తాను తలచిందంతా తల్లక్రిందులైందని, ఇదంతా విధికృతమని దుఃఖించి విధి బలీయమని సరిపెట్టుకోవటానికి ప్రయత్నిస్తాడు. భీముడు అన్యాయమార్గంలో కుమారుని తొడలు విఱుగ గొట్టినందుకు తమ పరదృష్టానికి దుఃఖిస్తూ

"తలపఁగ భాగ్యవంతుల కుదాత్త శుభంబగు గాక పుణ్యహీ
నుల కది గల్గనేర్చునె తనూభవులాఱడిఁ బోయిరింకఁ గా
నలఁ జరియింపఁ బోవుటయ నాకుచితం బటుగాక చండినై
నిలిచితినేని మాటలనె నిచ్చలు భీముడు సూడుచుండడే"

(శల్య. 1-31)

అని తన భవిష్యజ్జీవితాన్ని గూర్చి శోకతప్తుడై అరణ్యవాసం పోవటంకన్న గత్యంతరం లేదనే అభిప్రాయానికి వస్తాడు. నూరుగురు కుమారుల మరణం విని కూడ గుండె వ్రక్కలు కాలేదంటే అది పాషాణం కన్న కఠినమైందనే ఆలోచనకు లోనయ్యాడు. భావి జీవితంలో పాండవులను ఆశ్రయించి బ్రతుకవలసి వచ్చిన దురదృష్టానికి దుఃఖం పెల్లుబికి తన దీన స్థితికి

"... అట్టి భూపాలు తండ్రినై
ప్రాభవమునఁ జేర్చి పరమ దైన్య
వృత్తికోర్వదగునె వినవశమె మాట
లామరుత్తనూజుఁడాడ నాకు" (సౌప్తి. 1-7)

అని శోక సంతప్తుడైనట్లు కనిపిస్తుంది. ఈ సందర్భంలో ఆ మహారాజు నిస్సహాయస్థితి, ఇంతటి అనర్థంలో తన భాగం కూడ ఉన్నదనే ఆవేదన స్పష్టంగా వ్యక్తం అవుతుంది.

యుద్ధం ముగిసింతరువాత కురువంశం సమూలంగా నాశనమైన విషయం విన్న ధృతరాష్ట్రుని స్థితి ఎంతో దయనీయంగా మారింది. పుత్రులు, బంధువులు, మిత్రులందరు మరణించినా రెక్కలు తెగిన పక్షిలాగా, కాంతి కోల్పోయిన సూర్యుని లాగా వెలవెలబోతూ కష్టవిష్ఠురమైన బ్రతుకు సాగించటం సాధ్యం కాదనే ఉద్వేగానికి లోనయ్యాడు. కృష్ణుడు, విదురుడు మొదలైనవారు హితవు బోధించినా 'దుర్బుద్ధినగుట బాటింప నైతి' అని ఆత్మనిందకు పాల్పడతాడు. సుయోధనాదులతోపాటు తన బుద్ధి కూడ 'కుత్సితమయ్యె విధాతృప్రేరణన్' అని నిందించుకొంటూ

"అప్పుడటు లతఁడు సెప్పఁగ
దప్పఁ దలచిన ఫలంబు దగఁ గుడువక పోఁ
జొప్పడునె......" (శల్య. 1-37)

అని వికృతపుటాలోచనలు విరుద్ధ ఫలితాలనే ఇస్తాయని దుఃఖిస్తాడు. తన కారణం గానే పుత్రులంతా మరణించారని అంగీకరిస్తూ, తన కీడువల్లే బంధు నాశనం సంప్రాప్తించిందని పశ్చాత్తాపదగ్ధుడయ్యాడు. ఆ దుఃఖోద్వేగంలో ఆ మహారాజు మనసు దైవంపై మళ్ళీ "దైవంబు దుఃఖ భాజనత్వం బొనర్చుటం బూర్వ జన్మాచరితంబైన సుకృతంబులేమి గాన నయ్యెడు" (స్త్రీ. 1-14) అని పూర్వజన్మ దుష్కృత్యం వల్లనే దైవం ప్రతికూలమైందనే అభిప్రాయానికి వస్తాడు. ఈ సందర్భంలో పశ్చాత్తాప దగ్ధుడైన ఆ మహారాజు మనసు ఆముష్మికంపై లగ్నం అవుతున్నట్లు తెలుసుకోవచ్చు.

పుత్రమరణ జనిత శోకంతో క్రుంగిపోయి ఉన్న ధృతరాష్ట్రుణ్ణి ఓదార్చ టానికి వచ్చిన వ్యాసునితో ఆ రాజు దుఃఖాన్ని విశదీకరిస్తూ మానవ జన్మ మానస దుఃఖాలన్నింటినీ తెచ్చిపెడుతుంది, అట్లాంటి 'భవంబిది కాల్పనే తండ్రీ' అని జీవితంపై నిరాసక్తతను ప్రకటిస్తాడు. రాజ్య వైభవంపోయి, సంతానం, బంధువు లందరూ యుద్ధంలో దారుణంగా మృతిచెందితే 'ఎవ్వనికైన శోకమను వహ్ని గాల్పదే' అని పలికి, ఇంతటి దౌర్భాగ్య స్థితిలోకూడ

మునీంద్ర నిర్భాగ్యత ముట్టి చావుం
గా నేరదయ్యెం గడుగట్టి చిత్తం
బనూన మూర్ఛం దెగటాఱియుం దా
రానేర్చె నిమ్మేనికిఁ గ్రమ్మఱంగన్" (స్త్రీ. 1-64)

అని మృత్యువు సంప్రాప్తం కాని తన హృదయ కాఠిన్యాన్ని దూషించుకొన్నాడు. దుఃఖోద్వేగంతో జీవితంపై విరక్తి ప్రబలిన ధృతరాష్ట్రునకు వ్యాసుని హితవచనాలు కొంత ఊరట కలిగించాయి. అంతకు పూర్వం విదురుని, సంజయుని సాంత్వన వాక్యాలతోపాటు వ్యాసుని హితోక్తులు మనస్తాపాన్ని తగ్గించాయని పలుకుతాడు. చిత్తస్వాస్థ్యం చిక్కిన తాను కుమారులకై శోకం వదలి పాండవుల ఎడ ప్రేమ

బాంధవ్యం పెంచుకొని మనశ్శాంతికి దోహదంచేసే కార్యకలాపాలు నిర్వహిస్తానని అంటాడు. జీవితంలో నిర్వహించిన కార్యక్రమాలన్నీ వ్యర్థమై పరిణామాలు విపరీతంగా ఉండటంతో, ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో ఆ మహారాజు హృదయం వైరాగ్య ప్రశాంతిని పొందినట్లు గ్రహించవచ్చు. ధృతరాష్ట్రుని హృదయంలో పశ్చాత్తాపం కారణంగా ఏర్పడ్డ ఈ పరిణామం జీవితాంతం కొనసాగి ఆముష్మిక ప్రయాణంలో తోడ్పడినట్లు తరువాతి కథ పరిశీలిస్తే తెలుస్తుంది.

కురుక్షేత్ర సంగ్రామంలో విజయం సాధించి హస్తినాపుర సింహాసనాన్ని అధిష్ఠించిన ధర్మరాజు పెదతండ్రిని పుత్రజనిత శోకం మరచే విధంగా సంభావిస్తున్నప్పటికీ ఏకాంతంలో భీముని నర్మగర్భ ఉపాలంభనలు ధృతరాష్ట్రునకు హృదయశల్యాలై భరించలేనివయ్యాయి. కురుసామ్రాజ్యాధిపతియై, వీరులైన కుమారులకు తండ్రియై వైభవోపేతంగా ప్రకాశించిన ఆ మహారాజుకు ఈ అనుభవం భయంకరమైనదే అయింది. భీముని ఎత్తిపొడుపు మాటలవల్ల గతమంతా మనసులో మెదలి జరిగిన వినాశనానికి తానే కారణం అనే భావనకు లోనయ్యాడు. ఆ భావంతో వృద్ధరాజు హృదయం పశ్చాత్తాపంతో క్రుంగిపోయింది. అందరి సమక్షంలో తన హృదయాన్ని బ్రద్దలుచేసి గద్గద ఆవేదనను వెల్లడిస్తాడు. తన కారణంగానే కౌరవ కులానికి నాశనం వాటిల్లిందని ఆక్రోశించి, కృష్ణుడు, భీష్మ, ద్రోణ, కృప, సంజయ, విదురాదులు సస్నేహంగా బోధించిన హితవును పుత్రవ్యామోహం కారణంగా ఉదాసీనభావంతో తిరస్కరించానని వాపోతాడు. గాంధారి చెప్పిన మాటకూడ వినని కారణంగా ఈనాడు అంతరంగమంతా శల్యమైందని దుఃఖోద్వేగంతో అంటాడు. ధృతరాష్ట్రుని ఈ పరివర్తనలో హృదయంలోని పశ్చాత్తాపజనితమైన ప్రశాంతి ద్యోతకం అవుతుంది. ముదిమి సమీపించిన దశలో జీవితంలో సర్వస్వమూ కోల్పోయి, ఆశలన్నీ అడియాసలైనప్పుడు సంక్లిష్టమైన ఈ ప్రశాంతి కలగటం సహజంగానే కనిపిస్తుంది.

ధర్మరాజు ఆర్ద్రభరిత ప్రేమాదరాలతో సంభావించటంలోని మంచితనాన్ని ధృతరాష్ట్రుని హృదయం భరించలేకపోయింది. శత్రువు విశేషమైన మంచితనం చూపటంకన్నా శిక్ష మరొకటి ఉండదు. లౌకిక ప్రపంచ స్థితిపైనా, అక్కడ సంభవిల్లే జయాపజయాలపైనా మనసు నిలువక ఒక విధమైన నిస్తేజమైన నిర్వికార భావాన్ని పొందింది. ధృతరాష్ట్రుని జీవితంలో సంభవిల్లిన అనేక

కార్యాల పర్యవసానంగా కలిగిన పశ్చాత్తాప ఫలితమే ఈ పరిణామం అని తలంచటం సమంజసంగా ఉంటుంది.

ఆ తరుణంలో ఏర్పడ్డ ప్రశాంత చిత్తంతో ధృతరాష్ట్రుడు ఆముష్మిక చింతనలో ఆశ్రమవాసానికి పోవాలని సంకల్పించాడు. ఆ సంకల్పంతోనే తన మనోనిశ్చయాన్ని రాజైన ధర్మరాజుకు తెలియచేసి గౌరవాన్ని ప్రదర్శిస్తాడు. రాజులకు తపోవనగమనం శాస్త్రసమ్మతమేనని చెప్తూ

"సమరమరణమొండె విమల తపమునకు
జొచ్చి యందు నిలిచి చచ్చుటొండె
వలయు నస్మదీయ కుల ముఖ్యులిట్టుల
నడపి రనుపు నన్ను నడవి కనఘ" (ఆశ్రమ. 1-27)

అని తనకు ఆశ్రమానికి అనుజ్ఞ ఇవ్వవలసిందని కోరతాడు. అరణ్యంలో భార్యాసహితుడై వల్కలాజినాలు ధరించి మునులచేరువలో కందమూల ఫలాలతో ఆకలిని హరించి తపో జీవనంతో ధర్మరాజును దీవిస్తూ ఉంటామని అంటాడు. ధృతరాష్ట్రుని ఈ వేడికోలు ఎంతో పరిణత మనసును ప్రతిబింబిస్తుంది. భీముని ఎత్తిపొడుపు మాటలకు మనసు క్షోభ చెందిందనే అంశం ధర్మరాజుకు తెలియకుండా, అతడి సౌజన్యాన్ని కొనియాడుతూ, తనకు ఆముష్మికంపై గల అభిలాషను వ్యక్తం చేస్తూ ధృతరాష్ట్రుడు చేసిన ప్రసంగం అతడి హృదయపు లోతులను, మానసిక పరిణామాన్ని వ్యక్తం చేస్తుంది.

తపోవనానికి పోవాలనే ధృతరాష్ట్రుని కోరికను ధర్మరాజు మన్నించలేకపోయాడు. తానుకూడ అరణ్యానికి వచ్చి తల్లిదండ్రులకు సేవచేస్తూ శేషజీవితం గడుపుతానని ఆర్ద్రంగా ఆ [illegible] పడుతాడు. ధృతరాష్ట్రుడు ధర్మరాజు వేడుకను మన్నించకుండ "నాకె [illegible] దపంబునకంటె కాననంబునకుం బోవలయు" (ఆశ్రమ. 1-44) అని స్పష్టంగా పలుకుతాడు. ఆ సమయంలోనే అక్కడకు వచ్చిన వ్యాసుడు ధృతరాష్ట్రుని హృదయంలో కలిగిన పరివర్తనను ధర్మరాజుకు వివరించి ఆశ్రమవాసానికి అనుజ్ఞ ఇమ్మని సలహా ఇస్తాడు. ధర్మరాజు అనుజ్ఞ పొందిన భర్తగారి ఆశ్రమవాస ప్రయాణం విషయమై గాంధారి ప్రస్తావిస్తుంది. ఆ సమయంలో ధృతరాష్ట్రుని పరితాప జనిత హృదయం నుంచి వెల్లుబికిన

మాటలు జీవిత చరమాంకంలో ఆముష్మిక ప్రయాణంలో జీవికి సహజంగా కలిగే విశ్వమానవతా భావానికి, త్యాగదృష్టికి ప్రతిరూపంగా నిలుస్తాయి. కల్లజూదం ఆడి పాపభాగులైన కుమారులను తపశ్శక్తి ధారపోసి కడతేరుస్తానని పలకటం ఆ వేళలో ఆ రాజు ఆత్మ సంయమనం, విశాల హృదయాన్ని నిదర్శనంగా నిలుస్తుంది.

ఆశ్రమ వాసానికి అంతఃపురంలో అందరి అనుజ్ఞ తీసుకొన్న ధృతరాష్ట్రుడు పురజనుల నుంచికూడ అనుజ్ఞ వేడాడు. వారి అనుజ్ఞ తీసుకొంటూ గతంలో జరిగిన అనర్థాలన్నింటికి తానే కారణం అంటూ

"... అన్యాయ మాచరించు
దుర్ణయంబున నిలయేలి ద్రుంచెఁ గులము
నుర్విగల భూపతులను దుర్యోధనుండు
వాని దుశ్చేష్టలకు మూలమేన నాదె" (ఆశ్రమ. 1-87)

అని కుమారుని దుష్ప్రవర్తనకు బాధ్యతంతా తనదే అని విన్నవించాడు. కృష్ణ రాయబార సమయంలో జరిగిన అనర్థాలన్నింటికీ 'నా తప్పులేదు' అని మీరు నమ్మితే చాలు అని పలికిన ధృతరాష్ట్రుడు, జీవితం చరమ దశలో అనర్థాలన్నింటికీ తానే బాధ్యుడనటం, కాలము పరిస్థితులు అతడి జీవితంలో తెచ్చిన పరిణామాలకు, పరివర్తనకు నిదర్శనంగా నిలుస్తాయి 'పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తం లేదనే లోకోక్తి ఈ సందర్భంలో ఆ మహారాజు విషయంలో చక్కగా సరిపోలుతుంది. ధృతరాష్ట్రుని దుష్టత్వం ఎడ ప్రజల మనసులలో ఏమీలేక పోయినప్పటికీ' 'తన కీళ్లగ్గడించి యరణ్య గమనానుజ్ఞాకరణంబునకుం' ప్రార్థించాడు. ఇంకా తనే తన కులంవారికి సుఖకారి అయినా ప్రజలు మాత్రం తనకెన్నడూ వ్యతిరేకంగా వ్యవహరించ లేదంటూ "తాననఘున కరుగుట మేలని మాకనుజ్ఞయిందు మాన్యులార" (ఆశ్ర. 1-9) అని ఆశ్రమ ప్రయాణానికి అనుమతి నీయవలసిందని అర్థిస్తాడు. పాండవులు వారణావతం పోయేటప్పుడు లాక్షాగృహ దహన సమయంలోను, జూదంలో ఓడి పాండవులు అరణ్యవాసం పోయేటప్పుడు సుపుత్ర బాంధవంగా ధృతరాష్ట్రుణ్ణి నిందించిన ప్రజలు. జీవితం చరమదశలో ఆ మహా

రాజుతో అనుబంధం పెనవేసుకొని ఆర్ద్రితాభావం ప్రకటించటం ముదావహంగా ఉంది.

వానప్రస్థ జీవితం గడుపుతూ శతయూపుని ఆశ్రమంలో ఉన్న ధృత రాష్ట్రుణ్ణి సందర్శించేందుకు ధర్మరాజు పరివారంతో వచ్చినప్పుడు, ఆ వృద్ధరాజు వారియందు ప్రేమను, సంయమనాన్ని ప్రదర్శిస్తాడు. ఆశ్రమంలో కొంతకాలం ఉండి హస్తినాపురం ప్రయాణమైన పాండవులను ఒక్కొక్కరినే సమాశ్లేషించి, ప్రత్యేకంగా "భీమసేను సాంత్వన వచనంబులం బ్రీతుంగావించి కౌగిలించుకొని" (ఆశ్రమ. 2-142) వీడ్కోలు పలికాడు. కుమారులందరనూ సంహరించాడనే కోపంతో, భీముడు సాన్నిధ్యానికి వచ్చినప్పుడు కుంభ నిక్షిప్త భుజంగంలాగా నిశ్వాసం విడుస్తూ అతి భీకరమైన కోపంతో విచక్షణా జ్ఞానం కోల్పోయే ధృత రాష్ట్రునిలో ఈ సంయమనం, ఆర్ద్రిత, స్నేహభావం. పరిణామ బద్ధమైన విశ్వ మానవతా భావాన్ని ప్రదర్శిస్తున్నాయి.

ఈ విధంగా జీవితంలో ఎక్కువ భాగం రాజ్యదాహంతోను, పుత్ర మమకారంతోను, కక్షలు, కార్పణ్యాలు పగా పెంచుకొన్న ధృతరాష్ట్రుడు విధి బలీయం కావటంతో తన ఆశలు, లక్ష్మి విఫలం కాగా హతాశుడై మిగిలాడు. హితులు, సన్నిహితులు, శ్రేయోభిలాషులు జీవితంలో అనేక సందర్భాలలో చెప్పిన హితోక్తులు, తాను విపరీత ఫలితాలను పొందింతరువాత, నెమరు వేసుకొని, పశ్చా త్తాపంతో మానసిక పరిణామానికి లోనయ్యాడు. ఆ పశ్చాత్తాపంతో తన కారణంగా ఎన్నో రాజవంశాలు నాశనం అయ్యాయనే నిర్వేదానికి గురి అయ్యాడు. ఆ నిర్వే దంలో లౌకిక బంధాల ఎడ ఆశ చంపుకొని ఆత్మ సంయమనంతో ఆముష్మిక చింతనపై దృష్టి మరల్చాడు. ధృతరాష్ట్రుని జీవితంలోని ఈ రెండు భాగాలు మానవ జీవితంలో సహజ పరిణామాలుగానే గోచరిస్తాయి.

ధృతరాష్ట్రుని జీవితంలో పరిణామబద్ధమైన ఈ పశ్చాత్తాపంతో గ్రీకు విషాద నాయకుని ఛాయలు కొన్ని ప్రస్ఫుటం కావటం గమనించవచ్చు. అయితే భారతీయ సంప్రదాయంలో విషాదాంతాలు కాక కావ్యాలు సుఖాంతాలుగానే ఉండా లనేది అనూచానంగా వస్తున్న ఆచారం. అంతేకాక భారతం ఇతిహాసం కావటంతో ధృతరాష్ట్రుని జీవితంతోపాటు ఎన్నో రాజవంశాల ఔన్నత్య పతనాలు వివరించ

బడ్డాయి. గ్రీకు రూపకాల్లో స్వయంకృతం వల్లకాని, దైవఘటన వల్లకాని నాయకుని పతనం సంభవిస్తుంది. కాని మహాభారతంలో ధృతరాష్ట్రుడు కురుక్షేత్ర సంగ్రామంలో పుత్రులను, రాజ్యాన్ని కోల్పోయినప్పటికీ, గ్రీకు విషాద నాయకుని లాగా సంపూర్ణంగా పతనం కాకుండ, పశ్చాత్తాప దగ్ధుడై ప్రాయశ్చిత్తం పొంది అనంతర కాలంలో ఆత్మాగ్నిలో శరీర త్యాగంచేసి ఆముష్మికంగా ఉన్నత శిఖరాలను అధివసించాడు. భారతీయ సంప్రదాయంలో ఒక వ్యక్తి జీవితంలో కలిగే ఈ పరిణామమే సహజమైందిగా పరిగణించబడింది. జీవితంలో ఎంతో విషాదాన్ని చవిచూసినప్పటికీ, జీవితం చరమ దశలో ఆముష్మిక మార్గంలో కలిగిన ఈ పరిణామంవల్ల ధృతరాష్ట్రుడు గ్రీకు విషాద నాయకుని వంటివాడనేందుకు అవకాశం మృగ్యం. కాని గ్రీకు విషాదనాయకుని ఛాయలు మాత్రం ఆ మహారాజు జీవితంలో ప్రతిబింబిస్తున్నాయనటంలో దోషం కనిపించదు.

# 3.2 ఆధ్యాత్మిక చింతన

మానవ జీవిత ప్రయాణం రెండు ముఖాలుగా సాగుతుంది. ఒకటి ప్రాకృతికమైందైతే రెండోది పారమార్థికమై ఒప్పి ఉంటుంది. వీటిలో ప్రాకృతిక జీవితం సామాజిక, ఆర్థిక, రాజకీయ సంబంధమైన లౌకిక వ్యవహారాలకు సంబంధించి ఉంటుంది. పారమార్థికమైన జీవితం నైతికమైన విలువలకు, ఆత్మ వికాసానికి సంబంధించి ఉంటుంది. భారతీయ సంస్కృతిలో ద్విముఖమైన ఈ జీవిత ప్రయాణంలో మానవుడు మొదటిదాని వల్ల సమాజంలో తన ప్రాధాన్యాన్ని, గుర్తింపును పెంపొందించు కొంటే, పారమార్థిక చింతన ఆత్మీయమై ఆముష్మిక ప్రయాణంలో ఆధ్యాత్మిక పరివర్తనకు దోహదం చేస్తుంది. ఈ రెండూ సాధించటానికి మానవుడు చతుర్విధ పురుషార్థాలను గమ్యంగా పెట్టుకొని జీవితగమనాన్ని చతుర్విధ ఆశ్రమాలలో విస్తరించుకొన్నాడు.

మానవ జీవితం బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమాలని నాలుగు దశల్లో విస్తరించి ఉంది. మానవుడు ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలను సాధన చేయటమే జీవిత లక్ష్యమని పండితులెందరో వక్కాణించిన విషయం. పురుషార్థాలు నాలుగింటిలో ధర్మార్థ కామాలు భౌతిక జీవితానికి ఆధారమైనవైతే, తురీయ పురుషార్థం ఆముష్మికమై ఒప్పి ఉంది. భౌతిక జీవితంలో సాధించే మూడు పురుషార్థాలు ఒకదానితో ఒకటి సంయమనం పొందే ఉంటాయి. భౌతిక జీవితానికి ప్రధాన లక్ష్యం, ఆధారం, ధర్మం. మానవుడు జీవితంలో అనుసరించే అర్థకామాలు ధర్మ బద్ధమైనప్పుడే వాటి లక్ష్యం నెరవేరుతుంది. ధర్మబద్ధంకాని జీవితం సర్వానర్థకమని వేత్తలు అభిప్రాయ పడ్డారు. మానవుడు ధర్మానుగుణమైన అర్థంతో ధర్మ బద్ధమైన కామాన్ని సాధించుకొన్నట్లయితే పర్యవసానంలో మోక్షసాధన కది సులభమార్గ మౌతుందని తత్త్వవేత్తల అభిప్రాయం. పురుషార్థ సాధనలో మానవుడు బ్రహ్మచర్యాశ్రమంలో ధర్మసాధన ఎడ లక్ష్య శుద్ధిని పొందేందుకు కావగిన భూమికను ఏర్పాటుచేసుకొని, గార్హస్థ్య జీవితంలో ఆ పునాదిని ఆధారం చేసుకొని ధర్మబద్ధమైన అర్థాన్ని, ధర్మానుగుణమైన కామాన్ని నియమిత రీతిలో సాధించే ప్రయత్నం చేస్తాడు.

ఆ ప్రయత్నంలో సఫలీకృతుడై వాన ప్రస్థాశ్రమంలో మోక్షసాధన వైపు ప్రయాణం ప్రారంభించి సన్యాసాశ్రమంలో ఆముష్మికమైన ముక్తి పొంది ఆత్మానుభవానికి లోనవుతాడు.

మానవులందరి జీవనగమనం ఒకవిధంగానే సాగదు. భిన్న భౌగోళిక, సాంఘిక పరిస్థితుల్లో భిన్నమైన జీవన ధర్మాలు నెలకొని ఉండటం సహజం. జీవితం నియమ బద్ధమై క్రమ పరివర్తనతో సాగుతున్నట్లయితే గార్హస్థ్యాది ఆశ్రమ ధర్మాలుకూడ క్రమబద్ధంగా నిర్వహించబడుతూ పురుషార్థ సాధనలో మానవుడు కృతకృత్యుడవుతాడు. అట్లాకాక పరిస్థితుల ప్రాబల్యంవల్ల కాని, వ్యక్తిగత కారణాల వల్లకాని జీవిత నియమాలను ఉల్లంఘించటం జరగవచ్చు. అట్లాంటి సమయంలో ఆశ్రమ ధర్మానుష్ఠానంకాని, ఆముష్మిక కృషికాని ఆశించిన రీతిలో జరగకపోవచ్చు. కొన్ని సందర్భాల్లో ఆశ్రమ ధర్మాల వివక్షలేకుండ, ధర్మార్థకామాల ప్రమేయంలేకుండ ఏకంగా బ్రహ్మచర్యాశ్రమం నుంచి మోక్షసాధన పైనే దృష్టి మరల్చిన వారు కూడ ఉండటం కద్దు. మోక్షసాధన అనేది ఆత్మానుభూతియై, వైయక్తికం కనుక ఇతరులు దానిని గమనించటం సాధ్యంకాదు. అది కేవలం అనుభవైక వేద్యమే.

మోక్షసాధనకు సాధనమైన ఆధ్యాత్మిక చింతన జీవితంలో ఒక నియమిత దశనుంచి ప్రారంభమైనట్లు గుర్తించటం సాధ్యంకాదు. మానవ జీవితం అన్ని దశలలోను ఈ ఆధ్యాత్మిక చింతన అంతర్లీనంగానే ఉంది. వ్యక్తి జీవన గమనంతోపాటు పరిణామాలకు లోనౌతూ, చరమదశలో మోక్షసాధనకు వాహకమౌతుంది. ఆధ్యాత్మిక చింతనకు సంబంధించిన బీజాలు అనూచానంగా, వంశపారంపర్యంగా జీవకణాలతోపాటు మౌళిక రూపాలుగా (A chyt pes) సంక్రమిస్తాయి. ఆ బీజాలు జీవన గమనంలో సంప్రదాయం అచ్ఛాదనలో వృద్ధి చెందుతాయి. మానవ జీవితంలో లౌకిక జీవితమే అధిక శాతం ఆక్రమించి, పారమార్థిక చింతన చిట్ట చివరి కొద్ది భాగంలో మాత్రమే స్థానం ఏర్పరచుకుంటుంది. అయితే జీవితంలో పొందిన అనుభవాలు, అనుభూతుల పరిణామంగానే ఈ చివరి భాగం నిలుస్తుంది. అంటే గార్హస్థ్య జీవితంలోని అనుభవాల సారమే వానప్రస్థ సన్యాసాశ్రమాల్లోని అనుభవాలకు, ఆలోచనలకు, భూమిక అవుతుంది.

లౌకిక జీవితంలో మానవుడు ధర్మార్థ కామ వర్తనం సక్రమంగా నిర్వహిస్తే ఆధ్యాత్మిక అనుభవంకూడ సరళ మార్గంలో సుగమంగా ఉంటుంది. అట్లా కాక లౌకిక జీవితంలో పరిస్థితుల ప్రాబల్యం వల్లకాని, స్వార్థచింతన వల్లకాని ధర్మ రక్షితం కానట్టి అర్థ సంపాదన కాని, కామసాధన కాని చేయటం జరిగినట్లయితే, జీవితంలో పొందిన విపరీత ఫలితాలకు చివరలో పశ్చాత్తాప హృదయంతో చింతనకులోనై జీవిత గమనాన్ని మననంచేసుకొంటూ శాశ్వతానుభవ సారమైన పారమార్థిక దృష్టిని అలవరచుకొంటారు. అట్లాంటి వారు కూడ ఆధ్యాత్మిక ఫలితాన్ని పొందటం జరుగుతుంది. ఈ రెండు వర్గాల్లోను మొదటి వర్గంవారు ఋషులు, మునులుగా ప్రసిద్ధి వహిస్తే, రెండవ వర్గంవారు సాంసారిక జీవనంలోని అనుభవాలను, ఒడిదుడుకులను స్మరించుకొంటూ సామాన్య జీవితాన్ని గడుపుతూ పశ్చాత్తాప హృదయంతో వానప్రస్థంలో నివాసం ఏర్పరచుకొని ఆముష్మిక సాధన చేసే సామాన్యులవుతారు. ఈ సామాన్యులలో రాజర్షులు, రాజ శ్రేష్ఠులు, సామాన్య మానవులుకూడ ఉంటుంటారు.

కురుసామ్రాట్టు ధృతరాష్ట్రుడు పైరెండు వర్గాల్లో రెండో వర్గానికి చెందిన వ్యక్తిగా కనిపిస్తాడు. జన్మించింది ఉన్నత రాజవంశంలోనే అయినా బాల్యంలోనే తండ్రిని కోల్పోయి, జీవితంలో తొలి ఆశ్రమమంతా పెద తండ్రి రక్షణలోనే గడిపాడు. గార్హస్త్యపు తొలి దినాలుకూడ పెదతండ్రి సోదరుల అండదండలతోనే రాజ్యపాలన సాగించాడు. అప్పటికే ధృతరాష్ట్రునిలో లౌకిక ధర్మాన్ని అనుష్ఠించటంతో పాటు యజ్ఞయాగాదులు చేయటంవల్ల ఆధికారాన్ని సుస్థాపితం చేసుకోవటమేకాక, పారమార్థిక మార్గంలోకూడ బీజాలు హృదయంలో మొలకెత్తినట్లు భావించవచ్చు. ఈ పారమార్థికాన్వేషణ సంబంధమైన బీజాలే ధృతరాష్ట్రుని జీవితంలో తుట్టతుదకు ఫలప్రదమైనట్లు పరిశీలిస్తే తెలుస్తుంది.

ధృతరాష్ట్రుని గార్హస్త్య జీవితం ఎక్కువభాగం ఆ మహారాజుకు శోక సంతప్తమైన నిర్వేదాన్నే మిగిల్చింది. ఆ మహారాజు మహాజ్ఞాని, బుద్ధిజీవి, రాజనీతి దురంధరుడు, దశసహస్రకరి బలయుతుడై వర్ధిల్లాడు. జాత్యంధుడైనా ప్రజ్ఞా చక్షువు. ధృతరాష్ట్రుడు మంచి చెడుల అంతరము, ధర్మాధర్మ వివక్ష

చక్కగా తెలిసినవాడు ఆ మహారాజు మంచిపని ఏదో తెలుసుకొని మంచిని అంగీకరించగలడు. కాని ఆ మంచిని జీవితంలో అనుసరించలేడు. అట్లానే చెడుపని ఏదోకూడ తెలుసు. దానివల్ల సంభవిల్లే నష్టం కూడ అర్థం చేసుకో గలడు. కాని ఆ చెడును జీవితంలో అనుష్ఠించ కుండ ఉండలేకపోయాడు. ఈ విధమైన అనిశ్చయ స్థితే ఆ మహారాజు జీవితంలో అనేక వికృత పరిణామా లకు కారణభూత మైనట్లు తెలుస్తుంది. జీవితంలో అనేక ప్రభావాలు, ప్రలోభాలు, వ్యామోహాలు ధృతరాష్ట్రుణ్ణి ప్రభావితంచేసి భారతంలో అనేక దుష్పరిణామా లకు ప్రధాన కారకుల్లో ఒకణ్ణి చేశాయి. లౌకిక జీవనం గడిపే ఏ వ్యక్తికూడ ధృతరాష్ట్రునికన్న భిన్నంగా ప్రవర్తించటం సాధ్యంకాదని పూర్వ ప్రకరణాల్లో విశదపరచటం జరిగింది.

మానవ జీవితం సంఘర్షణాయుతమైంది. అతడు జీవితంలో మొదటి దశలో మానుషశక్తికే ప్రాధాన్యం ఇచ్చి తన ధీశక్తిపైనే ఆధారపడి కార్య సాధనకు పూనుకొంటాడు. ఈ లక్ష్యసాధనలో కొన్ని సందర్భాల్లో అడ్డదారులు తొక్కటం కూడ కనిపిస్తుంది. అనుకూల ప్రయోజనాలు కలిగినంతకాలం తన ధీశక్తే గొప్పదనే విశ్వాసంతో ముందుకు సాగుతాడు. ఆ దశలో తన ప్రయోజ కత్వంపై మానవునకు సంపూర్ణ విశ్వాసం ఉంటుంది. అట్లా తన ధీశక్తిపై అపరిమితమైన నమ్మకంతో చేసిన కొన్ని ప్రయత్నాలు విఫలమై తనచుట్టూ ఉన్న వారెవరూ ఉద్ధరించటానికి ముందుకు రానప్పుడు, ఆత్మవిశ్వాసం బీటలు వారటం మొదలుపెట్టి క్రమంగా ఆధిదైవికపదార్థం మానుష శక్తికన్న భిన్న అయిన దేమోననే ఆలోచనకు లోనుకావటం ప్రారంభిస్తాడు. ఆ విధంగా జీవితంలో కొంతకాలం మానుషశక్తి, దైవశక్తి మధ్య మానవ హృదయం సంఘర్షణతో ఊగిసలాడుతుంది ఆ ఊగిసలాటలో మానవుడు తన కార్య కలాపాలకు పశ్చాత్తప్తుడౌతూ దైవ బలమే అధికమనే విశ్వాసం పెంపొందించుకొని, జీవితం చివరి దశలో సంపూర్ణంగా దైవాంకితుడు అవుతాడు. ఈ మూడు దశలు సాధారణ మానవ జీవితంలో జరిగే అధ్యాత్మిక సహజమైన పరిణామంగా గోచరిస్తుంది. పశ్చాత్తాపం, ఆలోచనలేని మానవుడు ఎట్లాంటి సంఘర్షణలకు, అధ్యాత్మిక చింతనకు లోను కావటం సాధ్యం కాదు.

ధృతరాష్ట్రుని జీవితం ధర్మరాజుకు యౌవరాజ్యాభిషేకం జరిగేంత వరకు చెప్పుకోతగినంత పరిణామాలకు లోనుకాక ప్రశాంతంగానే సాగినట్లు కనిపిస్తుంది. యువరాజైన ధర్మరాజు సోదరుల అండదండలతో తన ప్రాభవాన్ని పెంపొందింప చేసుకోవటం కురువంశంలో కలతలకు దారితీసింది. ఆ సమయంలో నెలకొన్న పరిస్థితుల ప్రాబల్యానికి లోనై మానుషశక్తినే నమ్ముకొని కణికుని దుష్టనీతిని అనుసరించి పాండవులను హస్తినాపురానికి దూరంగా పంపించే ప్రయత్నం జరిగింది. లాక్షాగృహం నుంచి తప్పించుకొన్న పాండవులు సురక్షితంగా పాంచాల నగరం చేరి ద్రౌపదీ వివాహంతో బలవంతులు కావటంతో ధృతరాష్ట్రుని బుద్ధిశక్తి వ్యర్థమై ఆశించిన ప్రయోజనం ఇవ్వలేదు. పాంచాల బంధుత్వంతో బలవంతులైన పాండవులను ద్రుపదుని నుంచి వేరుచేసి బలహీనులను చేసే ఉద్దేశంతో ఇంద్రప్రస్థ రాజ్యప్రదానం చేయటం జరిగింది. ధృతరాష్ట్రాదుల ఆశయం వ్యర్థమయ్యేటట్లుగా ఇంద్రప్రస్థంలో రాజసూయం చేసి ధర్మరాజు సామ్రాట్టు అయ్యాడు. పాండవ వైభవాన్ని సహించలేని సుయోధనాదుల ప్రోద్బలంతో ధృతరాష్ట్రుడు జూదానికి అంగీకారం తెలిపాడు. ఈ మూడు సందర్భాలలో కూడ భీష్మ విదురాదులు ధర్మబద్ధంకాని పనులు చేయటం తగదని వారించారు. మానుషశక్తిపై నమ్మకం పెంచుకొన్న ధృతరాష్ట్రుడు తన ధీశక్తిపై ఉన్న ఆత్మవిశ్వాసంతో పెద్దల హితవాక్యాలు సహృదయంతో స్వీకరించక, కుమారుని మాటపై వర్తించాడు. జూదం ఫలితంగా పాండవులు అరణ్య అజ్ఞాత వాసాలకు పోవటంకూడ ఆ మహారాజు రాజనీతితో సాధించ గలిగాడు. అయితే ఈ సందర్భంలో కూడ ధృతరాష్ట్రుని ఆశయం విపరీత ఫలితాన్నే ఇచ్చింది. పాండవులు క్షేమంగా అజ్ఞాతవాసం పూర్తి చేస్తారు. ఈ మధ్య కాలంలోనే భీష్మ విదురాది హితులేకాక, వ్యాసుడు, మైత్రేయుని వంటి మునులు కూడ ధృతరాష్ట్రుని ప్రయత్నం నిష్ప్రయోజనమైనదని, పాండవులు దైవబల సంపన్నులనే అభిప్రాయాలను వెలిబుచ్చారు.

ధృతరాష్ట్రుడు మానుష ప్రయత్నాలు వ్యత్యస్త ఫలితాన్నీయటం, కురువంశ హితాన్ని కోరి నారదాదులు దైవశక్తి ప్రాధాన్యాన్ని వివరించి నింద తననెత్తిన వేయటంతో ఆలోచనలో పడ్డాడు. తన ప్రయత్నాలు ఆశించిన ఫలితాలనీయక పోవటానికి ప్రకృతి సహజమైన మానవబుద్ధికి అందని శక్తి ఉందేమోననే మీమాంసకు

లోనయ్యాడు. ఈ ఆలోచన ఆ మహారాజు హృదయంలో అలజడి రేకెత్తించింది. ఈ అలజడివల్ల అతడి హృదయంలో మానుషశక్తి, దైవశక్తికి సంబంధించిన సంఘర్షణ ప్రారంభమైంది. ఆ మహారాజు జీవితంలో ఈ విధమైన సంఘర్షణ దైవశక్తి ఆధిక్యాన్ని అంగీకరిస్తూనే మానుషశక్తిపై విశ్వాసం వీడలేనితత్వం ప్రాథమిక దశలో కనిపిస్తుంది. కాలం గడుస్తున్నకొద్దీ ఆశలన్నీ క్రమంగా వ్యర్థం అవుతుంటే దైవబలమే ఉన్న, పైపం అండలేనిది మానవప్రయత్నం నిష్ఫలం అవుతుందనే అభిప్రాయానికి స్థిరంగా వస్తాడు. ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక పరిణామంలో ఈ సంఘర్షణ రెండవదశగా తలంచవచ్చు.

ధృతరాష్ట్రునిలో ఈ సంఘర్షణదశ సభా, అరణ్యపర్వాలల్లో బీజరూపంగా ద్యోతకమైనా ఉద్యోగ పర్వంనుంచి స్పష్టంగా గోచరిస్తుంది. సంధి విషయంలో ధర్మరాజు మనఃస్థితిని స్పష్టంగా పరిశీలించిన సంజయుడు "మానుషశక్తి యొల్లడు సముచిత దైవము యూడియుండు" (ఉద్యోగ. 2-8) అని ధర్మరాజు దైవసంపదతో వర్ధిల్లు తున్నాడని చెప్పి, నాప ప్రాణ్యాలనాశం పెద తండ్రిపైనే ఉంచాడని విన్నవిస్తాడు. సంజయుని మాటలు ధృతరాష్ట్రుని హృదయంలో అలజడి కలిగించగా నిద్రలేమితో వ్యధకు లోనై చిత్తస్వాస్థ్యంకోసం విదురుణ్ణి పిలిపిస్తాడు. విదురుడు కూడ మాటల సందర్భంలో మానుషశక్తి దైవశక్తిముందు నిలువలేదని చెప్తూ

"దైవంబనేర్చు గాకిటు
వోవగ నేనేర్తు నేరఁ బొమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు
దైవము పౌరుషముకంటె ధరణీనాథా" (ఉద్యోగ. 2-99)

అని దైవాధిక్యాన్ని వెల్లడిస్తాడు. అదే సందర్భంలో లౌకికమైన మనఃక్లేశాలను అధిగమించటానికి

"నియత వమః ప నింద్రియ నిగ్రహంబు
భూరివిద్య ము, శాంతికిఁ గారణములు
వాని యస్రాంతింతె మేలైన శాంతి
కారణము శోభమడుగుట కౌరవేంద్ర" (ఉద్యోగ. 2-84)

అని అరిషడ్వర్గాలలో ప్రధానంగా లోభం విడిచిపెట్టటం అవసరమని చెప్తాడు. విదురుని మాటలు ధృతరాష్ట్రునిలో ఆలోచన రేకెత్తించాయి. అందువల్లే నీతి ధర్మప్రథాలైన మాటలెన్నో విన్న తనకు తృప్తితీరలేదనీ 'పరమార్థదృష్టి యెట్టి వాక్యములగల్గునో' చెప్పవలసిందని అర్థిస్తాడు. ధృతరాష్ట్రుని ఈ అర్థింపులో ఆతని హృదయంలోని అంతస్సంఘర్షణ ద్యోతకం అవుతుంది.

ధృతరాష్ట్రుడడిగిన అంశాలు బోధించటం తనకు సాధ్యంకాదని, సనత్సు జాతుని ఎంతటి గుహ్యమైన విషయాలనైనా వివరించగల శక్తి సంపన్నుడని చెప్పి విదురుడు ఆ మహర్షిని ప్రత్యక్షంలోకి రప్పిస్తాడు. ప్రత్యక్షంలోకి వచ్చిన సనత్సుజాతుడు "ఆధ్యాత్మ విషయంబులగు వివిధ వాక్యంబుల సోపాన ప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబులగు నర్థంబులు సమర్థించుచు హృదయ పుష్కర కలితంబగు పరతత్త్వంబు ప్రసాదించునట్టి గూఢోక్తులను" (ఉద్యోగ. 2-106) సవిస్తరంగా వివరిస్తాడు. సనత్సుజాతముని చేసిన పరతత్త్వబోధ ధృతరాష్ట్రుని హృదయంలో ఆలోచన రేకెత్తించినప్పటికి సంపూర్ణమైన పరిణామం కలిగించలేదు. మానుషశక్తిపై ఆశ ఆ మహారాజుకు సన్నగిల్లలేదు. ధర్మరాజు దైవబల సంపన్నుడని సంజయుడు చెప్పినప్పటికీ, భీష్మద్రోణ విదురాదులు పాండవులతో సంధికి అనుగుణంగా ప్రసంగించినప్పటికి మనసు ఆ అంశంపై లగ్నం చేయకుండ, ధర్మరాజు "ఎవ్వరిగోని కౌరవులమీద నెత్తిరా గలుగువాడు" (ఉద్యోగ. 2-168) అని ప్రశ్నించి పాండవబలం తెలుసుకోవటం ఎడ ఉత్కంఠ ప్రదర్శిస్తాడు. ఇంకా "ఇందుగల బలుమానుసు లెవ్వరికి నసాధ్యులు వీరి సాధించు తెఱంగూహించిరే" (ఉద్యోగ. 2-228) అని స్వపక్షబలం ఎడ అత్యంత విశ్వాసం ప్రకటిస్తాడు. అదే సమయంలో బహిరంగంగా సంధి యత్నాన్ని వ్యతిరేకిస్తే పెద్దలకు ఆగ్రహం కలుగుతుందనే భావంతో, వారు బోధించిన విధంగా శాంతి పొందటం తనకు అంగీకారమేనని పలుకుతాడు. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుని హృదయం మాయావరణం లోనే ఉండి పురుషాహంకారాన్నే ప్రదర్శిస్తున్నట్లు కనిపిస్తుంది.

వ్యాసుని సమక్షంలో సంజయుడు కురుపాండవ బలాబలాలను గూర్చి వివరిస్తూ పాండవపక్షాన శ్రీకృష్ణుడున్నాడని, కౌరవపక్షాన అంతటివాడు లేడని ధృతరాష్ట్రునకు చెప్తాడు. అప్పటివరకు కృష్ణుణ్ణి యాదవవీరునిగా మాత్రమే భావించే ధృతరాష్ట్రుడు సంజయుని మాటలకు ఆశ్చర్యానికిలోనై

"విష్ణుని నేనెఱుఁగని విధంబునుం దెలియఁగ నీ
కనియున్న తెఱఁగు జెప్పుము" (ఉద్యోగ. 2–319)

అని అర్థిస్తాడు. అప్పుడు సంజయుడు విద్యావిద్యలగూర్చి వివరించి సాత్త్విక, రాజస, తామస వికారాలకు లోనుకాకుండ ధర్మం ఆచరించేవారికి మాత్రమే అచ్యుతుణ్ణి తెలుసుకోవటం సాధ్యమని పలుకుతాడు. వ్యాసుడుకూడ సంజయుని అభిప్రాయాన్ని బలపరుస్తూ, కృష్ణుడు "ఏకాగ్రచిత్తులై యారాధించినవారికిఁ జేరువయగుఁ గామ క్రోధోపహతులై తమతమ ధనంబులం దృప్తులుగాక యన్యాయంబున వర్తించు వారలకు దూరంబై యుండు" (ఉద్యోగ. 2–325) అని ధృతరాష్ట్రునకు కృష్ణుని మహాత్మ్యాన్ని బోధిస్తాడు. వీరిద్దరి మాటలు శ్రీకృష్ణునకు అధి దైవికరూపాన్ని ఆపాదించినప్పటికి, వారి బోధల సారాంశంమాత్రం మానవుడు నియుక్తమైన ధర్మ మార్గంలో ప్రయాణించే సాధనంగానే గోచరిస్తుంది. కృష్ణుని నామ నిర్వచనం వివరిస్తూ సంజయుడు

"ఎల్లయందును దావసియించు నెల్ల
యదియుఁ దనయందు వసియించు" (ఉద్యోగ. 2-326)

అని సర్వవ్యాప్తమైన పరతత్త్వాన్ని గూర్చి చెప్పి అంతరంగ నిగ్రహంవల్ల మాత్రమే ఆ తత్త్వ సందర్శనం కలుగుతుందని చెబుతాడు. సంజయుని మాటలకు కొంత పరివర్తన కలిగిన వానివలె, తనకు కన్నులు లేనందుకు నివారిస్తూ, అతణ్ణి సందర్శించగలవారి అదృష్టాన్ని కొనియాడుతూ

"ఆతనిఁ గన్నులారఁగ నహర్నిశముం గనుఁగొంచు నుండు వా
రే తపమాచరించిరొ యుపేంద్రుని నాశ్రిత వత్సలున్ విని
ర్ధూత కలంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోక వి
ఖ్యాతుఁ బవిత్రమూర్తి శరణాగత రక్షకు నాశ్రయించెదన్"
(ఉద్యోగ. 2-330)

అని వాసుదేవుని శరణుజొచ్చి బ్రతుకు సాగిస్తానని పలుకుతాడు. తిక్కనగారి ఈ పద్యరచనా వైశిష్ట్యం పోతన వంటి అనంతర కవులకు ఒరవడి చూపినట్లు తలంచటంలో దోషం లేదు.

సనత్సుజాతునివల్ల పరమార్థ తత్త్వ విశేషాలు విన్న సమయానికి, వ్యాస సంజయులవల్ల కృష్ణుని రూపంలో ఉన్న పరతత్త్వాన్ని గూర్చి విన్న సమయానికి ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక సందర్శనా దృష్టిలో కొద్దిపాటి వ్యత్యాసం గోచరమయి నట్లు తలంచవచ్చు. మొదట్లో కనిపించే మానుషాహంకార ప్రవృత్తి ఈ దశలో కొంత పరిణామానికి లోనై దైవశక్తి ముందు మానుష శక్తి లొంగిపోతున్న సూచనలు గోచరం అవుతున్నాయి. మానుషశక్తి, దైవశక్తి మధ్య అతడి హృదయంలో జరిగిన అంతస్సంఘర్షణలో కుమారుల విజయం ఎడ ఆశకొద్ది కొద్దిగా సన్నగిల్లుతుంటే, హితుల బోధలవల్ల మనసు పారమార్థికం వైపు మొగ్గుచూపటం ప్రారంభించింది. అంతమాత్రాన ధృతరాష్ట్రుని జీవితం సంపూర్ణంగా ఆధ్యాత్మిక పరివర్తనం చెందిందని చెప్పలేము. ఈ దశలో మానుష శక్తిని మించింది దైవ శక్తి అనే బీజాలు మాత్రమే ఆ మహారాజు ఆధ్యాత్మిక పరిణామంలో పడినట్లు భావించవచ్చు ధృతరాష్ట్రుని హృదయ సంఘర్షణలోని ఈ పరిణామం క్రమ క్రమంగా ఆముష్మికానికి దగ్గరై ఆశ్రమవాసంలో ఫలసిద్ధిని పొందటం మనం చూస్తాము.

పాండవ రాయబారిగా హస్తినాపురం వస్తూ శ్రీకృష్ణుడు కుశస్థలంలో విడిదిచేసి ఉన్న విషయం తెలుసుకొని ధృతరాష్ట్రుడు ఉద్వేగానికి లోనవుతాడు. యాదవ కృష్ణుడే అయినా, వ్యాససంజయాదుల వివరణవల్ల ధృతరాష్ట్రుడు అతణ్ణి అధి దైవికమూర్తిగా భావించినట్లు ప్రవర్తించాడు. ఈ సందర్భంలో కూడ కృష్ణుడు సర్వలోకాభిగమ్యుడనే అభిప్రాయం వెలిబుచ్చి, అలాంటి వానికి ఆతిథ్యం ఇవ్వటం కన్న అదృష్టమైన విషయం లేదని, విశ్వాసం ప్రకటించిన వారిని భవబంధ విముక్తులను చేస్తాడని అంటాడు. అయితే ధృతరాష్ట్రుని పురుషాహంకారం పూర్తిగా నశించలేదు. అందువల్లే

**''వివిధ మణిమయ రథంబులు**
**జవనాశ్వంబులును భద్రసామజములు ర**
**త్న విభూషణములు దాసీ**
**నివహంబులుఁ జాలఁ గృష్ణునకు నేనిత్తున్''** (ఉద్యోగ. 3-156)

అని విదురునితో చెప్పటం, శ్రీకృష్ణుణ్ణి మానవ మాత్రునిగా తలచి వస్తుసము దాయంతో ప్రలోభ పెట్టాలనే సంకల్పాన్ని బట్టబయలు చేస్తుంది. రాయబారం సందర్భంగా కౌరవ సభలో కూడ కృష్ణుణ్ణి రాయబారిగానే సంభావించాడు కాని అతని ఎడ పారమార్థిక భావాన్ని స్థిరంగా నిలుపుకోలేక పోయాడు. అందుకు కారణం ఆ మహారాజు హృదయంలో జరిగే మానుష, దైవ శక్తుల మధ్య సంఘర్ష ణకు సంపూర్ణమైన సమాధానం లభించక పోవటమేనని తలంచవచ్చు.

ధృతరాష్ట్రుని పురుషాహంకార ప్రదర్శన సుయోధనాదుల దుర్మార్గానికి అడ్డులేకుండ చేసింది. సభలోని పెద్దలు, గురువులు, మునుల, ఎన్నో హితోక్తులు పలికినా ప్రయోజనం సమకూరలేదు. సుయోధనాదుల దౌష్ట్యానికి పరాకాష్ఠగా వారు రాయబారినే బంధించే ప్రయత్నం చేశారు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు కోపాన్ని ప్రదర్శించి వారిని విభ్రాంతులను చేస్తాడు. శ్రీకృష్ణానుయాయులకు ఈ పరిణామం సంతోషదాయకమైంది. సంస్కృతాంధ్ర భారతాలు రెండింటిలోను శ్రీకృష్ణుని పరాక్రమ ప్రదర్శన విశ్వరూప ప్రదర్శనగా అధిదైవిక కల్పనగా రూపొందించబడింది. యాదవ కృష్ణుడు విశ్వరూపం ప్రదర్శించటం సాధ్యంకాక పోయినా, ఆతని జననంలోని అధిదైవికత్వాన్ని అంగీకరించినట్లయితే ఈ ప్రదర్శ నను కూడ అంగీకరించక తప్పదు. ఈ మీమాంస అంతా విశ్వాసంపై ఆధారపడి ఉంటుంది. ఏది ఏమైనప్పటికి ఆ సమయంలో శ్రీకృష్ణుడు తీక్ష్ణకోపాన్ని ప్రద ర్శించిన విషయం మాత్రం వాస్తవం.

శ్రీకృష్ణుని విశ్వరూప ప్రదర్శన సమయంలో దేవదుందుభులు మ్రోగ టం, సిద్ధ, సాధ్య విద్యాధరాది దేవతలు భక్తితో పుష్పవృష్టి కురిపించటం జరిగింది సభలో అధికమైన కలకలం చెలరేగింది. ధృతరాష్ట్రుడు ఆ కలకలం 'విష్ణుని దివ్య విజృంభణంబు గావలయు' అని భావించాడు. కొన్ని సందర్భాలలో సభలో కలకలం ఏర్పడ్డప్పుడు, ఆ విశేషాలు విదురుణ్ణి అడిగి తెలుసుకొనే ధృత రాష్ట్రుడు ఈ సమయంలోని కలకలాన్ని విష్ణుని దివ్యవిజృంభణంగా భావించటం విశేషంగా ఉంది. ఆ మహారాజు అట్లా ఊహించటానికి అంతరింద్రియశక్తి (Sixth Sense) కారణం కావచ్చు. ఒక్కుమ్మడిగా ఆ మహారాజులోని అహం కారం నశించి భగవంతుని ముందు భక్తుడిలాగా మోకరిల్లి

"కరుణింపుము సంశ్రిత భయ
హరణ ధురీణా సహింపు మజ్ఞానంబున్
శరణంబు వేఁడెద భవ
చ్చరణంబులు గనఁగొనం బ్రసాదింపగదే" (ఉద్యోగ. 3-408)

అని కటాక్షించవలసిందని అర్థిస్తాడు. ఆపైన శ్రీకృష్ణుడు దృష్టి ప్రసాదించటం, ఉపసంహరించటం అధి దైవిక కల్పనలో భాగమే అనుకొన్నా, కృష్ణుని అతిమానుష శక్తిపై అంధరాజు విశ్వాసం, భక్తి వెల్లడవుతున్నాయి. ఈ ఘట్టంలోని వాస్తవాల మాట అటుంచితే, ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక పరిణామంలో ఇది ఒక ముఖ్య ఘట్టంగా ప్రవర్తిల్లుతుంది. ఈ సందర్భంలో పారమార్థిక శక్తికి సంపూర్ణంగా అధీనమయ్యే భక్తుడు ధృతరాష్ట్రునిలో మనకు గోచరం అవుతాడు.

విశ్వరూప ప్రదర్శనం ధృతరాష్ట్రుని అనంతర జీవితంలో పారమార్థిక మార్గంలో ఎంతో మార్పును తెచ్చినట్లు కనిపిస్తుంది. మానుష శక్తికన్న దైవ బలమే అధికం అనే భావానికి అతడి మనసు దగ్గర పడుతున్నట్లు ఆ మహారాజు ప్రవర్తనవల్ల తెలుసుకోవచ్చు. అనివార్యమైన కురుక్షేత్ర సంగ్రామంలో ఇరు పక్షాల వీరులు మరణించినప్పటికీ కౌరవ సైన్యమే అధిక నష్టాలకు గురి అయింది. ఒక్కొక్క నాయకుని, వీరుణ్ణి కోల్పోతుండే కొద్దీ ధృతరాష్ట్రుడు అధికమైన దుఃఖానికి లోనయ్యాడు. దుఃఖం అధికమైతే శోకంగా పరిణమిస్తుంది. శోకం మిక్కుటమైతే అది నిర్వేదంగా మారి లౌకిక జీవనంపై ఒక విధమైన అనాసక్తి ప్రబలుతుంది. ఆ దశలో పురుషాహంకారం పూర్తిగా నశించి, మానవుని కర్మలన్నింటికీ దైవ సంకల్పమే మూలమనే అభిప్రాయం ప్రబలుతుంది. ఆ అభిప్రాయమే మానవుణ్ణి పశ్చాత్తాపంతో దహించి, ఐహిక జీవితంపై వైమనస్యం కలిగించి, త్రికరణ శుద్ధిగా ఆముష్మికంపై లక్ష్యం ఏర్పరచుకొనేటట్లు ప్రేరేపిస్తుంది. యుద్ధ పర్వాలను పరిశీలిస్తే ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక పయాణంలో ఈ పరిణామం క్రమంగా గోచరమవుతుంది.

కురుక్షేత్రంలో యుద్ధం ప్రారంభం కాబోయే సమయంలో వ్యాసుడు ధృతరాష్ట్రుని వద్దకు వస్తాడు. అనివార్యమైన యుద్ధానికి కారకులైన కుమారుల

దుర్వినయానికి నిర్వేదం చెంది చింతించే ధృతరాష్ట్రునితో "ప్రాప్తకాలంబై వచ్చిన భూప్రజాక్షయంబు దీనికి వగవంబని లేదు ధర్మోజయ తనుచు నిశ్చింతంబున నుండుము" (భీష్మ. 1-8) అని చెప్పి వ్యాసుడు ఆ మహారాజు హృదయంలో సంకుచిత లౌకికబంధ సంబంధమైన భావనస్థానంలో, శాశ్వతమైన పారమార్థిక సంబంధమైన విశ్వమానవ క్రాంతదర్శన భావాన్ని పెంపొందించే విధంగా ప్రబోధం చేస్తాడు. వ్యాసుని ఈ సూచన ధృతరాష్ట్రుని అనంతర జీవితంలో పరిణామానికి ఎంతో దోహదం చేసినట్లు స్పష్టం అవుతుంది. పద్దెనిమిది రోజులు వ్యాపించిన కురుక్షేత్ర యుద్ధంలో స్వపక్ష వీరులు ఒక్కొక్కరు మరణించిన విషయం విన్న ప్రతిసారి మానుషబలం కన్న దైవశక్తి అధికం అనే అభిప్రాయాన్నే వ్యక్తం చేస్తూ, క్రమంగా మానుష శక్తిపై విశ్వాసం సడలుతుండగా సమస్తమూ దైవాధీనం అనే ఆత్మతత్వాన్ని ఆ మహారాజు అలవరచుకోవటం కనిపిస్తుంది.

నాల్గవరోజు యుద్ధంలో పాండవ బలాలు కౌరవ పక్షాన్ని చింపరవందర చేశాయన్న విషయం విన్న ధృతరాష్ట్రుని హృదయంలో ఆవేదన రగిలి, సంజయుడు ఎప్పుడూ పాండవుల విజయాలనే వివరిస్తాడని నిష్ఠూరమాడతాడు. సంస్కృత భారతంలో ఇంతవరకే ఉంది. ఈ నిష్ఠూరంలో కేవలం ఆ మహారాజు పుత్రవ్యామోహం, యుద్ధంలో అపజయంపట్ల అసహనం, ఆవేదన మాత్రమే వ్యక్తం అవుతుంది. కాని తిక్కనగారు ఈ ఆవేదనకు తోడు ధృతరాష్ట్రుడు దైవాధిక్యం ఎడ కూడ విశ్వాసం పెంచుకొన్నట్లు

"మానషమేటికి దైవా
ధీనము సర్వంబు నస్మదీయ స్వాయ
త్తేనలఁ బాండు నృపాలక
సూనులు గెల్చెదరు కంటె సూతతనూజా" (భీష్మ. 2-198)

అని వివరించి ఆ మహారాజు ఆధ్యాత్మిక పరివర్తనలోని పరిణామాన్ని విశదీకరించారు.

ధృష్టద్యుమ్నుడు ద్రోణుణ్ణి వధించాడని విన్నప్పుడు కూడ ధృతరాష్ట్రుడు ఎంతో ఆవేదనకు లోనయ్యాడు. హీనాత్ముడైన ధృష్టద్యుమ్నుడు ద్రోణుని వధించ

టం ఆశ్చర్యంతో కూడిన నిర్వేదాన్ని కలిగించింది. ద్రోణుని వధతో పాండవ విజయం తథ్యమని విశ్వసించి పాండవులు విజయం సాధించేందుకు లోకరక్షణ పరుడైన కృష్ణుడు శక్తి దయాళుత్వం పూని అండగా ఉండటమే కారణమనే అభిప్రాయానికి వస్తాడు. ఈ సందర్భంలో "దైవము దలంచు రణంబునఁజేటు సంజయా" (ద్రోణ. 4-185) అని "దైవమగ్గలంబు పౌరుషము కంటె" (ద్రోణ. 1-80) అని పౌరుషం కన్న దైవబలం అధికమనే నిశ్చితాభిప్రాయానికి వచ్చినట్లు ద్యోతకం అవుతుంది. అట్లానే కర్ణుడు మరణించిన విషయం విన్నప్పుడు కూడ 'దైవంబు బలవంతంబు' అంటూ, పాపి చిరాయువు అనే నానుడిని అనుసరించి ఈ ఘోరకలి గాడటానికే బ్రతికి ఉన్నానని నిర్వేదంతో పలుకుతాడు.

భీష్మ ద్రోణ కర్ణులు కురుక్షేత్రంలో విజయం సాధించి పెట్టలేక యుద్ధానికి ఆహుతి అయిన విషయం విని కూడ ఆ మహారాజు హృదయంలో కొనఊపిరితో ఉన్న పురుషాహంకారం పద్దెనిమిదవ రోజు యుద్ధ వార్తలు వినాలనే ప్రేరణకు దోహదం చేసింది శల్య సుయోధనుల మరణంతో ఆ ఆశకూడ నశించింది. పాండవులకు భయపడి సుయోధనుడు గదాకలితుడై ఏకాంతంగా నారాయణహ్రదం వైపు వెళ్లాడని విని కుమారుని దీనావస్థకు దుఃఖం పెల్లుబకగా "అపదలిట్టివి కలవె మనుజపతులకు నెందుఁ బన్" (శల్య. 2-3) అని విచారించి, నిర్వేదంతో "దైవమెవ్వరినెట్లు చేయఁ జాలదేమి సెప్పఁగలదు" (శల్య. 2-5) అని నిస్సహాయంగా దైవాధిక్యాన్ని అంగీకరిస్తాడు. విదురాదిహితులు ఎన్ని బుద్ధులు చెప్పినా కుమారులు వినలేదని, తానుకూడ "నాకును మది వారికెట్లటుల కుత్సితమయ్యె విధాతృ త్రిప్పనన్" (శల్య. 1-36) అని తన బుద్ధి మాంద్యానికికూడ దైవమే కారణమనే అభిప్రాయం వ్యక్తంచేస్తాడు. అంతేగాక శత్రువులు స్వపక్ష వీరులను సంహరించటం కూడ వారి ప్రభావంవల్లకాక "అమ్మహాత్ములన్ ద్రుమ్ముచ్ఛలఁ జంపినట్టుయి పరుల్ దెగటార్చిరి దైవ మిచ్చినన్" (శల్య. 1-27) అని దైవశక్తివల్లే సంహరించ గలిగారనే అభిప్రాయాని వస్తాడు మానుషశక్తికి అతీతమైన దైవం విజృంభిస్తే "పల్కాదు నేమని యేన దైవమున్" (శల్య. 1- ) అని అంటూ నిస్సహాయుడై పురుషాహంకారం నశించగా సర్వమూ దైవాధీనం అనే అభిప్రాయానికి వచ్చినట్లు తలంచవచ్చు.

కురుక్షేత్ర సంగ్రామంలో నూరుగురు కుమారుల వినాశంతో ధృతరాష్ట్రుని మానవ ప్రయత్నాలన్నీ విఫలమైనట్లయింది. యుద్ధం సాగేకొలది ఆ మహారాజు

హృదయంకూడా మానుషంకన్న దైవమేమిన్న అనే ఆత్మజ్ఞానాన్ని అవగతం చేసుకోసాగింది. తనలోభద్రృష్టే ఇంతటి అనర్థానికి కారణం అన్న విదురుని మాటలు అతడి చిత్త క్షోభను కొంత తగ్గించ కలిగాయి. ఆ మహారాజుకు ఆశలన్నీ అడియాసలై అనుకున్నది సాధించలేని అశక్తత దూఢికావటమే ఈ పరిణామానికి కారణం కావచ్చు. ఆ సమయంలో తన వైఫల్యాలన్నిటికీ దైవ ప్రాతికూల్యమే కారణమని, అదంతా పూర్వజన్మ పరిపాకమేనంటూ "దైవంబు దుఃఖభాజనత్వం బొనర్చుటం బూర్వజన్మా చరితంబైన సుకృతంబు లేమి గానవచ్చెడు"(త్రి. 1-14) అని పశ్చాత్తాపానికి లోనవుతాడు. ఇక భావిజీవితంలో తనకు "బ్రహ్మపద ప్రాప్తియ తగునదియై యున్నది యది యాచరించుట సంశ్రితవ్రత పరాయణులైన పాండు సుతులు చూతురుగాక" (త్రి. 1-14) అని ఆముష్మిక చింతనే మిగిలిఉన్నట్లు ఆత్మ ప్రబోధానికి లోనయ్యాడు. ధృతరాష్ట్రుని ఈ ఆధ్యాత్మిక పరివర్తన క్రమ పరిణామ జనితమై భావి జీవిత పథానికి మార్గం సుగమం చేసినట్లు తెలుసుకోవచ్చు.

ఆ తరువాత విదురుడు ధృతరాష్ట్రునకు పుత్ర మరణ జనిత శోకాన్ని పోగొట్టి మానసిక శాంతి కలిగించే ప్రయత్నంచేస్తాడు. ఆ ప్రయత్నంలో అతడు జీవిత స్వరూపాన్ని, జీవిత పరమార్థాన్ని, సంసార లంపటాన్నిగూర్చి వివరిస్తాడు. జీవన్మరణాలు మానవ జీవితానికి సహజాలని, అందుకు వగవ పనిలేదని బోధిస్తాడు. కుమారులు క్షాత్ర ధర్మాన్ని నిర్వర్తించి ఇంద్రునకు అతిథులుగా వెళ్లారని సాంత్వన పరుస్తాడు. విదురుని హితవాక్యాలు ధృతరాష్ట్రునిలో ఉత్కంఠను రేకెత్తించాయి. అతడు సంసార దుఃఖ బహుళతను, తద్గహనత్వాన్ని తెలుసుకోవాలనే ఆకాంక్ష వ్యక్తం చేయటం ఆ మహారాజు హృదయంలోని ఆధ్యాత్మిక పరిణామాన్ని సూచిస్తుంది. విదురుని బోధలన్నీ విన్నతరువాత ధృతరాష్ట్రుడు ప్రత్యక్షంలోకి వచ్చిన వ్యాసునితో

"మానుష జన్మము మాన్యవివేకా !
మానస దుఃఖ సమాజము నెల్లం
దాన ఘటియించుచు దైన్యము దెచ్చుం
గాన నవంబిదిగాల్పనె తండ్రీ" (త్రి. 1-62)

అని మానవజన్మలోని నికృష్టతను గుర్తించినవానిలాగా భవబంధాలపై తన విరాసక్త తను వ్యక్తం చేస్తాడు. ధృతరాష్ట్రునిలో ఈ పరిణామం అతని ఆధ్యాత్మిక పరి వర్తనలో ఒక ముఖ్యాంశంగా నిలుస్తుంది.

ధృతరాష్ట్రునిలో ఇంత పరివర్తన కలిగినా అతడి పురుషాహంకారం, ప్రతీకారజ్వాల హృదయాన్ని అంటి ఉన్నదనేందుకు ఉక్కు భీముని వృత్తాంతం ఉదాహరణగా నిలుస్తుంది. అయితే యుద్ధరంగం మధ్యలో అప్పటికప్పుడు ఉక్కు విగ్రహాన్ని కల్పించటం అసంగతం అని పండితులు వెలిబుచ్చిన అభిప్రాయాన్ని పూర్వ ప్రకరణాల్లో ఉట్టంకించటం జరిగింది. ఉక్కు భీముని వృత్తాంతం ధృతరాష్ట్రుని హృదయంలోని ప్రతీకారానికీ, పురుషాహంకారానికి ప్రతీక అనుకొన్నప్పటికీ, అనంతరం శాంత్యను శాసనిక పర్వాల్లోని నీతి బోధ ఆ మహారాజు హృదయంలో లేశమాత్రంగానైనా ఉన్న మాయావరణాన్ని తొల గించి పురుషాహంకారానికి స్వస్తి పలికి ఆధ్యాత్మిక చింతనే పరమావధిగా భావిం చేందుకు దోహదం చేసి ఉండవచ్చు.

శాంతి పర్వంలో ప్రశ్నోత్తర రూపంలో భీష్ముడు రాజధర్మము, ఆపద్ధ ర్మము, మోక్షధర్మాలను గూర్చి సవివరంగా, సోపపత్తికంగా ఎన్నో ఉపాఖ్యా నాలు ఉదాహరణలుగా వివరిస్తాడు. మోక్షావలంబియైన ధర్మముత్తమ ధర్మమని విశద పరచి ధర్మరాజుకు కలిగిన అనేక సందేహాలను నివృత్తి చేస్తాడు. భీష్ముడు ధర్మరాజుకు దర్మబోధ చేసే సమయంలో ధృతరాష్ట్రుడు సాన్నిధ్యంలో ఉన్నట్లు సంస్కృతాంధ్ర భారతాలల్లో చెప్పకపోయినప్పటికీ, బంధుమిత్ర సామంతాది రాజోద్యోగులందరూ ఉన్నప్పుడు ధృతరాష్ట్రుడు కూడ తప్పకుండ ఉండే ఉంటా డని భావించటం సమంజసం.

ధృతరాష్ట్రమహారాజు సుదీర్ఘమైన రాజకీయానుభవంలో రాజధర్మాన్ని గూర్చి అనేకాంశాలు తెలుసుకొనే ఉంటాడు. తన అనుభవంలోకి రాని విశేషాలు భీష్మునిబోధల్లో అందరితోపాటు విని ఉంటాడు. భీష్ముడు బోధించిన రాజధర్మ విశేషాలకన్న మోక్షధర్మ విశేషాలు ధృతరాష్ట్రుని హృదయంపై ఎంతో ప్రభావాన్ని చూపి ఉంటాయి. అంతరాంతరాల్లో లేశమాత్రంగానైనా ఉన్న పురుషాహంకారం భీష్ముని మోక్షధర్మ బోధవల్ల సమూలంగా తొలగిపోయి ఉంటుంది. మనసు

పశ్చాత్తాపదగ్ధమై కడిగిన ముత్యంలాగా స్వచ్ఛమై, ప్రసన్నమై ఆధ్యాత్మిక తత్త్వావగాహన యందే లగ్నమై ఉంది. ధృతరాష్ట్రుని ఆధ్యాత్మిక పరివర్తనలో ఇక్కడినుంచి మూడవ దశ ప్రారంభమైనట్లు తలంచవచ్చు.

కురుసామ్రాజ్యానికి అధిపతి అయిన ధర్మరాజు పెద తండ్రిని గౌరవాదరాలతో సంభావిస్తూ పుత్రులను కోల్పోయిన విచారం తెలియనీయకుండ ప్రవర్తించసాగాడు. అయినప్పటికి పుత్రులందరను కోల్పోయిన ధృతరాష్ట్రునకు జీవచ్ఛవంలాగా పరాయి పంచన బడుగు జీవితం సాగించటం దుర్భరంగా తోచింది. మనసు పశ్చాత్తాపంతో ఆముష్మిక చింతనపై లగ్నం అవుతుంటే, శరీరం అంతఃపురాల్లో హంసతూలికాతల్పాలపై ఐహిక భోగాలు అనుభవించటం నీచంగా తోచింది. ఆధ్యాత్మిక చింతనలో భగవంతుణ్ణి ప్రీతిచేసే సంకల్పంతో భౌతిక కార్య కలాపాలు కొన్ని కొనసాగిస్తూ "గుఱ్ఱ, జెఱుపులు, గట్టించు గోరియాఱ్ల లగ్రహారముల్" (ఆశ్రమ. 1-7) బ్రాహ్మణోత్తములకు దానంగా ఇచ్చి తృప్తి పరచి తాను తృప్తి అనుభవించేవాడు.

దాన ధర్మాది లౌకిక కార్యాలెన్ని చేసినా అతడి మనసుకు తృప్తి కలుగలేదు. పాపభాగులై, వంశ విచ్ఛేదకులైన కుమారులకు పుణ్యలోక ప్రాప్తి లేదనే క్షోభ ధృతరాష్ట్రుని మనసును పారమార్థికం వైపు ఆయత్తంచేసి తొందర పెట్టింది. అంతఃపుర భోగాల్లో మనసు సంకల్ప సిద్ధి పొందదనే దృఢ నిశ్చయానికి వచ్చి, ఆశ్రమాల్లో వానప్రస్థ జీవితం గడుపుతూ పారమార్థిక కృషి చేయాలని స్థిర సంకల్పుడయ్యాడు. సమస్త సౌఖ్యాలు అందుబాటులో ఉంచుకొన్న ఆ మహారాజు

**"ఏను గాంధారియును తపోమాననీయ**
**మునుల చేరువ వల్కలములు ధరించి**
**కందమూల ఫలముల నాకలి హరించి"** (ఆశ్రమ. 1-29)

వానప్రస్థజీవితం గడపాలని నిశ్చయించటం భవబంధాలపై సంపూర్ణ వైరాగ్యాన్ని ప్రదర్శిస్తుంది. ఆ విధమైన స్థిర సంకల్పంతోనే ఆహారం కూడ విసర్జించాడు. వ్యాసుడుకూడ అతని లక్ష్య శుద్ధిని కొనియాడుతూ

"కేవల తపః క్రియా సం
సేవన తాత్పర్య మిపుడు చిత్తంబునయం
దావేశించినయది యీ, భూవరునకు..." (ఆశ్రమ.1-52)

అని ఆ మహారాజు ఏకాగ్రతను శ్లాఘించి అరణ్య గమనానికి అనుజ్ఞ ఇవ్వవలసిందని ధర్మరాజుకు సలహా ఇస్తాడు. వ్యాసుని అభిప్రాయం సమంజసంగా ఉంది. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుని లక్ష్యశుద్ధి, పారమార్థిక చింతనపై ఏకాగ్రతతో కూడిన పరివర్తన శ్లాఘనీయంగా ఉంది.

ధృతరాష్ట్రుని స్థిరసంకల్పం వల్ల, వ్యాసుని బోధల వల్ల ఆశ్రమ వాసానికి ఆ మహారాజుకు అనుమతి నివ్వక ధర్మరాజుకు తప్పలేదు. ధర్మరాజు అనుజ్ఞ పొందిన ధృతరాష్ట్రుడు గాంధారీ సహితుడై అంతఃపురవాసుల, పుర జనుల అనుజ్ఞ తీసుకొని వానప్రస్థానికి ప్రయాణం అయ్యాడు. గంగానదీ తీరంలో విడిదిచేసి బ్రాహ్మణోత్తముల మంత్రాహుతులతో వెలిగే మహితాగ్నులకు అర్చన లిచ్చి దర్భాసనంపై విశ్రమించటం అలవరచుకొన్నాడు. అనంతరం గంగానదిని ఉత్తరించి శతయూపరాజర్షి ఆశ్రమ ఉపాంత ప్రదేశంలో విడిది ఏర్పాటు చేసు కొన్నాడు. ఆ రాజర్షి ధృతరాష్ట్రునకు సకల సత్కారాలు చేసి పట కుటీరాలు నిర్మించి ఆవాసాలుఏర్పాటు చేశాడు. ధృతరాష్ట్రుడు మునివృత్తి స్వీకరించి గాంధారితో కలసి 'చీరాజిన వసనుడు, సువ్రత పరుడై' తపస్సుచేయ సంకల్పిం చాడు. ధృతరాష్ట్రుని తపో నిష్ఠ అచ్చటి మునులను కూడ ఆశ్చర్య చకితులను చేసింది. ఆ మహారాజు "నియమ నిష్ఠలతిశయిల్ల అచ్చటి మునులచ్చెరు వంద నచ్చెరువ నతి తీవ్ర తపశ్చరణంబున నిజాంగంబు నిర్మాంసత్వంబునం జర్మాస్థులు గదియునట్టి కార్యంబు దనకు నొప్పు" (ఆశ్రమ. 1-183) నట్లుగా కఠోర తపస్సుకు పూనుకొన్నాడు. రాజర్షిగా రూపాంతరం చెందిన ధృతరాష్ట్రుని తపో కాఠిన్యం నారదాది దేవర్షుల ప్రశంసకు కూడ పాత్రమైంది.

ఆశ్రమంలో ధృతరాష్ట్రుని వానప్రస్థ జీవితం అతడి అధ్యాత్మిక జీవితంలో ఎంతో విశిష్టంగా వర్తిల్లింది. ఆశ్రమానికి వచ్చే మునులతోడి గోష్ఠు లలో ధృతరాష్ట్రుడు ఎన్నో ఆధ్యాత్మికాంశాలను తెలుసుకొనేవాడు. రోజులు గడచే

కొద్దీ అతడి మనసు మిక్కిలి నిర్మలమై రాగద్వేషాతీతమై వర్ధిల్లింది. ఆశ్రమంలో ఉన్న ఆరాజర్షిని సందర్శించటానికి వ్యాసుడు, ధర్మరాజాదులు వచ్చి ఒక నెల్లాళ్ళు ఉన్నప్పుడు అతడి హృదయంలోని ఆధ్యాత్మిక పరివర్తన దృగ్గోచర మవుతుంది. వ్యాసుడు దీర్ఘవైరవృత్తి, క్రోధ చింతనములేని మనః ప్రవృత్తియే మానవునకు అసలైన సంపద అని చెప్పి, పాండవుల ఎడ 'నీ మనసు ప్రసన్న మైందా?' అని ప్రశ్నిస్తాడు. అందుకు సమాధానంగా ధృతరాష్ట్రుడు

"వనవాస మించుకయును నాకు దుఃఖంబు
సేయదు దేహంబుఁ జిత్తమును ద
పః క్రియలకుఁ బనుపడి యున్నయవి నన్ను
గాంధారి బుత్రశోకం బొకింత
యేనియుఁ బొందంగ నీదు సభక్తిక
మైన వృత్తమున ధర్మాత్మజుండు
మునివర యితనిపై ననుజుల మీద వ
త్సలము నా హృదయ మిద్ధరణి విభుఁడు
దేవతాత్ముడగుట దెల్లమై యునికి మ
ద్వచన వర్తనముల వలన నితఁడ
యెఱిఁగి యుండు గొంతి తెఱుగు శుశ్రూషయు
నద్భుతంబు ముదము నావహించు" (ఆశ్రమ. 2-80)

అని చెప్పి తనకు "పరిజ్ఞానంబును మానస నిర్మలత్వంబును భవత్ప్రసాదంబున గలిగెడు గాక" (ఆశ్రమ. 2-81) అని తన మనో నైర్మల్యాన్ని విశద పరుస్తాడు. ధృతరాష్ట్రుని ఈ మాటల్లో అతడి ఆముష్మిక పరివర్తన ఉన్నత స్థాయిలో ఉన్నట్లు వ్యక్తం అవుతుంది. వ్యాసుడు 'నీమనోభీష్టాన్ని కడతేర్చటానికే వచ్చాను, మనోరథం వెల్లడించమని' అడిగినప్పుడు ధృతరాష్ట్రుడు వెలిబుచ్చిన వైరాగ్యంతో

కూడిన ఆత్మ సంయమనం ఆ రాజర్షి తపశ్శక్తికి నిదర్శనంగా నిలుస్తుంది. వ్యాసునకు సమాధానంగా ధృతరాష్ట్రుడు

"మానుషమైన నమానుష
మైనను బ్రార్థనకు విషయ మైనది భవదీ
యానూన కృపకు నెక్కుడు
గా నొక్కఁడుఁ గాన నేను గారుణ్య నిధీ" (ఆశ్రమ. 2-85)

అని ఇహ పరాలకు మించినది వ్యాసుని దయ అని అంటాడు. వ్యాసుడు ఆదరించినప్పుడే తనకు భవబంధాలపై విరక్తి కలిగి జన్మ సాఫల్యం పొందిందంటూ

"సంయమీంద్ర నాఁదు జన్మంబు సఫలత
బొందె మీరు విమల బుద్ధి నింత
యాదరించినపుడ లేదింకఁ బరలోక
భీతి ధన్యతముఁడనైతి నేను" (ఆశ్రమ. 2-86)

అని ఐహిక జీవితంపై వైరాగ్యం ప్రదర్శిస్తాడు. ఇంకా ధర్మరాజుతో కూడ "తపమునెడన్ మదీయ మతి తత్పర గావున దానికోర్తు" (ఆశ్రమ. 2-134) అని తపోధర్మం తన వృత్తి అన్నట్లుగా పలికాడు. ధృతరాష్ట్రునిలో ఈ విధమైన పరివర్తన వానప్రస్థ జీవితాని కనుగుణంగా ఉండి పరతత్వం పై అతడి మనసు లగ్నమైన విధానాన్ని స్పష్టం జేస్తుంది.

ధృతరాష్ట్రుని తపోవృత్తిలో అనంతరదశ అత్యంత కాఠిన్య స్వరూపాన్ని పొందింది. ఈ దశలో భార్యతో కలిసి ప్రాయోపవేశం చేయటం జరుగుతుంది. ఏకాగ్ర చింతనతో దైనందిన కార్యాలు నిర్వర్తించే ధృతరాష్ట్రుడు యాజకులను, బ్రాహ్మణుల నందరను వదలి, ఆశ్రమం విడిచి గాంధారి, కుంతీదేవి వెంటరాగా భాగీరథీ తీరంలోని దుర్గమారణ్యంలో దుష్కరమైన తపస్సుకై పూనుకొన్నాడు. ఈ దశలో ధృతరాష్ట్రుడు లౌకిక బంధాలన్నింటినీ త్రెంచుకొని ఏకా

త్మనా కఠోర దీక్షకు పాల్పడినట్లు తెలుస్తుంది. తపోనియమంలోను, ఆహార స్వీకారాది నియమాల్లోను భార్యా భర్తలది ఎవరి మార్గం వారిదయింది. ధర్మపత్నియైన గాంధారి సర్వకాల సర్వావస్థలలోను భర్తను అనుసరించే వ్రతంతో ఉండి కూడ, జీవితంలోని ఈ చివరి దశలో ఆహార నియమంలో భర్తను అనుసరించ లేక పోయింది. అందుకు పారమార్థిక చింతన అత్యున్నతస్థితిలో ఆత్మీయమై వైరాగ్యాన్ని పొంది వైయక్తికానుభూతి కావటమే కారణం కావచ్చు. ఆ దశలో వారిరువురి తపోవృత్తి వైయక్తికమై, ఎవరి ఆవేదన, తపన, నివేదన, తపో మార్గం స్వతంత్ర మార్గంలో సాగాయి. వారు ముగ్గురు క్రమంగా

"... దుష్కర తపంబు
వాయు భక్షతఁ బూని చేయఁ దొడంగె, గాం
ధారియు నీళ్ల నాహారకలన
మోపి యొనరించె, గొంతి మాసోపవాస
నియమమూది ..." (ఆశ్రమ 2-148)

వర్తించారు. భర్తనే అనుసరించ వలసిన గాంధారి, అతడు వాయు భక్షతనే నియమంగా స్వీకరిస్తే, అంతటి సంయమనం లేక నీటిని స్వీకరించింది. అంటే ధృతరాష్ట్రుడు తపోనిష్ఠలో భార్యతో సహా ఐహికమైన సమస్తాన్ని త్యజించి, భవబంధ విముక్తుడైనట్లుగా కనిపిస్తున్నాడు. ఈ సందర్భంలో మహాభారతంలో వ్రాయబడక పోయినా, ధృతరాష్ట్రుడు సర్వసంగ పరిత్యాగం చేసి సన్యాసాశ్రమ స్వీకరణంతో పరతత్వంలో ఏకాత్మనా సంలీనం కావాలని ప్రయత్నం చేసినట్లు తలంచవచ్చు. ప్రాయోపవేశం చేసే సమయంలో కూడ గాంధారి భర్తను అనుసరించినట్లు కనిపిస్తుంది కాని ధృతరాష్ట్రుడు ఆమె ఉనికిని గమనించినట్లు కనిపించదు. అతడు యోగయుక్తుడైనట్లే ప్రవర్తించాడు. ఆ మహారాజు ఆధ్యాత్మిక పరిణామంలో ఈ దశ సర్వోత్కృష్టమై, మనోజ్ఞ సహజమై ప్రకాశిస్తుంది.

అరణ్యంలో కార్చిచ్చు రగిలిన వార్త విన్న కల్పించిన సమయంలో ధృతరాష్ట్రుడు ఆత్మ సంస్కారానికి సిద్ధపడి సమాహిత చిత్తంతో తూర్పు

ముఖంగా ఆసీనుడయ్యాడు. గాంధారి, కుంతీదేవి కూడ అట్లానే కూర్చున్నారు. అనంతరం కొద్దిసేపటికి ఆ మహారాజుతోపాటు వారుకూడ ప్రాయోపవేశంతో సంస్కారం పొందారు. ధృతరాష్ట్రుని ప్రాయోపవేశ అంశాన్ని కొనియాడుతూ నారదుడూ కూడ 'ఆత్మాగ్ని కాలె నా విభుడు' అని అంటాడు. ఈ విధంగా వంశనాశనానికి కారణమయ్యాననే పశ్చాత్తాపాగ్ని దహించిన హృదయం పారమార్థి కాన్వేషణలో సంయమనం పొంది, ఆ సంయమనం పరాకాష్ఠనొంది ఆ మహా రాజు ఆత్మాగ్నిలో భవబంధాలను త్రెంచుకొని పంచభూతాల్లో లీనమయ్యేట్లుగా పరి ణామం చెందిందని తలంచటం సమంజసంగా ఉంటుంది.

## 4.0 ధృతరాష్ట్రుడు - ఇతర పాత్రల దృష్టి

లోకంలో సాధారణంగా వ్యక్తి ప్రవర్తన అతడి వ్యక్తిత్వానికి అద్దం పడుతుంటుంది. అతడి ప్రవర్తన వల్లే సమాజంలోని వారు ఆ వ్యక్తి మంచిచెడ్డలు నిర్ణయించటం జరుగుతుంది. లోకులు ఒక వ్యక్తిని గూర్చిన అభిప్రాయాలు ప్రత్యక్షంలోను, పరోక్షంలోను కూడ వ్యక్తీకరిస్తుంటారు. వీరు వెలిబుచ్చే అభిప్రాయాలవల్ల ఆ వ్యక్తితో ప్రత్యక్ష పరిచయం లేనివారుకూడ అతణ్ణి గురించి ఒక అంచనా వేసుకొనేందుకు అవకాశం కలుగుతుంది. అయితే ప్రత్యక్షంలో వెలిబుచ్చే అభిప్రాయాల్లో కొన్ని సమయాల్లో పొగడ్తకు తావుండటం కనిపిస్తుంది. కాని పరోక్షంలో వెలిబుచ్చే అభిప్రాయాల్లో మొహమోటానికి, ముఖప్రీతికి స్థానం ఉండదు. కనుక సత్యానికి కొంత దగ్గరలో ఉంటాయని తలంచవచ్చు. హితైషులయితే ప్రత్యక్షంలో అయినా నిష్కర్షగా తమ అభిప్రాయాలను వ్యక్తం చేస్తారు. ప్రమాదం కలిగించే ప్రియవాదులకన్నా ప్రమాదం నుంచి తప్పించగలిగే హితవాదులే మేలైనవారని నీతిశాస్త్రవేత్తల అభిప్రాయం.

సాంఘిక జీవన స్రవంతిలో అంతర్భాగమైన వ్యక్తి సాంఘిక పరిణామాలకు, పరిస్థితులకు అనుగుణంగా నిత్య నూతనంగా చైతన్యవంతంగా జీవించటానికే హెచ్చు అవకాశాలు ఉన్నాయి కాని, జడ పదార్థంలాగా జీవితమంతా ఒకే విధమైన ప్రమాణాలతో మెలగటం వీలుకాదు. వ్యక్తి జీవితంలో అతడి మానసిక విలువలతోపాటు పరిసర స్థితిగతుల ప్రభావం ఎంతో ప్రాధాన్యం వహిస్తుంది. అందువల్ల ఒక సమయంలో మంచి అనిపించిన కార్యం, అదే వ్యక్తికి భిన్నమైన పరిస్థితుల్లో తప్పుగా కనిపించవచ్చు. కాని రెండు సందర్భాల్లోను అతడు చేసే పని మంచిదని విశ్వాసం కలిగితేనే చేస్తాడు కాని, విశ్వాసం లేకుండ చేయడు. అట్లా ఎవరన్నా చేస్తే అది ఆత్మవంచన అవుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో వ్యక్తిచేసిన కార్యాలకు అనుగుణంగా పొందిన ప్రయోజనాలను అనుసరించే ఇతరుల అభిప్రాయాలుంటాయి. ఆ ఇతరులు అభిప్రాయాలను వ్యక్తం చేసేటప్పుడు, ప్రయోజన ఫలితాలతోపాటు వ్యక్తి, తన అభిరుచులు, ఆలోచనలకు కూడ ఎంతో ప్రాధాన్యం ఉంటుంది. ఇట్లాగా

ఒక వ్యక్తిపై ఇతరులు వ్యక్తంచేసే మంచిచెడులు అనేక అంశాలపై ఆధారపడి ఉంటాయని తలంచవచ్చు.

మహాభారతాన్ని పరిశీలిస్తే భిన్నమనస్తత్వాల సమ్మేళనంలో చైతన్య వంతమైన సామాజిక జీవనానికి ప్రతిరూపంగా కనిపిస్తుంది. ఇందులో కనిపించే పాత్రలు భిన్న మనస్తత్వాలతో, భిన్న అభిరుచులతో ఒకరిని గూర్చి మరొకరు విభిన్నమైన అభిప్రాయాలను వ్యక్తం చేస్తూ అన్ని కాలాలలోని వర్తమాన సమాజానికి ప్రతిబింబాలుగా గోచరం అవుతారు. భారతంలోని పాత్రలన్నింటిని మౌలికంగా ధృతరాష్ట్రుని పక్షీయులు, పాండవ పక్షీయులు, కురువంశ శ్రేయస్సునందు మాత్రమే ఆసక్తిగల మధ్యే మార్గీయులని మూడు విధాలుగా పేర్కొనవచ్చు. మహాభారతంలోని, పాత్రతా భేదం లేకుండ, పెద్ద చిన్న పాత్రలన్నీ కూడ కథలో తమ ప్రాధాన్యాన్ని స్థాపించుకొన్నాయి. కథనంలో ఉన్న విశేషమే ఇందుకు కారణమని భావించవచ్చు.

భిన్న పరిస్థితుల్లో, విభిన్న దృక్పథాలతో ప్రధాన కథలో వర్తిల్లిన భారత పాత్రలు ప్రత్యక్షంగా కాని. పరోక్షంగా కాని కురుసార్వభౌముడైన ధృతరాష్ట్రునితో ఏదో ఒక విధంగా సంబంధాన్ని కలిగిఉన్నట్లు పరిశీలనవల్ల తెలుస్తుంది. ఈ పాత్రలన్నీ ధృతరాష్ట్రునితో ఉన్న అనుబంధ ప్రాధాన్యాన్ని బట్టి, అనుభవాన్ని బట్టి అతడి ప్రవర్తన పైనా, నిర్వహించిన కార్యస్వరూపం ఎడ భిన్న సమయాల్లో భిన్నమైన అభిప్రాయాలను వెలిబుచ్చటం కనిపిస్తుంది. వీరిలో కొందరు ధృతరాష్ట్రుని ఆలోచనా సరళిని గ్రహించి తప్పుత్రోవ పట్టించినవారైతే, మరికొందరు శత్రుభావంతో తీవ్రమైన నిరసన భావం వ్యక్తం చేసినవారు కాగా, ఇంకొందరు సంయమన దృష్టితో ప్రజాశ్రేయస్సును, దేశ శ్రేయస్సును, వంశ గౌరవాన్ని పరిశీలనలోకి తీసుకొని హితైషులై తమ తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. భారత పాత్రలలో ముఖ్యులైనవారు ధృతరాష్ట్రుని కార్యశీలత పరంగా వెలిబుచ్చిన అభిప్రాయాలు కొన్నింటిని క్రోడీకరించటం ప్రస్తుతాంశం.

**వ్యాసుడు :** భారత కథను నిర్మించిన వ్యాస మహర్షి అందులో ఒక ప్రధాన పాత్రగా కూడ వర్తిల్లాడు. సత్యవతి కన్యగా ఉన్న కాలంలో జన్మించిన

కారణంగా ధృతరాష్ట్రుని జననంతో ఈ మహర్షికి సంబంధం కల్పించటం జరిగింది. ఆధిదైవిక శక్తులతో భవిష్యత్కార్య స్వరూపాన్ని ఎరిగిన వ్యక్తిగా తనను చిత్రించు కొన్నాడు. భారత కథలో ఇతడు కురువంశ శ్రేయస్సు, వైభవం ఎడ ఎంతో మక్కువ చూపినట్లు తెలుస్తుంది. అయితే పెక్కు సందర్భాల్లో పాండవులదే ధర్మపక్షం అనే భావంతో ధృతరాష్ట్ర ధార్తరాష్ట్రుల కార్యకలాపాలను నిరసించి, ఏకాంతంలో ధృతరాష్ట్రునకు తన అభిప్రాయాలు నిష్కర్షగా చెప్పి హితవు బోధించ ప్రయత్నించినట్లు తెలుస్తుంది

వారణావతంలో లాక్షాగృహం నుంచి తప్పించుకొన్న పాండవులు శాలి హోత్రుని ఆశ్రమంలో ఉన్న సమయంలో పరామర్శించటానికి వచ్చిన వ్యాసుడు వారి కష్టానికి సానుభూతి వ్యక్తం చేస్తూ

"కొడుకు పల్కువిని కూడదునాక దురాత్ముడై
కడగి మీకు నపకారముసేసి ధరిత్రి వె
ల్వడగఁ బంచెఁ గడుఁ బాపమతిన్ ధృతరాష్ట్రుఁ డె
య్యెడల దుర్జనుల నేమఱి నమ్మఁగ బోలునె" (ఆది. 6-230)

అని ధృతరాష్ట్రుణ్ణి దురాత్ముడని నిరసించి, దుర్మార్గులైన వారితో ఏమరుపాటు లేక జాగ్రత్తగా మెలగాలని హితవు చెప్తాడు.

ద్యూతంలో ఓడిన పాండవులు అరణ్యవాసం గడిపేటప్పుడు, వారిని అరణ్యంలోనే మట్టుపెట్టే ఉద్దేశంతో సుయోధనుడు సమర సన్నాహాలు చేస్తున్న సమయంలో, అంతఃపురానికి వచ్చిన వ్యాసుడు పాండవులకు ఈ ఆపదంతా ధృత రాష్ట్రుని ఉపేక్షవల్లే వచ్చిందంటూ

"విను మేనును నీవును శాం
తనవుడు విదురుండు నుండి తగునె యధర్మం
బున నీయుపేక్ష ననయం
బును బాండవ విగ్రహంబు పుట్టుటలగ్గే" (అరణ్య. 1-79)

అని ఇందరు 'కులపెద్దలు' ఉండి కూడ పాండవులపై పగను తొలగించలేకపోవటం వంశానికి శ్రేయోదాయకం కాదని పలుకుతాడు. అట్లానే యుద్ధ ప్రారంభంలోకూడ ఉపేక్షా భావం విడిచి ఇప్పటికైనా పాండవులను దగ్గరకు చేర్చి ప్రజానాశనాన్ని అరి కట్టవలసిందని బోధిస్తాడు.

భారత యుద్ధంలో సమస్తం కోల్పోయి కుమారులకోసం విలపించే ధృతరాష్ట్రుని వద్దకు వచ్చిన వ్యాసుడు జీవిత పరమార్థాన్ని బోధిస్తూ, కురుపాండవ వైరం కేవలం సుయోధనుని దుష్టచింతనవల్ల మాత్రమే రాలేదనీ, ధృతరాష్ట్రుని ప్రమేయం కూడ ఉన్నదంటూ "సీవెఱుంగక యుండగా నచ్చెనే వైరబంధంబు కౌరవ పాండవులకు" (స్త్రీ. 1-71) అని యుద్ధం నివారించలేకపోవటంలో ఆ రాజు అనాసక్తిని ఎత్తిచూపుతాడు. బుద్ధిమంతుడైన విదురుడు యుద్ధంవల్ల కుల నాశనం అవుతుందని చెప్పినప్పటికీ వినని ఫలితం ఇప్పుడు అనుభవానికి వచ్చిందనీ, దానికి చింతించినా ప్రయోజనం లేదని చెప్పి మనసు ప్రసన్నం చేసుకొని పాండవు లను చేరదీయవలసిందని బోధిస్తాడు. ఈ విధంగా వ్యాసుడు కురుపాండవ విభే దానికి ధృతరాష్ట్రుని ఉపేక్షాభావమే ప్రధాన కారణమని అభిప్రాయపడ్డప్పటికీ, కురువంశ శ్రేయోభిలాషిగా ధృతరాష్ట్రునకు ఆత్మసంస్కారం కలిగే మార్గాన్ని ఉపదేశించాడు.

**భీష్ముడు :** భీష్ముడు ధృతరాష్ట్రునకు పెదతండ్రి. జీవితమంతా కురు సామ్రాజ్యోన్నత్యానికి, వంశ క్షేమం కోసం పాటుపడిన వ్యక్తి. కురుపాండవు లలో ఎవరినీ విడువలేక, అట్లని ఎవరికీ ఒత్తిచెప్పలేక కురువంశ విచ్ఛేదానికి విల విల్లాడిపోయాడు. ఇతడు ధృతరాష్ట్రుని ఎడ వ్యక్తం చేసిన అభిప్రాయాలు శత్రు భావంతోకాక హితవు చెప్పి కర్తవ్యోపదేశం చేసేవిగా ఉన్నాయి.

పాండవులకు అర్ధరాజ్యం ఇచ్చే విషయంలో కర్ణాదుల సలహాను సుయో ధనుడు అనుసరించాలని ప్రయత్నించిన సమయంలో భీష్ముడు ఎదుర్కొని పాండవు లకు భాగం ఇచ్చి వంశ ప్రతిష్ఠ, గౌరవం కాపాడ వలసిందని ధృతరాష్ట్రునకు చెప్తాడు. కురుపాండవ సంధి యత్నంలో కూడ సుయోధనుడు అనుసరించే విధానం క్షేమకరం కాదని తలచి ధృతరాష్ట్రునకు నీతిమార్గం ఉపదేశించే నెపంతో

"జ్ఞాతులు దమలోఁ బొందినఁ
జేతో మోదమున వెలిఁగి చెలువొందుదు ర
న్నీతిం బాసిన విగత వి
భూతిం గడకొఱవులట్లు పొగయుదు రధిపా"

(ఉద్యోగ. 2–275)

అని జ్ఞాతులతో వైరం వంశానికి క్షేమకరం కాదని చెప్తాడు. అట్లాగే కృష్ణరాయ బార సమయంలో సుయోధనుని గూర్చి

"......వృథాభిమానియై
మతిసెడి లోభ మోహ మిద మత్సరముల్ దను ద్రిప్ప నిట్లు సం
గతమున బోయె" (ఉద్యోగ. 3-376)

అని వెల్లడించిన అభిప్రాయం, అట్లాంటి కుమారుణ్ణి బలపరచే ధృతరాష్ట్రునకు కూడ హెచ్చరికే అని తలంచవచ్చు. పాండవుల ఎడ ధృతరాష్ట్రుడలకు సుహృద్భావం పెంపొందించే విషయంలో ఏన్నో హితబోధలు చేసి విఫలమైనా, క్షత్రియ ధర్మాన్ననుసరించి కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవుల పక్షానే పోరాడాడు.

భీష్ముడు జీవిక చాలించే సమయంలో కూడ కురుపాండవ మైత్రి ఎడ ఎంతో ఆపేక్ష ప్రదర్శించాడు. అప్పటికి కురుపక్షంలో మిగిలింది ఒక్క ధృతరాష్ట్రుడు మాత్రమే. ఆ దశలో ధృతరాష్ట్రునకు

"విను నీతనయులు దుర్యో
ధనాదు లవినీతిపరు లధర్మజ్ఞులు గ్రో
ధను లతిలుబ్ధులు వారల
మనమున నిడి వగవవలదు మనుజాధీశా" (అను. 5-459) అని

సుయోధనాదుల దుర్మార్గ వర్తనమే కురువంశ విచ్ఛేదానికి కారణమని చెప్పి, పాత కక్షలను మనసులో ఉంచుకొనక తమ్ముని కుమారులతో సఖ్యత ప్రదర్శిస్తూ "ధర్మసుతునిపైఁ గారుణ్యము గలిగి పనులు గఱపుము నెమ్మిన్" (అను. 5-457) అని హితవు గరపాడు. ఈ సందర్భంలో జీవితంలో ఎక్కువ భాగం పాండవులతో వైరమే పెంచుకొన్న ధృతరాష్ట్రునిపై ప్రేమని విరసన భావం వ్యక్తమౌతూ, కన్న కొడుకులందరూ మరణించిన ఈ దశలోనన్నా కురువంశం ఐక్యతకు కృషి చేయ వలసిందనే విన్నపం గోచరం అవుతుంది. భీష్ముని ఈ అభిప్రాయం చివరి కోరికయై మరణ శాసనంగా ద్యోతకం అవుతుంది.

**బాహ్లీకుడు :** కురువంశంలో భారత యుద్ధం నాటికి బ్రతికి ఉన్న కురువృద్ధుడు. ఇతడు ధృతరాష్ట్రునకు పితామహుడైన శంతనునకు సోదరుడు. కురుపాండవ వైరంలో ధృతరాష్ట్రుని పక్షం వహించినప్పటికీ, కురుపాండవ సంధియత్నంలో పాండవులతో సంధి చేసుకొని సఖ్యతగా మెలగవలసిందని హితవు చెప్తాడు. కళ్ళు చెదరిన బాటని విక్రమ మార్గం చూపించినా ఆ మార్గాన పోవని విధంగా సుయోధనుడు పెద్దలు చెప్పిన మాటలు వినకుండ అడ్డదారుల ప్రవర్తించటం ఉచితం కాదని అంటాడు. ఈ మాటలు సుయోధనుణ్ణి ఉద్దేశించి పలికినవే అయినా కురువంశం క్షేమం ఎడ బాహ్లీకుని ఆత్రుత, వంశప్రతిష్ఠ కాపాడ టంలో ధృతరాష్ట్రుడు జూపవలసిన శ్రద్ధకు హెచ్చరికగా కనిపిస్తున్నాయి.

**ద్రోణుడు :** ద్రోణుడు కురుపాండవులకు అస్త్రగురువు. ఇతడికి అర్జునుడంటే ప్రత్యేకమైన అభిమానం. కురువంశ వర్ధనం చిత్తశుద్ధితో కోరి, భీష్మునిఎడ గౌరవాదరాలతో జీవించిన వ్యక్తి. కురు పాండవ కలహంలో ద్రోణాచార్యుడు అనేక సందర్భాలలో భీష్ముని మార్గాన్నే అనుసరించి వంశ శ్రేయస్సుకు ఆరాటపడ్డాడు బ్రాహ్మ్య క్షాత్రములు ఒక ఒరలో ఇమిడిన ద్రోణుడు ప్రభు కార్యాలపై ఆమరణాంతం కృషిచేశాడు. ఉత్తర గోగ్రహణ సమయంలో కర్ణుడు ద్రోణ కృపాశ్వత్థామలను ఉపాలంభించిన సమయంలో భీష్ముని విజ్ఞాపన మేరకు అర్జునుని ఎదిరించేందుకు వ్యూహం పన్నుతాడు. ఈ సందర్భంలో

"మోహసాహసములఁ గురుముఖ్యు దెసకుఁ
గీడురాకుండఁ దగఁ బరికింప వలయు" (విరాట. 4-229)

అని ద్రోణుడు పలికిన పలుకులు అతని ప్రభు భక్తికి నిదర్శనంగా ఉన్నాయి. తనకు ఆశ్రయం కలిగించిన ప్రభువు ఎడ ఈ అభిప్రాయంతోనే జీవితాంతం గడిపి, ప్రభువు కోసమే అసువులు వదిలాడు.

**కృపాచార్యుడు :** కృపాచార్యుడు కూడ ద్రోణునివలె కురుపాండవులకు బాల్యంలో అస్త్ర గురువుగా ఉన్నాడు. ఇతడు కూడ కురుపాండవ కలహంలో వారి సఖ్యతకై చిత్తశుద్ధితో ప్రయత్నం చేశాడు. సంధి పొసగక యుద్ధం ప్రాప్తించిన సమయంలో బ్రాహ్మణత్వాన్ని కూడ మరచి అధర్మ యుద్ధానికి పాల్పడాడు. గోగ్రహణ సమయంలో కర్ణుడు ద్రోణుని ఉపాలంభించి యుద్ధానికి ప్రేరేపించే సమయంలో కృపాచార్యుడు

"... నీతి యుతులు సమర
మధమ సాధనముగ గాదుదు రర్థ సం
సిద్ధిఁ బొందు తెఱఁగు సేయునెడల" (విరాట. 4-207)

అని కర్ణుని మూర్ఖత్వాన్ని వారించి, దేశకాలాల ననుసరించి చేసిన యుద్ధం లాభం చేకూరుస్తుందని పలికి ప్రభువుకు విజయం చేకూర్చే అంశంలో తన అభిలాషను వ్యక్తం చేస్తాడు. సౌప్తిక పర్వంలో సుయోధనుడు అశ్వత్థామను కురుసైన్యాధిపతిని చేసిన తర్వాత ఇతడు సౌప్తిక ప్రళయానికి సిద్ధమైనప్పుడు కూడ కృపాచార్యుడు యుద్ధ విముఖంగానే మాట్లాడి ధృతరాష్ట్ర సుయోధనులు గతంలో చేసిన కార్యాలపై నిరసన భావాన్ని వ్యక్తం చేస్తాడు. క్రోధ లోభాలకు లోనైన కురుక్షితీశుడు దురభిమానంతో పంశచ్ఛేదానికి పూనుకొని నిందకు గురయ్యాడు, కనుక "దుశ్శీలుండగు భూనాథుండు పోయినట్టులె పోఁగాఁ పెగుడుం జేటు గలిగి వగ మిగుల్చు" (స్త్రీ. 1-39) అని సుయోధనుని దుశ్శీల ఎడ అసహనాన్ని ప్రదర్శిస్తాడు. కాని భావికర్తవ్యం గూర్చి ధృతరాష్ట్రుణ్ణి అడిగి తెలుసుకొందామంటూ

"అతడెయ్యది గని పలికిన నదియ మనకుఁ గర్తవ్యమగున్" (స్త్రీ. 1-41) అని పలికి ప్రభువైన ధృతరాష్ట్రునిపై గౌరవాన్ని ప్రదర్శించాడు.

**విదురుడు :** విదురుడు దాసి పుత్రుడే అయినా సోదరునిగా సకల గౌరవాలను పొంది ధృతరాష్ట్రుని జీవితంలో ప్రధాన వ్యక్తిగా వర్తిల్లాడు. పాండవ పక్షపాతి అని భారత విమర్శకు లెందరో భావించినా, సోదరునిపై ఎనలేని గౌరవ ప్రవృత్తులను ప్రదర్శించి కుటుంబ కలహాన్ని వారించేందుకు శాయశక్తులా ప్రయత్నించాడు. ఆ ప్రయత్నంలో అనేక పర్యాయాలు అగ్రజుని లోపాలను నిష్కర్షగా విమర్శించి, మరికొన్ని సందర్భాల్లో అతడి ఆగ్రహానికి కూడ గురి అయ్యాడు.

పాండవులకు అర్ధరాజ్య ప్రదానం చేయవలసిందని హితవు చెప్పే సందర్భంలో పాండవులు శక్తిమంతులనీ, వారి శక్తియుక్తులు సుయోధనాదుల బలంకన్నా కురుసామ్రాజ్యానికి అధిక బలం చేకూరుస్తాయని అంటాడు. వారు లాక్షాగృహంనుంచి తమను తాము రక్షించుకొన్న విషయం గుర్తుచేస్తూ వ్యంగ్యంగా "నీ పుణ్యంబున నమ్మహాత్ములు జననీ సహితంబు లక్కయింట బ్రతికిరి" (ఆది. 8-49) అని చెప్తాడు. ఈ సందర్భంలో 'నీపుణ్యము' అనే మాటలో నీవు చేసిన పాపకార్యం అని వ్యంగ్యం ద్యోతకం కాగా, వారు బ్రతికి నీకు రక్షణగా ఉండటం నీకు ఎంతో మంచిది అనే వాచ్యార్థం ద్యోతకం అవుతుంది. లాక్షాగృహ దహన ప్రయత్నం నికృష్టమైందని విరసించి, పాండవులకు అర్ధరాజ్య ప్రదానం చేయవలసిందని ఉపదేశిస్తాడు. విదురుని ఈ అభిప్రాయం నిష్కర్షగా ఉండి వంశం విచ్ఛిన్నం కాకుండ చూడాలనే అభిలాష వ్యక్తమౌతుంది. అట్లానే ద్యూత సమయంలోకూడ వంశ విచ్ఛేదం కాకుండ చూడాలనే తాపత్రయంతో సుయోధనుని మూర్ఖత్వాన్ని గూర్చి రహస్యంగా ధృతరాష్ట్రుణ్ణి హెచ్చరిస్తాడు. ఈ హెచ్చరికలలో కుమారుని తుచ్ఛత్వాన్ని ఉపేక్షించిన ధృతరాష్ట్రునిది కూడ దోషమే అనే అభిప్రాయం వ్యక్తమౌతుంది. విదురుడు "నీవు సపుత్రకుండవైన వైచిత్రవీర్య కౌరవ్యంబునకు హితంబైన నెగడుము" (సభా. 2-193) అని వెలిబుచ్చిన అభిప్రాయం ధృతరాష్ట్రుని వంశ శ్రేయస్సుపై అతని ఉత్కంఠను వ్యక్తం చేస్తుంది.

ఇట్లాంటి అభిప్రాయం కలిగిన విదురుడు కూడ కొన్ని సమయాల్లో ధృతరాష్ట్రుణ్ణి నిందించి తాను పాండవ పక్షపాతి అని అనుకొనేందుకు అవకాశం కల్పించాడు. ధృతరాష్ట్రునిచే అంతఃపురం నుంచి బహిష్కృతుడైన విదురుడు అరణ్యంలో ఉన్న ధర్మరాజును చేరి, ఉభయ పక్ష శ్రేయస్సును కోరి తాను చెప్పిన హితవచనాలు "సర్వ జన రుచికరంబైన యాహారంబు రోగాతురునకు నరుచి కరం బైన యట్ల యతనికి రుచింపదయ్యె" (అరణ్య. 1-58) అని ధృతరాష్ట్రుడు రాజ్య ప్రలోభమనే రోగంతో ఉన్నట్లు చెప్తాడు. ధృతరాష్ట్రుడు అల్పకార్య బుద్ధి కలవాడని, అందువల్లే "రూపలావణ్యవతియై వృద్ధ శ్రోత్రియుని చేతం బరిణీతయైన తరుణియుం బోలె రాజ్యలక్ష్మి యద్దురాత్మునందు విరక్తయ కాని ప్రీతిఁ బుట్టింపదు" (అరణ్య. 1-60) అని సోదరుని దురాత్మునిగా సంభావిస్తాడు. విదురుడు వెలిబుచ్చిన అభిప్రాయం పరోక్షంలో కనుక, అతని హృదయగతమైనదే నని తలంచవచ్చు. ధృతరాష్ట్రుని ఎడ విదురుని ఈ ఆక్రోశం వంశ క్షేమంకోసం చెప్పిన హితవచనాలు వినని మూఢుడు అనేకాని, శాశ్వత ద్వేషభావం వల్ల కాదని ఆ సోదరుల అనంతర అనుబంధం వల్ల వ్యక్తమౌతుంది.

ధృతరాష్ట్రుడు చిత్తస్వాస్థ్యం కొరవడినప్పుడల్లా విదురుణ్ణి పిలిచి మన శ్శాంతి కలిగే మాటలు చెప్పించుకొనేవాడు. సంధి విషయంలో ధర్మరాజు ఆంతర్యం తెలియక తల్లడిల్లిన మనసుతో ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిపిస్తాడు. విషయం విన్న విదురుడు బలవంతుడు దండెత్తి వచ్చిన సందర్భంలో బలహీనునకు, ధనము కోల్పోయిన వానికి, దొంగిలించే బుద్ధి కలవానికి, కామాతుల చిత్తుడైన వానికి నిద్రరాదు అంటూ 'నీకు నిద్ర చెడటానికి

"ఇక్కొక్కఁ డగాముల లోపల
నెక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ యొరు సొ
మ్మెక్కటి గుడువఁ దలంచితొ
నిక్కము గతమేమి సెపుము" (ఉద్యోగ. 2-22)

అని ధృతరాష్ట్రుని హృదయంలో దూరి మనసును చదివినట్లు మాట్లాడతాడు. విదురుని మాటల్లో చిత్తశుద్ధితో కూడిన నిష్కర్ష వ్యక్తమౌతుంది. ధర్మరాజు హృదయం తెలియక పోవటమే నిద్రాభంగానికి కారణం అని ధృతరాష్ట్రుడు అన్నప్పుడు, విదురుడు తండ్రీ కొడుకులు పాండవులను కష్టాలపాలు చేశారని దూషిస్తాడు. తండ్రీ కొడుకులు శకుని కర్ణ దుశ్శాసనుల మాటపైనే నడుస్తారంటూ

"తము దారెఱుగుట, వేగప
డమి దాలిమి విడుపు గలుగుటయు లేని ప్రభు
త్వము గలదె" (ఉద్యోగ. 2-27)

అని ఉత్తమ ప్రభువు లక్షణాలను వివరించి, ఇతరుల సలహాలపై గ్రుడ్డిగా వర్తించే వీరికి ఈ లక్షణాలేమీ లేవనే అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. ఇంకా యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రుణ్ణి తండ్రిగానే సంభావిస్తున్నప్పటికీ, ఈ పెద తండ్రే ఆ గౌరవం కాపాడుకోవటం లేదని నిందిస్తాడు.

విదురుడు అగ్రజుని పేరాశను, రాజ్యలోభాన్ని తమ్ముని కుమారుల ఎడ అతని దుశ్చేష్టను నిశితంగా విమర్శిస్తూ, పాండవుల రాజ్యాన్ని కబళించాలని చూడటం ఎరను తినాలనే ఆశతో గాలాన్ని మ్రింగటం లాంటిదని చెప్తూ "ఉక్కివు డైన నీ కొడుకు మల్లమునున్నటు లాడగూడనే" (ఉద్యోగ. 2-52) అని ధృతరాష్ట్రుని ముఖ్యమైన లోపాన్ని బహిర్గతం చేస్తాడు. ఆ లోపం వల్లనే కొడుకులు నోటికి వచ్చినట్లు ప్రేలినా మౌనంగా అంగీకారాన్ని తెలుపుతాడని విదురుని అభిప్రాయం. ఇంకా

"అన్నింటి కంటె మేలైన శాంతి
కారణము లోభముడుగుట కౌరవేంద్ర"

(ఉద్యోగ. 2-84)

అని ఆ రాజు లోభ దృష్టిని ఎత్తి చూపుతాడు. అట్లానే రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణుణ్ణి అసూహ్యమైన అతిథి సత్కారంతో ప్రలోభ పెట్టి సంధికార్యం సాను

కూలం చేసుకోవాలనే తలంపు వెల్లడించినప్పుడు విదురుడు 'సితలపేను గంటి' అని సోదరుని లోభదృష్టిని నిరసించి లంచం ఇచ్చి కృష్ణుణ్ణి లొంగ తీసుకోవటం సాధ్యం కాదని చెపుతాడు.

పాండవ కార్యార్థమై కౌరవ సభకు రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణుడు విదురుని ఇంట్లో విడిది చేసిన సందర్భంలో సుయోధనుని ధూర్తత్వాన్ని గుర్తుచేసి 'ఈ అల్పకార్యం కోసం నీవు రాతగినది కాదని' అంటాడు. అదే సమయంలో కౌరవ సభలో ఉన్నవారు "వెడంగులగుటం గార్య వచనంబు లెఱుంగరు, మొఱకులగుటం బ్రతాప భాషణంబులకు వెఱవరు, వారల తలంపులు గీడు" (ఉద్యోగ. 3-235) అని వివరిస్తాడు. ధృతరాష్ట్రుని సభలోని వారిపై విదురుని అభిప్రాయం ఆ మహారాజుపై తప్పకుండ ప్రతిబింబిస్తుంది. ఈ విధంగా విదురుడు సోదరుని సమక్షంలోను, పరోక్షంలో కూడ వెలి బుచ్చిన అభిప్రాయాలన్నీ కూడ ధృతరాష్ట్రునిపై ద్వేషభావంతో కాకుండ, ఎట్లాగయినా కురువంశం విచ్ఛేదం కాకుండ కాపాడాలనే ఆశతోనేనని గమనించటం ఉచితంగా ఉంటుంది.

**సంజయుడు :** సంజయుడు ధృతరాష్ట్రునకు అత్యంత సన్నిహితుడైన సచివుడు. రాజోద్యోగి అయినప్పటికీ ఆ మహారాజు జీవితంలో ఎంతో ప్రాధాన్యం వహించిన వ్యక్తి. ప్రభువు ఆంతర్యం తెలుసుకొని, తదనుగుణంగా ప్రవర్తించి ప్రభుకార్యం తీర్చటంలో పట్టుదల గల కార్యదక్షుడు. కేవలం ఉద్యోగధర్మంగానేకాక, ధృతరాష్ట్రుని ఆలోచనలు వక్రమార్గాన నడుస్తున్నాయని అనిపించిన సందర్భాలలో ఆంతరంగికునిగా, హితునిగా ఆ రాజును సంస్కరించాలని చిత్తశుద్ధితో ప్రయత్నించిన హితైషి. భారత యుద్ధ విశేషాలన్నీ ధృతరాష్ట్రునకు తెలిపి జీవితాంతం అతణ్ణి వెన్నంటి ఉన్న ప్రభుభక్తి తత్పరుడు. ఇతడు కూడ విదురాదుల లాగా కురువంశం ఐక్యత, క్షేమం ఎడ ఎంతో అపేక్ష ఉత్కంఠ కలవాడు.

సంజయుడు మొట్ట మొదటగా అరణ్య పర్వంలో కనిపిస్తాడు. ధృతరాష్ట్రుని ఆగ్రహానికి గురి అయిన విదురుడు కామ్యకవనంలో ఉన్న పాండవుల వద్దకు పోయినప్పుడు అతణ్ణి తీసుకురావటానికి సంజయుడు వెళతాడు. అక్కడ సంజయుడు ధర్మరాజుతో "మిమ్మును ధర్మార్థ నిమంద్రైన విదురుని గౌరవేంద్రుం

దెప్పుడుం దలంచుచుండు" (అరణ్య. 1-67) అని చెప్పటం ప్రభువైన ధృతరాష్ట్రుని బంధుప్రీతిపై అతడి సాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తుంది. పరోక్షంలో ఆ మహారాజుపై ఇంత భక్తిని ప్రదర్శించిన సంజయుడే, కొన్ని సందర్భాల్లో ఆ రాజు నిర్ణయాలు పెడత్రోవన నడుస్తున్నాయని తలచినప్పుడు నిశితంగా విమర్శించే వాడు. అరణ్య వాసం గడిపే అర్జునుడు అనేక అస్త్రాలను సంపాదించాడని విన్న ధృతరాష్ట్రుని హృదయం తల్లడిల్లి, సుయోధనుడు పాండవులతో వగ పెంచుకొని బంధుజనానికి, రాజులకు హాని తెచ్చి పెట్టాడని వాపోతాడు. ఆ సందర్భంలో సంజయుడు, ఇంతటి అనర్థానికి ఆ మహారాజు ఉపేక్షే కారణమని స్పష్టంగా చెప్తాడు. సుయోధన దుశ్శాసనాది వీరులు పాండవులను సభలో అవమానిస్తుంటే, వారిని శాసించి ఆ ప్రయత్నంనుంచి మాన్పలేని "నీయుపేక్షం జేసి దుర్యోధన దుర్ద్యూత పరాజితులై రాజ్యంబు విడిచి పాండవులరిగిరి" (అరణ్య. 1-384) అని అతడి ఉదాసీనతే అనర్థ కారణమని నిరసిస్తాడు.

ఉద్యోగ పర్వంలో పరోక్షంలోను, ప్రత్యక్షంలోను సంజయుడు ధృతరాష్ట్రునిపై వెలిబుచ్చిన అభిప్రాయాలు అతని ఉత్తమ సచివత్వానికి తగిన విధంగా ఉన్నాయి. స్నేహపూర్వకమైన ప్రియభాషణాలతోనే ప్రభుకార్యం నెర వేర్చే బృహత్తర భారం నెత్తిన వేసుకొని ధర్మరాజును చేరిన సంజయుడు "అస్తోక పుణ్య ధనుడు మీ తండ్రి ధృతరాష్ట్ర ధరణినాథు" (ఉద్యోగ. 1-273) అని ధృతరాష్ట్రుని పెద్దరికాన్ని సంభావించిన తీరు రాయబారి వ్యక్తిత్వాన్ని పెంపొం దించే విధంగా ఉంది. ధర్మరాజు పెదతండ్రి చిత్తశుద్ధిపై సందేహం వెలిబుచ్చిన సందర్భంలో సంజయుడు

"ధృతరాష్ట్ర భూపతికి వృ
ద్ధత కతమునఁ జిత్తమొక విధముగామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు మనః
క్షతి పిదపం బుట్టి యిపుడు శాంతుండయ్యెన్"
(ఉద్యోగ. 1-284)

అని ధృతరాష్ట్రుని లోపాన్ని ఎత్తి చూపుతూనే, పాండవుల ఎడ ఆ రాజు సుహృ ద్భావాన్ని వెల్లడించేందుకు ప్రయత్నిస్తాడు. ధృతరాష్ట్రుని పరంగా పాండవ సభలో సంజయుడు వెలిబుచ్చిన అభిప్రాయం ఆ మహారాజు అంతస్తును పెంచేదిగా ఉంది.

ఉపప్లావ్యం నుంచి తిరిగివచ్చిన వెంటనే ఏకాంతంలో ధృతరాష్ట్రుణ్ణి కలిసి సంజయుడు వెలిబుచ్చిన అభిప్రాయాల్లో సునిశితమూ, ప్రభుహితమూ అయిన దృష్టి ద్యోతకమవుతుంది. పాండవుల యోగక్షేమాలు చెప్పిన తరువాత ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని, ఉపేక్షాభావాన్ని నిరసిస్తాడు. అనంతరం కురుసభలో తన రాయబారం విశేషాలను వివరించేటప్పుడు, ధర్మరాజు ఎవరి సహా యంతో కురుసైన్యాలను జయించ దలచుకొన్నాడని ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి ప్రశ్ని స్తాడు. పాండవబలాన్ని తెలుసుకోవాలనే ఆ మహారాజు ఉత్కంఠకు దిగ్భ్రాంతి చెందిన సంజయుడు తేరుకొని "అక్కటా! ఈ భూపాలుడింత బేలయగునే యుధిష్ఠిరుండెవ్వరిఁగొని యెత్తివచ్చువాడని యడుగుచున్న వాడింత యెఱుంగని వాడెంత సెప్పినను దెలియనేర్చునే, యితని భంగి యిట్టిదనినఁ గొడుకుల తెఱంగు వేఱ యెన్ననేల" (ఉద్యోగ. 2-169) అని ఆ తండ్రీకొడుకుల మూర్ఖత్వానికి జాలిపడి, ధృతరాష్ట్రుని ఉపేక్షా భావానికి నిరసన వ్యక్తం చేస్తాడు. సభ ముగిసిన తరువాత సుయోధనుని సమక్షంలో ఈ సందేహాన్ని తీర్చుకొనే ఉద్దేశంతో ధృతరాష్ట్రుడు కౌరవ పాండవ బలా బలాలను వివరించ వలసిందని సంజయుణ్ణి అర్థిస్తాడు. ఆ ప్రశ్నకు సమాధానం ఒంటరిగా కాకుండ వ్యాసుని సమక్షంలో విన వలసిందని, ఒకవేళ పాండవ శక్తిని విని

"నీ కసూయాదు లొదవెనేని
పూని మాన్పంగ నేర్తురు మానవేంద్ర"

(ఉద్యోగ. 2-304)

అని చెప్తాడు. సంజయుని ఈ అభిప్రాయంలో అతడు ధృతరాష్ట్రుణ్ణి అసూయా పరునిగా భావిస్తున్నట్లు తెలుసుకోవచ్చు. అట్లానే ఉలూకుడు ధర్మరాజుతో పలికిన మాటలు విన్పించేటప్పుడు కూడ ధృతరాష్ట్రుని ప్రమేయం లేకుండ సుయోధను

దొక్కడే పాండవులను హింసించ లేదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతాడు. మొత్తం మీద ధృతరాష్ట్రుని రాజ్య లోభము, ఉపేక్షా భావం కురుపాండవ కలహానికి ప్రధాన కారణంగా సంజయుడు భావించినట్లు తెలుసుకోవచ్చు.

కురుక్షేత్రంలో యుద్ధం ప్రారంభమైన సమయంలో, కురుపాండవులు లుబ్ధబుద్ధులై యుద్ధానికి పాల్పడ్డారని ధృతరాష్ట్రుడు పలికిన సమయంలో, ధర్మ రాజుకు రాజ్యలోభం లేదని, జూదసమయంలో ఆ రాజు ఉపేక్షే యుద్ధానికి కారణ మని సంజయుడు నిందిస్తాడు. భీష్ముని మరణం విని దుర్వినీతుణ్ణని ఆత్మనిందకు లోనైనప్పుడు సంజయుడు ఆ మహారాజును సాంత్వన వాక్యాలతో అనునయించ వలసింది పోయి

"అధిప నీవు సెప్పినట్టిద నీ యువి
నీతిఁ జేసి ధర్మ నిరతులైన
పాండుసుతుల కన్నిపాటులు వాటిల్లె
నింత దెచ్చి కొంటి వంతసేసి" (భీష్మ. 1-69)

అని అతడు అవినీతి పరుడనే అభిప్రాయాన్ని బలపరుస్తాడు. ఇంకా "నీ తప్పునఁ బాటిల్లిన చేటునకు శోకింపం బనిలేదు" (భీష్మ 3-32) అని అంటాడు. సంజ యుని ఈ అభిప్రాయం కుటుంబం హితాన్ని కోరి పెద్దలు ఎంత చెప్పినా విన నందుకు ఫలితం అనుభవిస్తున్నారనే ఆవేదనతో పలికిందిగా తలంచటం సమంజసం. అంతేకాని ధృతరాష్ట్రుని ఎడ సంజయునకు ద్వేషభావం ఉన్నదని చెప్ప వీలులేదు. "మీరు తగువారు సేయు హితోపదేశంబు లాచరించెదరె" (భీష్మ. 2-273) అన్న సంజయుని పలుకులు అతడి స్నేహభావాన్ని, ప్రభుహితం ఎడ ఆవేదనను వ్యక్తం చేస్తున్నాయి.

యుద్ధం కొనసాగేకొద్దీ స్వపక్ష పరాజయాలకు ధృతరాష్ట్రుని హృదయం దుఃఖోద్వేగంతో క్షోభించి కొన్ని సందర్భాల్లో మనసు వశంతప్పి ఉన్మత్తునిలాగా ప్రవర్తిస్తూ కుమారులను, తనను కూడ నిందించుకొనేవాడు. అట్లాంటి సంద ర్భాల్లో సంజయుడు ఆ విలాపమంతా గత జలసేతు బంధనమేననీ, మాయాజూదం

ఆపుచేయలేని ఆరాజు లుబ్ధుడు, అవినీతిపరుడని ప్రజలు నిరసిస్తున్నారని చెప్పి "తనయు మీద దెట్టిదేల నీ కుర్కీర్తి పుట్టవచ్చె" (ద్రోణ. 3-29) అని ధృతరాష్ట్రుడే దుష్టమైన రాజనీతిని ప్రదర్శించాడని అంటాడు. ఈ విపత్కర స్థితిలో దుఃఖించటం "విష మెత్తిక్రోలి యది యంగము నారటపెట్ట నమ్మ్యలం గిని సిన యట్ల" (ద్రోణ. 4-209) ఉన్నదని పలుకుతాడు.

ద్రోణుడు ధృష్టద్యుమ్నునకు ఓడిన విషయం చెప్తూ "శతవృద్ధుండగు నయ్యస్త్రగురుండు నీదుర్మంత్రంబునం ద్రుంగిపోయిన" (ద్రోణ. 5-324) అని ధృతరాష్ట్రుని దుర్మంత్రమే గురుని మరణానికి కారణమని నిందిస్తాడు. కర్ణుడు మరణించిన విషయం తెలియజేసేటప్పుడు కూడ కుమారులు పాండవరాజ్యాన్నంతటినీ జయించే శక్తిమంతులనే పరాశతో వారి అవినయాన్ని ఉపేక్షించిన ఫలితమే యుద్ధ పరాజయమని చెప్తాడు. ఈ సందర్భంలోనే "నీవు సేసిన యదియచూవె ఫలించె; ఖండనంబు వలదని యెన్ని భంగులం జెప్పినం బాండవులకుం గీడు దలంచి, యప్పలుకులు గొనవైతివి; వారు వలన మున్నెనేక పాపంబు లాచరించితి, నీవలన సర్వజన క్షయంబువాటిల్లెం గావునం గడపం బడిన దానికి వగవంబని లేదు" (కర్ణ. 1-226) అని ఇదంతా స్వయంకృతాపరాధమనే అభిప్రాయాన్ని వెలి బుచ్చుతాడు.

కురువంశం నాశనానికి ధృతరాష్ట్రుని దుష్టనిర్ణయాలే కారణమని విర సించినా, స్వపక్ష నాశనానికి గురవుతున్న మహారాజుపై ఆత్మీయంగా సానుభూతిని వ్యక్తం చేస్తాడు. సుయోధనుడు ఒంటరిగా యుద్ధరంగం నుంచి తొలగిపోయాడని దుఃఖించి వివశుడైన ఆ రాజును చూసి "దైవమెవ్వరి నెట్లు చేయఁజాలం దేమి సెప్పఁగలదు" (శల్య. 2-5 అని సానుభూతిగా మాట్లాడతాడు. ఇంకా 'శ్రుతులు, శాస్త్రాలు చదివిన నీవు పుత్రుల కోసం దుఃఖించటం తగదు, శాంతి పొందవలసిందని హితవు చెప్తాడు. ఈ విధంగా సంజయుడు ప్రభుకార్య తత్ప రుడై, రాజు తప్పుత్రోవన పోతున్నాడని చినప్పుడు తీవ్రంగా విమర్శించినా, కురువంశ వర్ధనం ఎడ ఏకాగ్రచిత్తుడై తదనుగుణంగా ప్రవర్తిస్తూ వచ్చి కౌనేటట్లు యత్నం చేసినట్లు స్పష్టం అవుతుంది.

**గాంధారి :** గాంధారి ధృతరాష్ట్రుని పట్టమహిషి. జీవితమంతా భర్తకోసం చూపును త్యాగం చేసిన దొడ్డ యిల్లాలు. జీవితంలో ఏ సందర్భంలోను తానుగా తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసే ప్రయత్నం చేయలేదు. కాని ఏ విషయంలోనైనా తన అభిప్రాయం అడిగినప్పుడు మాత్రం నిర్ద్వంద్వంగా సత్యం అనిపించిన అంశాన్ని ప్రకటించేది. రాయబార సమయంలో శ్రీకృష్ణుడు చెప్పిన హితోక్తులు విని సుయోధనుడు తల్లి చెప్పితేనన్నా వింటాడనే ఉద్దేశంతో ధృతరాష్ట్రుడు గాంధారిని పిలిపిస్తాడు. సభకు వచ్చిన గాంధారి కురుపాండవోద్యోగంలో ధృతరాష్ట్రుడే ప్రధానం కాని, కుమారుడు కాదనే అభిప్రాయం వ్యక్తం చేస్తూ, ఆ మహారాజు పాండవులకు రాజ్యభాగం ఇస్తే ప్రశ్నించే అధికారం ఎవరికీలేదని నిష్కర్షగా పలుకుతుంది. గాంధారి అభిప్రాయం ధృతరాష్ట్రుని బలహీనతపై విమర్శగా ద్యోతకం అవుతుంది. మొత్తం మీద ఆమె జీవితమంతా భర్తకు అనుకూలంగా, ఉత్తమ పతివ్రతా శిరోమణియై వర్ధిల్లింది.

**శ్రీకృష్ణుడు :** శ్రీకృష్ణుడు భారత కథాకాలంలో ప్రధాన రాజవంశాల్లో ఒకటైన యాదవ వంశంలో ప్రముఖ వ్యక్తి. పాండవులు ఇతడికి మేనత్త కుమారులు. బంధుత్వం రీత్యాను, అర్జునునితో ఉన్న స్నేహం రీత్యాను పాండవ కార్యం సాధించే విషయంలో తోడ్పడినప్పటికీ, కురుపాండవులు ఉభయులకు కావలసిన వాడుగా కనిపించేందుకు ప్రయత్నించాడు. కాని భారతంలో కృష్ణుని ప్రవర్తన నిష్పక్షపాతంగా ఉన్నట్లు కనిపించక కొంత విమర్శకు లోనయింది.

మహాభారతంలో శ్రీకృష్ణుడు మొట్టమొదటిసారి ద్రౌపదీ స్వయంవరంలో కనిపిస్తాడు. అర్జునుడు మత్స్యయంత్రాన్ని భేదించి ద్రౌపదిని తీసుకొని తల్లి దగ్గరకు పోయిన తర్వాత శ్రీకృష్ణుడు పాండవులను కలిసి "అధర్మ నిరతులగు ధృతరాష్ట్ర దుర్యోధనులు చేసిన లాక్షాగార దాహ ప్రయోగంబు వలన విముక్తులయితి రెంక మీకు లగ్గగను" (ఆది. 7-222) అని చెప్పి పాంచాల బంధుత్వం వల్ల వారికి శుభం సమకూరుతుందని ఆశీర్వదిస్తాడు. ఈ సందర్భంలో ధృతరాష్ట్రుణ్ణి అధర్మనిరతుడని నిందించటం గమనార్హం. అరణ్యవాసంలో ఉన్న పాండవుల చెంతకు సత్యభామా సహితుడై వచ్చిన కృష్ణుడు కుశల ప్రశ్నలువేస్తూ అంధక, భోజ, వృష్ణి వంశీయులంతా వారి పక్షానే ఉన్నారని, అందువల్ల 'లోట

మోహాంధులైన ధార్తరాష్ట్రులు' వారిని ఎదిరించలేరని ధర్మరాజుకు ధైర్యం చెపుతాడు. కృష్ణుని ఈ అభిప్రాయం ధృతరాష్ట్రునకు కూడ వర్తిస్తుందని తలంచవచ్చు.

ఉద్యోగ పర్వంలో శ్రీకృష్ణుడు పాండవ హితార్థియై వారికి అండగా నిలిచి సంధి యత్నం పొసగటానికి వీలులేని రీతిగా ప్రవర్తించినట్లు పూర్వ ప్రకరణాల్లో తెలుసుకోవటం జరిగింది. ఉద్యోగ పర్వంలో ధృతరాష్ట్రుని ఎడ వ్యక్తం చేసే అభిప్రాయాలు కొన్ని ఆ రాజు కోపాలను ఎత్తిచూపేవే అయినప్పటికీ, అనేకం ఏకపక్షంగానే కనిపిస్తాయి. రాజ్యభాగం కోసం ప్రయత్నించే ధర్మరాజు తమ పక్షాన ధృతరాష్ట్రుని చెంతకు పోవలసిందని కృష్ణుణ్ణి అర్థిస్తూ సుయోధనాదులు కుటిలమతులు, అవినీతులు, క్రూరకర్ములు, నీచులు అని పేర్కొన్న సమయంలో, సమాధానంగా కృష్ణుడు "ఆ ధృతరాష్ట్రుడు నట్టివాఁడ తత్తనయుడ యేల" (ఉద్యోగ. 3-30) అని తండ్రి కూడ అలాంటి వాడేననే అభిప్రాయం వెలిబుచ్చుతాడు. సంధి ప్రయత్నాలకు విఘాతంగా పుత్రవ్యామోహ లోభదూషితుడైన ధృతరాష్ట్రుడు కుమారుణ్ణి వారించక ఉపేక్ష వహించినట్లయితే ప్రజలంతా నిందిస్తారని అంటాడు. హస్తినాపురం ప్రయాణానికి అన్నీ సిద్ధమైన సమయంలో కృష్ణుడు "దుర్యోధనుండు దుష్టాత్మకుండతని మన్నించు మానిసులునుం గుటిల బుద్ధులు" (ఉద్యోగ. 3-132) అని చెప్పి రథంలో ఆయుధాలను పెట్టిస్తాడు. కృష్ణుని ఈ అభిప్రాయం ధృతరాష్ట్రునకు కూడ వర్తిస్తుందని తలంచవచ్చు.

హస్తినాపురం వచ్చిన కృష్ణుడు సుయోధనుని ఇంట్లో విందుకు తిరస్కరించి స్వయంగా పాండవాభిమానాన్ని వెల్లడిస్తాడు. కౌరవ సభలో కృష్ణుడు పలికిన మాటలు కూడ సంధికి ప్రోత్సాహంగా కనిపించవు. పాండవులను పిలిచి సుయోధనాదులతో సమానంగా గౌరవించ వలసిందని చెప్తూ, ధృతరాష్ట్రుడు పాండవుల ఎడ ఉపేక్ష వహిస్తున్నాడనే అభియోగం తెస్తాడు. కౌరవ సభలో సుయోధనుడు దూతను బంధించే ప్రయత్నం చేసిన సమయంలో కృష్ణుడు 'ఈ దుర్యోధనుడింత గర్వి యగునే' అని నిందించి, సభాసదులకు "వర్జింపరాదే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ గోదే ఖేద మీ జాతికిన్" (ఉద్యోగ. 3-378) అని సూచన

చేస్తాడు. కృష్ణుడు ఈ సమయంలో వచ్చిన కోపాన్ని, ఆ తర్వాత వీడ్కోలు పలుకుతూ ధృతరాష్ట్రుడు తన నిర్దోషిత్వాన్ని వ్యక్తం చేసినప్పుడు కూడ, బహిర్గతం చేసి దోషం ధృతరాష్ట్రుని పైనే వేస్తాడు. కౌరవ సభలో జరిగిన విశేషాలను ధర్మరాజుకు వివరించేటప్పుడు కూడ ధృతరాష్ట్రుని ఉపేక్షాభావం, పుత్రవ్యామోహం ఎడ నిరసన ధ్వనిస్తుంది.

కురుపాండవ సంధి యత్నం విఫలమై, కురుక్షేత్ర యుద్ధంలో సమస్తం కోల్పోయిన ధృతరాష్ట్రునకు శోకోపశమనం కలిగించే ప్రయత్నం కూడ కృష్ణుడే చేశాడు. పుత్రశోక దుఃఖితుడైన ధృతరాష్ట్రుణ్ణి ఓదారుస్తూ ఇదంతా స్వయంకృతాపరాధమని, పాండవులకు ఐదూళ్లు ఇవ్వమన్నా ఇవ్వకుండ

"... నీ కొడుకు లెమ్మెయి మానర లోభగర్వముల్
నీవును నట్లకాక మహనీయమతుల్ విదురాది బాంధవుల్
వేవురు సెప్పరే యధిప వింటె తగం బలుకొక్కడేనియున్"
(శల్య. 2-367)

అని తండ్రీకొడుకుల దుర్మార్గ వర్తనాన్ని వివరించి, దుఃఖోపశమనం పొందవలసిందని అంటాడు. అట్లాగే స్త్రీ పర్వంలో ధృతరాష్ట్రుడు భీముణ్ణి సంహరించాలనే ఉద్రేకానికి లోనైనప్పుడు కృష్ణుడు ఆ మహారాజు 'దురాత్ముడు' అని అభిప్రాయపడతాడు. అదే సందర్భంలో కురువృద్ధులు, తాను, మునులు ఎన్ని చెప్పినా వినకుండ కుమారుని త్రోవనే పోయిన దాని ఫలితమే యుద్ధ పరాజయం అంటూ

"నీ యుల్లంబొక నియతిం గార్యౌ
బాయత్తంబుగ నను నంధింపం
జేయం జాలవు చెడు తెర్వం బోఁ
బాయం ద్రోవవు బలిమిం బుత్రున్" (స్త్రీ. 1-145)

అని ధృతరాష్ట్రుని అనిశ్చిత మనస్తత్వాన్ని, పుత్రవ్యామోహాన్ని బహిర్గతం చేస్తాడు. అంతటితో ఆగక "నీ యవినీతియుం గొడుకుల దుశ్చరిత్రంబును దలంచి శోక

రోషంబులు విడిచి శాంతుండవై యుండుము" (స్త్రీ. 2-147) అని ఆ రాజు అవినీతిని ఎత్తిచూపుతూనే సాంత్వనపరచే ప్రయత్నం చేస్తాడు.

ఈ విధంగా శ్రీకృష్ణుడు కురుపాండవ కలహంలో పాండవ పక్షం వహించి, వారి ప్రయోజనం కోసమే రాజతంత్రాన్ని నడపి, ధృతరాష్ట్రసుయోధనులు సంధికి అంగీకరించటానికి వీలులేని పరిస్థితులు కల్పించి, ఆ తండ్రీకొడుకుల చేష్టలను మిగిలిన భారత పాత్రలతో పాటు లోకం కూడ నిరసించే విధంగా ప్రవర్తించాడు.

**ధర్మరాజు :** ధర్మరాజు మహాభారత కథలో ఇంద్రప్రస్థం రాజధానిగా కురుసామ్రాజ్యంలో సగభాగానికి అధిపతి. ఇతడు ధృతరాష్ట్రునకు సోదరుని కుమారుడు. పరిస్థితుల ప్రాబల్యంవల్ల పెదతండ్రితో విరోధం ప్రబలి కురుక్షేత్రంలో యుద్ధంగా పరిణమించింది. ధర్మరాజు అనేక సందర్భాలలో ధృతరాష్ట్రునిపై భక్తిభావం ప్రదర్శించినా, రాజకీయంగా ఆ మహారాజును సన్నిహితులందరు నిరసించే విధంగా రాజనీతి నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాడు.

ద్రౌపదీ వివాహం తరువాత ధృతరాష్ట్రుని పనుపున విదురుడు పాండవులను హస్తినాపురం తీసుకొని పోయేందుకు పాంచాల నగరం వచ్చినప్పుడు, యోగక్షేమాలడుగుతూ ధర్మరాజు పెదతండ్రిని 'రవినిభతేజుడు' అని సంభావిస్తాడు. సుహృద్ద్యూతానికి ఆహ్వానించేందుకు ఇంద్రప్రస్థం వచ్చిన విదురుణ్ణి సత్కరించి హస్తినాపురంలోని వారి కుశలం అడుగుతూ "పుత్రవత్సలుడు విచిత్రవీర్యాత్మజుఁ డార్యుడు" (సభా. 2-157) అని ధృతరాష్ట్రుని సంభావించిన తీరు వ్యంగ్య ద్యోతకమై ఉంది. 'పుత్ర వత్సలుడు' అంటే సుయోధనాదులయందు మాత్రమే వాత్సల్యం కలవాడని ధర్మరాజు మాటల్లో ధ్వనిస్తుంది.

అరణ్యవాసంలో ఉన్న ధర్మరాజును పరామర్శించేందుకు వచ్చిన మునులను సత్కరిస్తూ, 'అధర్మపరుల' వల్ల తమకు ఆపదలు సంభవించాయని అంటాడు. అట్లానే అజ్ఞాతవాసం విరాట నగరంలో గడపటానికి నిర్ణయం తీసుకొనే సందర్భంలో కూడ ధర్మరాజు తమకు ఆపదలు సుయోధనుని కుటిల చేష్టల

వల్లే వచ్చాయని అంటాడు. సుయోధనుని కుటిల చేష్టలకు ధృతరారాష్ట్రుని అను మతి ఉన్నదని ధర్మరాజు విశ్వాసం కావచ్చు.

ఉద్యోగ పర్వంలో తనకు రాజ్యాధికారం ఉన్నదనే అంశం మెలకువతో రూఢి పరచుకొంటూ, ధర్మరాజు సంధి వైఫల్యానికి నేరమంతా ధృతరాష్ట్రునిపై వేయటానికి తన రాజనీతి వైశారద్యాన్నంతా ప్రదర్శిస్తాడు. కౌరవ పక్షాన రాయబారిగా వచ్చిన సంజయునితో ధర్మరాజు ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని, కాపట్యాన్ని, అవినీతిని సున్నితంగా బయట పెడతాడు. రాజోచితమైన నిత్య కృత్యాల నుంచి తమను వెలిచేశారనీ, ద్యూత సమయంలో ధృతరాష్ట్రుడు వక్ర బుద్ధితో వర్తించాడనీ, అతడు నీతి వర్తనులైన వారి పలుకులను ఎన్నడూ స్వీకరించడని అంటూ

"తగుమాట లాంబికేయుం
డగునని కైకొనునె యెన్నఁడైనను గొడుకన్
మగఁటిమి గలఁడనియెడు న
మ్మిగఁ జూచుచు నుండు విషము ద్రింగిన యేనిన్"

(ఉద్యోగ. 1-315)

అని ఆ రాజు పుత్రవ్యామోహం బలవత్తరమైందని అంటాడు. ఇక ముందుకూడ ధృతరాష్ట్రుడు పుత్రులు, శకుని, కర్ణుడు చెప్పిన విధంగానే వర్తిస్తాడు కాని స్వయం నిర్ణయం చేయలేడని అంటాడు. ఉపప్లావ్యం నుంచి తిరుగు ప్రయాణమయ్యే సంజయునితో ధృతరాష్ట్రునకు దండప్రణామంబు లర్పించమని చెబుతూ, ఇప్పటికైనా ఉపేక్షాభావం విడనాడి తమను చేరదీయవలసిందిగా చెప్పవలసిందని కోరతాడు. ధృతరాష్ట్రుడు తమ యందు ఉదాసీనంగా ఉన్నాడని ధర్మరాజు మాటల్లో వ్యక్తమవుతుంది.

అనంతరం శ్రీకృష్ణుణ్ణి కౌరవ సభకు రాయబారిగా పంపేటప్పుడు ధర్మరాజు ధృతరాష్ట్ర సుయోధనుల గూర్చి కొన్ని అభిప్రాయాలు వ్యక్తం చేస్తాడు. ధృతరాష్ట్రుడు మాటలతో తృప్తిపరచాలని చూస్తున్నాడనీ, తమకు రాజ్యభాగం ఇవ్వకుండా ఉండటం అన్యాయమే అవుతుందంటూ

"కులము పొడి నడపఁ దలఁపడ పతిసెడఁ
దలచెనేనిఁ గొడుకు వలచినట్టి
వాడుగాన యతని వక్రత మాన్పలేడు" (ఉద్యోగ. 3-9)

అని ధృతరాష్ట్రుని బలహీనతను వ్యాఖ్యానిస్తాడు. ఇంకా ధృతరాష్ట్రుడు 'సుతు వాడై సంధికార్యాన్ని వినయంతో అంగీకరించడు. ఏ అభిప్రాయాన్ని చెప్పని దుర్నీతి పరుడు' అని అంటాడు. దుర్నీతిపరులు, కుటిలమతులు క్రూర కర్మలచే పరివేష్ఠించబడ్డవాడు కనుక ఆ రాజు చేసే నిర్ణయాలు కూడ వంశ విచ్ఛేద కరంగా ఉంటాయనే అభిప్రాయానికి వస్తాడు. ధర్మరాజు వ్యక్తంచేసే ఈ అభిప్రాయాల్లో శత్రుభావమే కాని ఆదరభావం కనిపించదు.

ధర్మరాజు ధృతరాష్ట్రుల రాజనీతి ఫలితంగా కురుక్షేత్ర యుద్ధంలో వంశ నాశనం జరిగింది. ఉభయులకు శోకమే మిగిలింది. ఆ సమయంలో కూడ

"ధృతరాష్ట్రుండు దనూజు కీడు నమబుద్ధిం జూడ కన్నిచు దే
గతి జన్నం జననిచ్చెఁగాని మగుడంగా దివ్వడయ్యెన్"
(శాంతి. 1-46)

అని ఉభయుల శోకానికి ఆ ఉపేక్షే కారణం అని అభిప్రాయపడ్డాడు. హస్తినా పురంలో కురుసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడైన ధర్మరాజు పౌరజానపదులందరికీ తండ్రియు గురువును దైవంబు నీతడ' అని పరిచయం చేసి, అతణ్ణి గౌరవిస్తే తనను సంభావించినట్లేనని పలుకుతాడు. ఇంకా ధృతరాష్ట్రుణ్ణి సేవించటానికే రాజ్యాభి షిక్తుణ్ణి అయ్యానంటూ

"జ్ఞాతివధ మట్లు సేసియు
నీతని గొల్చుటకుఁగాగ నీ గృహ ధర్మో
పేతత్వము బొరసితి భూ
భూతికి మనకు విభుడీ ప్రభువ మఖవటుడీ" (శాంతి. 1-377)

అని పెదతండ్రి ఎడ గౌరవాదరాలతో కూడిన పూజ్యభావం వ్యక్తం చేస్తాడు. ఆశ్రమ వాసం ప్రయాణమయ్యే ముందు మరణించిన కురువీరులకు శ్రాద్ధకర్మలు నిర్వర్తించటానికి భీముడు వ్యతిరేకించినా, ధృతరాష్ట్రునకు సమస్త సంభారాలు సమకూర్చి సాభిప్రాయం వ్యక్తం చేస్తాడు. ఈ విధంగా ధర్మరాజు శత్రుపక్షం నాయకుడుగా పెదతండ్రితో రాజకీయ చదరంగం ఆడి పర్యవసానంగా జరిగిన యుద్ధంలో గెలిచి కూడ గతం మరచి సానుభూతితో పెదతండ్రిని ఉన్నత భావాలతో గౌరవించినట్లు స్పష్టమౌతుంది.

**భీమసేనుడు :** భీమసేనుడు ధర్మరాజుకు సోదరుడు. పాండవు లందరలోను కౌరవులను మిక్కుటంగా ద్వేషించిన వ్యక్తి. బాల్యం నుంచి భీముని బలమే సుయోధనాదులకు అసూయాకారణమై మహాభారతంలో అనేక పరిణామాలకు దారి తీసింది ధృతరాష్ట్రునకు పాండవులందరిలోను భీముడంటేనే అమితమైన భయం అని పరిశీలనవల్ల తెలుస్తుంది. జీవితం అంతా కౌరవులపై ప్రతీకార భావంతోనే జీవించి, భీముడు ద్యూత సభలో చేసిన ప్రతిజ్ఞలను నిరంకుశంగా తీర్చుకొన్నాడు. జీవితం చరమ దశలో మిగిలిన సోదరులు ధృతరాష్ట్రుని ఎడ ఆదరం పెంచుకోగలిగారు కాని, భీమ ధృతరాష్ట్రులు మాత్రం పరస్పరం దగ్గరకాలేక పోయారు. ధృతరాష్ట్రుని పరంగా భీముడు వ్యక్తం చేసిన అభిప్రాయాలు కూడ స్పష్టంగా, నిరంకుశంగా ఉన్నట్లు కనిపిస్తాయి.

ధృతరాష్ట్రుని గూర్చి భీముని ప్రతిఘటనతో కూడిన అభిప్రాయం మొట్ట మొదటగా లాక్షాగృహ దహనం సందర్భంలో వ్యక్తం అవుతుంది. లాక్షాగృహం నుంచి తప్పించుకొని అరణ్యంలో పోయేటప్పుడు విపరీతంగా అలసిన సోదరులు, మాతృమూర్తి సొమ్మసిల్లి నిద్రిస్తుంటే, వారి దుర్గతికి దుఃఖిస్తూ, ఇంత ఆపదకు మూలకారణం

"ఖలుడై ధృతరాష్ట్రుఁడు పు
త్రులుఁ దానును గూడి మమ్ము దూరస్థులఁగా
నిలు వెలువరించి లాక్షా
నిలయంబున నునిచె బాప నిష్ఠితబుద్ధిన్" (ఆది. 6-181)

అని వారి పాపబుద్ధిని దూషిస్తాడు. అంతటితో అతడి కసితీరక కులపాంసనులై ఎప్పుడూ అపకారం తలపెట్టే బంధువులతో సఖ్యత పెంచుకోకుండ ఉండేవాడే ధన్యుడని 'ధృతరాష్ట్రి బాంధవంబు' ను నిందిస్తాడు.

అరణ్యవాసం చేస్తూ ద్వైతవనం చేరిన పాండవులు తాము అనుభవించే కష్టాలను గూర్చి విచారించే సందర్భంలో భీముడు అన్యాయ మార్గంలో కౌరవులు రాజ్యాన్ని అపహరించారు అంటూ

"దుష్కర్ములగు ధార్తరాష్ట్రుల
పేర్మి యడంగింపఁ గడఁగు పృథు భుజశక్తిన్"

(అరణ్య. 1 - 249)

అని సుయోధనాదుల ఎడ కసిని, కోపాన్ని వ్యక్తం చేస్తాడు. భీముని ఆవేశం ధృతరాష్ట్రుణ్ణి కూడ లక్ష్యం చేసుకొన్నట్లు తలంచవచ్చు. శ్రీకృష్ణుడు రాయబారానికి పోయే సందర్భంలో విధి లేక ధర్మరాజు అభీష్టాన్ని బలపరుస్తూనే, ధార్తరాష్ట్రులు కుమతులు, పాపాత్ములు, మదాంధులు అని అనటం ధృతరాష్ట్రుని వంశస్థుల పరంగా భీముని కోపాన్ని వ్యక్తం చేస్తుంది.

శల్యపర్వంలో సమస్త సైన్యాలను కోల్పోయిన సుయోధనుడు ఒంటరిగా నారాయణ హ్రదంలో దాగిన సమయంలో, అతడితో గదాయుద్ధానికై కృష్ణుడు భీముణ్ణి ప్రేరేపిస్తాడు. అత్యంతమైన ఉత్సాహాన్ని పొంది భీముడు సుయోధనుని తాను సంహరించటం వల్ల

"జీకురాజు నేఁడు పనరు
గాక శకుని బుద్ధి కతమునఁ దమకిట్టి
పుట్టెననిం తనూజు పొలియు టెఱిఁగి" (శల్య. 3-132)

అని పలికి ధృతరాష్ట్రుని పుత్రశోక మే తనకు ఆనందదాయకమనే అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. దుశ్శాసనుని సంహరించిన సందర్భంలో కూడ 'ఆ సభం తా వలదన్న కీడుడు గదా' అని ధృతరాష్ట్రుని ఉపేక్ష దూషిస్తాడు.

అట్లాగే ఆశ్రమవాసం కోసం సంకల్పించిన ధృతరాష్ట్రుడు యుద్ధంలో మరణించిన బంధువులకు, పుత్రులకు శ్రాద్ధకర్మలు నిర్వహించాలని సంకల్పిస్తాడు. కోశాగారం తన అధీనంలో ఉన్నందువల్ల భీముడు ప్రజాధనం శత్రువుల శ్రాద్ధకర్మలకు వెచ్చించ వీలులేదని అడ్డగిస్తాడు. ధృతరాష్ట్రునివల్ల కలిగిన ఆపదలను గుర్తు చేస్తూ

"మఱచితె యాతడు మనలం
ఖఱచిన ఖన్నములు భీష్మ బాహ్లిక ముఖుల
త్తఱి నెటవోయిరి వారల
నెఱుంగమెమన మట్టి బంధు లేఱికి మనకున్"

(ఆశ్రమ. 1-114)

అని ఆ రాజు బంధుత్వాన్నే నిరసించి "అంబికేయుండు దంద్రియగుట నాడెట వోయె" (ఆశ్రమ. 1-118) అని పెదతండ్రి ఎడ తీవ్రమైన వ్యతిరేక భావాన్ని వ్యక్తం చేస్తాడు. ఇంకా అవసరమైతే భీష్మాదులకు శ్రాద్ధకర్మలు తానే నిర్వర్తించటం శ్రేయస్కరం అంటూ 'దుష్టమతి యతడేలా !' అని ధృతరాష్ట్రుణ్ణి కూడ చచ్చిన వాని క్రిందే జమ చేస్తాడు. వంశంలో పెద్ద వారుండగా మరణించిన వారికి శ్రాద్ధకర్మలు చిన్నవారు జరపటం సంప్రదాయం కాదు. భీమునకు ధృతరాష్ట్రునిపై ఉన్న కోపం సంప్రదాయాన్నే వ్యతిరేకించేంత తీవ్రమైందని స్పష్టం అవుతుంది. ఈ విధంగా భీముడు బాల్యం నుంచి సుయోధనాదులతో తనకున్న వైరాన్ని, వారు పెట్టిన బాధలను మనసులో ఉంచుకొని పెదతండ్రి వానప్రస్థం స్వీకరించేంత వరకు కూడ అతడిపై వ్యతిరేక భావాన్నే కలిగి ఉన్నాడని తెలుస్తుంది.

**అర్జునుడు :** అర్జునుడు కూడ ధర్మరాజు సోదరుడే. ఇతడు కార్యవిషయాల్లో అధికంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ప్రకటించకుండ ధర్మరాజు శ్రీకృష్ణుల అభిప్రాయాలకు అనుగుణంగా ప్రవర్తించాడు. అగ్రజుడైన ధర్మరాజుకన్నా శ్రీకృష్ణునితోనే అనుబంధం అధికంగా ఉన్నట్లు భారతంలో వ్రాయబడింది. అయినా ఒకడు రెండుచోట్ల సోదరుని అభిప్రాయాన్ని గ్రహించి ధృతరాష్ట్రుని ఎడ తన అభిప్రాయాలను కూడ వ్యక్తం చేశాడు.

ఉద్యోగ పర్వంలో కౌరవ సభకు రాయబారిగా పోయే శ్రీకృష్ణునితో అర్జునుడు, అగ్రజుని అభిప్రాయాన్నే బలపరుస్తూ, సంధికి సుముఖంగానే మాట్లాడతాడు. అదే సమయంలో ధృతరాష్ట్రి సుయోధనుల రాజ్యలోభాన్ని నిరసిస్తూ

**"ధృతరాష్ట్రుం డతిలోభ దూషితుడు ధాత్రీభాగమీనేర్చునే**
**సుతుడుం గష్టుడు సంధి యేలయగు"** (ఉద్యోగ. 3-72)

అని ఆ తండ్రీకొడుకుల కృష్ణుని మాట వినరనే అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. ధృతరాష్ట్రుడు రాజ్యలోభ దూషితుడు, పుత్రవ్యామోహ లోభ దూషితుడని అర్జునుని అభిప్రాయంగా తలంచవచ్చు. ఈ సమయంలోనే కౌరవులు తమకు చేసిన దుష్కార్యాలు చవిటి నేలలో పెట్టిన విత్తులలాగా మనసులోనే స్థిరంగా ఉన్నాయంటాడు. ఇంకా సుయోధనాదులు 'మొలకలు' 'నికృష్టాత్ములు' అనే అభిప్రాయం వ్యక్తం చేస్తాడు.

ఆశ్రమవాస పర్వంలో ధృతరాష్ట్రుడు మరణించిన బంధుపుత్రాదులకు శ్రాద్ధ కర్మలు నిర్వహించాలనే అభిప్రాయం వెలిబుచ్చినప్పుడు, ధర్మరాజు ఎంతో ఆదరంతో అంగీకరిస్తాడు. భీముడు నిరసన వ్యక్తం చేస్తాడు. అర్జునుడు ధర్మరాజునే అనుసరించి

**"అయ్యంబికా తనయు దొల్లి**
**వేడికొందు మతడు వేడెడు గానకు**
**నేగుచుండి మనల నిప్పుడు"** (ఆశ్రమ. 1-111)

అని భీముని వ్యతిరేకతను పోగొట్టే ప్రయత్నం చేసి ధృతరాష్ట్రుని ఎడ సాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తాడు. ఈ విధంగా అర్జునుడు ధృతరాష్ట్రునిపై తనకు కొన్ని అంశాల్లో వ్యతిరేకాభిప్రాయాలున్నా పెక్కు సందర్భాల్లో అగ్రజుని అభిప్రాయానుగుణంగా వర్తించా

**ద్రుపదుడు** : ద్రుపదుడు పాంచాల దేశాధిపతి. పాండవ పక్షంలో ప్రధాన వ్యక్తులలో ఒకడు. ఇతడు పాండవులకు మామ కావటంవల్ల వారి జీవిత

సమస్యలు తమ సమస్యలుగానే భావించాడు. ద్రౌపదీ వివాహానంతరం ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్య ప్రదానం చేయటం ద్రుపదుని సైనిక శక్తిని పరిగణనలోకి తీసుకొనేనన్న విషయం పూర్వోక్తం. అజ్ఞాత వాసానంతరం పాండవ కార్యం సాధించేందుకు పాండవ హితైషులు పెద్దవాడని, ద్రుపదునిపైనే భారమంతా పెట్టారు. ద్రుపదుడు ధృతరాష్ట్రుణ్ణి శత్రుపక్షం వానిగానే భావించటంచేత ఆ రాజుపై వ్యతిరేకాభిప్రాయాలనే కలిగి ఉండటం సహజం.

ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భంలో జరిగిన సభలో పాండవ కార్యార్థం పరంగా బలరాముని అభిప్రాయాన్ని త్రోసిపుచ్చి ద్రుపదుడు సుయోధనుని దురభిమానాన్ని దూషించి, ధృతరాష్ట్రుడు కూడ 'తనూజు తృష్ణ నూనినవాడు' అని అతడి పుత్రవ్యామోహాన్ని నిరసిస్తాడు. అట్లానే రాయబారానికి పోయే సందర్భంలో తన పురోహితునితో కూడ

''వినుకొడుకుగొన్న వేడుఁకు
కొని కొట్టిన తిండికాడు కుటిలుండతఁడు'' (ఉద్యోగ. 1-56)

అని ధృతరాష్ట్రుడు కుటిలమతి అనే అభిప్రాయాన్ని విస్పష్టంగా వ్యక్తం చేస్తాడు.

**ద్రుపద పురోహితుడు :** రాయబారిగా ప్రభుకార్యాన్ని నిర్వర్తించటంలో ద్రుపద పురోహితుని ప్రాధాన్యం పరిమితం అవుతుంది. ప్రభువు మనసు తెలుసుకొని, అందుకు అనుగుణంగా కార్యసాధన చేసే ప్రయత్నంలో ధర్మమని తోచిన విషయాలు చెప్పాడు. అట్లా చెప్పేటప్పుడు ధృతరాష్ట్రునిపై కొన్ని అభిప్రాయాలు వ్యక్తం చేయటం జరిగింది.

కౌరవ సభలో పాండవుల గుణగణాలను వివరించి, ద్యూతంలో వారి సామ్రాజ్యాన్ని మాయోపాయంతో అపహరించటం అక్కడున్న వారంతా ఎరిగిందే నని చెప్తూ "ఓపు సెల్ల నియ్యకొనియె నీ పెద్దరాజు నేమనగ నేర్తు" (ఉద్యోగ. 1-231) అని ఇన్ని ఆపదలూ ధృతరాష్ట్రుని ప్రమేయంతోనే జరిగాయనే అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. ద్యూతసమయంలో జరిగిన అవమానాలను ఉట్టంకించి, కురుపాండవుల మంచి చెడ్డలు అక్కడి వారికి తెలుసుకనుక, ధృతరాష్ట్రునకు

"గౌరవమున బుద్ధి సెప్పగాదగు మీకున్" (ఉద్యోగ. 1-233) అని సభలోని వారిని అర్థిస్తాడు. ద్రుపద పురోహితుని ఈ అభిప్రాయాలు ధృతరాష్ట్రుని పుత్ర వ్యామోహాన్ని, ఉపేక్షాభావాన్ని విమర్శించేవిగా ఉన్నాయి.

**బలరాముడు :** బలరాముడు యదువంశ వీరుడు. శ్రీకృష్ణునకు అగ్రజుడు. కురుపాండవ కలహంలో స్పష్టమైన తటస్థవైఖరిని అవలంబించాడు. సుయోధనునిపై కొంత అభిలాష ఉన్నా సోదరుడైన కృష్ణుడు పాండవ పక్షం వహించటంతో, తటస్థంగా ఉన్నాడు. కురుపాండవుల ప్రవర్తనలో లోపం అనిపించిన వాటిని నిర్ద్వంద్వంగా ఖండించాడు. ఉత్తరాభిమన్యుల వివాహ సమయంలో జరిగిన సభలో కురుపాండవ కలహానికి ధర్మరాజు ద్యూతవ్యసనం కూడ కారణమేనని చెప్తాడు. సుయోధనుని తొడలు విరుగ కొట్టినప్పుడు భీముణ్ణి నిందిస్తాడు.

అరణ్యవాసంలో తీర్థయాత్రలు చేస్తూ ప్రభాస తీర్థంలో ఉన్న ధర్మరాజును సందర్శించేందుకు బలరామకృష్ణులు యాదవ వీరులతో కలిసి వస్తారు. ఆ సమయంలో పాండవులకు కలిగిన కష్టాలకు సానుభూతి వ్యక్తం చేస్తూ

**"మతిహీనుడై తన సుతుని పల్కులు విని**
**ధృతరాష్ట్రుఁ డీ పాండుసుతులఁ బాప**
**భీరుల నపగత ధారుణీ రాజ్యులఁ**
**జేసి యుగ్రారణ్యవాస గతులఁ**
**గావించె నిది ధర్మువే విచార విహీను డయ్యె"**

(అరణ్య. 3-162)

అని ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహాన్ని, బుద్ధిలేని తనాన్ని తీవ్రంగా విమర్శిస్తాడు ఇంకా ఆ రాజు విచార విహీనుడని, ధార్తరాష్ట్రుల దర్పను సంహరించి కౌరవ సామ్రాజ్యాన్ని ధర్మరాజుకు అప్పగించటం ఉచితం అని అంటాడు.

**ద్రౌపది :** ద్రౌపది పాండవ పట్టమహిషి. కురుపాండవ కలహంలో భర్తలతోపాటు అనేకమైన బాధలను అనుభవించింది. ద్యూత

సమయంలో ద్రౌపదికి జరిగిన అవమానాలు భారత యుద్ధంలో తీవ్ర పరిణామాలకు కారణం అయ్యాయి. ఆ అవమానం ఆమె హృదయంలో అగ్ని శిఖలాగా నిక్షిప్తమై కొన్ని సందర్భాల్లో భర్తలను ప్రతీకారం తీర్చుకొనేందుకు ఉద్యుక్తులను చేసేందుకు దోహదం చేసింది. అందువల్ల ద్రౌపది ధృతరాష్ట్రుని ఎడ వ్యతిరేక అభిప్రాయాన్ని కలిగి ఉండటం సహజ పరిణామంగానే కనిపిస్తుంది.

కామ్యకవనంలో ఉన్న పాండవులను పరామర్శించేందుకు యాదవ పాంచాలుర వచ్చిన సమయంలో ద్రౌపది తనకు జరిగిన అవమానాన్ని వివరించి 'పాండవుల్ సూచుచు నుండి రొరులువోలె' అని భర్తలపై నేరం మోపుతూ ధార్త రాష్ట్రులను నిందిస్తుంది. కొన్ని సందర్భాల్లో ధృతరాష్ట్రుని ఎడ ద్రౌపది అభిప్రాయాలు ఎంతో తీవ్రంగా ఉన్నాయి. ద్వైతవనంలో ఉన్నప్పుడు, తమకు సంభవిల్లిన ఆపదలను నెమరు వేసుకొనే సందర్భంలో ఉద్వేగంతో ఆవేశం అణచుకోలేక, ఆ రాజు పుత్రవ్యామోహం పాపబుద్ధివల్లే ఈ కష్టాలు సంభవిల్లాయంటూ

"వృద్ధు గొడుకు పలుకు విని క్రూరుఁడై పాప
బుద్ధిఁ జేసి మిమ్ము భూతలంబు
వెలువరించి రాజ్య విభవంబు గొని యిప్పు
డలుక సెడి సుచిత్తు డయ్యెనొక్కొ" (అరణ్య. 1-208)

అని కఠినంగా పలుకుతుంది. అతడి హృదయం పాషాణ మయమని, మానవత్వం ఏమాత్రం లేదని

అద్దురాత్ము హృదయమది యయః పాషాణ
నిష్ఠురంబు ధర్మనిధుల మిమ్ము
నట్లు గొడుకు లెగ్గులాడంగ బోయిన
వలదనండ కలహ వాంచచేసి" (అరణ్య. 1-209)

అని పాండవులతో కలహవాంఛ ధృతరాష్ట్రుని హృదయ వాంఛయే అనే అభిప్రాయం వెలిబుచ్చింది. భర్తల బలపరాక్రమాలను కొనియాడుతూ, కౌరవులు ధర్మదూరులని, వారిని శిక్షించక పోయినట్లయితే, వారి అధర్మం వల్ల ధర్మపరులు ఆపదలు పొందుతారంటూ

"నికృతిపరుల యందు నికృతి సేయని వారు
వారి నికృతిఁ జేసినధ్యులంద్రు" (అరణ్య. 1-226)

అని చెప్పి, అందువల్ల ధార్తరాష్ట్రులు తప్పకుండ వధించ తగిన వారని అంటుంది.

శ్రీకృష్ణుణ్ణి రాయబారానికి పంపేటప్పుడు తన అభిప్రాయం చెబుతూ, ధార్తరాష్ట్రులు చేసిన అవమానాలను జ్ఞాపకం చేసి వాటన్నింటికి ధృతరాష్ట్రుని అనుమతి ఉన్నదనే భావం వ్యక్తంచేస్తూ, ఆ మహారాజును మామగా గుర్తించటానికి కూడ మనసు అంగీకరించ నట్లు పలికింది. పాండవులతో సంధికి ధృతరాష్ట్రుడు అంగీకరించి నట్లయితే భర్తలతో పాటు "ఏను జెచ్చెరఁజని కోటరంబు ధగఁ జేయుదునో యటుగాక పాడియై వరవుడమోపి చేయుదునొ వారికి"(ఉద్యోగ.3-112) అని పలికిన మాటలలో ఆమె అభిప్రాయం వ్యక్తమౌతుంది ఈ విధంగా ద్రౌపది పొందిన అవమానాలు హృదయాన్ని దహిస్తుంటే, ప్రతీకారవాంఛ హృదయంలో రగులుతుంటే అవకాశం లభించినప్పుడల్లా ధృతరాష్ట్రునకు వ్యతిరేకంగా భర్తలను ప్రోత్సహించటానికే ప్రయత్నించింది.

**కుంతి :** కుంతి ధృతరాష్ట్రుని సోదరుడు పాండురాజు భార్య. పాండవులకు మాతృమూర్తి. నకుల సహదేవులకు మాతృమూర్తి. నకుల సహదేవులను సొంత బిడ్డలకన్న ఆప్యాయంగా చూసుకొన్నది. వర్తమాన రాజలోకంలో ప్రబలమైన యాదవ వంశం పుట్టినిల్లైనప్పటికీ, జీవితంలో ఎక్కువ భాగం బిడ్డల కష్టాలకు దుఃఖిస్తూ శత్రువుల అధీనంలో జీవితం సాగించింది. కుంతి ప్రత్యేకంగా తన అభిప్రాయాలను వ్యక్తం చేయలేదు. అయినా చైతన్య వంతమైన మానవ మూర్తిగా, మాతృమూర్తిగా కొన్ని సందర్భాల్లో హృదయ స్పందనాన్ని మాటల్లో వ్యక్తం చేస్తుంది. శ్రీకృష్ణుడు రాయబారిగా వచ్చినప్పుడు,

ప్రత్యేకంగా ధృతరాష్ట్రుణ్ణి గూర్చి కాకపోయినా, కౌరవవంశం మీద ఆమె చేసిన అభియోగం నిక్షిప్తమైన ఆ హృదయానికి ప్రతిరూపంగా నిలుస్తుంది. ఆ సందర్భంలో బావ ఇంట్లో ఉండటం మనస్తాపం కలిగిస్తున్నదని పలుకుతుంది. సంధికి అంగీకరించనందుకు కౌరవులపై నేరం మోపటం అనవసరమని, "యిట్టి క్రూరుల యింటి కిచ్చిన మనవారినందు" (ఉద్యోగ. 3-195) అని వ్యంగ్య గర్భితంగా మెట్టినింటి వారంతా క్రూరులేననే అసంతృప్తి వ్యక్తం చేస్తుంది. కుంతిమాటల్లో వంశం మొత్తాన్ని నిందించినట్లు కనిపిస్తున్నప్పటికీ ముఖ్యంగా ధృతరాష్ట్రునిపై మాత్రమే ఆమె అభిప్రాయం కేంద్రీకృతమై ఉన్నదని భావించటం సమంజసం కాకపోదు.

**ఇతరులు :** మహాభారతంలో పైని పేర్కొన్న పాత్రలేకాక మునులు, పౌరులు, సైనికులు, అంతఃపుర వాసులు కూడ కొన్ని సందర్భాల్లో ధృతరాష్ట్రుని గూర్చి, అతని కుమారుల గూర్చి కొన్ని అభిప్రాయాలను వెల్లడించారు. వీరిలో కొందరు హితవు చెప్పిన వారైతే, ఎక్కువ మంది ఆ తండ్రీ కొడుకుల దుష్కార్యాలను విమర్శించినట్లే కనిపిస్తుంది.

అరణ్యంలో ఉన్న ధర్మరాజు వద్దకు పరామర్శించేందుకు వచ్చిన రోమశ మహర్షి పాండవులు అనుభవించే కష్టాలకు సానుభూతి వ్యక్తం చేస్తూ, ఇన్ని కష్టాలకు కారణం ధృతరాష్ట్రుడు, అతని కుమారులేనని, ఈ అధర్మానికి వారు ఫలితం అనుభవిస్తారని అంటాడు. రోమశమహర్షిలాగానే మార్కండేయాది మహర్షులు కూడ ధర్మరాజును ఓదార్చే ప్రయత్నంలో ధృతరాష్ట్రాదుల దుష్ట కార్యాలను నిరసిస్తారు. అట్లాగే కణ్వుడు, నారదుని వంటి ఋషులు శ్రీకృష్ణుడు చెప్పిన హితవును ఆలకించి పాండవులకు చేసిన అకార్యాలను సరిదిద్దుకోవలసిందని చెపారు.

ధృతరాష్ట్రుడు పాండవులను వారణావతం పంపేటప్పుడు హస్తినాపురంలోని ప్రజలు తీవ్రంగా ప్రతిస్పందించారు. ప్రజారంజకులైన పాండవులను వారణావతం పంపటం అధర్మమనీ, ధృతరాష్ట్రుని ఈ చర్యను భీష్మాదివృద్ధులు ఎట్లా అనుమతించారు? అని, నిరసన వ్యక్తం చేసి వారితో పాటు వారణావతం

పోయేందుకు సిద్ధం అవుతారు. అట్లానే సుయోధనుని మాయోపాయంతో పురోచనుని ప్రయత్నాన్ని వమ్ముచేసి లాక్షాగృహాన్ని దహించి తమను తాము రక్షించుకొన్నప్పుడు వారణావత ప్రజలుకూడ తీవ్రంగా ప్రతిస్పందించారు. లాక్షాగృహంలో పాండవులు దహించ బడ్డారనే భావంతో, అక్కడ ధృతరాష్ట్రుని ఉపాయ ఫలితమేనని భావించి "ధృతరాష్ట్రోపాయ మాయోద్ధత జ్వలన జ్వాలల గ్రాగిరే యనుచు" (ఆది. 6-167) సంతాపార్తులై ఆ మహారాజు ఎడ వ్యతిరేక భావాన్ని ప్రదర్శించారు. ఈ రెండు సందర్భాల్లోను ప్రజలు సానుభూతిగా ఆలోచించటానికి పాండవులు తండ్రిని కోల్పోయిన సుకుమారులు కావటం, కారణం కావచ్చు.

కృష్ణరాయబారం విఫలమైపై శ్రీకృష్ణుడు హస్తినాపురం నుంచి తిరిగిపోయేటప్పుడు పౌరులు సంధి పొసగనీయని నేరం సుయోధనాదులపై పెట్టి నిందించారు. శ్రీకృష్ణుడు చెప్పిన హితవును ఆదరించకుండ సుయోధనాదులు మూర్ఖులౌతున్నారని, ఇలాంటి దుర్మార్గులు లోకంలో ఎక్కడా ఉండరని అభిప్రాయపడ్డారు. కురుక్షేత్ర యుద్ధానికి పూర్వమే సుయోధనాదులపై ప్రజాభిప్రాయం విముఖంగా ఉండటం యుద్ధాంతంలో ధృతరాష్ట్రునకు శోకాన్నే మిగిల్చింది. ఈ సమయంలో ప్రజల ఆలోచన ధృతరాష్ట్రాదులపై ద్వేషంతో కాక వంశశ్రేయస్సును, క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొనే నని తలచటం భావ్యంగా ఉంటుంది. యుద్ధంలో భీమ సుయోధనులు తలపడి ఘోరంగా పోరు సాగించేటప్పుడు ధృతరాష్ట్రుని లోభం వల్లే కురువంశానికి ఈ పరిస్థితి కలిగిందంటూ

"చండ విరోధితిమిర మా
ర్తాండులనగఁ దగిన వీరు దమలో నిట్లు
ద్దండతఁ బెనఁగుట ధృతరా
ష్ట్రుం డవినయ లోభ ముష్కుఁడగుటం జూమీ"

(భీష్మ. 2-311)

అని జనులు నిందించటంకూడ పై అభిప్రాయానికి దోహదం చేస్తుంది. ఈ సమయంలో యుద్ధాన్ని చూసే జనులు ధృతరాష్ట్రుడు 'అవినయ లోభ ముష్కురు' డనే అభిప్రాయానికి వచ్చినట్లు తెలుస్తుంది.

తొమ్మిదవరోజు యుద్ధంలో ధృష్టద్యుమ్న, శిఖండి, ద్రుపద, విరాటులు భీష్ముణ్ణి చుట్టుముట్టినప్పుడు కురుపాండవ సైన్యంమధ్య భయంకరంగా సంకుల సమరం జరిగింది. ఆ యుద్ధాన్ని చూసి రణరంగంలోనే ఉన్న సైనికులు ధర్మ రాజును జయించటం శక్యం కాదనీ, ఇంత ప్రజాక్షయానికి ధృతరాష్ట్రుని లోభమే కారణం అంటూ

"ధృతరాష్ట్రుండును బుత్రులు
నతి లోభంబునఁ బ్రజాక్షయము సేసిరి ధ
ర్మ తనూజు గెలువ వచ్చునె
మతి లేరైరింక నేటి మాటలు మనకున్"

(భీష్మ. 3-127)

అని ఆ రాజు మతిలేనివాడై కురు వంశానికే దురవస్థ తెచ్చి పెట్టాడని అభిప్రాయ పడ్డారు. అట్లానే శల్యుడు మరణించింతర్వాత అక్కడి జనం సుయోధనుడు కూడ ఈ రోజు మరణించటం తప్పదనుకుంటూ, కురువంశానికి బాధలన్నింటికి ధృతరాష్ట్రుడే మూలమనే అభిప్రాయం వ్యక్తం చేశారు.

వంశ వినాశనానికి ప్రధాన కారకుడని భావించి నిందించిన ప్రజలే, ధృతరాష్ట్రుడు వానప్రస్థజీవితం గడిపేందుకు ఆశ్రమానికి ప్రయాణం అయ్యే సమయంలో సానుభూతితో ఆ మహారాజు పరిపాలనా విశేషాలను మెచ్చుకోవటం విశేషం. ఆ దశలో అతడి ఎడ వారి హృదయాలు సమాదరంతో స్పందించాయి. వారందరికి ప్రతినిధిగా వృద్ధబ్రాహ్మణుడొకడు ముందుకు వచ్చి ఆ మహారాజు పాలనలో ఎంతో సౌఖ్యాన్ని అనుభవించామనీ, కురుక్షేత్రంలో జరిగిన వంశనాశనం ఒక్క సుయోధనుని కారణంగానే జరగలేదనీ, యుద్ధం చేయటం రాజధర్మమే అని చెప్పి, ధర్మరాజు పాలనలో కూడ ధృతరాష్ట్రుని పరిపాలనలో లాగానే తమ తమ వృత్తులు క్షేమంగా ఉంటాయనే విశ్వాసాన్ని వ్యక్తం చేస్తాడు. ఈ సందర్భంలో బ్రాహ్మణుడు వ్యక్తం చేసిన అభిప్రాయం, ఆత్మీయత వృద్ధరాజు హృదయాన్ని పరవశింప చేసింది. బ్రాహ్మణుడు వ్యక్తం చేసిన ఈ అభిప్రాయం మహాభారతం మొత్తంలో ధృతరాష్ట్రుని వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే జీవనాడిగా స్ఫురిస్తుంది.

మహాభారతంలోని పాత్రలలో అనేకులు ధృతరాష్ట్రుని ఎడ వ్యతిరేక భావాన్నే వ్యక్తం చేసినట్లు పై పరిశీలనవల్ల తెలుస్తుంది. ధృతరాష్ట్రుని ఆత్మీయులు, అనుయాయులు కూడ కురుపాండవ కలహంలో ఆ మహారాజునే ప్రధాన భాగస్తునిగా చేసి నిందించటం, హితవు, కర్తవ్యం బోధించటం కనిపిస్తుంది. అయితే వీరిలో ఏ ఒక్కరుకూడ ధర్మరాజు ద్యూత వ్యసనాన్ని, ద్రోణ ద్రుపదుల వైషమ్యాన్ని, శ్రీకృష్ణుని రాజకీయపు ఎత్తులను గమనించినట్లు కనిపించదు. కురువంశ వినాశనానికి ధృతరాష్ట్రుడు ఒక ప్రముఖమైన కారణం అనటంలో విప్రతిపత్తి లేకపోయినప్పటికీ, ఆ మహారాజుతోపాటు ప్రత్యర్థుల కార్య కలాపాలు కూడ అందుకు దోహదం చేశాయని తలంచటంలో దోషం కనపడదు.

ధృతరాష్ట్రుడు నిజంగా అంతటి దుర్మార్గుడే అయితే ప్రజలు అతణ్ణి, కుమారుణ్ణి కూడ బ్రతకనీయరు. అట్లా దుర్మార్గులైన రాజులను ప్రజలు సంహరించి పరిపాలనా దక్షుడైన రాజును నియమించుకొన్న సందర్భాలు భారతంలోనే కనిపిస్తాయి. అంతేకాక ధృతరాష్ట్రునకు అనుకూలంగా అనేక దేశాలరాజులు పదకొండక్షౌహిణుల సైన్యంతో కలిసి రావటం ఆ మహారాజు ప్రాభవానికి ఇతర రాజన్యులతో మైత్రీ బంధానికి నిదర్శనంగా నిలుస్తుంది. ఇంకా ధృతరాష్ట్రుడు మహాపండితునిగా మేధావిగా, ఉత్తమ ధ్యాన సంపన్నుడుగా కనిపిస్తాడు. మహర్షులు కూడ అతడి నియమ నిష్ఠలను కొనియాడటం ఇందుకు నిదర్శనం. అందువల్ల భారతంలో ఉన్న పాత్రలు ధృతరాష్ట్రుని ఎడ వ్యక్తం చేసే అభిప్రాయాలను, ఆ అభిప్రాయాలు కాక మిగిలిన భారత కథాంశాలను పరిశీలించి క్రోడీకరిస్తే పాత్రలు వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఏక పక్షంగా ఉన్నట్లు గోచరిస్తుంది. భారత పాత్రలన్నీ ఆరోపించినట్లు ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహి అనటం కొంతవరకు సమంజసమే అయినప్పటికీ, ఆ ఒక్క కారణం చేతనే మహాభారతంలో కురువంశానికి ఇంతటి విపత్తు సంభవించిందని చెప్పటం సాహసమే అవుతుంది. ఇరు వర్గాల వారిలో ఉన్న వ్యసనాలు, ఆశలు, పంతాలు, పట్టుదలలు కలిసి కురువంశాన్ని ఈ స్థితికి తెచ్చాయని భారత కథను ఏకాగ్రతతో పరిశీలిస్తే బోధపడుతుంది. కనుక భారత పాత్రలలో ప్రాధానమైనవారు ధృతరాష్ట్రుని ఎడ వ్యక్తంచేసిన అభిప్రాయాలు, కురువంశ విచ్ఛేదానికి ప్రధానంగా ధృతరాష్ట్రుణ్ణే పాపాల భైరవుణ్ణి చేయటానికి చేసిన ప్రయత్నంగా తలచటం సమంజసంగా ఉంటుంది.

# 5.0 ఉపసంహారం

కవిత్రయం వారి ఆంధ్రమహాభారతంలో కురుసామ్రాట్టు ధృతరాష్ట్రుని పాత్ర చిత్రణలోని విశేషాలను ఈ గ్రంథంలో సమగ్రంగా పరిశీలించటం జరిగింది. సమస్త జీవకోటితో కూడిఉన్న ప్రకృతి పరిణామ జనితమని శాస్త్రకారుల పరిశీలన. ఈ పరిణామం అవ్యవధానంగ నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. ప్రకృతి పరిణామంలో నుంచే బుద్ధిజీవి మానవుని ఆవిర్భావం జరిగింది. మానవుని ఆవిర్భావదశ నుంచే అవిశ్రాంతంగా చుట్టూ ఉన్న సమాజంతోపాటు అతడి వ్యక్తిగత జీవితం కూడ నిరంతరం పరిణామ దశలోనే ప్రయాణం చేస్తుంది. ఆ ప్రయాణంలో నిత్యనూతనమైన చైతన్యంతో వర్ధిల్లుతూ దైనందిన పరిణామం గమనించేందుకు శక్యంకాక పోయినప్పటికీ, ఒక వ్యవస్థిత పరిణామానంతరం ఆ పరిణామంలోని నూతనత్వాన్ని విస్పష్టంగా గుర్తించటం సాధ్యం అవుతుంది. ఈ వ్యవస్థిత పరిణామాలలో సమాజ పురోగమనంలోను, వ్యక్తిత్వపు విలువలలోను క్రొత్త పుంతలు గోచరమైనప్పటికీ ప్రాథమికమైన మౌలిక రూపాలలో మాత్రం అంతగా భేదం కనిపించదు.

నియమితమైన వ్యవస్థిత పరిణామాలలో సంభవిల్లిన ప్రకృతి పరిణామం వివిధ విభాగాల సామాజిక పరిశోధకులచే గుర్తించబడింది. సాహిత్య ప్రపంచంలో కూడ ప్రాచీన కాలంనుంచి సామాజిక పరిణామంతో పాటు మానవ మనఃప్రవృత్తులు కూడ విశ్లేషించబడ్డాయి. క్రాంత దర్శనులైన ఋషులు, కవులు, సమకాలీన సామాజిక పరిణామం నుంచి స్ఫూర్తిని పొంది, తమ భావానావిపంచిలో తత్స్వరూపాన్ని విశ్లేషించి, మానవుడు ఎదుర్కొనే సమస్యలకు పరిష్కారాన్ని సూచిస్తూ మానవాళికి ఆనంద ప్రదాయకాలైన కావ్యాల నెన్నింటినో ప్రపంచ భాషా సాహిత్యాలలో అందించారు. ఆయా భాషా సాహిత్యంలో భిన్నకాలాలలో వెల్లివిరిసిన కావ్యజాలంలో మానవుని జీవిత సమస్యలు, అందుకు కారణాలు, వాటికి పరిష్కార మార్గాలు సూచించటం జరిగింది. భాషలు వేరైనా మానవ ప్రవృత్తులలో దేశకాల భేదాన్ని అనుసరించి అల్పమాత్ర వ్యత్యాసమేకాని, మౌళికాంశాలలో భేదం అంతగా కన్పట్టదు మానవుడు ఎక్కడ నివసించినా అతడి దైనందిన జీవితంలో ప్రాథమిక

సమస్యలు ఆహారం, గృహవసతి, శారీరకాచ్ఛాదనంగా కనిపిస్తాయి. చరిత్రలో ఎన్ని యుద్ధాలు జరిగినా, రాజ్యాలు కూలినా, క్రొత్త సామ్రాజ్యాలేర్పడ్డా అంత రార్థంగా ఉన్న సమస్యలు మాత్రం ఇవేనని చెప్పవచ్చు. మానవ జీవన వికాసంలో ఈ పరిణామం అతడి ప్రాపంచిక జీవితానికి ప్రతీక అయితే, భౌతిక దృష్టికి గోచరం కాకుండ అంతర్లీనంగా మానసికమైన ఆధ్యాత్మిక పరిణామం కూడ మానవుని మనోవ్యథలో చోటు చేసుకుంది. మానవ జీవిత పరిణామంలో ఈ రెండు ముఖాలు భిన్నకాలాలలో వెలసిన సాహిత్యంలో చోటు చేసుకొని వాటికి పరిష్కారాలు చెప్పబడ్డాయి.

భారతీయ సాహిత్యంలో భారత రామాయణాలు అత్యంత ప్రాచీన గ్రంథాలుగా ప్రసిద్ధికెక్కాయి. ఈ రెండు గ్రంథాలలో కూడ మానవ జీవిత, సమాజ పరిణామంలోని పైరెండు ముఖాలు అంతర్భాగంగా ఒక దానిలో ఒకటి చోటుచేసుకొన్నట్లు కనిపిస్తాయి. ఈ రెండు గ్రంథాల్లో మానవుని జీవితంలో ఎదురయ్యే ఎన్నో సమస్యలకు పాత్రల ముఖంగా పరిష్కారం లభిస్తుంది. మానవ ధర్మం, ఆవశ్యకత, ఆచరించ తగిన రీతి, ప్రయోజనం ఇత్యాది అంశాలెన్నింటినో పాత్రల ముఖంగా సమకాలీన సమాజానికే కాకుండ భావితరాల వారికి సూచికగా వ్యాస వాల్మీకు లందించారు. అనంతర భారతీయ భాషా సాహిత్యాల పురోగమనంలో భారత రామాయణాల ప్రాశస్త్యం స్థిరంగా నిలదొక్కుకొని అనేక భాషలలో వీటి అనుసరణలేకాక, అనువాదాలు కూడ వచ్చిన విషయం సువిదితమే.

కురువంశంలోని రెండు మూడు తరాల కథ ఆధారంగా మహాభారతం వ్యాపించింది. కురుపాండవ కలహం కథాబీజంగా వ్యాసుడు 'జయము' నిర్మించాడు. ఈ కథ అనంతర కాలంలో వందిమాగధ పాటకులచే వ్యాప్తిచేయబడి లిఖితరూపం పొందేనాటికి పాండవానుకూలంగా మహాభారతంగా పరిణామం చెందింది. పాశ్చాత్య విమర్శకులు కొందరు కురు పాంచాల యుద్ధంలో పాండవులు పాంచాలపక్షం వహించటమేకాని కురువంశంతో వారి కేమాత్రమూ అనుబంధంలేదని ఆధారాలతో నిరూపించారు[1]. వైదిక సాహిత్యంలోకూడ కురుపాంచాలురే కనిపిస్తున్నారు కాని పాండవుల ఉనికి గోచరంకాదు. వ్యాసుడు నిర్మించిన 'జయము' మహాభారత విస్తరణంలో ఎంతవరకు నిలిచిఉందో ఖచ్చితంగా నేర్పరచే ప్రయత్నం చేస్తే కాని పాండవులు కురువంశాంతర్భాగమా లేక మహాభారత విస్తరణంలో బ్రాహ్మణ

మతాభిమానులైన పాటకులచేత, పండితులవల్ల కురుసామ్రాజ్య దాయాదులుగా చిత్రీకరించబడ్డారా అన్న అంశం తేలదు. ఈ దిశలో ఇంకా ఎంతో పరిశోధనచేసి నిగ్గు తేల్చవలసిన అవసరం ఉంది.

అయితే మహాభారత విస్తరణంలో మాత్రం వాస్తవాంశాలతోపాటు అధిదైవికాంశాలుకూడ చోటుచేసుకొన్న విషయం తేటతెల్లమవుతుంది. అందులో కొన్ని అంశాలు బౌద్ధయుగానంతరం బ్రాహ్మణ మతవ్యాప్తిలో వైదిక మతానుయాయులైన రాజుల ఆస్థానాలలోని కవులు, పండితులు, పురోహితులు బ్రాహ్మణ మత గ్రంథాలలోని అంశాలను, జాతక కథలలోని అంశాలను కొన్ని మార్పులతో ఉపాఖ్యానాల రూపంలో మహాభారతంలో ప్రవేశపెట్టి ఉంటారు. ఉపాఖ్యానాలేకాక కురువంశ కథలో కొన్ని ప్రముఖ సన్నివేశాలలోకూడ అధిదైవికాంశాలను కూర్చిన విషయం బోధపడుతుంది. ధృతరాష్ట్రుని జనన విషయంలో దేవేంద్రాదుల నియోగం, కృష్ణుని విశ్వరూప ప్రదర్శనం, ద్రౌపదీ పరాభవ సమయంలో కృష్ణుని అదృశ్య సహాయం మొదలైనవి వీటిలో కొన్ని మాత్రమే. ఇదంతా భారతం ఇతిహాస స్వరూపంనుంచి పంచమవేదంగా రూపాంతరం చెందే దశలో ఎవరికి తోచిన విధంగా వారుచేసిన మార్పుల పరిణామంగా తలంచటం భావ్యంగా ఉంటుంది.

మతసిద్ధాంతాల వ్యాపకంలో అసహజాలు, హేతుబద్ధం కానట్టి, కేవలం విశ్వాసంపైనే ఆధారపడిఉన్న, అంశాలుకొన్ని కల్పించినప్పటికీ, సామాజిక జీవన స్రవంతిలో వ్యక్తిప్రాధాన్యం, అతడి సమస్యలు, ఆవేశకావేషాలు, వ్యామోహ లోభాలు, పంతాలు ప్రతీకారాలు, ఆధ్యాత్మిక భావపరిణామం మొదలైన అంశాలు సార్వకాలికమై సర్వజన సామాన్యంగా వర్తిల్లినట్లు భారతం పరిశీలించిన వారందరికీ విదితమవుతుంది. మహాభారతంలో ప్రతిపాత్ర ఒక వ్యవస్థగా రూపొంది భావితరాల వారికి, జీవితావగాహనకు దర్పణంగా ఉపకరిస్తుందనటంలో ఎలాంటి సందేహంలేదు. అందునా కవితా స్వాములైన కవిత్రయంవారు కృష్ణద్వైపాయనుని అభిహితార్థం అవగాహన చేసుకొని, ఆ అవగాహన తాత్పర్యాన్ని తెలుగు ప్రజలకు అందించారు. ఈ గ్రంథంలో ఇంతవరకు ధృతరాష్ట్రపాత్ర పరిశీలనలో వ్యాసుని అభిహితార్థ తాత్పర్యాన్ని కవిత్రయంవారు తెలుగు ప్రజల జీవిత గమనానికి కరదీపికగా అందించిన విశేషాలను అవలోకించటం జరిగింది.

సృష్టికి స్త్రీ పురుష ప్రకృతుల అవగాహనతో కూడిన కలయిక మూలం. మానవ జీవితంలో వివాహంతోనే ఈ కలయికకు సామాజిక పరంగా అధికార ముద్రపడుతుంది. జీవితంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా సంతానోత్పత్తి ప్రాధాన్యం వహించిన, భార్యాభర్తల అనుబంధం సమాజం స్థిరంగా పురోగమించేందుకు మూలస్తంభం అన్న అంశం గాంధారీ ధృతరాష్ట్రుల దాంపత్య జీవితంలో స్పష్టం అవుతుంది.

సంతానోత్పత్తితోనే తండ్రి ప్రయోజకత్వం అభినందనీయం అవుతుంది. ప్రతి తండ్రి తన జీవితానికి అర్థం. పరమార్థం బిడ్డలను కనటంకోసు, వారి పురోగమనంలోను ఉందని భావిస్తాడు. ఆ భావనలో పుత్రులను సన్మార్గ పర్తనులుగా ప్రవర్తింపచేస్తే సర్వం సుఖాంతం అవుతుంది. అట్లాకాక తండ్రులే స్వార్థలాభదూషితులై కుమారులను ఒత్తిచెప్పలేని స్థితిలో ఉంటే సర్వమూ నాశనం అవుతుందనేందుకు ధృతరాష్ట్ర సుయోధనుల జీవితాలు ప్రతీకగా నిలుస్తాయి.

సమిష్టి కుటుంబాల్లో సోదరానుబంధం, పరస్పర వాత్సల్యం ప్రాధాన్యం వహించి మధురానుభూతిని కలిగిస్తుంది. సోదరుల మధ్య కొన్ని సందర్భాల్లో అపోహలు, అపార్థాలు చోటుచేసుకోవటం సహజం. అయినప్పటికీ జీవనగమనంలో సోదర బాంధవ్యం తుడిచి వేయలేనిది. ధృతరాష్ట్రునకు పాండువిదురులతో నెలకొన్న అనుబంధం రామలక్ష్మణులలాగా ఆదర్శం కాదు కాని, సార్వకాలికంగా సమాజంలో జీవించే సాధారణ సోదరుల జీవితాలకు దర్పణంగా నిలుస్తుంది.

వ్యష్టి కుటుంబాల్లో కంటె సమిష్టి కుటుంబాల్లో సభ్యులంతా కుటుంబం పెద్ద కనుసన్నలలో మెలగుతూ ఉంటే, యజమాని కూడ సోదరులను, సోదర పుత్రులను స్వంత కుమారులతో సమానంగా సంభావిస్తే ఆ కుటుంబం మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతుంది. అట్లా కాకుండ స్వార్థ ప్రేరితులై యజమాని సభ్యులు పరస్పరం అనుమానాలతోను, భయంతోను కాలం గడపవలసి వస్తే ఆ కుటుంబానికి అది క్షేమకరం కాదు. లోకంలో అత్యవసర సమయాల్లో అన్నదమ్ముల సంతానం పరస్పరావసరాలను తీర్చుకొన్నా, సాధారణంగా స్వార్థప్రేరితులై ఎవరి మానాన వారు జీవితం సాగిస్తూ విరోధ భావంతో ఉండటం సమాజంలో కనిపిస్తుంది. మహాభారతంలో ధృతరాష్ట్రునకు పాండవులతోడి సంబంధ బాంధవ్యా

లలో సమాజంలో సహజంగా నెలకొని ఉండే ఈ పరిస్థితి ద్యోతకం అవుతుంది. మానవుడు ఎంతటి స్థిరసంకల్పుడైనప్పటికీ, సమాజంలోను జీవితంలోను వచ్చే మార్పులు సంబంధ బాంధవ్యాలలో పరిస్థితుల ప్రాబల్యం నింత పోకడలకు దారి తీస్తుందనేందుకు ధృతరాష్ట్రి పాండవుల సంబంధం ప్రతీకగా నిలుస్తుంది.

మానవుడు సామాజిక జీవన స్రవంతిలో ఒక భాగమైనప్పటికీ, ప్రతి వ్యక్తీ తనదైన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కలిగి ఉంటాడు. వ్యక్తిగతమైన అభి రుచులు, అభిమాన దురభిమానాలు, ఇష్టాయిష్టాలు ఈ వ్యక్తిత్వంలో భాగంగా నిలు స్తాయి. విషయ నిర్ణయంలో తన మనసుసు ఇతరులకు తెలియనీయని నిగూఢత్వం, అనిశ్చిత స్థితి, పూర్వాపర విరుద్ధ ప్రవర్తనతో కూడిన వ్యక్తిత్వాలకు ధృతరాష్ట్రుడు ఆదర్శంగా నిలుస్తాడు.

మహాభారతంలో కురుసామ్రాజ్యాధికారాంశం వివాదాస్పదమైంది సంస్కృతాంధ్ర భారతాలు పాండురాజు, ధృతరాష్ట్రుల అధికారాన్ని ప్రధానంగా పేర్కొన్నప్పటికీ స్థలాంతరంలో రెండింటికీ మధ్య విరుద్ధాంశాలు గోచరం అవుతాయి. పండితులు, విమర్శకులు లభించిన ఆధారాలకు తమకు తోచిన రీతిని వ్యాఖ్యానం చెప్పి, కొందరు ధృతరాష్ట్రుని అధికారాన్ని, మరికొందరు పాండురాజు అధికారాన్ని బలపరచారు. అయితే కొందరు పాశ్చాత్య పండితులు నుడివినట్లు పాండవులు కురువంశ సంజాతులు కాదని అంగీకరించినట్లయితే రాజ్యాధికార విషయంలో అను మానాలకు తావే ఉండదు. కాని ఇప్పుడు లభ్యమయ్యే భారతమే మనకు ఆధారం కనుక ధృతరాష్ట్రునితో పాండురాజు సంబంధం తృణీకరించటం సాధ్యం కాదు. అయినప్పటికీ మహాభారతంలోని ఆంతరంగిక సాక్ష్యాలను, ప్రజల అభిప్రాయాలను పరిశీలిస్తే ధృతరాష్ట్రుడే కురుసామ్రాజ్యాధిపతి అన్న విషయం రూఢి అయింది.

ప్రజాక్షేమం కోసం రాజులు నిర్వర్తించే ధర్మమే రాజధర్మం అవుతుంది. రాజు దేశీయ, వైదేశిక విధానాలలో ఉత్తమమైన రాజనీతిని ప్రదర్శించి, చతుర్విధో పాయాలలో తురీయోపాయంతో కాకుండ మిగిలిన ఉపాయాలతో శత్రువును సాధించి తన స్థానం పటిష్ఠం చేసుకొని ప్రజాశ్రేయస్సుకు పాటుపడటం అవసరం. మహా భారతంలో ధృతరాష్ట్రమహారాజు దేశీయంగాను, వైదేశిక రాజనీతిలో కూడ తాత్కాలికంగా కొన్ని విజయాలను సాధించినప్పటికీ, మొత్తం మీద అతడి రాజనీతి

ఘోరంగా విఫలమైన విషయం తేటతెల్లమైంది. రాజనీతిలో వైఫల్యం చెందటమే కాకుండ స్వపక్ష సేనానాయకులు పరస్పరం వైరుధ్యం మాని ఒకే త్రాటిపై నడిచే టట్లు చేయటంలో కూడ ఆ మహారాజు విఫలమైనట్లు గోచరమైంది. ధృతరాష్ట్రుని రాజనీతి వైఫల్యంలో సుయోధనునితో పాటు పరిస్థితుల ప్రాబల్యం కూడ అధిక ప్రాధాన్యం వహించినట్లు రూఢిగా నమ్మవచ్చు.

బుద్ధిజీవి అయిన మానవుడు తన ఆలోచనాశక్తితోను, వివేచనా జ్ఞానం తోను తనకు లభ్యమయ్యే సదుపాయాలను అనుకూలంగా వినియోగించుకొని మనో రథం తీర్చుకొనేందుకు ప్రయత్నిస్తాడు. ప్రతికూల ఫలితాలు పొందితే ఆవేదనతో, నిర్వేదంతో నిరాశానిస్పృహలకు లోనవుతాడు. ఆ నిస్పృహలో జీవితంలో తాను ఆచరించిన కార్యాలను, అనుభవించిన ఫలితాలను నెమరువేసుకొంటూ పశ్చాత్తాప దగ్ధమైన హృదయంతో ప్రశాంతంగా ఆముష్మికం వైపు దృష్టిసారించి జీవన్ముక్తు డయ్యే ప్రయత్నం చేస్తాడు. మహాభారతంలో ధృతరాష్ట్రుడు తన ఆలోచనలు, వాటికి అనుగుణంగా చేసిన కార్యాలు పేకమేడల్లాగా కూలిపోయి బంధుమిత్రాదు లందరనూ కోల్పోయి జీవితంలో చేదు ఫలితాలను చవిచూచి పశ్చాత్తాప దగ్ధమైన హృదయంతో శత్రువులైన పాండవులతో ఆత్మీయతా బంధాన్ని పెంపొందించు కోవటానికి చిత్తశుద్ధితో ప్రయత్నించాడు. ఆ మహారాజు పశ్చాత్తాపంలో కొన్ని సందర్భాల్లో గ్రీకు విషాద నాయకుని ఛాయలు గోచరిస్తాయి. మహాభారతం వృద్ధి చెందే కాలానికే గ్రీకు భారతదేశాల మధ్య వర్తక వాణిజ్య సాంస్కృతిక సంబం ధాలు నెలకొన్న విషయం కాదనలేము. అందువల్ల గ్రీకు విషాద నాయకుని ఛాయలు ధృతరాష్ట్రుని జీవితంలో ద్యోతకమైన అంశం పూర్తిగా కొట్టివేయ తగిందికాక పర్యాప్త పరిశీలనకు అర్హమై ఉంది.

మానవ జీవిత ప్రయాణం ద్విముఖం. ప్రాపంచికమైంది ఒకటైతే, రెండోది పారమార్థికమైంది అవుతుంది. మానవ జీవితంలో మౌలికంగా ఈ రెండు ప్రవృత్తులు అంతర్లీనంగా ఉండి, అతడి జీవిత గమనంతోపాటు పరిణామం చెంది ఆముష్మిక పరివర్తన గమ్యంగా పెట్టుకొని ప్రయాణం సాగిస్తాయి. జీవి తంలో పురుషాహంకారానికి, దైవశక్తికి జరిగే సంఘర్షణలో మానవుడు క్రమంగా అహంకారాన్ని త్యజించి ఆముష్మికంపై మనసు లగ్నం చేయటం గోచరం అవు తుంది. ధృతరాష్ట్రుడు కూడ జీవితంలో తొలి దశలో పురుషాహంకారంతో

మానుషశక్తిని విశ్వసించి, చేసిన కార్యాలు విపరీత ఫలితాలను ఇవ్వటంతో దైవ శక్తి, మానవశక్తి సంఘర్షణలో క్రమంగా దైవశక్తి అధికం అనే జ్ఞానం పొంది, వంశ నాశనానికి కారణం అయ్యాననే పశ్చాత్తాపాగ్ని దహించిన హృదయంతో పారమార్థిక అన్వేషణలో సంయమనం పొంది, ఆధ్యాత్మికంగా భవబంధాలను త్రెంచు కొని పరతత్వంలో లీనమైన అంశం విశదమైంది.

సమాజంలో సాధారణంగా ఒక వ్యక్తి ప్రవర్తననుబట్టి ప్రత్యక్షంగా, పరోక్షంగా అనేక అభిప్రాయాలను వెలిబుచ్చుతుంటారు. ప్రత్యక్షంగా వెలిబుచ్చే అభిప్రాయాలలో కొన్ని సందర్భాల్లో ముఖప్రీతి చోటుచేసుకొన్నప్పటికీ, పరోక్షంలో వెలిబుచ్చే అభిప్రాయాల్లో మొహమాటానికి తావుండదు. నిష్కర్షగా ఉండి ఆ వ్యక్తి వ్యక్తిత్వానికి అద్దం పడతాయి. అయితే కొందరు మంచిచెడులను పరిశీలన చేయకుండానే ఎల్లప్పుడూ విమర్శించే ధోరణే అవలంబిస్తారు. ఇలాంటి అభి ప్రాయాలవల్ల ఆ వ్యక్తి వ్యక్తిత్వం స్పష్టంగా తెలుసుకొనేందుకు అవకాశం తక్కువగా ఉంటుంది. అభిప్రాయాలు వెలిబుచ్చే వారు కూడ అనేక సమయాల్లో రాగద్వేషాలకు లోనుకావటం సిద్ధం. మహాభారతంలో ప్రధాన పాత్రలందరూ ధృతరాష్ట్రునిపై వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆ మహారాజు వ్యక్తిత్వానికి మచ్చ తెచ్చేవిగానే కనిపించాయి. వీరిలో కొందరు ప్రత్యక్షంగా శత్రుపక్షాన్నే వహించిన వారైతే, ఇంకొందరు కురువంశ శ్రేయస్సును కోరిన హితులై ఉన్నారు. వీరంతా కూడ కురుపాండవ వివాదానికి, పర్యవసానంగా కురువంశ వినాశనానికి ఆ మహారాజే ప్రధాన కారణం అని నిందించారు. అయితే మహాభారతం పరిశీలిస్తే అందలి పరిణామాలకు ప్రధానంగా బాధ్యులైన వారిలో ధృతరాష్ట్రుడు ఒకడు అనే అభి ప్రాయం మాత్రమే కలుగుతుంది కాని, నేరమంతా అతడిదే అనే భావం కలగదు. మహాభారతం పరిణామ దశలో వందిమాగధ పాటకులు మహాభారత కథలో అన్ని అనర్థాలకు ధృతరాష్ట్రునికే పాపాల భైరవుణ్ణి చేయటానికి ప్రయత్నించారని భావించ వచ్చు. ఆ ప్రయత్నంలోనే భారత పాత్రలలో అనేకులు కురుపాండవ వివాదానికి బాధ్యుడుగా ధృతరాష్ట్రునిదేనని నిందించినట్లు తలంచటం సమంజసంగా ఉంటుంది.

ఇట్లాగా కవిత్రయం వారు మహాభారతంలో చిత్రీకరించిన ధృతరాష్ట్ర మహారాజు వ్యక్తిగత, రాజకీయ, ఆధ్యాత్మిక జీవిత విశేషాల విశ్లేషణవల్ల సార్వ

కాలికమైన సామాజిక వ్యవస్థలో ఉన్నతవర్గానికి చెందిన వ్యక్తుల జీవిత పరివర్తనం ఎట్లా ఉంటుందో కొంతవరకు బోధపడుతుంది మానవ జీవితంలో సంభవిల్లే ఒడుదుడుకులు, సంబంధ బాంధవ్యాలు ఎట్లా పరివర్తిస్తాయి, పారమార్థిక చింతనలో మానవుడు ఎంతటి ఉన్నతోన్నత శిఖరాలను అందుకోవచ్చు మొదలైన అంశాలెన్నో ద్యోతకం అయ్యాయి. ఒక్క ధృతరాష్ట్రుడే కాకుండ మహాభారతంలో ఏ పాత్రను పరిశీలించినా సమాజంలోని ఎందరో వ్యక్తుల స్వరూప స్వభావాలు దృగ్గోచరం అవుతాయి. కనుక ఈ దృక్కోణంలో పరిశీలకులు మహాభారతంలో చిత్రీకరించిన అనేకానేక పాత్రల స్వరూప స్వభావాలను విశ్లేషించి ప్రయోజనకరమైన ఫలితాలను పొందగలరని అభిలషిస్తున్నాను.

అధస్సూచికలు :

1. Barend. A Vannooten, The Mahabbharatha Attributed to Krishna Dvaipayana; P. 44.

   A. D. Pusalkar, Studies in the Epics and puranas; Introduction P XXVIII. and

   E. W. Hopkins, Great Epic of India - Its character and Origin; P. 397.

# ఆధార గ్రంథాలు

## తెలుగు గ్రంథాలు


1. అప్పలస్వామి, పురిపండా —
   1) సారస్వత వ్యాసాలు, నాల్గవ సంపుటము;
   2) ఆంధ్ర భారతోపన్యాసములు, వ్యాససంకలనం.
2. ఇరావతీ కార్వే (మరాఠీ మూలం), (తెనుగుసేత) బాలచంద్ర ఆప్టే- యుగాంతం; 1979.
3. ఎఱ్ఱాప్రెగ్గడ - హరివంశము; 1967.
4. కవిత్రయము — 1) ఆంధ్ర మహాభారతము సంశోధిత ముద్రణము. 1968 - 1973. మరియు 2) ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ముద్రణలు. 1970 - 1976.
5. కుప్పుస్వామయ్య, నాగపూడి- (అను) ( Mrs. Annie Besant Story of the Grand wai) భారతసారము; 1916.
6. కృష్ణమాచార్యులు, వాడపల్లి - కురుపాండవీయము; 1926.
7. కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీపాద - కురుపాండవ దాయభాగ విమర్శనము.
8. కృష్ణమూర్తి, గరికపాటి - సంస్కృత భారత విశేషములు.
9. కృష్ణారావు, యనమండ్ర - కురుపాండవ విభాగము.
10. గణపతిశాస్త్రి, చర్ల - 1) ఆర్షధర్మ సూత్రములు; 1972.
    2) సాహిత్య సౌందర్య దర్శనము;
11. గోపాలకృష్ణమూర్తి, నండుల - ఆంధ్రమహాభారతము - ఔపదేశిక ప్రతిపత్తి; 1982.
12. ధర్మారావు, తాపీ - పెళ్లి దాని పుట్టు పూర్వోత్తరాలు; 1975.
13. నరసింహం, కె. వి. ఆర్ - సాహిత్య దర్శనము; 1973.
14. నరసింహశాస్త్రి, నోరి - సారస్వత వ్యాసములు.
15. నరసింహావధాని పాకయాజి, ములుకుట్ల - మహాభారత సారోద్ధారము.
16. నాగేశ్వరరావు, కాశీనాథుని - ఆంధ్రవాఙ్మయ చరిత్ర; 1947.

17. నారాయణాచార్యులు, పుట్టపర్తి - మహాభారత విమర్శనము: 1965.
18. నారాయణదాసు, శేషగిరిరావు, రాధాకృష్ణ - ఆంధ్రసాహిత్యంలో రాయబారములు.
19. పురుషోత్తం, జటావల్లభుల - స్మృతికాలపు స్త్రీలు ; 1935.
20 పురుషోత్తమశర్మ, మంగిపూడి - తిక్కన చరిత్రము: 1931.
21. ప్రభాకరశాస్త్రి, వేటూరి — శృంగార శ్రీనాథము: 1923.
22. ప్రసాదభూపాలుడు - ఆంధ్ర విజ్ఞానము: 1938.
23. బుచ్చిబాబు - షేక్స్పియర్ సాహిత్య పరామర్శ: 1966.
24. బ్రహ్మయ్య, కాశీభట్ల - కురుపాండవుల దాయ భాగనిర్ణయము (నన్నయ భట్టారక చరిత్రము) : 1907.
25. మల్లయ్యశాస్త్రి, బంకుపల్లి - [illegible] : 1934.
26. మృత్యుంజయరావు, పొన్నలగడ్డ - వ్యాస భారతము - నన్నయ పరిష్కారము: 1979.
27. యజ్ఞనారాయణ, ద్రోణంరాజు - ఆంధ్ర మహాభారత తాత్పర్య నిర్ణయము: 1915.
28 రంగాచార్యులు, చెలమచర్ల - ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము:
29. రఘునాథశర్మ, శలాక - భారత ధ్వని విమర్శనము: 1979.
30. రాఘవన్, వి.ఎస్ — తమిళాంధ్రభారతముల తులనాత్మక పరిశీలనము: 1982.
31. రామకృష్ణకవి, వెలగలేటి — పాండవ గౌరవము.
32. రామకృష్ణయ్య, కోరాడ - ఆంధ్రభారత కవితా విమర్శనము: 1981.
33. రామకృష్ణశాస్త్రి, శిష్ట్లా - ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వము: 1976.
34 రామశాస్త్రి, పార్నంది - శ్రీ మహాభారత విమర్శనము: 1915.
35. లక్ష్మణరావు, కొమఱ్ఱాజు - లక్ష్మణరాయ వ్యాసావళి: 1923
36. లక్ష్మీకాంతం, పింగళి - 1) సాహిత్య శిల్ప సమీక్ష: 1966.
2) ఆంధ్రసాహిత్య చరిత్ర : 1976
37. లక్ష్మీనరసింహం, చిలకమర్తి - ప్రచ్ఛన్న పాండవము : 1922.

38. లక్ష్మీనారాయణ, కొడాలి - 1) మహాభారత విమర్శనము; 1972
2) వివాహముల చరిత్ర; 1969.
39. లక్ష్మీనారాయణ ఘాపతి — భారతము - తిక్కన రచన; 1962.
40. వీరభద్రరావు, చిలుకూరి - శ్రీనాధకవి జీవితము; 1930.
41. వీరమల్లయారాధ్యులు, కాశీనాధుని - భారతసారము; 1919.
42. వీరేశలింగం, కందుకూరి - ఆంధ్ర కవుల చరిత్ర : 1917.
43. వెంకటశాస్త్రి, కేతవరపు — వి' రుని ఉపదేశములు; 1924.
44. వెంకటప్పయ్య, యఃమంచలి - పెళ్లెందుకు; 1977.
45. వెంకటాచలం, కోట - కలియుగ రాజ వంశములు; 1950
46. వెంకటావధాని, దివాకర్ల — 1) ఆంధ్ర వాఙ్మయారంభదశ : 1960.
2) ఆంధ్రవాఙ్మయ చరిత్రము : 1981.
47. వెంకట రంగయ్య, మామిడిపూడి (అను) — కౌటిల్యుని అర్థశాస్త్రం; 1968.
48. వెంకట సుబ్బయ్య, అప్పజోడు - మహాభారతము - మానవ స్వభావ చిత్రణ, 1977.
49. వేంకటకృష్ణారావు, దేవరాజు - రాయబారము : 1935.
50. వేంకట రామకోటిశాస్త్రి, కేతవరపు - మహాభారతము తత్త్వకథనము; 1976.
51. వేంకట లక్ష్మీనరసింహారావు, లక్కరాజు — గ్రీకుల పురాణగాధలు; 1977.
52. వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, పెండ్యాల - మహాభారత చరిత్రము; 1933.
53. వ్యాసమూర్తి, కాఖూరి - తిక్కన కళాసామ్రాజ్యము;
54. శేషయ్య, చాగంటి - ఆంధ్రకవి తరంగిణి; 1958.
55. శ్రీనాధుడు - 1) శివరాత్రి మహాత్మ్యము; 1968
2) కాశీఖండం; 1969.
56. శ్రీనివాసరావు, కోలాచలం - 1) శ్రీభగవద్గీతా విమర్శనోపన్యాసములు; 1925.
2) వివాహకట్టడములు; 1926.

57. శ్రీరామమూర్తి, కొర్లపాటి - శ్రీనాథుడు; 1971.
58. శ్రీరామమూర్తి, గురజాడ - కవిజీవితములు; 1925.
59. సీతారామారావు, ద్రోణంరాజు - భారతయోధులు, 1921
60. సుబ్రహ్మణ్య అయ్యర్, పుదుప్పాకం - నన్నయ భట్టారకుడు; 1910.
61. సుబ్రహ్మణ్యశాస్త్రి, వారణాసి - మహాభారత తత్త్వకథనము; 1950 - 1955.
62. సూరన, పింగళి - రాఘవపాండవీయము; 1910.
63. సూర్యనారాయణశాస్త్రి, దండిగుంట మరియు సుందరరామశాస్త్రి, చదలవాడ - శ్రీకృష్ణుని రాయబారము; 1917.
64. సూర్యనారాయణశాస్త్రి, మల్లాది - A critical Introduction to Andhra Mahabharatam ;
65. సూర్యనారాయణశాస్త్రి, శిష్ట్లా - 1) మహాభారత రహస్యము; 1938. 2) కురుసామ్రాజ్యాధిపత్య నిర్ణయము; 1940.
66. సూర్యారావు, కొత్తపల్లి — దుర్యోధనాభిమానము ; 1911.

వ్యాసాలు :

1. ఈశ్వరచరణ్, ముదిగొండ - తిక్కనగారి ఉభయవాక్ప్రౌఢి ; భారతి, జనవరి ; 1973.
2. జగన్నాథము, దూతులూరి - తిక్కన ఉద్యోగము ; భారతి, ఫిబ్రవరి, 1958.
3. నీలకంఠశాస్త్రి, ఓరుగంటి - తిక్కన ధర్మాద్వైతము ; భారతి, మే ; 1973.
4. బంగారయ్య, నండూరి - 1) నవోదయము తిక్కన ; భారతి, మార్చి 1937. 2) శ్రీకృష్ణుడు ; భారతి, నవంబరు; 1933.
5. రామస్వామి, త్రిపురనేని - కృష్ణుని రాయబారము ; ఆంధ్రభారతి, ఫిబ్రవరి; 1912.
6. లక్ష్మీనారాయణ, ఉన్నవ - కృష్ణరాయబారము; భారతి, నవంబరు; 1948.
7. వీరవెంకట దీక్షితులు, భమిడిపల్లి - కురుపాండవ దాయవాద తీర్మానము ఆంధ్రభారతి, ఫిబ్రవరి ; 1914.

